# అభిప్రాయం

మన దేశస్వాతంత్ర్య పోరాటములో ఆగస్టు ఉద్యమము తరువాత జైళ్ళనుండి వచ్చాక మన స్థానిక నాయకులు చాలా మందికి ఎసెంబ్లీ ఎన్నికల, మునిసిపాలిటి, జిల్లా, పంచాయితీ బోర్డుల ఎన్నికల వ్యవహారములు చూచుకొనుటకే సరిపోవు చున్న ఈకాలములో, ఇంకనూ ఎవరైనా ఇదివరనుండియే దీనిలో చేరియున్నగాని, ఇటీవల మారినగాని స్వార్థపర బుర ఖావారికి పెర్మిట్లు ఇప్పించుటకుకాని, ఉద్యోగములు, సిఫారసు లు ఇచ్చి అధికారములు సంపాదించుటకుగాని తమ కాలమంత యూ సరిపోకుండాయున్న ఈరోజులలో మనదేశ స్వాతంత్ర్య మును నిలబెట్టుకొనుటకు, స్వాతంత్ర్యఫలమును ప్రజలుఅనుభవిం చుటకు ప్రాణాధారమైనటువంటిన్ని, ప్రజల ఇబ్బందులు తెలు సుకొనుచు వాటిని సరిదిద్ది, కావలసిన సౌకర్యములు సమకూ ర్చుటకు మహాత్ముడు చెప్పిన నిర్మాణ కార్యక్రమమును ఆచ రించవలసిన బాధ్యత ప్రజలపైనను, ముఖ్యముగా కాంగ్రెసు సేవకులపైన పడియున్నది.

యువజన కాంగ్రెసువారు ఈరాష్ట్రములోను, ముఖ్య ముగా మన జిల్లాలోను ఈ కార్యక్రమమును చేయగలిగినంత గా నిర్విరామముగా ప్రజల సహకార సానుభూతులతో, జాతీ య ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు, రైతు కాంగ్రెసు, చేనేత కాంగ్రెసు, విద్యార్థి కాంగ్రెసు మున్నగు సంస్థలకు సహాయ పడుచు చేయుచునేయున్నది.

కాని ఇట్టి నిర్మాణ కార్యక్రమమును చేయవలెనన్న కుతూహలముగలవారికి, చేయుచున్న వారికికూడ ఒక సమగ్రమైన కార్య ప్రణాళిక ఏఅడుగున కా యడుగునకు దారిని నిర్దేశించురీతిని అందరకు అందుబాటులో నుండేరీతిని ఒక పుస్తక రూపములో లేనికొరతను ముఖ్యముగా గత రెండుమూడు సంవత్సరములనుండియు మిక్కిలిగా యగుపడుచున్నది.

ఈగ్రంథకర్తయగు శ్రీ సాధనాల పెద తిరుపతిరాయుడుగారు ఈ గ్రంథముద్వారా ఈ కొఱతను తీర్చినందులకు మహానందమును పొందుచున్నాను. ఈయన అనుభవపూర్వక మనస్తత్వవేత్త Psychologist సిరి సంపదలు, భోగ భాగ్యములుగల ఒక ఉన్నత సాంప్రదాయమైన కుటుంబములో జన్మించియు, చిన్నవయస్సుననే సత్యాహింసల ప్రభావము, పీడిత ప్రజాసేవా తత్పరతకలిగి, ఇందుకు అవసరమైన రాజకీయ విద్యకొరకు హైస్కూలువిద్యవదలి, కార్యక్రమనిర్వహణాదక్షతకొరకు బ్రిటిషు సామ్రాజ్యములో అందరికన్న చిన్నవయస్సులో, ఆంధ్రదేశములో బహుకొద్దిమందిగామాత్రమేయున్నటువంటి ఒక ఉన్నత నౌకా స్టీము ఇంజనీరింగు పరీక్షలో ఉత్తీర్ణులై, చాల సంవత్సరములు ఉద్యోగము చేసియుకూడ 1942 లో దేశ తక్షణావశ్యకతను గుర్తించి, మహాత్ముని, దేశనాయకులయొక్క పిలుపు నాలించి, దేశప్రజలసేవకై పూర్తికాలమును వినియోగించుటకు ఉద్యోగము విరమించిరి. దరిమిలా ఎన్ని ఉద్యోగములు కల్పించబడినను పీడిత ప్రజాసేవయే పరమావధియని, సకలభోగభాగ్యములు అనుభవించగలిగియుండి కూడ వాటిని తృణప్రాయముగా యెంచి 'భోగియైన కాని యోగికాడు' అనే యోగి వేమన నుడివికి ఆదర్శప్రాయులైనారు. ఈయనకిదియే ఆనందమట.

రిరు రాజకీయ బాధితులకు సరిపడు చక్కని మార్గము ను ఏర్పరచుట ప్రధాన కర్తవ్యముగా పెట్టుకొని 'ప్రజల దారిద్ర్యము'ను పారద్రోలుటకు బద్ధకంకణులై మహాత్ముడు దరిద్ర నారాయణుడైనట్లు ఆకృషిలో ఈయన నిజమైన రాజకీయ బాధితుడై నాడు. మాజిల్లా యువజన కాంగ్రెసుకు ప్రధాన కార్యదర్శిగా యుంటూ ఈ ముఖ్య గ్రంథమును వెలువరించుట మాకు గర్వకారణం.

ఈ గ్రంథమునకు 'సత్యాగ్రహి' యను నామకరణ ముంచుట ఎంతయు సమంజసముగా యుండునని నాకు తోచు చున్నది. ఈమధ్యను రాజమహేంద్రవరములో మన పూజ్య బాపూజీ విగ్రహ ప్రతిష్ఠాపనచేయుచు ఆంధ్రకేసరి ప్రకాశం గారున్ను, డాక్టరు పట్టాభిగారి అఖిలభారత అధ్యక్ష ఎన్నికల సందర్భమున జరిపిన రాష్ట్రకాంగ్రెసు సేవకుల సమావేశము లో ఆచార్య రంగాగారున్ను అత్యవసరమని తమ అభిప్రాయము వెలిబుచ్చిన సత్యాగ్రహుల నిర్మాణమునకై, అసలు సత్యాగ్రహి యనగ నేమో, యేమిచేయవలెనో విపులముగా సామాన్య ప్రజలకు కూడ తెలియురీతిని వ్రాయబడిన ఈపుస్తకమును ఎల్లరు ఉపయోగించుకొని సుఖించెదరుగాక ! ఇది ముక్తికి మోక్షమునకు కూడ త్రోవ.

జై హింద్ !

రాజమహేంద్రవరం,<br>8—11—48.

ముట్నూరి వెంకటసోమసుందరం.<br>ఎం ఎ; బి.యల్; అడ్వకేట్<br>అధ్యక్షులు,<br>తూర్పు గోదావరిజిల్లా యువజన కాంగ్రెసు.

# గ్రంథ పరిచయము



గత 60 సం॥లనుండియు కాంగ్రెసు ప్రజాసేవ చేయుచునేయున్నది. అనగా కొందరు త్యాగధనులు కాంగ్రెసుద్వారా ప్రజాసేవ చేయుచునే యున్నారు. వీరిలో నాయకులు, సేవకులు, అభిమానులు, వాంఛితప్రజలు అనే నాలుగు అంగములుగల బలగముతో నిర్మాణకార్యక్రమము, శాసన సభా కార్యక్రమము, పోరాటము అనే విధానముల నే రాజనీతితో ఎక్కడో దారితెన్ను లేకుండా చెట్టూ, పుట్టా ఐపోయిన మన జాతిని–ప్రజాకోటిని– స్వాతంత్ర్య సౌధప్రాంగణములోనికి తీసుకొని రాగల్గిరి. ఇక ఇప్పుడే చాల మెలకువతో ప్రతివ్యక్తి బాధ్యతనాది అని ప్రవర్తించుకోవలసిన సమయము. ఏలనన వారి తెన్నులేనివారిని కాంగ్రెసుయంత్రము స్వాతంత్ర్య సౌధమువద్దకు తీసుకువచ్చినపుడు సౌధములో ప్రవేశించి సౌధమును ఉపయోగించుకొనుట తెలుసుకొననిచో ప్రయోజనముండదు. అనగా ప్రజలు కాంక్షించే శాంతిసౌఖ్యములు అనుభవమునకు రావు. వందలకొలది సంవత్సరములుగా పరాయివారి పరిపాలనా కారణముగా దేశప్రజల బానిసస్థితి కారణముగా మన సాంఘిక నిర్మాణము శిధిలమైపోయినది. ఈ సాంఘిక కట్టుబాట్లు పునర్నిర్మించుకొననిదే సౌధప్రవేశము చేసినామా ఆసౌధమునే కూలగొట్టుకుంటాము. ఇది ఎట్లనః మన ఫలవృక్షములతోటను పరాయివారు ఆక్రమించుకుని అనుభవించుచున్నప్పుడు మనము వారితో పోరాడి అతోటను మరల స్వాధీనము చేసుకునికూడా అతోటను పండించుకొనుటచేత కాక ఏకొద్దిగా పండిన ఫలములనుకూడ మనలో మనము సంఘీభావముగానుండి అనుభవించుటచేతకాక ; కొట్లాడుకుని అనగా తోటదున్నినవారికి, ఎరువు వేసినవారికి, నీరు కట్టినవారికి, కాపలాళ్ళకు, అజమాయిషీ జరిపినవారికి ఎంతెంత రావలెనో అంతంత

వచ్చేటట్లు సాంఘిక నిర్మాణము చేసుకొనక పోయినచో దెబ్బలాడుకొని ఏవిధముగా కాళ్ళక్రింద త్రొక్కుకొని మట్టిపాలు చేసుకునే అవస్థవచ్చునో అదే విధమూను. కావున ఇట్టి సంఘ నిర్మాణము చేసుకొనుటకుగాను మనము ఏమి చేయవలయునో, చేయుటఎట్లో, ఇప్పుడు ఏమిజరుగుచున్నదో దీనిని నివారించుటకుగాను ఉపకరించురీతిని ప్రజలు ప్రజారాజకీయ సంస్థ, ప్రభుత్వములకుగల ఎడతెగని పరస్పర సంబంధము మొదలుగా ప్రతి వారికి నిత్యజీవితమునకు ఉపకరించేటటువంటివిన్ని, తెలుసుకోవలసినటువంటివిన్ని విషయములను విపులముగా, సామాన్యభాషలో, సామాన్యముగా అందరకు అర్థమయ్యేటట్లు ఇందు వ్రాయ ప్రయత్నించితిని.

ప్రస్తుత ఈ అంధకార పరిస్థితులలో పీడిత ప్రజల స్థితినిగూర్చిన నా ఈ ఆవేదనాపూరిత రచనకుతోడు, మానవకోటి సాంఘికంగా పునర్నిర్మింపబడుటకు మన సారథియైన మహాత్ముడు ఏమి చెప్పుచున్నాడో ఆసూత్రములనుకూడ మూడుపొత్తములనుండి ఎత్తి ఇందు మరిమూడు భాగములుగా పొందుపరచితిని.

వీటిలో ఒకటి:- గాంధిగారి ఆశ్రమములో ఉదయ, సాయంకాల ప్రార్థనల ననుసరించి ఆంధ్రమున 'వినయాశ్రమము'లో ఆంధ్ర గాంధి అధునిక వశిష్ఠ, సర్దార్ శ్రీ గొల్లపూడి సీతారామశాస్త్రిగారిచే నియమముగా జరుపబడుచున్న ప్రార్థనా కార్యక్రమము ఈ ప్రార్థనలను ప్రజలు ఉదయముననే 5 గంటలకు లేచి కాలకృత్యములు తీర్చుకుని స్నానము చేసి నిశ్చలముగా పంక్తులుతీరి కూర్చుని ఉదయ ప్రార్థనచేసి సూర్యోదయమగుసరికి లేచి సూర్యనమస్కారములు చేయవలెను. ఈ సూర్య నమస్కారములు మంత్రోచ్చారణతోకూడిన పది భంగిమముల సముదాయమై ఒకే పర్యాయముగా మానసిక, శారీరక వ్యాయామము కల్గించునది. దీనివలన ఆరోగ్యవంతులై యేరోగము రాకుండుటయే కాక బృహత్ మొదలగు అనేక దీర్ఘరోగములుకూడ నివారణమగును. ఈ ప్రార్థనలన్ని అర్థ

సహితముగాయున్నవి. ఇందు మంత్రపుష్పముకూడ చేర్చబడియున్నది. దేవాలయములందును. శుభ కార్యములందును చదువబడుచుండును. మానవ శరీరతత్వమును. మానవునకు భగవంతునకుగల సంబంధమును రెండును ఒక్కటేననియు విపులీకరించబడి జెప్పబడినదియే ఈ మంత్రము. ఇకను సాయంకాల ప్రార్థన గోధూళివేళ చేయవలయును. ఈ ప్రార్థనా సమావేశములవల్ల కల్గు యితర ఉపకారములను మీరే గ్రహించుకోవచ్చును, ప్రార్థనానంతరము ఆరోజు విశేషములను అందరు తెలుసుకొనగలుగుటకు గల అవకాశము మెండుగనైనవి. ఈ ఉదయ సాయంకాల ప్రార్థనలలో వచ్చు రామ, కృష్ణ, విష్ణు, బ్రహ్మ, అల్లా, క్రీస్తు మొదలగు పదములను పురాణములలోని వ్యక్తులుగా కాక ఒకజాతికి, ఒక మతమునకు చెందినవిగా కాక విశాలదృష్టితో అన్ని మతములవారు జెప్పుచుండే ఆఒక్క భగవంతునే సంబోధించుచు ఉపయోగించిన పర్యాయపదములుగా భావించుకోవలెను. ఈ ప్రార్థనల అనంతరం ఒకటి రెండు నీతిపద్యములు, కీర్తనలు పాడవచ్చును. దీనికి అనువుగా కొన్ని పద్యములుకూడ ప్రకటించబడినవి. బహిరంగ ప్రార్థనవల్లమనలో వచ్చే మార్పుకలిగే ఉపకారము చేయుచున్న వారికి ప్రత్యక్షముగా అనుభవమునకే వచ్చును- ఇప్పటికే నిదర్శనముగా పురాణములలోని కృష్ణుడు, అర్జునుడు, అంజనేయుడు మొదలగువారే కాక ఈ కాలములోకూడ మహారాణాప్రతాప్, శివాజి, రామకృష్ణపరమహంస, వివేకానంద, గాంధీమహాత్ముడు, ఆధునికవశిష్ట, సద్గురు శ్రీగొల్లపూడి సీతారామశాస్త్రిగారు, విషిధయోగి, బాబూరాజేంద్రప్రసాద్, త్యాగరాజు, వేమనయోగి, భక్తపోతన, రామదాసు మున్నగువారు యేవిధముగా మానవకోటిలోని ఉత్కృష్ట గౌరవస్థానమునుపొంది నిత్యజీవులైనారో సుబోధకమే. ఇంకను ఇట్టివారును, పెద్దఉద్యోగులు అనేకమందియున్నఉన్నారు ప్రార్థన ఏవిధముగా ఇట్టిపని చేయుచున్నదనగా, తేలుమంత్రము, పాము మంత్రము, తలనొప్పి, ఇరుకునొప్పి మొదలగు శారీరకబాధలను చేయు మంత్రములు యేవిధముగా పని చేయుచున్నవో అట్లనే- అందుచేతనే ఈ అనుభవశాలురగు మహానీయుల్లు దేశక్షేమముకొరకు శాంతికొరకు కొన్ని

ఈతిబాధలు తొలగుటకు మనలను పదేపదే భగవంతునిగూర్చి ప్రార్థించమని కోరుచుందురు. తమవలె ఇతరులకుకూడ వివేకము కల్పించవలసినదిగా భగవంతుని ప్రార్థించెదరు.

మరియొక భాగము :— ఒక్కొక్క విషయముపై మహాత్ముడు అప్పు డప్పుడు తన ఉపన్యాసాలలోను, ప్రకటనలలోను వెల్లడించిన సిద్ధాంత ములు. ఇందు మొత్తముమీద ఏవిషయమును వదలక సంఘజీవియైన ఈ మానవజీవితమునకు కావలసిన అన్నియంశములను విపులీకరించబడెను. కాని మాటలు మాత్రము క్లుప్తము — మాటలుక్లుప్తమైనను విషయము తేట తెల్లమగుట చేతనే విపులీకరించబడెను, అన్న పదము వాడడమైనది.

తక్కిన భాగముకూడ అన్నివిధముల రెండవభాగము వంటిదే కాని గాంధీస్మృతి అనిచెప్పనగు గాంధీసూత్రములో అనేకగ్రంథములు దేవనాగర లిపిలోనున్న సంస్కృతసూత్రములు వాటిని ఇంగ్లీషులోనున్న వ్యాఖ్యా నమునకు ఒక్కొక్కసూత్రములను వాటికి తెలుగర్థము పెట్టుకున్న ప్రాయుక్త మైనది. ఈరెండు భాగములను కాంగ్రెసుసేవకులకు తరచు ప్రజలప్రశ్నల వల్ల కలుగు ఇబ్బందిని నివారించుటకును, ప్రజాసేవచేయుటకు ఒకనిర్దిష్ట మయిన త్రోవచూపుటకును ఉపయోగపడును. అదియునుగాక చాలమంది కాంగ్రెసుసేవ చేయుటకు ఉత్సాహులైయుండియుకూడ ఏమిచేయవలెనో తెలియక, శిక్షణ లేకయున్నస్థితిలో ప్రజలు అడుగు ప్రశ్నలకు ఎవరకుతోచినట్లు వారుచెప్పుట కలుగుచున్నది- ఇందువల్ల చాలకీడు వచ్చుచున్నది- ఇట్టివారికి ఈచిన్నిపొత్తము ఎంతయోని ఉపకరించును- దీనివల్ల కాంగ్రెసు నకు కొందరిచే చేయబడుచున్న బాధ్యతారహితమయిన ప్రచారమువల్లను, కుయుక్తితో చేయబడే ప్రచారమువల్లను కలిగే హాని నివృత్తియై మనస్వా తంత్ర్య రథమునకు ఇంకను సాఫైన గమనము కల్గునని ఆశతో వ్రాసితిని.

గ్రంథకర్త.

# మొదటి భాగము

# నిర్మాణ కార్యక్రమ కార్యాచరణ ప్రణాళిక

కాంగ్రెసు యొక్క గత 60 సం॥ చరిత్ర తెలిసినదే సర్వసాధారణముగా ఇది మనము వేదిక ఎక్కగానే చెప్పే విధము కాని ఈ తెలిసినదే – ఎవరికి? ఎంతమందికి? ఎంతమందికి ఎంతమట్టుకు? ఒకవేళ ఏకొద్దిమందికో—వ్రేళ్లమీద లెక్కపెట్టగలంత కొద్దిమందికే తెలిసినను ఈకొద్దిమందిలో ఆచరణలో పెట్టుచున్నవారెందరు? కాకపోయినచో ప్రచారములో మనమీద ప్రజలనుండి అడుగడుగునకు ప్రశ్నల శరపరంపర చీదరింపులు ఏల కలుగవలెను? ఈవిషయములోనుకూడ మాపని మాకు జరిగిపోవుచున్నదిగదా. ఎన్నికలక్కేగదా. ఆసమయములోను కొద్దికోజులపాటేగదా. తరువాత మూడు సం॥రముల వరకుగాని ఇంకా ఎక్కువ కాలముపాటుగాని మమ్ములను అడిగేవారెవరు? దానిలోకి ఈపరిజాతూప్రలకుడాలు, కవచము పరిచారకులేగదా, యనిఘన్నకుండవచ్చు. కాని ప్రజలలో సదభిప్రాయము కల్గించినచో, ఇట్టి వ్యతిరేకప్రశ్నే లేకపోయినచో మీరు ఆ కొద్దిరోజుల పాటైనను ఎంత మాపని మాకుజరిగిపోవుచున్నను కొన్ని వేలరూపాయలు వదలించుకొనుట, సుమారు నెలన్నైచిల్లర నిద్రాహారములు సరిగాయుండక ఆరోగ్యములు పోగొట్టుకొని కోలుకొనుటకు మరికొన్ని నెలలు తీసుకొనుట కలుగదుగదా? పోగా నిత్యము ఉండిపోయేది ముఖముమీద కాకపోయినను పరోక్షముగానైనను తిట్టించుకొనుట మాత్రమేగదా! ని

కంతకు కారణము కాంగ్రెసు ఆశయము వదలిపెట్టి పదవులకు ప్రాకులాడుటయే, ప్రజలను ఒక పవిత్రలక్ష్యసిద్ధికి గాను తద్వారా శాంతిసౌఖ్యములు పొందుటకు కార్యోన్ముఖులుగా చేయక మీమీపదవీవ్యామోహకీచులాటకై కేవలం ఉసికొత్తించి వారిని నిత్యబాధితులుగా ఉంచుటయే (మీతో సహా) Democracy యా లేక Mobocrecy యా మనకు కావలసినది. ఒక్కమాటలో చెప్పవలెనంటే Constructive Programme (నిర్మాణ కార్యక్రమము)ను పూర్తిగా విస్మరించి Parlamentary programme (శాసనసభా కార్యక్రమము) ;ఒక్కదానిలోనే సుడిగుండంలో పడ్డట్లు తేల్తూ, మునుగుతూ యుండుటయే. ఇంకా స్పష్టంగా చెప్పవలెనంటే Election (ఎలక్షన్) నాయకులుగా తయారవ్వటమే-

కాని నా ఉద్ఘోషణ చూచి నేను యే కమ్యూనిష్టులలాగో, ఇంకో ఇష్టుల లాగో లేదా ఎవరిపనులు వారు చూచుకొనే కడుపునిండిన పడకకుర్చీ విమర్శకుడిలాగో మిమ్మల్ని ప్రత్యేకంగా ఖాళీ విమర్శించేందుకే పూనుకున్నానని తలంచవద్దు. విమర్శ వాంఛనీయమే- మంచిదే. కాని వట్టివిమర్శ పనికిరాదు- విమర్శతో సూచనకూడ యున్నప్పుడే మేలుకలుగజేయును. కావున ప్రజలబాధలు, నిత్యసమస్యలు, తన్నివారణోపాయములు అవగతము చేసుకొనుచు అహర్నిశలు యేకైకదీక్షతో పనిచేయుచున్న కాంగ్రెసు వర్కరుగానే మన కర్తవ్యములు సాధించుటకే ఉద్యమించితిని- ఈరీతిని మిమ్ములను ప్రజలచే తిట్టించుకునే ఎలక్షన్ నాయకులుగా మాత్రమే ఉండిపోక ప్రజలచే పూజింపబడే కాంగ్రెస్ నాయకులుగాకూడా కండని కోరుచున్నాను.

ఇందుకుగాను ఈక్రింద ఉదహరించిన ప్రణాళిక ప్రతిపాదించుచున్నాను- ఇది కార్యాచరణీయమైనదనిన్ని దీనివల్ల ఒకప్రక్కన ప్రజలలోనున్న అపోహాతొలగించి తద్వారా వారిలోయుంటున్న జడత్వమును పాపి. స్వాతంత్ర్యసంపాదనా కార్యోన్ముఖులుగా జేయుటకున్నూ మరి

యొక్క ప్రత్యేక కాంగ్రెసువర్కర్ల బాధలు నివారణయగుటకున్ను ఒక్కసారి సాధ్యపడునని నమ్ముచున్నాను. దీనిని ఈ జిల్లానాయకులగు మీరందరు దయతో ఆమోదించి ఈ జిల్లాలో ప్రవేశపెట్టినచో ఆంధ్రరాష్ట్రములోని తక్కినజిల్లాలుకూడా తప్పక అనుసరించగలవని ఆశించుచున్నాను.

నాయకులు, ప్రజలు : ఇంతకాలమునుండి ప్రజలకు మేలుకూర్చే కార్యక్రమమేదీ అచరించలేదంటే ఈ తప్పు నాయకులలోను, ప్రజలలోనుకూడా గలదు. దేశస్వాతంత్ర్యమునకై జరుపుచున్న నిరంతర పోరాటమునకే (జైళ్ళకు వెళ్ళుటకు, యెన్నికలు నడుపుటకు) ఇంకను చాలినంతమంది ప్రజలు రానప్పుడు, నిర్మాణకార్యక్రమము జరుపుటకు(ప్రజోపయోగకరమైన కార్యక్రమము నడపుటకు) అసలే ఎవరూ తయారవనప్పుడు నాయకులను అని ఏమిలాభము? నిజమే! కాంగ్రెసుపోరాటములో మనం (ప్రజలు) విశేషముగా పాల్గొనినచో మనకు చాలకాలము క్రితమే స్వరాజ్యము సిద్ధించియుండెడిది. అందరూ స్వరాజ్యము కావలెనని కోరేవారేగాని అందులకుగాను చేయవలసిన ప్రయత్నములో పాల్గొనరు సరిగదా ఉన్న కొద్దిమందినాయకులు (ప్రజాసేవకులు బ్రహ్మాండమైన ప్రభుత్వముతో పోరాటములో పూర్తి కాలము ఉపయోగించేందుకు ఉన్న ఉద్యోగాదిరాబడు లజంజాటములువదలుకొని ప్రజలమధ్యనుండి పని చేయునప్పుడు మనకనీసధర్మముగా వారికుటుంబపోషణార్థమై చేయదగుద్రవ్యసహాయమైనను చేయము. సరిగదా అఖరుకు మనగురించి సంవత్సరములతరబడి కారాగార క్లేశములు అనుభవించుచుండే సమయములోనైనను మగడక్షత లేకుండాపోయిన వారి కుటుంబములయొక్క ఆలనా పాలనానైనను చూడకుండగా ఈ కాంగ్రెసు వారు మాకు ఏమిచేసినారు. వారుచేసిన గొప్ప ఏమిటని ఎంతో చులకనగా అనేస్తాము. ఇంత ఎందుకు మన ప్రజలు వారినాయకులనే గౌరవించుకునే కనీసం గుర్తించుకునే స్థితిలోనే లేరు ఇట్టి విషయములో ఒక్కొక్క విషయమునకు ఒక్కొక్క స్థిరీకరింపబడిన సిద్ధాంతము (Universal truth) కలదు. ఇచ్చట ఈవిషయమునకు సంబంధించిన 'దేమనగా

'ఏ ప్రజ వారి నాయకులను గౌరవించుకోలేదో వారికి కష్టములు తప్పవు.' కాని మన ప్రజల మనో ప్రవృత్తులు బొత్తిగా అధఃపాతాళములో నున్నవి కాబట్టి వీరిని స్వాతంత్ర్య పోరాటములో చేరునట్లుగాని, నిర్మాణ కార్యక్రమము ఆచరించునట్లు చేయుటకుగాని వీటికిముందు కనీసం వారినాయకులను అర్థంచేసుకొని గుర్తించుకునేటట్లుగా చేయుటకుగాని వారికి ఆయా వివరములు తెలియ చెప్పవలసిన బాధ్యత తిరిగి నాయకులపైనే పడుచున్నది. ఇక్కడ మళ్ళీ ద్వంద్వం వచ్చిందంటారేమో. పెళ్ళికుదురితే పిచ్చి, పిచ్చి కుదిరితే పెళ్లి అన్నట్లు ఈనీతి సామెతలు అన్నింటికి వ్యతిరేకములవి కూడా కలవు. 'కంగారుపడితే లంగరు తెగుతాది.' దానికి వ్యతిరేకముగా "ఆలస్యం అమృతం విషం" అన్నట్లు, ఇచ్చట మన విషయమునకు సంబంధించినదే మన "ప్రజలు ఎంతమట్టుకు అర్హులో అట్టి పరిపాలనే సంక్రమించును." దీనికి వ్యతిరేకముగా "యథా రాజా తథా ప్రజా" వీటిలో ఏదినిగ్గు పట్టినే పైపైని తర్కించుకునేవారికి ఈ ద్వంద్వాలు ఉపయోగపడుతున్నా (వాటిలో పాత్రిసత్యంవలె కొంతవరకు విభాగముగా సత్యమున్నది కాబట్టి) నిజానికి ఇవికూడా ఒక్కొక్క విషయాన్ని నిర్ణయించుటకే కాబట్టి వీటికికూడా ఒక్క సిద్ధాంతము మాత్రమే కలదు. సత్యము ఎప్పుడూ ఒక్కటే కాబట్టి ఇప్పుడు ఈ చెట్టు ముందా ? విత్తుముందా ? అన్న ద్వంద్వాన్ని పైపైనే తర్కించుకొని రెంటియు తేలక విఫలులై ఎవరిదారిని వారు వెళ్ళిపోవుచున్నట్లు కాక చివర (అనగా Atomic or Darvinian theory) వరకు శోధించిన చెట్టేముందని ఎట్లు సిద్ధాంతీకరించవచ్చునో అట్లనే యథారాజా తథా ప్రజా అన్నదే నిగ్గని తేలుచున్నది. ఇచ్చట రాజా అనగా నాయకుడు. ఇకపోతే ప్రజలమీద మనము మోపగల నింద ఎంతమట్టుకు అంటే విజ్ఞులు వచ్చి చెప్పినప్పటికిని (మీటింగులు) వినకపోవుట యొకటి. ప్రభుత్వముగా మనకు సౌకర్యములు చేయుటకుగాను చందాలు పన్నులు రూపేణా శాసనాలు చేయు సంస్థయనియు అది విషయమునకు విరుద్ధముగా మన

అను సర్వవిధాల నాశనమొనర్చుటకే ఉపయోగించుచున్నదని తెలుసుకొని ఈపీడ ఎప్పుడు వదలిపోవునాయని తిట్టుకొనుచుకూడ, ఈపీడను వదలగొట్టి మనకు సౌఖ్యమును చేకూర్చుటకు అహర్నిశలు పని చేయుచున్న ఏకైక సంస్థ కాంగ్రెసుకు విరాళములు గానో లేక పన్నులిచ్చినట్లు గానో అంతేకాని విరివిగ (బ్రిటిషు ప్రభుత్వమున కిచ్చినట్లు శాపనార్థములతో కాక) సంతోషముతో దీవించుచు ఇచ్చుటయు మాత్రమే. ఈ రెండే ప్రజలకు ప్రస్తుతము ప్రాథమిక బాధ్యతలుగా యెంచి ఇంక నాయకుల యొక్కయు, వర్కర్లయొక్కయు ప్రస్తుత బాధ్యతలు యోచించుదాం,

మొదటనే పోరాటములో అందరు చేయుటలేదనియు దీనికి మీరి 60 సంll ల కాంగ్రెసు చరిత్ర యేకొద్దిమందికో తప్ప సామాన్యముగా ప్రజలకు తెలియదనియు చెప్పియుంటిని. ఇదేమి విచిత్రము బహిరంగసభలలోను, పత్రికలలోను మన ఉద్యమాలల్లో అనేకమంది పాల్గొనుచున్నారని చెప్పుకొనుచున్నామే ? సభలద్వారా, పత్రికలద్వారా, పుస్తకాలద్వారా సంవత్సరముల తరబడి నాయకులు కాంగ్రెసు ప్రచారము చేయుచు కాంగ్రెసు చరిత్ర చెప్పుచుండ 60 సంll ల చరిత్ర ప్రజలకు తెలియదనియు, ప్రజలు ఉద్యమాల్లో పాల్గొనుట లేదనియు నేను అను మీకు హాస్యాస్పదముగను, కించపరుచున్నట్లు తోచవచ్చును. కాని ఈ రెండు విషయములగూర్చి కొంచము పరిశీలించినచో వీటియదార్థమున్ను, మన బాధ్యతయున్ను మనము చేయవలసిన కార్యక్రమమున్ను గోచరించును.

మన దేశములో నున్న 7 లక్షల గ్రామములనుండి గ్రామానికి కనీసం 10 మంది వచ్చి ఉద్యమంలో పాల్గొంటే యేలాగు ఉంటుందో ఊహించుకోవచ్చు. యేనాడో స్వరాజ్యం సిద్ధించి ఉండేది కాని ఇప్పుడు నిజానికి ఉద్యమాల్లోకి ఒకరూ కూడా రాని గ్రామాలు ఎన్నిలక్షలో యోచించండి.

దీనికి కారణాలు కాస్త పరిశీలించుదాం. గ్రామసంఘాలు (కాంగ్రెసు) యేమి చేసినవి? ఎన్ని గ్రామాల్లో గ్రామసంఘాలు యేర్పాటు చేసినారు? ఇది జిల్లా కమిటీవారి బాధ్యత కాదా? బాధ్యత యేమిటి?

కార్యాచరణ:— తాలూకా కమిటీలు యేర్పాటు చేయుట. వారిచే గ్రామకమిటీలు యేర్పాటు చేయించుట. గ్రామకమిటీలు ఆయా గ్రామాల్లో నిర్మాణ కార్యక్రమము సాగించుట. ఇవన్నీ చెప్పుటకు సులువుగానే ఉంది. ఇవన్నీ ఇదివరకు చేయుచున్నదే నిర్మాణ కార్యక్రమము తప్ప- ఎందుచేత ననగా ఇది సాగించుట చాలా కష్టమని తలచబడుచున్నది. కాబట్టి అని అంటారు. కాని నిర్మాణకార్యక్రమము కొనసాగించనిదే స్వరాజ్యం లభించుట కష్టము. ఒకవేళ లభించినను స్వరాజ్యసౌఖ్యము అనుభవమునకు రాదు. ఇకను నిర్మాణ కార్యక్రమము ఆచరించుట కష్టమనే దానికి అబద్ధమాడకుండ సత్యమునే పలుకుటనుగురించి యోచన చేయుచుండినంతకాలం బహుకష్టసాధ్యముగా తోచుచు ఆచరించుటకు మొదలిడిన క్షణమునుండి ఎంతసులువు అని కనుగొనగలమో, అబద్ధమాడుటయే బహుకష్టసాధ్యమని ఎట్లు విదితమగునో అట్లనే నిర్మాణ కార్యక్రమమును అట్లనే సుగుణమిచ్చుటయే యితర కార్యమయినను.

దుష్టఫలితమునిచ్చు కార్యక్రమములు పైకి ఆచరించుటకు చాల సుగమముగను ఆనందమును కూర్చునవిగాను కాన్పించును. ఉదాహరణకు ఎన్నికల కార్యక్రమమును చూపిన చాలును. కావున నిర్మాణ కార్యక్రమము నిష్కల్మషముగా ఆచరించిన మనకు స్వరాజ్యము మహదానందదాయకముగా సంక్రమించుననియు, దానిఫలితము మనమున్ను ప్రజలున్ను అనుభవించ కలుగుదుమనియు, నిర్మాణ కార్యక్రమము సాగించ నిచ్చగించక ప్రస్తుత వ్యామోహములకు లోనైయున్న మనము తాత్కాలిక సుఖముల కొరకు - నిజానికి ఇవి సుఖములు కావు సరిగదా పైగా ఇవే కష్టపరం

పరలు - ఈసుఖములని భ్రమపడుచున్న వాటిని విడనాడుకొన లేనంతటి దౌర్బల్యముగకు లోనై పరితపించుచున్నంత కాలం స్వరాజ్యము రావడం కాదు సరిగదా ఇంతవరకు అనుభవించుచున్న కష్టములే కాక ఇంకనూ ఎక్కు-వైన కష్టములు అనుభవింపక తప్పదనిన్ని మనము గ్రహింపవలసియున్నది. నిర్మాణ కార్యక్రమ ఆచరణయొక్క స్వరూపము రూచించుటకు శాస్త్రసాధనములైనచో ఈఆచరణవల్ల గాంధిమహాత్ముడు చెప్పినట్లు గవర్నర్లు పై పోయిలే కాక యావత్ప్రపంచములోని మధాంమలందరుకూడా మనదొద్దకు రాకతప్పదు- ఇందుకుగాను యేమి చేయవలెనన్న :—

ప్రతి గ్రామమున్ను అనగా గ్రామములోని ప్రజలు ఆర్థికముగా (ధనవంతులతో సహా) సాంఘికముగా, నైతికముగా నీచస్థితిలోనున్నది అందరకు సువిదితమే. ఈస్థితికి విద్యాలోపమే కారణము. సమగ్రమయిన విద్య దానియొక్క నిజస్వరూపములో పొందవలెనన్న గాంధిమహాత్ముడు సూచించిన నిర్మాణ కార్యక్రమము ద్వారా మాత్రమే లభ్యమగును- కాని యీ కార్యక్రమము సాగించుటకు తగిన శిక్షణపొందినవారు లేరైరి- కాన ప్రతిగ్రామమునను నిర్మాణ కార్యక్రమ కేంద్రము అవశ్యము. దీనికి ప్రయత్నము జరుగక పోలేదు. రెండు సంవత్సరములక్రిందట మహాత్ముడు నిర్మాణ కార్యక్రమమోమును చాటినప్పుడు కనీసము లక్షమంది "ప్రచారకులనైనను తయారు చేయుటకుగాను అఖిలభారతానికి వార్ధాలో శ్రీకస్తూరి గాంధి అధ్యర్యానిన్ని ఆంధ్రదేశమునకు వినయాశ్రమములో ఆధునికవశిష్ఠ, ఆంధ్రగాంధీ, సర్దార్ శ్రీగొల్లపూడి శీతారామశాస్త్రిగారి అధ్వర్యానిన్ని గ్రామప్రచారక శిక్షణాశిబిరములు స్థాపింపబడి ప్రథమజట్టుతోనే ఆగిపోయినవి. (అక్కడ ఒక 80 ఇక్కడ ఒక 20 మందితో) దీనికి కారణము పార్టీక్లిక్కులు. జిల్లాకమిటీలు శ్రద్ధవహించకపోవుట- అంటే విద్యార్థులను పంపక పోవుట- తిరిగి వచ్చినవారిని కార్యక్రమమునకు వినియోగింపక పోవుట. దీనికి కారణము నిర్మాణ కార్యక్రమము కొనసాగించిన ప్రజలు అంధకారములోను అన్నివిధాల క్షుద్ధులనుదుర్య కాబట్టి మునపటోద్యాల్ను, పదవులు,

అట్టే పెట్టుకొనుట మస్థమగు నేమోయన్న భీతివలె, ఒకవిధమయిన ఈర్ష్య వలె తోచుచున్నది. కాంగ్రెసు పేరిట నడుపబడుచున్న కార్యక్రమము పదవుల సంపాదనకా? స్వరాజ్య సంపాదనకా? స్వరాజ్యసంపాదనకే పన్నయిన నిర్మాణ కార్యక్రమము సాగించుట మాత్రమే శరణ్యము. ఇందువల్ల మనమే కాక అనేకమంది మనకువలె సమర్థులుగ తయారగుదురనే ప్రోత్సహించుటకూడ అవసరము. యేలనన, గ్రామములను నిజముగ సౌభాగ్యవంతముగ చేయుటకు యెందుకోట్లమందియైనను సమర్థతకలవారు కావలసియుందురు. కావున అందరకు తావుకలదు. వీరిని మీరే తయారుచేసినచో ఆగౌరవము మీకే దక్కును. ఎవరు ఎంత భూభాగానికి ఇట్టి నిష్కళంక సేవచేతురో వారు ఆంతప్రదేశానికి సంబంధించిన ఉన్నతపదవిని ఎట్టి ప్రత్యేక ప్రయత్నము చేయనక్కర లేకుండగనే అమిత గౌరవపూజలతో సహా పొందగలరు. యీవిధానానికి ఇప్పటికైనా అవలంబించక ఎవరి తాపత్రయము వారే పడుచున్న పాతపద్ధతినే గాని అనుసరించుచున్న, ఇదే పద్ధతితో తయారయ్యేవారు ఇక ఉండరు అనే హామీ యేమీలేదు కాబట్టి పైగా ఈపద్ధతినిపోషించి నేర్పినవారు మీరే యగుదురు కాబట్టి, ఇట్టి వారే తయారై, రేపో, నేడో ఇప్పుడు మీరు పిల్లలు పెట్టకుండగా, శాఖోపశాఖలు గాకుండా గొడ్డుమోతుగా తయారుచేసి అట్టే పెట్టుకొనుచున్న (Centralize చేసుకొని కూర్చున్న) ఆ ఒకటి రెండు పదవులను గుంజుకుపోయే పరిస్థితులను కల్పించుకొన్న వారగుదురు. పైగా గ్రామ గ్రామములోను పార్టీలు వృద్ధి చేసినవారగుదురు. అప్పుడు చాల బాధాకరమైన పరిస్థితిలో జీవింపవలసివచ్చును.

కావున ఇటు చూచినను నిర్మాణ కార్యక్రమమే శరణ్యము. పైగా దీనివల్ల బాధ్యతా రహితమైన విమర్శకులకు బాధ్యత అంటే యేమిటో చెప్పినవారగుదురు. దొంగవాని చేతిలోనే తాళము పెట్టినట్లుగా ఇట్టివారికి బాధ్యత ఇచ్చిన ఇంతకాలముగా మీ ఒక్కొక్కరి ఆధ్వర్యాన్ని

ఉంటున్న సంఘములు, సంస్థలు మున్నగువాటిమీద చేయబడుచున్న విమ ర్శలు అంతరించును.

ఇకపోగా మిగిలినది స్వరాజ్య సంపాదనా ప్రయత్నములో ఎన్ని కయగుటకూడా యొక అంగమేనని యందురేమో. ఎన్నిక యగుటకు ఎన్నెన్ని మార్గములుండవచ్చునో కాని నిర్మాణ కార్యక్రమా చరణలో ఎన్నిక యగుటకు కల మార్గము లన్నిటిలోకూడ మిక్కిలి సులభమగు మార్గముకూడ ఇమిడియున్నది. స్వరాజ్యసంపాదనకు గాంధిగారి నాయ కత్వమున కాంగ్రెసు మూడు అంగములతో నడపబడుచున్నది. ప్రబోధ ము, ఎన్నిక, పోరాటము, (Constructive Programme, Parliamentary Progamme, Fight.) దీనిలో ఎన్నికల కార్యక్రమ మునే ముఖ్యముగ తీసుకొన్నచో ప్రబోధము, పోరాటము కుంటివడిపోవు చున్నవి. నిర్మాణ కార్యక్రమమునే ముఖ్యముగ తీసుకొన్నచో ప్రబోధము, ఎన్నికలు, పోరాటముకూడా దిగ్విజయముగా కొనసాగును.

ఆర్థిక సౌష్టవము :—అసలు ఏ కార్యక్రమమునకైనను డబ్బు కావలెను. ఎన్నికలకైనను స్వంతముగా కొంతయు ప్రజలనుండి విరాళ ములుగా తీసుకొని కొంతయు ఖర్చుపెట్టవలసి వచ్చుచున్నది. కాని దీని వల్ల ఈ యొక్క కార్యక్రమమే సాగుచున్నది. అదైనా ఎంతో శ్రమతో అదుర్దాతో, అవినీతితో సాగుచున్నవి. తక్కిన రెండు కార్యక్రమములు పూర్తిగా కుంటువడుచున్నవి. పైగా ప్రజలలో యొకవిధమైన అపనమ్మ కము, ఉదాసీనత ప్రబలుచున్నది. ఈడబ్బునే నిర్మాణ కార్యక్రమమునకు గాను వెచ్చించిన దీనితోపాటు ఎన్నికల కార్యక్రమము, పోరాట కార్య క్రమముకూడా ప్రత్యేక ఖర్చు, ప్రత్యేకశ్రమ లేకుండగా బ్రహ్మాండముగా కొనసాగును. దీనివల్ల నాయకులకు ప్రత్యేక గౌరవము కల్గును. కేకవైచిన గ్రామమంతయు కదలివచ్చును. కావున ఇప్పటికైనను జిల్లా శిక్షణాశిబి రమును స్థాపించి యొక్కొక్క గ్రామమునుండి ప్రథమమున యొక్కొ క్క ఖర్చుయను కేంద్ర శిక్షణా శిబిరమునకు శిక్షణ పొందుటకు పంపు

నట్లు చేయవలెను. ఇట్టి శిక్షణపొందిన ప్రచారకుని తన గ్రామములో నిర్మాణ కార్యక్రమోద్యోగిగా జీతముమీద నియమించవలెను. ఈగ్రామోద్యోగి తాను వివిధ శాఖలు చూచుకొనుటలో కొన్ని ప్రత్యేక వాంశములలో సహాయభూతముగా నుండుటకై తన సలహామీద ఆయుర్వేదము, పశువైద్యము, ప్రసూతి శాస్త్రము, సహకారపద్ధతి, కొన్ని ప్రత్యేక అభివృద్ధితో నడపబడుచున్న గృహపరిశ్రమలు మున్నగువాటిలో తర్ఫీదుకై తగిన ఆయా శాఖలలో ఉత్సాహముగల, చురుకుగా అభ్యసించగల యువకులను గాని, యువతులను గాని గ్రామ కమిటీవారు కేంద్ర శిబిరమువారు సూచించిన స్థలములకు పంపవలెను. ఈవిధముగా తర్ఫీదుపొందివచ్చిన వెంటనే జీతముమీద నియమించవలెను.

ఈశాఖలలో చాలముఖ్యభాగము ప్రచారశాఖ. ప్రతిరోజు ప్రతి గ్రామములోను కాంగ్రెసు ప్రచారము అనగా సభ జరుగవలెను. ఇది యెందుకు అనగా ప్రస్తుతము కాంగ్రెసు ప్రచారము లేదు సరిగదా ఈ పేరున గ్రామాల్లో యే యొకరిద్దరో యున్నను వారియొక్క బాధ్యతారహితమైన చెప్పుటలు (loose talk రాజకీయములు) ద్వారా భారత జాతీయోద్యమమునకు అనగా కాంగ్రెసుకు తీరని దెబ్బ తగులుచున్నది. ఈపరిస్థితిని ఇంకను విపులముగా ఉన్నది ఉన్నట్టు చెప్పవలెనన్న ప్రస్తుతము గ్రామాల్లో యెవరైనా పెద్దనాయకులు వచ్చినప్పుడు మర్యాదలు చేయుచును, కొన్ని మాసములకో—కాదు సంవత్సరములకే—సమయము వచ్చినప్పుడు యెవరైన పెద్దనాయకులు వచ్చినప్పుడుగాని, తీసుకువచ్చిగాని సభలు యేర్పాటు చేయుచును మరల యెవరి వ్యవహారములు వారుచూచుకొనుచు పేరునకు ఉన్న యే మెంబరునో వర్కరునో సామాన్యముగా ప్రజలు కాంగ్రెసు (Representative) ప్రతినిధిగా తలంచుచు వారికియేదైనను సందేహము వచ్చినప్పుడు ప్రత్యేకముగా పనికట్టుకొని వెళ్ళి అడిగేటటువంటి పరిస్థితిలో లేనప్పటికి ఇట్టివారు తటస్థపడినప్పుడైనను రాజకీయములు గురించి "యుద్ధము యెలాగు ఉన్నదండీ" 'రాజీ విఫోయింది కదండీ,

'ఇప్పుడు కాంగ్రెసోరు యేంచేస్తున్నారండీ' యన్నగు ప్రశ్నలు సహజముగ తప్పక వేయుచుందురు. సహజముగ అనిఎందుకుఅన్నానంటేమానవుడు సంఘజీవి కాబట్టి, సంస్థలు రాజ్యాంగలు ఇట్టి పెద్దసంఘములే కాబట్టి, కడు బీద వానియొద్దనుండి మహా ధనవంతుని వరకు ఈసంబంధమును బట్టి రాజకీయపు మార్పులకు రొయుత్తిడులకు గురి కాక తప్పను కాబట్టిన్ని ఇట్టి ప్రశ్నలు మానవ సహజములే. ఇట్టిప్రశ్నలు వేయబడువారు మరిరెండు తెగలువారు కలరు. దీనిలో మొదటివారు పత్రిక గాని, ప్రతి గాని తాము చదువకపోయినను తెప్పించు వారును, చదివినను రాజకీయములు తెలియని వారును (రాజకీయము తెలియుటఅనగా ఆరోజు చదివిన విషయముయొక్క పూర్వాపరములు, దానికి సంబంధించిన దేశముల చరిత్రలు, నాయకుల చరిత్రలు తెలిసి యుండుట) ఇక రెండవ తెగ వారు ఉద్యోగస్థులు పాపం వీరు సాధారణముగా రాజకీయములు కాదుగదా, దినపత్రిక విశేషాలు కాదుగదా, వారి ఉద్యోగవిధులే తెలియవు. పాపం! ఇట్టివారినుండి ప్రజాసామాన్యం వారి కర్మలుగురించి తెలుసుకోగోర్తారు. సలహాలు పొందగోర్తారు. కాని వీరికి ఇంతవల్ల యెప్పుడూ తప్పుడు సమాచారం మే. తప్పుడు త్రోవలే చెప్పబడుచున్నవి.

కావున ప్రజలలోనుండే ఇట్టి సహజనైజమునకు (Inquisitive-ness) సత్ఫలితము ఒక్క నిర్మాణ కార్యక్రమము ద్వారానే దీనిలోని అంతర్భాగమైన అధికారయుతమైన ప్రచారముద్వారానే, క్రమశిక్షణ ద్వారానే (Correct information alongwith practical example) కలుగును. లేకపోయినచో ఈ పైచెప్పబడిన మూడు తెగల వారివల్లను తెలుసుకునే దౌర్భాగ్యపు స్థితిలోనే ఉంచివేసినట్లైన వీరికిని కూడ అపచారము చేసిన వారమగుదుము. యేలనన తెలియని సంగతులు చెప్పుటకు ప్రయత్నించుటవలనను అడిగే ప్రశ్నలకు సరియైన జవాబు చెప్పలేకపోవుట చేతను చికాకకల్గి అనవసరపు రభస పెరుగుటయు పలువురు పలు విధములుగా చెప్పుటకు ప్రారంభించి, చూచేప్రజలకు కాం

గ్రెసు అంటేను, ఇట్లు చెప్పేవారంతేనున్ను ఒకవిధమైన నిరసనభావము చులకన ఏర్పడుచున్నది.

కావున క్రమశిక్షణ పొందిన ప్రచారకులను నియమించిన ప్రజలు వారి ఈ సౌకర్యవల్లనే అధికార పూర్వకమైన సమాచారములను, సలహాలు సహాయములు పొందు చుండగలరు. యెప్పటికప్పుడు విషయములను తెలియ పరచుటకు కేంద్రమునుండి ప్రతిగ్రామమునకును కరపత్రములు పంపుచుండ గలము. ఇట్టి క్రమశిక్షణాపూర్వక నిర్మాణ కార్యక్రమమును ఆచరించు చున్న ఈ పై చెప్పబడిన తెగలవారినికూడా ఈ రాచబాటకు అడ్డు అని తొలగించనక్కరలేదు. వీరిలో ఇష్టమున్నవారు జిల్లా కేంద్ర శిబిరములో శిక్షణపొంది ఉపకరించగలరు. వీరికి విషయము తెలియక కొంత, తెలుసు కొనుటకు అవకాశము లేక కొంత గాని ఈ వర్గములో ప్రజాసేవాతృష్ణ కలవారు చాలామంది కలరు. లేనివారు ఈ రాచబాటనుండి వారే నిలువలేక తొలగిపోగలరు. అప్పుడే కాంగ్రెసు అంటే యేమిటో, ఆశ యము యేమిటో, ఏమి చేయుచున్నదో, ఎప్పుడెప్పుడు ఏమేమి చేసినదో ప్రజాసామాన్యము తెలుసుకొనగలదు. ఆచరించుటకు అవకాశము కల్పిం చిన వారమగుదుము. ఆచరించెదరు.

దీనివల్లఒక ప్రజాప్రభుత్వముఏర్పరచినట్లే Parallel Government (ఒక పోటీ ప్రభుత్వము) నడుపుటకు తయారు చేసినట్లే. ప్రతిగ్రామము ఒక ఆశ్రమమువలె తయారగును. దీని ఆర్థిక సౌష్ఠవమునకుగాను స్థానిక నాయ కులు ఆయా గ్రామాలకు వెళ్ళి ఈప్రణాళికను వివరపరచి దీనికిగాను విరాళ ములు సేకరించి ఆనిధిని ఆయా గ్రామములకే ఇచ్చి ఆయాగ్రామాలలోని వ్యక్తుల ఆదాయాన్నిబట్టి ఈ కార్యక్రమము నిర్విఘ్నముగా నడుపుటకు నెలవారి చందా కూడా ఏర్పాటు చేసుకొనవలెను. ఎన్నికలకు ఖర్చుపె ట్టినట్లు ఖర్చుగామాత్రమే లెక్కకట్టవద్దు. ఇంక మరికనబడును- నిర్మా ణకార్యక్రమమునకు ఖర్చుపెట్టినట్లు వ్యాపారమువలె రకముతిరుగుచు ఆ గ్రామమునకే పెట్టుబడివలె నుండిపోవును. ఎట్లన, కొంత సహకారపద్ధ

తిలో నడచుచుండును. అనగా ఖద్దరుఉత్పత్తిసంఘములు, పాలుసప్లయి సంఘములు మున్నగునవి స్థాపించవచ్చును. మరియు పెట్టుబడి అనగా ఒక్క వ్యాపార రీత్యానే చూచుట కాదు. గ్రామములోని వివిధరకముల ప్రజలకు సామాన్యముగా సంభవించుచుండెడు అనేక బాధలు కలుగకుండగా కాపాడుటకు ఒక నిధివలెకూడా ఉపయోగపడును. అనగా వివిధ జాతి, కుల, మతముల వారిమధ్య. వృత్తుల వారిమధ్య, వివిధరకముల కక్షల వారిమధ్య సంభవించుచుండెడి కార్పణ్యములు, కొట్లాటలు, కోర్టువిరుగుళ్ల ఖర్చులు మున్నగునవి లేకుండగ కాపాడును. ఇందుకుగాను, విరాళములు చందాలు ఇచ్చుటకుకూడా ఎట్టి అభ్యంతరముఉండదనియు, సంతోషముతో వారివారి స్వంత బ్రతుకుదెరువు కొరకై వినియోగించు కుంటున్నట్లుగానే ఇచ్చెదరనియు నాభావన. లేనిచో అట్లుఇవ్వ నిచ్చగించని వారికి మనలను అన్నివిధాలా పాడుచేయుటకు ప్రభుత్వమునకు ఎలాగుఇచ్చెదరో అలాగే మనలను బాగు చేసుకొనే పద్ధతికిగానుకూడా ఇచ్చుకొందురని నచ్చ చెప్ప వచ్చును.

అంతియేగాని ఎక్కడో నాలుగేసి రాట్నాలు పెట్టి పెద్ద నాయకులు వచ్చినప్పుడు త్రిప్పించిన అది నిర్మాణ కార్యక్రమము కాజాలదు. అవినీతిని బోధించుటే యగును. తమ్ముతాము వంచన చేసుకొనుటయే అగును. కాని ఇట్లు నిర్మాణకార్యక్రమము నిర్దుష్టముగా కొనసాగించిన ఇంటింటికి రాట్నము వచ్చును. ప్రతిరోజూ రాట్నము తిరుగును. ఉదయమునే లేచుట, ప్రార్థన చేయుట కల్గును. వీటితో శ్రద్ధా, భక్తులు, నీతి, నియమములు ఏర్పడును. నైతికముగను, ఆర్థికముగను. శారీరకముగను, మానసికముగను ఉచ్చస్థితిలోనికివచ్చి సౌఖ్యసంపదలు పొందగలుగుదుము. మహాత్ముని ఆత్మ సంతృప్తిచెందును. నెహ్రూవంటి దేశనాయకుల కృషిని కొల్లగొట్టుకునేపద్ధతిని తప్పించి, వారికృషిని యినుమడింపజేసి సఫలీకృత మొనర్చినట్లగును. మనప్రతిజ్ఞ నెరవేర్చుకొనిన వారమగుదుము. జిల్లాలలోని కాంగ్రెసులోని చీలికలు అంతరించును. ఉన్న కొద్దిప్రజాసేవకులలో గల భేదములుపోయి సమన్వయము కలుగును.

## మనలగూర్చి యదార్థవిషయము :—

ఒక దేశములోని ప్రజ సుఖముగా జీవించవలయునన్న సర్వాంగసౌష్ఠవమైన ప్రభుత్వము అవసరము. యేప్రభుత్వము ప్రజల వివిధ జీవితావసరములకై శాసనములు చేయగల్గునో కాని వాటిని ప్రభుత్వోద్యోగులు అమలుపరచవలసియుండును. సాధారణముగా ప్రభుత్వోద్యోగులకు అధికారగర్వము, అధికారమదము అబ్బును. కావున వారు ఈశాసనములను అమలుపరచుటకు శ్రమతీసుకొనుట అరుదు. ఇంక ఈవిషయములలో సామాన్య ప్రజలకు జరుగు అన్యాయములకు మేరయుండదు. కావున ఏప్రభుత్వమున్నను ఇప్పుడైనను, ఎప్పుడైనను సరే వీరిని సరిగాపనిచేయునట్లు, సరియైన మార్గమున నడచునట్లు చేయుటకు మూలకాలక్రవలె రాజకీయసంస్థ అవసరము. కావున ప్రభుత్వము చేయుశాసనములను ప్రజలకందరకు న్యాయముగా అందునట్లు చూచుటకున్ను, ప్రజలకు కాలప్రవాహములో ఎప్పటికప్పుడు అవసరమగుశాసనములను ప్రభుత్వముచే చేయించుటకున్ను, అవసరమయితే అనగా వినిపించుకొనకపోయినట్లయిన ఆ ప్రభుత్వమునుగాని ప్రభుత్వోద్యోగినికాని తొలగించుటకును రాజకీయసంస్థ పనిచేయుచుండును.

మనదేశమునకు ఇట్టిఆశయముతో పనిచేయుచున్న ఏకైక రాజకీయసంస్థ కాంగ్రెసే; కాని మనజిల్లాకు సంబంధించినంతమట్టుకు ఈవిషయములో పూర్తిగా వ్యతిరేకముగా వ్యవహారములు నడచుచున్నవి. యేజిల్లాబోర్డు మెంబరుగానో, పంచాయితీబోర్డు మెంబరుగానో, మునిసిపల్ కౌన్సిలరుగానో తయారై అక్కడనుండి ఆయా లోకల్ బోర్డులలోని డాక్టర్లను కాంపౌండర్లను, టీచర్లను, పంతులమ్మలను తమపలుకుబడి హోదాలకు జోహుకుందార్లుగా చేసుకొనుటకున్ను, ఆయా లోకల్ బోర్డులలోని కంట్రాక్టులు తమపరం చేసుకొనుటకున్ను మాత్రమే ఈఉత్కృష్టమైన రాజకీయసంస్థయగు కాంగ్రెసును వినియోగించుకొనుచున్నారు. దీనికి నిదర్శనము

కాంగ్రెసు ఎన్నికలకైనను ప్రభుత్వ ఎన్నికలకైనను ప్రతితాలూకాని, గ్రామాన్ని గ్రామాన్ని, ఇంటిని ఇంటిని, మనిషిని మనిషిని విడదీయుటకైనను వెనుదీయక పదేసివేలు పదిహేనేసివేలు రూపాయలైనను ఖర్చుపెట్టుకుని ఎన్నికయగుటకు పడుతాపత్రయమే. ఈవిషయముగూర్చి చెప్పవలెనంటే ఎంతైనాకలదు. కాని నేను ప్రథమమునే సూచించియుంటిని. ఒకడు విమర్శించుచూ కూర్చునటే నాపని కాదని. కాని ప్రస్తుతము నడచుచున్న ఈపద్ధతివల్ల కలుగుచున్న ఒక ప్రధానకీడునుగూర్చిమట్టుకు ఇంచుక ప్రస్తావించుట కవసరముగా తోచుచున్నది. ఇది ప్రస్తుతము మనము చేయవలసిన కార్యక్రమమునకు ఒకసూచనకూడ అగును. యేవ్యక్తికైనను, సంఘమునకైనను యేదేని ప్రభుత్వోద్యోగివల్లగాని, ఇతరులవల్లగాని (సాధారణముగా మోతుబరులైయుండురు) యేఅన్యాయము జరిగినను ఆవిషయమై వారితో వ్యవహరించి ఆబాధానివారణకు కృషిచేయవలసినవారు స్వలాభమునకై కంట్రాక్టులు మొదలగు లాభములకు దాసులై ఈవిషయములలో నిర్మొగమాటముగ వ్యవహరించ కలుగుటకుదూరమగుచున్నారు. దీనివల్లనే ప్రభుత్వోద్యోగులు నేడు స్థానిక కాంగ్రెసువాదులను సరకుగొనక ప్రవర్తించగలుగుటకు తావు యేర్పడినది.

కావున ఈనాటినుండి మనము ముఖ్యముగా చేయవలసినది యేమియన ప్రతిగ్రామ కాంగ్రెసుసంఘము ఆగ్రామపొలిమేరలలోని ప్రజలందరకు అట్లనే తాలూకా, పట్టణ, జిల్లాప్రజలకున్ను తమరు బాధ్యతవహించినంతమేరకు అనగా ప్రదేశములో యేఒక్కనికి యేఅన్యాయము జరుగుచున్నను, యేబాధ కలుగుచున్నను ఆబాధానివారణాబాధ్యత తమదేనని భావించుకొని ఆబాధానివారణకు సర్వకృషి చేయవలయును. ఇట్లు వకటి రెండు కేసులు చేసేటప్పటికి ఇట్టిబాధే కలవారుగాని ఏ ఇతరబాధలైనను సరే కలవారుగాని అందరూ వక ప్రవాహంవలె నిరాటంకముగా, నిశ్చయముగా, పూర్తిన్యాయముకల్గునని విశ్వాసముతో, ధీమాతోరా ప్రారంభిస్తారు. అప్పుడు ఆసంఘము ఒకకోర్టువలె

అగ్రాసనమునకు ఒకపార్లమెంటువలె ప్రజలకు తెల్లడియగును. ఇందులకు ప్రతి గ్రామ, తాలూకా, పట్టణ, జిల్లా కాంగ్రెసుసంఘములకు ఒక కార్యాలయం, దానిమీద నామాబోర్డు ఉండవలెను. కార్యాలయముపై బాగుగా కనబడునట్లుగా ఎగురవైచిన కాంగ్రెసు జండా, నోటీసుబోర్డు ముఖ్యం- కొన్ని గ్రామములలో అలవాటుగా యుంటున్న పద్ధతిని అధ్యక్షుని లేక కార్యదర్శి గృహమునే కార్యాలయముగా ఉపయోగించవచ్చును. కాని కార్యాలయముబోర్డు, జండా, నోటీసుబోర్డు మట్టుకు ఉండితీరవలెను. కార్యక్రమ, నోటీసు జమ ఖర్చులపుస్తకములు సవ్యముగా ఉండవలెను. ఇకను అన్యాయములగురించి చర్యతీసుకొనుటకు, జాతి, మత, వయోభేదములు యేమియు పాటించకుండగాను, చిన్న, గొప్ప తేడాలు చూడకుండగను, యేపార్టీకి చెందినవారికయినను, ప్రభుత్వోద్యోగికైనను సరే ఆపొలిమేరలలో నున్న సర్వులకు సేవచేయవలసినదే. అట్టి సేవలోనే ఆసంఘమునకు అధికారముకూడా దేవదత్తముగా సంక్రమించును. ఈసేవ చేయుటకుగాను ఆయావ్యవహారమునుబట్టి వీలుగా ఆయావిషయములలో పరిజ్ఞానము అనుభవముగలవారితో ఉపసంఘములను నియమించిన ఆయావ్యవహారములు సాఫీగాను త్వరగాను కొనసాగును. దీనితో ప్రజల కష్టసుఖములగురించి యేమియు చేయకుండగ డబ్బుతో కాంగ్రెసును కొనివేయుచున్న పద్ధతి దానంతట అదియే అంతరించును. ఎందుచేతనవగా వ్యక్తులపై ద్వేషము ఉండకూడదనే ధర్మాన్ని దృష్టిలో పెట్టుకున్నచో ఇంతవరకుగల పరిస్థితులలో వారు అట్లు చేయుచున్నారే కాని ఈసేవా కార్యక్రమము ప్రారంభించినచో వారికికూడ యేఉపసంఘములోనో, యే అన్యాయ నిరోధములోనో అవకాశము కలుగును. కావున ఈభేదమునకే తావుండదు. ఒకవేళ ఎవరైనను ఈఉత్కృష్ట కార్యములో పాల్గొనక పోయినచో అట్టివ్యక్తులగూర్చి ప్రజలకే తేటతెల్లమవును. మంచిలేనప్పుడు చెడ్డపాటించక పోబడవచ్చును. కాని మంచిపని చేయుచున్నపుడు చెడ్డ బయల్పడును. కావున ఆఖరకు ఇతరపార్టీలుకూడ నీటిలో లీనమైపోవుననియే నాభావన. కాని ఇట్టిసేవా

కార్యములో గమనించవలసినది మరియొక చాలముఖ్యవిషయము కలదు- ద్వేషము కాని, పగ కాని, కోపము కాని ఎంతపరిమాణములోనైనను ఏరూపములోనైనను ఈన్యాయాన్యాయ పరిష్కార వ్యవహారములో ప్రవేశింపరానివ్వకూడదు. సహజముగానుండే "యీకక్షవారు మొదట మనయొద్దకు వచ్చినారని కాని, వీరు మనవారు వారు పెరవారని కాని"యుండే ఈచిన్న దౌర్బల్యమునకు తావే యివ్వకూడదు.

ఈసేవా కార్యములో కొన్నిటికి గ్రామస్థులతోనున్ను, చాలమట్టుకు ప్రభుత్వోద్యోగులతోనున్ను వ్యవహరించవలసి వచ్చుచుండును. గ్రామస్థులతో ఈవిషయములోమట్టుకు నిర్మొగమాటముగ వ్యవహరించిన చాలును. ఇంక ప్రభుత్వోద్యోగులతో వ్యవహరించే పద్ధతిగూర్చి, సూచించేముందు వారు ప్రస్తుతము ఎట్టిపద్ధతిలో ఉన్నారో, దానికి కారణములుగూర్చి కొద్దిగా పరిశీలించవలసియున్నది. అవగ సర్వసాధారణముగ అందరూ నిత్యం విమర్శించుచున్న ప్రభుత్వోద్యోగుల దుర్నడతలను నేను ఇక్కడ యేకరవు పెట్టదలచలేదు- అది మామూలే. అది నిజమే. కాని వారు అట్లుచరించుటకు గల హేతువులను, తన్నివారణమార్గములను అసలు వీరు ఎవరో మాత్రమే కొద్దిగ ముచ్చటించెదను. మొదట ప్రజాజీవితము స్వేచ్ఛగ నడచుటకు ఒక ప్రభుత్వం అవసరమనియూ, ఆప్రభుత్వం ప్రజాజీవితమునకు అడుగడుగునకు అవసరమయ్యే వివిధవిషయములకు సౌకర్యములు కల్పించుటకు వివిధశాఖలను నడపవలసియుండునని, అట్టిశాఖలను నడుపుటకుగాను సిబ్బందిని తయారుచేయుటకు, నియమించుటకు ఖర్చులకుగాను మనడబ్బును పన్నులరూపేణా ఇచ్చుచున్నామనియూ గుర్తించిన, ఈప్రభుత్వోద్యోగులు మనం ఒక్కొక్క ప్రత్యేక పనిచేయుటకుగాను నియమించుకున్న మన నౌకర్లు అని గుర్తుకు వచ్చును. అంతేకాదు వీరు ఆయా ఉద్యోగాలకు తగిన అర్హతలతో సరాసరి ఎక్కడనుండియైనను ఊడిపడినచో అంతబాధ లేకపోయేది. వీరు ఏదోతప్పులు చేస్తున్నా నిశ్చింతగా

తొలగించువేసుకోనేవారము కాని ప్రజల డబ్బుతో అనగా లక్షలు, కోట్లు వ్యయముతో పాఠశాలలను నిర్వహించి వాటిలో మరల తల్లిదండ్రులు రోజు తాత ముత్తాతలు గడించిన ఆస్తి యే కొద్దిపాటో మిగిలియున్నది కూడా కొన్ని వాళ్ళు కొళ్ళి అలికస్తుముమీద ధరించుకున్న వ్యయముతో చదువు నేర్పించటానికి అంతకంటె ఎన్నోరెట్లు వ్యయముతో నిర్మింపబడిన వైద్య, వ్యవసాయ, ఇంజనీరింగు మున్నగు కళాశాలలలో కార్యనిర్వాహణోద్యోగి విద్య చెప్పించి, ఉబికలకు, ఉత్తమ్నాళ్ళకు మరల యెంతో వ్యయప్రయాసలతో ఎన్నో సిఫారసులు చేయించుకుని, యెందరి కాళ్ళో పట్టుకుని ఉద్యోగము ఇప్పిస్తే ఇక అక్కడనుంచి ఇవన్నియు మరచిపోయి నా ప్రభావము చూడమన్నట్లు ప్రజాసేవ మరచి ప్రజాభక్షణ చేయుచు వ్యవహరించ మొదలిడతారు, చివరకు కొందరు తమ ఇండ్లకు ఎవరైనా స్నేహితులు వచ్చినప్పుడు వీరు నూట్లు. హోటలులోయుండి తమ ముసలి తండ్రి యే అరుగుమీదో కూర్చునియుండగా గాని, వచ్చినప్పుడుగాని వీరెవరని ప్రశ్నింపబడినప్పుడు తమ నౌకరని చెప్పుకొనుటకు కూడ సాహసించుటకు తమ కాదనంతటి మదాంధకారులగుచున్నారు.

కాని ఇట్టి ప్రభుత్వభృత్యుతో విద్యాగరపబడినవారిని తప్పులు చేసినప్పుడు తొలగింపకూడని నష్టపడజాలము. వారికి ఉద్యోగహోదా తగ్గింపు జైలుశిక్షవంటి తగినశిక్ష వేసి సేవ చేయించుకొనవలెను. వారియొక్క ఎట్టి నీతి బాహ్యమైన ప్రవర్తనను సాగిపోనివ్వకుండా అరికట్టవలెను. కావున ఈ ప్రభుత్వోద్యోగుల విషయములో వీరు మనబిడ్డలనియు, తమ్ముళ్ళనియు, వీరిని మనకు ప్రత్యేక ప్రత్యేక సేవలు చేయుటకుగాను ఆసేవాతర్ఫీదు ఇచ్చి నియమించుకొంటిమనియు, అక్కడనుండి వీరు పెడదార్లు తొక్కుచున్నారేమని చేయవలెనో మనము ఆలోచన చేసి తగువిధముగా వర్తింపచేయునే బాధ్యత హక్కు మనకు కలదని గుర్తించుకుని ప్రవర్తించుకొంటే బాగున్ను.

రూల్సు ఇలాగు ఉన్నాయి. అనే నిబంధనలతో బిగింపు మొదలుపెడు తాడు. దానితో తెచ్చిన యే నాలుగైదువందలలో కక్కించి యెంతో తను సృష్టించి యిచ్చినట్లుగా, ఘన కార్యం చేసినట్లుగా వరప్రసాదం, ఇస్తాడు. దానితో ఈ మోతుబరులు ఎంతో పెద్ద విజయము సాధించిన వీరులవలె బయలుదేరుతారు. ఇంక కంట్రాక్టుల విషయములో వీరి చర్యలు చెప్పనవసరము లేదు. వేలు, లక్షల ప్రజాధనముతో ప్రజావసరములకుగాను నిర్మాణములను వేలకొలది పనివారు పోషింపబడుచు పనిచేసి నిర్మింపవల సినది డిపార్టుమెంటల్ గా చేయించటం చేత గాక, ఆకష్టం పడలేక కొద్ది మంది కంట్రాక్టరులతో, కొద్దిమంది పనివారితో మనిపూసి మారేడు కాయ పని చేయించి కక్కినదంతయు సగము తాము సగము కంట్రాక్టరులు దో చుకోవడము దొంగతనముకన్న హీనము. ఎందరో పనివారల బ్రతుకు దొంగిలించబడుచున్నది. ఉన్న కొద్దిమంది తక్కువ భృతితో, దారుణ పరి స్థితులలో పెట్టి పని చేయించబడుచున్నారు. నిర్మించిన స్వరూపములా సకాలమునకు కాక, సవ్యముగా జరగక, బలము లేక స్థిరత్వమునకు పూర్తి ఉపయోగమునకు దూరమగుచున్నవి. ఇట్టి పాపపు ఆర్జనతోను, అక్రమ సొమ్ముతోను కట్టిన మేడలలో ఎంత శుభప్రదముగా, ఎంత నిశ్చింతతో జీవించగలరో వారికే తెలియాలి. ఇదేవిధంగా డాక్టర్లు, ఒకరేమిటి, ఇంచుమించుగా అన్ని శాఖలలోను ఈస్థితి పరిపాటి ఐపోయింది. ఎంత శోచనీయం. ఎంత సిగ్గుచేటు. ఉద్యోగధర్మం, ధర్మవ్యాపారంపోయినై ఈ అక్రమ పద్ధతులను రూపుమాపాలి ! నశించాలి !! అని కేకలు వేస్తే పనికిరాదు. వేయకూడదు. నశించాలి ! నశించాలి !! అంటే బాగు పడదు,

కావున ఇట్టి విషయములలో మనము మన హక్కులను, బాధ్యత లను గుర్తించుకొని అర్గనైజ్డుగా (సంఘములుగా ఏర్పడి) సూటిగా వ్యవ హరించిన చాలును. ప్రజలు వేరు ప్రభుత్వోద్యోగులు వేరు అన్న భావము

ఉభయులలో కూడ చంపుకోవలసియున్నది. ప్రజలవల్లనే ప్రభుత్వోద్యోగులు, ప్రభుత్వ శాఖలవల్లనే ప్రజలు ఆధారపడియున్నారని గుర్తించవలసియున్నది. అట్లు కాక ప్రజలు నేను సాగించుకో గలనని అహంభావముతో, ధీమాతో ఎవరుమట్టుకు వారు వ్యవహరించుకోమాదినంత కాలము మొత్తము అందరకు చేటు తప్పదు. కష్టములు, నష్టములు తద్వారా నశింపు తప్పదు. అట్లనే ఉద్యోగమదమును, అధికార దుర్వినియోగము సాగుచున్నదిగదా అని కాలవాహినిలో వచ్చుచున్నమార్పును గుర్తించుకొనలేకుండా ఇంకా సాగించుకోజూచిన ప్రమాదము, తలచుకొనుటకే భయంకరమైన పతనము తప్పదు. కావున మరల చెప్పవలసి వచ్చినను, ఎన్నిసార్లు చెప్పవలసి వచ్చినను, ఆఖరుసారిగా చెప్పవలసివచ్చినను ఒక్కటే మాత్రము. ఈవిషయములో ఉభయులుకూడా తమతమ హక్కులను, బాధ్యతలను, ధర్మములను గుర్తించుకుని, నకిలీలేకుండా, నూటిగా పరస్పర సహకారముతో ప్రవర్తించుకొనిన అందరకు శ్రేయస్సు, సుఖవు, సౌఖ్యం. ఇదింతయు చెప్పుటకు చాల సులువే, చాల కాలముగా చెప్పబడుచున్నది కూడా. కాని దీనిని ఆచరణలోనికి తీసుకున్నివచ్చుటకు మాత్రం :— ఇట్టి విషయములలో సంఘములుగా ఆర్గనైజ్ అయి వ్యవహరించుకొనుట ద్వారా మాత్రమే ఆచరణసాధ్యం. తద్వారా ప్రజలయొక్క, ఉద్యోగులయొక్క అందరియొక్క బ్రతుకు తెరువులు గట్టుట, పుట్టుట లేకుండగా, భయములు, కష్టములు, తాపత్రయములు లేకుండగా, సాఫీగా, సుఖముగా, ఆనందముగా సాగగలవు.

## ప్రజలకు విజ్ఞప్తి :—

ఈదేశములో యేపార్టీ పేరుతోనైనాసరే లేక వ్యక్తిగతముగానైనాసరే మీమధ్యకువచ్చిన నిజమైన సేవయేకొద్దిగనో గొప్పగనో చేయుచున్న అది మీకు కాంగ్రెసు సేవయేయనియు, కాంగ్రెసువల్లనే జరుగుచున్నదనియు భావించుకోవలసియుంటుంది. ఇదేమివిచిత్రము మాట్లా అంటే,

మన దేశములోని ప్రజలమయిన మనకు వందల సంవత్సరములుగా ఎవరెవరి దురాశా దండయాత్రలవల్లనైతేనేమి యెవరెవరి దురన్యాయమువల్లనైతే నేమి గత 60 సం॥క్రితము నాటికి యెట్టి స్థితిలోనుంటిమో ఇంచుకయో చించిన యెడల ఈ సత్యము స్ఫురించును. అప్పటికే ఈస్టిండియా కంపెనీ వారి పరిపాలనలో మన దేశ ప్రజలు నానా అవస్థలుపడుచు పదేపదే దేశమంతట కరువులు సంభవించుచు గగ్గోలెత్తుచుండిరి. ప్రజలకు మరి దారి లేక తిరుగుబాటే మరి శరణ్యముగ నిర్ణయములోనుండిరి. కాని దేశప్రజలకు నాయకత్వము లేదు. తిరుగుబాటు నడుపుటకు క్రమబద్ధమైన సంస్థగాని ఎట్టి యేర్పాటు గాని లేదు. అట్టితరిలో బ్రిటిషు రాజరికమువారు కల్పించుకొని పరిశీలక సంఘమును పంప దేశమును తమ స్వాధీనములోనికి తెచ్చుకున్నారు. దేశము బ్రిటిషు కంపెనీల వారి చేతిలోనుండి మారినదే కాని దురన్యాయములు, ఉద్యోగుల పేద ప్రజలకు ఎడలలేదు సరికదా హెచ్చుగా జొచ్చెను. అందువల్ల ప్రజలలో మరి యుద్వేగము దీప్తించిన అలజడి, అయిష్టత, సర్దుబాటు చేసుకొనుటకు ప్రభుత్వమునకు దుర్ఘటముగా పరిణమించినది. వారి పరిపాలనే కూలిపోయే స్థితి యేర్పడినది. బ్రిటిషు రాజనీతిలో—కాదు రాజతంత్రములో అంటే వారికి బాగుగా వచ్చును—మహాదిట్టలు కావున ఇట్టి ప్రజాశక్తులకు కాంగ్రెసు అనే అనకట్టను కట్టగల్గిరి. హ్యూం అనే ఒక రిటైర్డు బ్రిటిషు ఐ. సి. ఎస్. గారని లేవదీసి దేశప్రజలకు ప్రియ మాట్లాడునట్లు చేసిరి. అయ్యా! మిమ్మల్ని ప్రభుత్వోద్యోగులు చాల అన్యాయము చేయుచున్నారే, మీరు వాటిని ప్రభుత్వమునకు తెలియచేసుకొనలేక పోవుచున్నారు. తెలియజేసుకొనక గాని తెలియ జేసుకొన్నట్లయినచో ప్రభుత్వము తప్పక న్యాయము జరుపును, అట్లు తెలియపర్చుకొనుటకు ఒక ప్రజాసంస్థ అవుసరము కావున అందులకు ఈ కాంగ్రెస్సు నిర్మించుకొండి అని చెప్పి ప్రజలను యిటు మళ్ళించి ప్రమాదమును శాంతింపచేయగలిగెను. ఈ కాంగ్రెస్ ద్వారా అర్జీలు యిప్పించుచు అందుతో సహజముగా జరుగు కాలయాపనతో ఒక్కొక్కప్పుడు మహాస

సభలు జరుపుతూ వాటిలో బ్రిటిషు జాతీయగీతములు పాడించుచూ వాటికి గవర్నర్ల గుబారములు వగైరాలు ఇస్తూ జరుగుచూ సభకు గవర్నర్లు కాని అటువంటి బ్రిటిషు పెద్దలు కాని వచ్చినప్పుడు అందరు లేచి నిలబడి గౌరవించుచు ఎన్నిబిసెంటువంటి బ్రిటిషు వారు బొత్తిగా మితవాదులు, కొందరు భీరువులు వినటువంటి వారి అధ్యక్షతతో ఈ కాంగ్రెసు కొన్ని సంవత్సరములు గడచినది. ఈ మోసమును కనిపెట్టి తిలక్ వంటి దేశభక్తులు దీనిని నిజమైన ప్రజాసంస్థగా చేసుకొనిరి. అంతలో ప్రజల స్థితిని బట్టియూ, దేశపరిస్థితులబట్టియు యెప్పుడు, ఎటువంటి అస్త్రమును, యెంత ప్రయోగించవలెనో అంతప్రయోగింపగలిగినట్టియు, మరల ఉపసంహరింపగలిగినట్టియు మహానుభావుడు మానవకోటి నాయకుడు అని తుదకు జవహర్. బోస్. తిలక్ మహరాజ్ వంటి అగ్నిపర్వతములవంటి అతివాద, తీవ్రవాదుల చేకూడ ఒప్పుకోబడిన మహాత్ముడు, గాంధిగారి నాయకత్వము మన దేశప్రజల కాంగ్రెసుకు లభించినది. ప్రజల కష్టముల గురించి. సుఖముగురించి నిర్దుష్టముగా పోరాడగల స్థితిలోనికి వచ్చినది. బ్రిటిషు రాజతంత్రజ్ఞులు అటులు సాగింపుకొనుటకు చేతులు జారిపోవుటయే కాక తలమించిపోయినది. యెలాగైనా వారు రాజతంత్రజ్ఞులేకనుక- కాస్త మోటుగా ఉంటుందేమో కాని అప్రస్తుతము, నూతనము కాదు. కావున ఉదహరించుచున్నాను; రాచపీఠుగ తోడులేకుండా పోదను సామెతగా- చివరకంటూ యెన్ని పేచీలు వేయగలిగితే అన్ని పేచీలువేస్తూ యెంతమందిని పొట్టను పెట్టుకోగలరో అంతమందిని ఆహుతిచేసే రీతిని భారత ప్రజలలో నుంచే యున్నట్లుగా, భారతప్రజలవాణిగా ధ్వనించేటట్లుగా ఒక జస్టిస్ పార్టీని, ఒకొక్కరి చేతిలో- గుప్పెట్లో- అన్ని బాపతుల, అనేక వేల, లక్షల ప్రజాసామాన్యాన్ని పెట్టుకొనియున్నటువంటి గ్రామాల్లోని మోతుబర్లు, తాలూకాలమీద తహసీల్దార్లు, జిల్లాలమీద రావుబహద్దూర్లు, దేశముమీద లార్డ్లు, రాజాలు, మహారాజాలు, జమీందార్లు మున్నగువారితో కూడి, ప్రభుత్వముయొక్క ప్రభుత్వోద్యోగులయొక్క పూర్తిమద్దతుతో దేశప్రజల పార్టీయని పుట్టించినారు,

పాపం! ఈ పార్టీని మొన్నయుద్ధంలో హిట్లరు, బెల్జియం మున్నగు దేశాలను వదలిపెట్టినట్లు రణరంగంలో వదలిపెట్టేసరికి ఇంతంత హేమాహేమీలతో కూడుకొన్నటువంటి చతురంగబలము ఇప్పటి స్వతంత్ర కాంగ్రెసు రథ గమనములో నామరూపాలు లేకుండాపోయింది.

ఇటువంటి నాయకత్వము లభించి దేశప్రజల యోగక్షేమాలకు నిజమైన ప్రాతినిధ్యము వహించిన రాజకీయసంస్థ, అతిరథ, మహారథులుగల దేశీయసంస్థ, జాతి మత, వివక్షత లేని నిష్పాక్షిక రాజకీయ దురంధురలతోను, వశిష్ఠునివంటి ఋషుల ఆశీర్వచనబలముతోను, బహువిధ నిర్మాణశిల్పులతోను, యంత్రనిపుణులతోను, పండిత, వైద్య, కవిత, సకలవిధ లలిత కళోపాసకులతోను, ధర్మవాణిజ్య శ్రేష్ఠులతోను, ప్రభుత్వయంత్రము నడుపుటకు వలసిన ప్రతిశాఖకు, ప్రతితరగతిలోను అగ్రశ్రేణికి చెందినవారున్ను, ఆప్తులయినవారున్నయైన మహాత్యాగ శీలురతోను, కార్మిక కర్షక ప్రముఖులతోను అండవేసిన పారిశ్రామికవేత్తలతోను విరాజిల్లుచున్న జాతీయసంస్థయనే ఈ రథము దేశప్రజలు కోల్పోయిన ఆత్మగౌరవప్రతిష్ఠాపనకై, వారిలో నిద్రాణమైపోయిన మానవత్వమును మేల్కొల్పుటకై, మరచిపోయిన ఆరోగ్య, వైద్య, పశుపోషణ, శిశుపోషణ వ్యవసాయ శిల్ప (వాస్తు) యంత్ర, లలితకళ (వినోద) న్యాయ మున్నగు శాస్త్రముల పునరుద్ధరణకై, బీదల దుస్థితిని, భిక్షుకుల ఆర్తిని బాపుటకై, ముఖ్యముగ వీటినన్నింటిని రాహు గ్రస్తముచేసిన పరపీడన అనే పరప్రభుత్వ దాస్యబంధమునుండి విముక్తిచేయుటకై సత్యాహింసలనే లోకోత్కృష్ట ధర్మములనే బాటగా చేసుకుని, నిర్మాణ, శాసనసభా, సత్యాగ్రహ పోరాటములనే లోకోత్కృష్ట కార్యక్రమములనే చక్రములుగా చేసుకొని, విద్వేషపరంపరలనే మానవకోటి చీడకు దివ్యౌషధమైన ప్రేమయనే దివ్యాస్త్రమునే సంధించుకుని, ఈ పై చెప్పిన అందరి మనోభావములను ఇక్కట్లను తామనుభవగతము చేసుకునివర్ధిల్లి సంపాదించినట్టి తాను ఉత్కృష్టస్థానాన్నే

ప్రతిబింబమైన మహాత్ముని సారధిగాను గైకొన్న ఈమానవకోటి మహారధము తన గమనములో తన లక్ష్యసిద్ధికొఱకు అనేక పోరాటములు సాగించవలసి వచ్చెను.

మొదట ఒక జాతియొక్క ఆత్మగౌరవము, చిహ్నము ఐన జండాకొఱకు. తరువాత జీవయాత్రకు కనీస అవసరమైన ఉప్పుకొఱకు, తనుపరిపాలనా దక్షత ప్రజాసౌభాగ్యమునకు వినియోగించుటకు. ఆతరువాత ప్రతివ్యక్తి తన కష్టసుఖములను తెలుపుకొనుటకు. తన మనోభావములను వెల్లడింప చేసుకొనుటకు కావలసిన వాక్స్వాతంత్ర్యముకొఱకు, తుదకు తమకు తాముగా సమాన గౌరవ ప్రతిపత్తిలో తమలో తాముగాను, ఈ భూలోకములోని ఇతరులతోను, సరాసరి వ్యవహరించుకునేందుకుగాను అటంకమైయున్న బంధవిముక్తికొఱకున్నూ అనగా రాజకీయ స్వాతంత్ర్యముకొరకు పోరాడవలసివచ్చెను. ఈప్రతి యొక్క పోరాటములోను అనేకత్యాగములు చేయవలసివచ్చెను. అనేకప్రాణములు కూడ కోల్పోవలసివచ్చెను. అనేకకష్టములు భరింపవలసి వచ్చెను. కాని ఈప్రతి యొక్క పోరాటములోను విజయము సాధింపబడెను. ఇంకను వైలక్ష్యములసిద్ధికై తుదిసారిగా మనలోని కుళ్ళును కడిగివేయుటకొఱకు దొంగలు అనబడే అనగా తమకు అవసరమునకుమించి ఇతరులకు ఉపయోగపడవలసిన సొత్తుకూడ కూడబెట్టుకొనుటకై అధికారములు సంపాదించుకొనుటకు వలసిన ఎట్టిఅవినీతిపనులైనను చేయుటకు సంకోచింపక తాపత్రయపడే అభివృద్ధినిరోధకులను అరికట్టుటకు అనగా ఆర్థికస్వాతంత్ర్యముకొఱకు (దీనికి Reform but not distrmctive removal అను Creed కాబట్టి, ఉదాహరణకు డాక్టర్లు ఇంచుమించులో అంతా అధర్మసంపాదకులోనై యున్నారనంకి, వీరందరిని ఒక్కసారి బర్తరఫ్ గాని, నిర్మూలించుటగాని చేసినట్లయిన బంగారుగుడ్లుపెట్టే బాతును చంపుకున్న సామెతగా, అంతకన్నా ఒకతన్నెటువంటి పొడిచేటువంటి వదరుకొనుకుజిష్ణు సంప్రకున్నట్లుగా అగును.

కావున వారు మనకు న్యాయముగా ఉపయోగపడేటట్లుగా సంస్కరణ కలిగేటటువంటి యేర్పాట్లు చేసుకోవలెను.) వీటన్నిటినిమించి ఇదివరకు హేమాహేమీలైన ధనికవర్గములోనుంచి తయారుచేసిన జస్టిస్ పార్టీతో వల్లెగాక అమాయకపు పామరులైన గ్రామికవర్గమును స్వప్రయోజనమునకు ఆకామముగా లేవనెత్తుకువచ్చుచున్న, మతకక్షతో వికటాట్టహాసము చేయుచున్న పార్టీలను మనకథవిచ్ఛత్తికి, కనీసము మనకథగమనమునకు అడ్డంకులుగాను వినియోగించుచున్న బ్రిటిష్ తంత్రజ్ఞుల పన్నుగడలను పూర్తిగా అరికట్టుటకు అనగా ప్రజలను చీలికలు చేసేదానిని అరికట్టుటకు అఖరిపోరాటము చేయవలసియున్నది. ఇందుకుగాను పన్నాహములు కాంగ్రెసు చేయుచునే యున్నది.

కావున ఈ 60 సం॥లుగా మనదేశము ఏపరిస్థితులలో నుండి యే పరిస్థితులలోనికి తీసుకురాబడినదో ఎవరివల్ల తీసుకురాబడినదో పరిశీలించిన ఈపార్టీలపేరున, జండాలపేరున అమాయకపు ప్రజలలోనికివచ్చి పైపైకి అగపడు చిన్నిచిన్ని ఉపకారములు ఎరవేయురీతిని చేయుచున్నవారికి అసలు వారికి ఆ మీటింగులు పెట్టుకొనుటకు, కష్టములు తొలగించుకొనుటకు, జెండాలు పెట్టుకుని మీమధ్యకు వచ్చుటకు హక్కు ఎక్కడనుంచి వచ్చినదో యెవరివల్ల వచ్చినదో ద్యోతకమగును. కావున ఇట్టివారు ఎవరైనను వచ్చి కొన్నిదేశాల, కొందరినాయకుల పేర్లు చెప్పుకునివచ్చి కాంగ్రెసు అటువంటిది, ఇటువంటిది, అదిమీకు యేమిచేయుచున్నది ? మేము మాకండి మీకు అదిచేసేం, ఇదిచేసేం ఇంకెంత కష్టపడిచేస్తున్నాం అని చెప్పవచ్చేవారిని మీరు కాస్త నంకలించవలసి యుంటుంది. ఈ చేస్తున్నది మీ జండాలుకాదు, మీ పార్టీలు కాదు. ఐతే చేస్తున్నది మట్టుకు మీరే. కాని మీరుచేస్తున్నదిమట్టుకు కాంగ్రెసు జండావల్లనే, ఈ దేశములోని కాంగ్రెసు సంస్థవల్లనే, వారు నేర్పినంతువల్లనే, వారి త్యాగాలవల్లనే, వారు కష్టించుచున్నందువల్లనే సాధ్యపడుచున్నది కావున

మీరు రకరకాల పార్టీ పేరున చేయుచున్నదే చిన్నదైనా ఉన్నదంటే దానిని మట్టుకు కాంగ్రెసు కృషిగానే భావించి, స్వీకరిస్తున్నాం అని చెప్పవలసి యుంటుంది. మీరు ఈ చేసేపనియేమాత్రం జెండాక్రింద చేయుండియే ఎందులకు చేయరాదు అని ప్రశ్నించవలసియుంటుంది.

తిలక్, గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు, గాంధీ, ఆంధ్ర గాంధీ సరిహద్దు గాంధీ, అజాద్, నెహ్రూ, ఆంధ్ర నెహ్రూ, ఆచార్య రంగా, సి. ఆర్. దాస్, అలీసోదరులు, బోస్, కొండా వెంకటప్పయ్య పంతులు గారు, ఆంధ్రకేసరి, కార్మిక నాయకుడు గిరిగారు, శ్రీమతి సరోజినీ నాయుడు విజయలక్ష్మీపండిట్, అమ్మన్నరాజా, దువ్వూరి సుబ్బమ్మ, ఈశ్వగంటి రత్నమాంబ, సూర్యదేవర అన్నపూర్ణాదేవి, మణిబెన్ కన్య, కెప్టెన్ లక్ష్మి, ఆశాదేవి, సావిత్రిదేవి, అరుణా, ఆసఫాలీ. జైప్రకాశ్, డాక్టర్ బ్రహ్మజోస్యుల సుబ్రహ్మణ్యంగారు, ఉన్నవ లక్ష్మీనారాయణగారు, ఎర్నేని సుబ్రహ్మణ్యంగారు, మద్దిరంగయ్య, ఆచార్య భిన్నాలి, ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్య, ఆంధ్రభోజ సాహిత్యబ్రహ్మ దుగ్గిరాల బలరామ కృష్ణయ్య, సజీవగ్రంథాలయ డాక్టరు పట్టాభి సీతారామయ్య, సమిష్ఠి యోగ రాజేంద్ర ప్రసాద్, సర్దారు గౌతు లచ్చన్న, తూర్పుగోదావరిజిల్లా గాంధీ, శ్రీపరానేని విశ్వేశ్వరరావు ఆంధ్ర రైతునాయకుడు గొట్టిపాటి వెంకట సుబ్బయ్యగార్లవంటి ఇంకా యెందరో యువజన, విద్యార్థి, మహిళా, బాల, కార్మిక, కర్షక, కాంగ్రెసు ఉత్తమ సత్యాగ్రహులు, మహానాయకులు మహాత్యాగములు చేసి మనకు స్వరాజ్య ఫలమును గాంచి మన ప్రజానాకు దూడామటికి మేసివేయకుండా కంచెకట్టి, నీరుపోసి, ఎరువువేసి, పెంచి పెద్దచేసి, కాపుకాయించి, పరుగునవచ్చిన ఈదారిలో వానివద్దనే వానివల్లనే నేర్చుకొనిన మీరు వారి ఉద్దేశములను మాకు తెలిసినట్లు మాచే ఆచరింపచేయుచు వారికృషిని, అనుయాయులు ఇతోధికముగా కృషి చేయుచు పలువలు చిలువలుగా మాలో వ్యాపింపచేయుచు మాకు సన్ని

బాధపడవలసివచ్చును. అప్పటికైనను బ్రతికి బయటపడుట తలమించిన వ్యవహారమగును. ఏమో! కావున ఈరీతిని మీరు మేముమాత్రమని వారిని త్రోసివేసి ఈ ఫలములను కోసుకోబోయి కృతఘ్నులవడం తగదు అబ్బాయిలా అని చెప్పవలసియుంటుంది. గత 60 సంవత్సరాలుగా వీటిని సృష్టించినవారిని కూలద్రోసి వారి ధర్మకర్తృత్వ స్థానాన్ని అధిష్ఠించుటకు చూస్తున్నారే కాని వాటిని ఇతరులు తిన్నకుపోకుండగా కాపాడుటకు; సవ్యముగా పంచిపెట్టుటకు కూడ అట్టి నిర్మాతలయొక్క నిర్మాణకౌశల్యము, ఓరిమి, అనుభవ చాకచక్యము ఇంకనూకూడ ఎంతేని అవసరము కావున ఓ! తొందరపాటు పిల్లలారా! ముక్కుపచ్చలారని పసికందులారా!! మీకీ దురాశ తగదు—అని గట్టిగా మందలించవలసియున్నది. వారి గౌరవము, మన గౌరవమూ నిలువవలెనంటే దేశానికి ఒక్కటే జండా, అట్టి గౌరవము సంపాదించుకున్న జండా యుండవలెనని నొక్కి వక్కాణించవలసియున్నది. పట్టుప్పుడు "ఈ కాంగ్రెసు మెతకరాయబారి భేదములతో యేమీజరగదు! ఈ బ్రిటిషు పిశాచమును కాల్చేస్తాం, చంపేయాలి, నమలకుండా మింగేయాలి" అని కేకలు వేసే ఈ పార్టీలు, అంత కాలముగా కాంగ్రెసు నిర్మాణయుక్తముగా అన్ని ఉద్యమాలు చేసి తీరా పోరాటము తీసుకువచ్చేసరికి, దిగజారిపోయి, పోరాటమును వ్యతిరేకించి, పోరాట వ్యతిరేక నినాదములను విదేశాలనుండి గ్రామఫోను రికార్డులుగా తీసుకువచ్చి, చివరకు ఆ శతృవులోనే సుఖప్రాణిగా చేరేటటువంటి ఈ పార్టీలను యెట్లు నమ్మగలము? పట్టుప్పుడు ఆర్భాటాలు చేసి ఏమి కాంగ్రెసుపై వత్తిడితీసుకొని వచ్చుట; ఏ అమాయాచేసుకోకుండగా, సన్నాహాలు లేకుండగాయున్నప్పుడే కాంగ్రెసును పోరాటములోనికి దిగబట్టు చేసి, అందు చూపవలసిన చూచుటకు స్థిరచిత్తముతో నడుచుచున్న ఈ మహాసంస్థను దెబ్బతినిపించుటకు కాదా! తద్ద్వారా ప్రవాహాలు తెంపబోటు దూరదేశులువవాడైనట్లు ఈ మత్తేభమువంటి మహాసంస్థ ఇటువంటి మశకమునకు దెబ్బతిని కూలిపోతే ఈ ఛోటా పార్టీలకు తినుటకేసి అవకాశము చిక్కగలదని చేసే అన్నను చంపు

ఈ నేటువంటి నీచపు కొత్తు కాదా? బొబ్బిలియుద్ధం, మహారాణా ప్రతాపుని త్యాగం ఆత్మార్పణమువంటి గుణపాత్రములతో, మన దేశమును పరాయివారికివప్ప చెప్పుకున్న ఘట్టములతో మనము ఒకప్పుడు ఆర్జించుకున్న నీచపుశకము జ్ఞాపకముంచవలదా? కనుక "మీకన్నా ముందడుగు వేసేవాళ్ళము, మీకన్నా తీవ్రతరగతిని స్వరాజ్యం సంపాదిస్తాం" అని చెప్పుకునే సోషలిస్టు, కమ్యూనిస్టులవంటి కాంగ్రెసుతో కొద్దిపాటి విభేదములు మాత్రమే నున్నట్లుగా కనబడే జాతీయపార్టీలుకూడా ఎగిరిపడే దురుసుతనము వారేనని. వీరు ఇలాగ ఎగిరిపడినప్పుడల్లా వీరు వ్యక్తిగతముగా నిజమైన జాతీయయోధులు కాబట్టి వీరిని కాపాడుకొనుట మరల కాంగ్రెసుకే మరియొకపనిగా పరిణమించుచున్నదని తేలిపోవుచునేయున్నది. పోనీ వీరేమన్నా పూర్తిగా విడిగాయుండుట కిష్టపడుచున్నారాయంటే అదీ లేదు. కాంగ్రెసును అంటిపెట్టుకునియేయుండటం మరియొక దారిని నడవటం. పోనీ వీరి ఆశయములు కాంగ్రెస్ ఆశయములకన్న మేలైనవాయంటే, ఈ దేశమునకే కాదు, యావత్ప్రపంచములోని మానవసంఘ ఆశయములన్నిటిలోకి ఉత్తమోత్తమమైన సోషలిస్టు మానవసంఘ నిర్మాణ ఆశయమే కాంగ్రెస్ ఆశయము. అదే వేర్ సోషలిజము. అదే సనాతన (నవ) సోషలిజము. ఈ వైపునకే కాంగ్రెస్ నడచుచున్నది. ఇదియే ఆచరణ సాధ్యమైన సోషలిజము. ఒకప్పుడు ఆచరణలోనున్నదికూడా. ఇది సోషలిజముయొక్క పరిపూర్ణరూపము కాబట్టియే ఆచరణసాధ్యము. అంతేగాని కలలుకంటున్న, నకిలీ, ఊహాగాన సోషలిజములు ఒకవేళ నయానో, భయానో, మోసమునో, దౌర్జన్యమునో ప్రజల అనుమతినిబడసినను ఆచరణసాధ్యము కాదు. ఎందుచేతననగా ఈ నకిలీ ఇజములకు మానవజాతియొక్క సంపూర్ణస్వామ్య స్వరూపము తెలియకపోవుటయే. కాని తొందరచే నకిలీవస్తువు, నిజవస్తువు నెమ్మదిమీదను లభ్యమగును. దీనికి ఉదాహరణ జర్మనీ నాజీయిజము (నేషనల్ సోషలిజము) ఇటలీ ఫాసిజము, రష్యా కమ్యూనిజములే. అవి యాంత్రికరీతిగా, అదృష్టాగా, దౌర్జన్యముచే (బలవంతముగా) స్థాపింపబడి

కనో అంతలోనే యెటువంటిపనికి అటువంటి ప్రతిఫలం- for every action there is reaction అనే లోక ధర్మమునుబట్టి) అదే విధముగా దౌర్జన్యముతోనే రూపునామాలు లేకుండాపోయినవి. ఇంక రష్యా కమ్యూనిజముకూడ గతయుద్ధములోని గుణపాఠముద్వారా, దెబ్బకు దేవేందుడు అగపడతాడనే సామెతగా దేవుడు లేడన్నవారు దేవస్థానములను తెరిపించుచున్నారు- బాలబాలికలను కలిపే చదివించవలెనన్నవారు యీపద్ధతి తప్పేయనియు బాలబాలికలకు వేర్వేరు పాఠశాలలుండవలెననుచున్నారు- ఈవిధముగ వీరిముందడుగు తొట్రుపాటు:ఇజము అనుభవముతో తిరిగి వెనకకువచ్చుచున్నది- కాగా ఈఇజముల గిల్టు కాంతికిమురిసికొనున్న కొద్దిమంది గట్టి రాజకీయవర్కర్లు విడిపోయి వేర్వేరు పార్టీలకు పనిచేయుచున్నందున గ్రామగ్రామములోను యున్నటువంటి కాంగ్రెస్ కమిటీలలో బురఖావారికి స్థానముదొరకుచున్నది- దానితో వారు ఇష్టమొచ్చిన ఆటఆడుటకు అవకాశమిచ్చినవారగుచున్నారు- ఈ కారణము కానుకోలేకపయిగా ఇందువల్లనే మేము యితరపార్టీలలోనికి పోవడం కాని, సృష్టించడం కాని, అనుచున్నారు. అట్లుకాక ఈవర్కర్లే కాంగ్రెస్ లోయుండి తమతమ గ్రామములలో పనిచేయుచున్నఆ స్థానిక కాంగ్రెస్ కమిటీలలో బురఖావారికి తావులేకుండా పోయేది- కాకోతే ఈప్రయత్నంలో ఒక సంవత్సరం కాకపోతే మరియొకసంవత్సరం పట్టవచ్చు-నాయకులైపోవుటకు ఆమాత్రం ఓపికపట్టలేకపోతే మనముండటినాయకులు యేలాలభ్యమయ్యేవారు? కాబట్టి యీపార్టీలవల్ల తేలే పర్యవసానం యేమిటంటే కాంగ్రెస్ మనదేశమునకు స్వరాజ్యముకొరకు, అందరు సౌఖ్యముగ జీవించేటట్లుగ చేయుచున్న కృషికిభారము, ఆటంకము అగుచుండుటే కాక ఇందుకై సర్వస్వము ధారపోసి అహర్నిశలు పనిచేయుచున్న మనదేశములోని కొద్ది రాజకీయవర్కర్లనుకూడా చీలదీసి మనం గమ్యస్థానం చేరుకునేకృషిని బలహీనపరచుచున్నారు. కావున ఇన్నిబంధాలుపెట్టి, ప్రజాశక్తిని-చీలదీసి

ప్రజలను తికమక పెట్టకూడదు- కాబట్టి భారతజాతీయజండా, మానవకోటి మానసబంధవిముక్తికి మానవకల్యాణమునకు పనిజేయుచున్న యీత్రివర్ణ పతాకమునుతప్ప యేయితరజండాను పెట్టనివ్వకూడదు.

ఇక కాంగ్రెస్‌లో పార్టీలంటారా, మీరుబాధ్యత వహించక అలసత్వము చూపుటవల్లనే కాని మీరు యేమాత్రము శ్రద్ధచుకొన్నను శ్రద్ధవహించినను రోజుల్లోనే యీవిభేదములు అంతరించును. మీరు అందరూ కాంగ్రెసు మెంబర్లుగాచేరి ఒక్క టెకం మీ ప్రాథమిక, గ్రామ తాలూకా, పట్టణ, జిల్లా, రాష్ట్రసంఘములు యేమిచేయుచున్నవో బడిలో వేసుకున్న మనపిల్లవాడిబాగోగులు, బాధ్యతవహించిన గురువును, పిల్లవాడినీ కూడా మనము అజమాయిషీ చేసుకునుటలో ఎట్లుకలదో ఆదే విధముగా మీ కష్టసుఖములకు బాధ్యతవహించిన ఈసంఘములనుకూడా అందరిగురించీ, మీగురించికూడా మీరు కాస్త అజమాయిషీ చేసుకున్నచో మరుచటి సంవత్సరమునకే కాంగ్రెస్ చేయుచున్న సేవలోని తేడా మీకు కాన్పించును. గ్రామస్వరాజ్యము అంటే యేమిటో ప్రత్యక్షముగా చూడ గలుగుతారు- అనుభవించ గలుగుతారు-స్వయముగా తెచ్చుకున్న దానిలోగల ఆనందమును పొందగలుగుతారు- లేక అట్లుమీరు పట్టించుకోనిచో, కాంగ్రెస్ పేరు చెప్పుకునిగాని, ఇతరపార్టీలు పేరుచెప్పుకునిగాని వ్యక్తులుయిష్టమొచ్చినట్లు ఆడుచున్న నాటకమును చూస్తూఊరుకున్నచో దున్నపోతు, దున్నపోతు మధ్య లేగదూడ కాళ్ళు విరిగినట్లు మీకుకష్టాలు తప్పవు. ప్రజాపాలనలో ఒకరొచ్చి యొకపద్ధతి, మరొకరొచ్చి ఇంకొకపద్ధతి, వారిని వీరినితోసివేసి వేరొకరొచ్చి వారి బాండ్లు, సమిష్టిజుల్మానాలు ; ఇట్టిబాపతులుగ కుదురు లేకుండగ నిత్యమూ నలిగిపోవుట మీకుతప్పదు- కావున మిమ్ములను ఆఖరు సారిగ కోరేదేమంటే, మీగురించియే కొద్దిబాధ్యత వహించవలసినది గామట్టుకే.

## బురకథానాయకులు, కాంగ్రెసులోని పార్టీలు అనే ప్రజావిమర్శ :—

పైన చెప్పినవిధముగ నిరూపించబడినవిధముగ కాంగ్రెస్ చేయుచున్న అసలు కార్యక్రమములు ప్రజలకు సామాన్యముగ తెలియకను, మరియొక ప్రక్క కాంగ్రెస్ నాయకులు అని చెప్పబడేవారిలో అనేకమంది ఆస్తులు సంపాదించుచున్నారనియూ, ఈవిమర్శ బయలుదేరినది. ఇట్టి విమర్శ చేయుటలో ప్రజలతప్పు లేదు. ఎందుచేతననగ వారికి తెలిసినది, పైకికనబడుచున్నది అంతయే కాబట్టి, కాని కాంగ్రెస్ సేవలోనికిదిగి నాయకుడు అనిపించుకుని మరల ఇట్టిస్థితికి దిగజారిపోవలసిన ఆగత్యమునకు, అవకాశమునకు గల కారణములను అరసినచో ఈపొరబాటు ఎక్కడున్నదో తేటతెల్లమగును

మొదట చదువుటద్వారానో, వినుటద్వారానో, చూచుటద్వారానో ప్రతివానికి రాజకీయచైతన్యము కలుగును. అట్టివారిలో చాలమందికి క్షణికోద్రేకము కలిగి వెంటనే మరచిపోవుదురు. వీరు జీవచ్ఛవములన బడుదురు. ఎట్లన శవముప్రక్కన తాటియాకులమంట పెట్టి వేడెక్కించి బ్రతికింపచూచిన శవము వేడెక్కునే గాని, హృదయము పనిపట్టుటకు ఎట్లు మొదలుపెట్టదో ఆదేవిధముగ వీరిలోని మానవత్వము అనే బీజము చచ్చిపోయినదన్నమాట. ఇంక కొద్దిమందికి ఆక్షణికోద్రేకము కలిగిన వెంటనే "నిజమే అంటే నిజమే! చంపేయాలి అంటే చంపేయాలి!! పాడిచేయాలిఅంటే పాడిచేయాలి!!!" అని అంటారు. కాని ఆవెంటనే ఎవరిఇళ్ళకు వారు వెళ్ళిపోయి యెవరి స్వంతపనులతో వారు మునిగిపోయి వారికి కలిగిన అజ్ఞానోదయాన్ని ఉపయోగపంచలేరు. అంటే ఈ తరగతివారిలో బీజమున్నది కాని క్షేత్రము నిస్సారమై పిరికివారన్నమాట. అనగా వీరి రక్తమాంసములలోను, మెదడులోను సారములేక పిరికివారై ప్రవర్తించుచుందురు. ఇంకపోగా బహుస్వల్పసంఖ్యగాయుండే కార్యశూరులు ఇట్టి రాజకీయ చైతన్యము కలిగినవెంటనే క్షణికోద్రేకమునకు లోనుగాక

ప్రాణికోటి రక్తమాంసములలోకెల్ల ఉత్కృష్టమైనది మానవుని రక్తమాంసములు. ఇట్టి రక్తమాంసములయొక్క సారము మెదడు, పిరికివారైనను రెండవరకము వారు ఈ మెదడును వారి స్వంతమునకుగాను, స్వలాభమునకుగాను ఉపయోగించుకొనువప్పుడైనను వారికివచ్చు ఆటంకములకు, అనుమానములకు ; వారియొక్క బలహీనమైన రక్తమాంసములు సమానముగా తూగలేక భయము చెందుచుండును. కార్యశూరులలో మెదడు (బుద్ధి) దీని సారమైన మనస్సు (హృదయము) శరీరము (రక్తమాంసములు) కూడా తన (ఆత్మ) యొక్క స్వాధీనములోనుండి సమానస్థాయిలో నడచుచుండును. కాబట్టి పిరికివాని రక్తమాంసములకన్న కొంచెము బలమైన మెదడు ముందు పరిగెత్తి క్షణికోద్రేకమునకు లోనైనట్లున్న అంతకన్న బలము తక్కువగలవాని రక్త, మాంసములు (శరీరము) అ పరుగుపెట్టలేక వెనకపడి భయము చెందుచున్నట్లున్నగాని కార్యశూరునియొక్క మనస్సు, బుద్ధి శరీరము, ఆత్మలయొక్క సమాన గమన బలములవల్ల తాను ఉద్రేకమునకుగాని భయమునకుగాని లోను కాడు. నిండుకుండవలె తొణికిసలాడకుండగా కార్యము నెరవేర్చుకొనుచు పోవుచుండును. అట్టి ఈ పైనుండివచ్చిన శక్తిని రాజకీయ జ్ఞానమును) కూడ జీర్ణించుకొని, చేయదగు కార్యమునకు పూనుకుందురు. వీరే రాజకీయ ప్రజాసేవకులు. ఇట్లు ప్రజాబాహుళ్యము కొఱకై కార్యరంగములోకి దిగి తత్కార్యవాహకమందు అవసరమయ్యే వివిధ విషయముల న్యాయాన్యాయ పరిష్కారమునకై వలసిన వివిధవిషయ పరిజ్ఞానములను సముపార్జించుచు, కృషిచేయుచున్న ఈ కొద్దిమంది త్యాగులను ప్రజలు ఆదరించి, పోషించుకుని సేవ చేయించుకొనలేకపోవుటచే వీరు అధర్మముతో సలిపే పోరాటములో అనేక ఇక్కట్లు పడవలసివచ్చుచున్నది. ఇట్లు వీరిశక్తిని కేంద్రీకరించి, సమిష్టిగా వ్యవహరించేటట్లు చేయకపోవుటచే వీరు ఎవరు ఓపినంత వారు సాగగలిగిన అంతస్థుకు సాగి చతికిలబడవలసివచ్చుచున్నది. కొందరు విరక్తులై ప్రాణములకు తెగించి సాహసించుచున్నారు. కొందరు భ్రాంతిగా (క్రింద అంతస్థులోనుండ గానే

సాగలేని ఇక్కట్టులు వచ్చినప్పుడు రాజకీయ బాధితుడుగా అగుచున్నాడు. ఇతడు పూర్తిగా ఎదుగని గుడ్డు అగుటచే అశక్తుడగుటచే కొంతయు తన రాజకీయ జీవితములో చేసిన ప్రసంగములకు, ప్రతిజ్ఞలకు కట్టుబడిపోయి కొంతయు ఏయితర వృత్తి అవలంబించనోల్లక బికారివలె కాన్పుట్టుడు. ఇట్టివానిని చూచి కొందరు తటస్థపడినను విముఖత్వము చూపుతారు. మరికొందరు నిరసిస్తారు. మరియొక ప్రక్క ప్రజలు వీరిని చూపి “యేమి కాంగ్రెసయ్యా, ఫలానా ఆతను చూడండి కాంగ్రెసులోదిగి యేమయ్యిపోయేడో! అంటున్నారు. అంతే కాని వారి అలసత్వంవల్లనే వారి అజ్ఞానంవల్లనే అతడు అట్లాగ తయారు కావలసివచ్చినదని గ్రహించలేకున్నారు.

మరికొందరు ఈప్రజా అలసత్వపు ఇక్కట్టులు చుట్టబెట్టుకు వేసరికి పై అంతస్థులలోనికి చేరుకున్న వారు ఎదిగిన గ్రుడ్లు కాబట్టి వారి విషయ విజ్ఞానపటిమను తమ కార్యభంగమునకు కారకులైనవారికి గుణపాఠము చెప్పటకోయన్నట్లు అధికార సముపార్జనకో, లేక ఈ సంత అంతా ఎవరికి? మనల్ని చూచేది ఎవరూ లేనప్పుడు అని తమ ఆర్జనకో, గడంగుటకు ఉపయోగపరచ ప్రారంభించవలసి వచ్చుచున్నది. యేళ్లో వతో ప్రక్క నను వీరివిద్యావిశేషములోని కార్యనిర్వహణాదక్షతవలన సహజముగా విశేషధనము, ప్రాబల్యము ఆర్జించకలుగుదురు. అంతటతో మొదలు, ‘కాంగ్రెసు ఇంతేరా, ఇందుకనే కాంగ్రెసులో దిగేదు’ అని.

ఇంక కొందరు అవకాశవాదులైన ధనవంతులు ఈ నిజమైన ప్రజాసేవకులకు కలుగుచున్న ఇబ్బందులను అవకాశముగా తీసుకొని ఏ మంత్రియో, ప్రధానియో అగుటకుగాను వారొక బురఖాను తగిలించుకొని పైన పేర్కొన్న తరగతులలోని వారిని కొందరను కొనుక్కొని, పార్టీలను సృష్టించ మొదలుపెడతారు.

మొత్తముమీద ఈధనవంతులైన బురఖా వారైనను, రాజకీయముగా సర్వస్వము ఒడ్డి ఇంక త్రాణలేక శరీరపటుత్వము కోల్పోయి కుదురుపడిన పెద్దలైనను, ప్రజలైనను, ప్రతిజ్ఞ వీడలేక బాధపడుచుండిపోయిన ఎదగని గ్రుడ్డయైన రాజకీయవర్కర్లను తమకు అవసరమువచ్చినప్పుడు యే యెలక్షనులకో, లేక తమకు యేదైన బాధవచ్చినప్పుడో- ఆంధ్రరాష్ట్ర యువజన కాంగ్రెసు ప్రధాన కార్యదర్శి, అఖిల ఆసియా అంతర్జాతీయ యువజన సమాఖ్య పరిచయసమితి కన్వీనర్ (సమావేశకర్త) యైన శ్రీపతానేని విశ్వేశ్వరరావుగారు చీపురుకట్ట కథచెప్పునట్లు—చీపురుకట్టవలె ఆ నాలుగుకోణాలకు టీ నీళ్ళసబ్బులు పెట్టుచు పందిళ్ళు, వేదికలు, మీటింగులు, పూలదండలు అమర్చుటకు, పేటలలోకిపోయి వోటర్లను తెచ్చుటకు ఉపయోగించుకుని తరువాత యెదుట కనబడితేనే కష్టపడతారు. వస్తుంటేనే లేచి వెళ్ళిపోతారు. ఈ రాజకీయ బాధిత వర్కర్లగూర్చి చెప్పవలెనన్న, శ్రీ విశ్వేశ్వరరావుగారు ఈవిషయమై చెప్పే చీపురుకట్ట కథ చెప్పినచాలును. “ఇంటికి బంధువులువచ్చినప్పుడు కుశలప్రశ్నలు వేసుకొనుచు కుర్చీలమీద, సోఫాలమీద ఇష్టమొచ్చినట్లు యెట్టి అభ్యంతరములు లేకుండాకూర్చొని కాలయాపన చేసి ముఖ్యావసరమైన భోజనవేళ వచ్చేటప్పటికి లేచి వెళ్ళి బీరువాలోనుంచి వెండిపళ్లెములు, వెండిగిన్నెలు తీసి పీటలు వేయబోయేటప్పటికి అభ్యంతరంవచ్చింది. నేలమీదదుమ్ము తుడుస్తున్నాను. అప్పుడే అవసరంవచ్చింది. దానితో జ్ఞాపకంవచ్చింది. యెక్కడో మూలనో, వరండాలోనో ఉన్న చీపురుకట్ట, ఆ పళ్ళాలు, గిన్నెలు అలాగఉంచి ఆచీపురుకట్టను తీసుకొచ్చి గదిని శుభ్రంగాతుడిచి మళ్ళా జాగ్రత్తగా తీసుకువెళ్ళి దూరముగా పెట్టి, వచ్చి ; మరీవడ్డనప్రారంభిస్తారు. లేకపోతే ఎదురుగాఉంటే మళ్ళాఅసహ్యం. ఆచీపురుకట్ట కాబట్టి అలాగఉండ కలుగుతుంది. కాని ఈ రాజకీయచీపురుకట్టలు యేంగాలితిని బతుకుతాయో, యెవరికి కావాలి?” ఇది. కావున ప్రజలకు ఈమూడువిధములవారు కనబడుచున్నారు. కాని కారణములుమట్టుకు ఇవి.

ఇవన్నీ యేవిధముగా ఉన్నా మొత్తముమీద యేవిధముగా చూచినను వీటన్నిటివల్ల ప్రజలకే పెద్దదెబ్బ తగులుచున్నది. 'ప్రజలు యెంత చేసుకున్న అంత' అన్న మాత్రమే గోచరించుచున్నది. కావున ప్రజలు విరివిగా సాధారణ సభ్యులుగా చేరి కాంగ్రెసును అజమాయిషీ చేసుకొనుటయొక్కటే మార్గము అగుపడుచున్నది దీనివల్ల గ్రామ, పట్టణ, తాలూకా, జిల్లాసంఘ సభ్యులు సరిగా పని చేయునట్లుగా చూచుకొనకల్గుదురు. ఈ అధీన సంఘముల సభ్యులు సరిగా పని చేసినచో ఇట్టి అన్యాయములు జరుగనేరవు.

ప్రజాసేవ, నిర్మాణ కార్యక్రమము :—

నిజము చెప్పుకోవలసివస్తే ఈరోజుల్లో ప్రజలలోను, బురఖా నాయకుల్లోను, బాధ్యతాయుత ఉద్యోగుల్లోను దేశసేవ అనేపదము వెళాకోళ పదముగా ఉపయోగించబడుచున్నది, అట్లనే నిర్మాణ కార్యక్రమమో! నిర్మాణ కార్యక్రమమో!! అంటే వీరికి అదేదో పెద్ద గగన కుసుమమువలె స్ఫురించి, వీరి మెదడులో తోడ్తోడనే అదియొక భయంకరమైన, బాధాకరమైన ఆచరణతో కూడుకుని, నష్టముతోను, ఫలితము గ్యారంటీ లేకుండగను యుండవట్టిదని ఒక విద్యుల్లతవలె ఒకభావం వెంట ఒకభావం ఒకచక్రమువలె ఒక్కసారిగా భ్రమించి, ఆగిపోయి, ఆలోచన, ఆనిర్మాణ కార్యక్రమము అనే పదముకూడా వీరి ఆలోచనావీథినుండి శూన్యములోనికి నిశ్చింతగా లీనమైపోవును. అక్కడతో సరి. ఈ మహోత్కృష్టమైన, నరకకూపములోపడి కొట్లాడుకొనుచున్న పీడితమానవకోటిని రక్షింపగల, యేకైక సాధనగూర్చి మహాత్ముడుచేసే శంఖారావము, పడేఆవేదన, మహాత్యాగులైన నాయకులు చేసే యేర్పాటులు, ఆకాశమంత పందిరి- భూదేవి అంతటి వేదికలనుండి ఆవేదనతో చేసే ఉపన్యాసాలు, పత్రికల్లోను, పుస్తకాలు గాను ప్రకటించే వివరాలు గంగపాలే. అంతేగాని దీనిగూర్చి విద్యుల్లతవంటి ఒక్క ఆలోచనాభ్రమణతో సరిపెట్టక. విమానములో

నీటిమీద విమానాపాయముల టికెట్టుతో ఒక్క భ్రమణము చేసి దిగిపోయి వట్టుగాక, మహాత్ములు చెప్పుచుండిన ఈ మానవ తరణోపాయముగూర్చి వినకొంచెము తీవ్రముగా యేల ఆలోచన చేయరో? విమానములోని విమానాపాయముల భ్రమణపటె యే పెద్దనాయకులనో తీసుకువచ్చి నాలుగు రాట్నములు పెట్టి, చేకాగితం తయారీ పరిశ్రమవంటి యేదైన పరిశ్రమ పెట్టునో పెట్టి ఒక్క ప్రదర్శన చేసి అక్కడతో మూల పారవేయుచూ యున్న ఆకొద్దిమందికూడా ఆ విమానమును స్వంతము చేసుకొనుటకు యేల ప్రయత్నించరో? దీనికి కారణము నిర్మాణ కార్యక్రమము అనగానే రాట్నములు పెట్టి త్రిప్పించుటయని వీరికి తోచుటయే అని నాకు గోచరించుచున్నది. ఈ కారణమే జబ్బులక్షణమైనచో దీనికిమందు వీరికి అట్టే దూరములోలేదు. నిర్మాణ కార్యక్రమమనగా రాట్నములు పెట్టి త్రిప్పించుట మాత్రమే కాదనియు, రైతు, పరిశ్రమ, విద్యార్థి, ఉపాధ్యాయ, మహిళా, మున్నగులోకములలోనివారికి జరుగుచున్న అన్యాయములను, కష్టములను బాపుటకు సంఘములుగా యేర్పాటుచేయుట, కృషి చేయుట, జాతి, మత, కుల, కక్షలతో ఒకరినొకరు హింసించుకొనుచు బాధపడుచున్న వారినిగూర్చి సఖ్యతా ప్రయత్నములు చేయుట, జీవించుటకూడ దుర్లభముగా గడుపుకొనుచు, నికృష్టజీవితము గడుపుకొనుచున్న అనేక వేల అణగద్రొక్కబడిన ప్రజలుగల సంఘములకు కనీసజీవితావసరములైనను కలుగచేయుటకు యేర్పాటులు చేయుట మున్నగునవి కలదే నిర్మాణ కార్యక్రమమని వీరు తెలుసుకొనుట మాత్రమే ఈ అసత్వజబ్బునకు, ఈగాను గచ్చట్టు తిరుగుడుకుమందూ, విరుగుడూను. ఈపైచెప్పిన యేర్పాటులు తమచుట్టుపక్కల ఉన్నవారిలోను, అందుబాటులో ఉన్నవారిలోను చేసినచాలును. శక్త్యానుసారము యెంతమేరకైనను వెళ్ళవచ్చును, చేయవచ్చును. కాని వ్యక్తిగతముగా, పేరుప్రతిష్టలువచ్చునని పూనుకోకూడదు, అందువల్ల అమితవ్యయము అలస్యము అవసరశ్రమ, తుదకు పతనము తప్పదు. ఇట్టి కార్యములు జాతీయప్రజాసంస్థయైన కాంగ్రెసు కమిటీల

ద్వారా వాటిసహాతో, సహాయముతో చేసిన సులువుగా, తక్కువఖర్చుతో, త్వరగా సాగును. స్థిరముగానుండునట్లుగా చేయవీలగును. ఇదియే దేశసేవ అన్ననూ నిర్మాణ కార్యక్రమం అన్ననూ,

## గ్రంథపరిచయము.

ఇదేవిధముగా ఈరోజులలో పదములు అర్థంలేకుండగా ఉపయోగింపబడుచున్నవి. ఒక్కొక్కమాటకు యొక్కొక్క అర్థమున్నదనిన్ని ఆయామాటలు ఆయాసమయాల్లో ఉపయోగించాలనిన్నీ అనేజ్ఞానమే నూన్యమైపోయినది. సర్వసాధారణముగా ప్రజలకు ఈసంగతే తెలియకున్నది. పదములను తప్పుడుగా ప్రయోగించుట పరిపాటైపోవుటయే గాక చాలమట్టుకు వ్యతిరేకముగాకూడ ఉపయోగింపబడుచున్నవి. బ్రాహ్మణుడు, మాల, వేదము, వేదాంతము మొదలగునవి ఇవి మానవసంఘమునకు ముఖ్యావసరమైన పదములలో ప్రథమశ్రేణిలోనివికూడా. ఇంకా ఇట్టివి అనేకము కలవు. ఈవిధముగా అర్థం ఊహించుకోకుండాను, అమితంగాను, పనిలేకుండా అనవసరంగాను, వీటినిమించి తెలియక వ్యతిరేకముగాను పదములను ఉపయోగించుటవల్లను, అనవసర బాతాఖానీలవల్లను మాత్రమే ఈ మానవసంఘము ప్రస్తుతము అనుభవించుచున్న బాధలకు పాల్పడవలసి వచ్చినదని నామతము. మానవులు జీవితావసరములకై చేయవలసిన శారీరక కృషి చాలయున్నది కావున అనవసరపు బాతాఖానీలతో కాలము పుచ్చక సరియైన అర్థముతో, సరియైన సమయములో, సరియైనస్థలములో ఎంత అవసరమో అంతే వ్యవహారరీత్యా మాట్లాడుచుండిన అన్ని బాధలు, పేచీలు తొలగి సకల సంపదలు, సౌఖ్యజీవనము కల్గును. ఇప్పటికే ఈచిన్నపుస్తకములో దేశసేవ, నిర్మాణకార్యక్రమము, ప్రభుత్వము, ప్రభుత్వోద్యోగులు నాయకులు, ప్రజలు అంటే ఏమిటో వ్రాసియుంటిని ఇంకనూ ఈపుస్తకములో గాంధీగారి సుభాషితములు 104న్ను, గాంధీస్మృతి 108 మాత్ర

అవసరమా, మనదేశమున 60 సంll లుగా కాంగ్రెసు లేకపోయినచో ఏమయ్యేవాళ్లమో మున్నగు వాంశములను చర్చించుచు చివరకు ప్రజలు, ప్రభుత్వము వరకు అనగా ఈ ప్రపంచములోని ప్రతిపదమునకు, ప్రతివిషయమునకు ప్రతిపదార్థమునకు అవినాభావసంబంధము ఎట్లుకలదో, ఏఒక్క పదముగాని, విషయముగాని, పదార్థముగాని తక్కినవాటినుండి వేరుగా భావించుటకు ఎట్లు వీలులేదో ఇదేవిధముగ ఈప్రపంచములోని ఏమానవుడుకూడా తక్కినవారికన్న నేను వేరువీరితో నాకేమి సంబంధములేదు. అనుకొనుట ఎంతపొరపాటో, ప్రతిమానవుడు తన ఆర్జనలో తనకు ఒక పాలు, తనమీద ఆధారపడియున్న కుటుంబములోని వారికి ఒక్కొక్క పాలు, తననౌకర్లకు ఒక్కొక్కపాలు, గ్రుడ్డి, కుంటి మొదలగు అనాథలకు ధర్మమునకుగాను యొకపాలు, ప్రభుత్వమునకు యొకపాలు, జాతీయ రాజకీయ సంస్థకు యొకపాలు ఇచ్చుటకుగాను సరిపోయినంత ఆర్జించవలసిన అవసరము ఎట్లుకలదో—అది ఎట్లు సాధ్యపడునో—ప్రస్తుత క్రమంలైనను ఉన్న ధనవంతులు, ఉద్యోగస్థులు అట్లుచేయ నిచ్ఛగించక చేయకుండినచో వారికి ప్రమాదము ఎట్లుసంభవించునో వీలైనంత సులభమార్గములో విపులముగా చర్చించదలచాను. అంతవరకు శలవు—

జైహింద్.



# రెండవ భాగము

## గాంధీస్మృతి [సూత్రములు]

1. అథ నవయుగధర్మం వ్యాఖ్యాస్యామః
ఇప్పుడు నూతన యుగధర్మమును వ్యాఖ్యానము చేయుచున్నాను.

2. ధర్మస్యైవ సనాతనస్య నవోల్లేఖః.
సనాతనమైన ధర్మముయొక్క నూతన విశదీకరణమే.

3. ఈశావాస్యమిదం సర్వం ఇతిశ్రూయతే
ఈలోకమంతయు ఈశునిచే ఆవరింపబడియున్నది- అని వేదము తెల్పుచున్నది.

4. సత్యస్వరూపః సర్వేశ్వరః
సర్వేశ్వరుడు సత్యమే రూపముగా గలవాడు.

5. సత్యే సందృష్టే సిద్ధిరాత్మనః
సత్యము చూడబడినపుడు ఆత్మానుభవము కలుగుచున్నది.

6. సర్వదా సర్వభావేన సత్యమేవ భజనీయం
సమస్త కాలములందు, సర్వభావములచేత అనగా మనసా, వాచా, కర్మణా సత్యమునే ఆరాధింపుము.

7. నేహసందృశ్యతే సత్యంపరం
ఈ లోకమునందు ఉత్కృష్ట సత్యము అనుభవము కాదు (కనబడదు)

8. హాస్తిసత్యే విప్రతిపత్తిః
సత్యమునుగూర్చి భిన్నాభిప్రాయములు కలవు.

9. తస్మాన్నాత్రకార్యో నిర్బంధః
కాబట్టి ఈకార్యమునందు నిర్బంధములేదు.

10. అహింసా పరమోధర్మః
అహింస ఉత్కృష్టమైన (శ్రేష్ఠతమైన) ధర్మము.

11. తయేవ సత్యసిద్ధిః
దానిమూలముననే సత్యము లభించును. (అహింసా మార్గమున సత్యాన్వేషణమే హిందూమతము. కార్య కారణములకు అవినాభావ సంబంధముకలదు.]

12. సర్వప్రాణీ మనః కాయ హింసానివృత్తిః అహింసా.
అహింసయనగా సర్వప్రాణులయొక్క మనఃకాయము లకు హింసచేయకుండుటయే.

13. సౌహార్ధంచ సర్వప్రాణిషు.
సమస్త ప్రాణులయందు సుహృద్భావముంచుటయే అహింస. సమస్త ప్రాణులు ఒకటేయనియు, తన్ను తాను ఎట్లు ద్వేషించుకోలేడో, అట్లేప్రాణినికూడా ద్వేషించకుండా యుండుటే హిందూ మతములోని ఉత్కృష్టత.

14. తద్ధి గవాం సంరక్షణం.
అహింసమార్గముననే గోసంరక్షణ చేయవలెను.

15. గొహిత్యుపలక్షణం తిరశ్చాం సర్వేషాం
అన్ని జంతువుల విషయమైయిట్లే.

16. సాభ్రాత్రంచ మనుష్యేషు
అహింస అంటే మానవులందరియందు సోదరభావము నిలుపుటయే.

17. తేషు కేచిత్ అస్పృశ్యా ఇతిఏతత్ మహాపాతకం.
మానవులలో ఎవరినిగాని అస్పృశ్యులని భావించుట మహాపాతకము.

18. ఏతే హరిజనా ఇతిబ్రూమః
వీరిని హరిజనులని చెప్పుచున్నాము.

19. కుతస్తేషాం దేవాయతనప్రవేశాదిషు అనధికారః
దేవాలయ ప్రవేశమున వారికి ఎట్లు అనర్హత కల్పింపవగును?

20. వర్ణాశ్రమధర్మవిభాగేషు అపి న ఉత్కర్ష అపకర్ష భేదః
వర్ణాశ్రమధర్మప్రకారము ఏర్పరచిన అన్ని సంబంధములలో న్యూనాధిక్యతలకు కించత్తయినను తావులేదు.

21. ప్రేమైవ పరంరూపం అహింసాయాః
అహింసకు ఉత్తమమైన రూపము ప్రేమయే.

(ఇక్కడ నాల్గువేదములు పూర్తిగా తెలిగించి అచ్చొత్తించిన మన ఆంధ్రగాంధి, ఆధునిక వశిష్ఠ, సర్దార్ గొల్ల

పూడి సీతారామశాస్త్రిగారు సత్యమునుగూర్చి చెప్పినది పొందుపరచుచున్నాను.)

మంత్రం॥ ఓం సహనావవతు, సహనౌభునక్తు. సహవీర్యం కరవావహై తేజస్వినావధీతమస్తు, మావిద్విషావహై ఓం శాంతిః శ్శాంతిః శ్శాంతిః

పాఠమునకు, భోజనమునకు ముందు చెప్పబడు ఈమంత్రమునకు మనమిద్దరము (అనగా గురు, శిష్యులు) ఒకరినొకరు రక్షించుకొందుముగాక, కలసి భోజనముచేయుదుముగాక, మనమిద్దరం వీర్యవంతులముగా చేయబడుదుముగాక. చదువు తేజస్సుగలది అగుగాక, విరోధము కలుగకుండుగాక యని అర్థము. గురు, శిష్యులనగామనలో ప్రతిఒక్కరు తాను ఇతరునకు గురువు, ఇతరుడు తనకు గురువు అనే భావము గనుక ఇక్కడ మనమిద్దరము అనే ఒక ప్రత్యేక ఇద్దరికేగాక మన అందరికి వర్తించుకోవలెను. ఈ విధముగా మనమేలుకొరకు నిత్యము జ్ఞాపకముండుటకొరకు మన వేదములలో ఇట్టి ఏర్పాటులు ఎన్నియోచేయబడియుండెను. కాని మనమిప్పుడు వాటిని నిత్యము పఠించుచున్నామేగాని అర్థము తెలుసుకొనక పఠించుచున్నందున ఆచరణలోనికి, అనుభవమునకు రావడం లేదు. అందుచేతనే ఇన్ని బాధలు పడుచున్నాము.

(వీరు సత్యమునుగూర్చియు అహింసనుగూర్చియు ఇక్కడ చెప్పిన మరికొన్ని వచనములు.)

1. మానవజాతి కంతకు వర్తించు శాసనము దౌర్జన్య రాహిత్యము. అది పశుబలముకంటె ఉత్తమమైనది. అధిక శక్తివంతమైనది.

2. ప్రేమస్వరూపుడగు దైవముయందు అచంచలమైన విశ్వాసములేనివారికి ఈ అహింస ఉపయోగపడదు.

3. తన ఆత్మగౌరవమునకు అహింసవలన సంపూర్ణమైన రక్షణకల్గును. కాని స్థిర, చరాస్తుల రక్షణకు సర్వదా భద్రత కలుగకపోవచ్చును. సాయుధభటులనుఉంచి ఈ ఆస్తులను రక్షించుటకన్న అహింసానుష్ఠానమే హెచ్చు భద్రతను కల్గించును. అక్రమ లాభములను, అధర్మచర్యలను కాపాడుటకు అహింస ఉపయోగపడదు. అది దానితత్వము.

4. వ్యక్తులుగాని, జాతులుగాని అహింసను అనుష్ఠించునెడలు తమ గౌరవమునుగాక శేషించిన ధన, జనబలమంతయును అర్పించుటకు సిద్ధముగావలయును. అందుచే ఆధునిక సామ్రాజ్య సిద్ధాంతము ననుసరించి పరాయిదేశముల నాక్రమించి పశుబలముచే సంరక్షించు జాతులు ఈ అహింసను అనుష్ఠించలేవు. ఇయ్యది అసందర్భము.

5. ప్రేమ స్వరూపుడగు దైవముయందు అచంచల విశ్వాసముకల్గి సర్వమానవులందు సమానప్రేమకల్గియున్నట్టి పసిబిడ్డలు, యువకులు, వయోవృద్ధులు అగు స్త్రీలు, పురుషులు అందరు సమానముగా ఈ అహింసాశక్తిని ప్రయో

గించగలరు. ఈ అహింసనే జీవితధర్మముగా అంగీకరించిన వారు దానిని ఏకొలది చర్యలకో సంకుచితపరచక జీవితమంత లో వినియోగపరచవలెను.

6. ఈ శాసనము వ్యక్తులకు మంచిదేగాని జనసమూహమునకు వర్తించదనుకొనుట మిక్కిలి పొరపాటు.

22. తదేవమూలం గృహ్యాధర్మాణాం
గృహస్తధర్మములన్నిటికి ప్రేమయేమూలం.

23. ప్రపంచః ఖలుకుటుంబం ఈశస్య.
ప్రపంచమంతా ఈశ్వరుని కుటుంబము.

24. అతోగృహ్యాధర్మ ఏవ ప్రపంచధర్మః
గృహధర్మమే ప్రపంచధర్మము.

25. ప్రేమైవభేషజం ద్వేషస్య
ద్వేషమునకు, ప్రేమయేమందు.

26. తస్యవిలాసో నిర్భయస్యైవ హృదయే
నిర్భయుని హృదయములోనే దాని పరిణామస్థితి ఏర్పడును.

27. హింసాపి క్లైబ్యాత్ శ్రేయసీ.
పిరికితనముకంటె హింసయైననుమేలే

28. అహింసాతు శ్రేష్ఠా అహింసయే శ్రేష్టము
(ఇక్కడ శాస్త్రిగారు చెప్పిన వచనములు)

నీ అన్నానికి అడ్డువచ్చే హక్కు నాకుఎక్కడ ఉన్నది? నాకు నాభోజనానికి కొంతఉంది. ఇంకా వృత్తిలేని ఇతరుల

పనికి పోటీకివెళ్లి 'అన్నం పరబ్రహ్మం' అనేఅందరికిహక్కున్న వారి భోజనానికి నేనెందుకు అడ్డువెళ్ళటం?

29. అహింసానిత్యోధర్మః హింసాతునైమిత్తికఏవ
అహింస శాశ్వత ధర్మము కాని హింసతాత్కాలికము మాత్రమే.

30. ధీరః స్వార్త్యైవ ఆచరతి అహింసామ్.
ధీరుడు స్వకీయకష్టానుభవముచేతఅహింసనుఅనుష్టించుచున్నాడు.

31. యావత్ దుఃఖంసహతే తావత్ ఉపకరోతి
ఎంతవరకు దుఃఖసహిష్ణుతకలదో అంతవరకు అహింస ఉపకరించును.

22, యావత్ విశుద్ధంసహనం తావత్ ఏవసిద్ధిః
ఎంతవరకు కష్టసహిష్ణుత పవిత్రమైయున్నదో ఆపవిత్రతనుబట్టియే ఫలసిద్ధికలుగును.

33. నహిసిద్ధిః త్యాగేనాపి అసంయతస్య
సాధనలేక నిగ్రహములేనివాని త్యాగముకూడ ఫలసిద్ధి కల్పించనేరదు.

34. పరోపకార ఏవ యజ్ఞః ఏషఓ అస్తి ఇష్టకామధుక్
పరోపకారమే యజ్ఞము. అది ఏమికోర్కెలు దీర్చు కామధేనువు.

35. అయజ్ఞస్సన్ యోభుంక్తే స్తేన ఏవ సః
యజ్ఞముచేయకుండ ఎవడుభుజించునో వాడుదొంగరా.

36. స్వస్వరూపాత్ చ్యుతఏవ నరోజాయతే చ్యుతస్తతో
పి ఉద్వహతే.

స్వస్వభావమునుండి జారిపడినపుడే మానవుడు జన్మ ఎత్తును. అంతకంటే జారిపడినపుడే వివాహము జేసుకొనును.

37. బ్రహ్మచర్యేనైవ తస్యమోక్షః
బ్రహ్మచర్యమూలముననే అతనికి మోక్షము కల్గుచున్నది.

[బ్రహ్మచర్య సాధనగూర్చి చెప్పుచు శాస్త్రీగారు ఇక్కడ నుడివిన సూచనలు]

బహ్మచర్యమనగాజింహేంద్రియగుహ్యేంద్రియనిగ్రహం. దీనికి చలనము బాహ్యంగా క్రియల్లో (స్పర్శవల్ల) మాటల్లో(చదువుట, పాడుట, అట్టివిధమైన ఖబుర్లు చెప్పుకొనుటలో) ఆలోచనలో (వంటరితనములో)కలుగును. కనుక వీటినిమానవలెను.

38. ఉద్వాహోపిప్రజాయై నతు కామోపభోగాయ.
వివాహముకూడ ధర్మసంతానమునకేగాని భోగవిలాసమునకుగాదు.

39. ధనస్యసంచయోహి దురితస్యసంచయః
ధనమును సంపాదించి నిలువచేయుట పాపమును సంపాదించి నిల్వచేయుటయే.

40. సర్వదా సర్వత్ర సేవితవ్యో దరిద్రనారాయణః
అన్నికాలములందు, అన్నిప్రదేశములందు (సర్వావస్థలయందు) దరిద్రనారాయణుని పూజింపవలెను.

41. మాన్యాః సేవ్యాః ఖలు కృషీవలాః
కర్షకుడు గౌరవపాత్రుడు అగుచున్నాడు.

42. అవస్కర వాహశ్చ
పాకీపనివాడుకూడా గౌరవనీయుడే.

43. కృషి నయనేహి గ్రామశ్రియః పాదద్వయం
గ్రామముయొక్క సంపదకు కృషియు, నేతయు రెండుకాళ్లు.

44. తంతుచక్రం ఏవ మూలాధారం
రాట్నచక్రమే దీనికి మూలాధారము

45. తంతుకరణంహి విశుద్ధంకర్మ సర్వేషాం హితంసుకరంచ.
వడుకుట పవిత్రమైనకర్మ. అది సర్వులకు ప్రయోజనకరమును సుకరమును అయియున్నది.

46. గ్రామాభ్యుదయాత్ ఏవ దేశాభ్యుదయః
గ్రామముల అభివృద్ధియే దేశముయొక్క అభివృద్ధి.

47. స్వదేశవస్తూపయోగఅభినివేశ ఏవ ప్రారంభః త్యాగస్య
త్యాగారంభము స్వదేశవస్తు ఉపయోగమందలి అభిరుచిసందేకలదు.

48. నశోభతే శిల్పం బాహ్యరూపమాత్రేణ.
బాహ్యరూపమువలననే శిల్పము శోభించదు.

49. నశబ్దార్థావధారణమేవ విద్యా.

శబ్దములను వాటిఅర్థములను గ్రహించుట మాత్రమే విద్యకాదు.

50. స్వవిద్యైవ ప్రధానం ఇతరా స్తు తదంగాని.
స్వవిద్యే ప్రధానము. ఇతర విద్యలు ఉపవిద్యలు మాత్రమే.

51. స్వధర్మే అభిమతిః పరధర్మేచ అభిరతిః.
స్వమతజ్ఞానము కలవాడే పరమతమునందు అభిలాష కలవాడగును.

52. యస్మాత్ సర్వేధర్మాః సత్యస్య శాఖాః.
ఏలన సర్వధర్మములు సత్యముయొక్క శాఖలే.

53. సత్యాగ్రహ ఇతి ధర్మస్యైవ సనాతనస్య నవోల్లేఖః.
సత్యాగ్రహ మనునది సనాతన ధర్మముయొక్క నూతన రూపమే.

54. సత్యాగ్రహ ఏవ సత్యశక్తిః ప్రేమశక్తిః ఆత్మశక్తిశ్చ.
సత్యాగ్రహమే సత్యశక్తి, ప్రేమశక్తి, ఆత్మశక్తి ఐఉన్నది.

55. ప్రతిష్ఠాన ఏవ లోకస్య.
అదియే లోకమునకు మూలాధారము.

56. తస్యచలనా దేవసంఘర్షః తతః చరిత్రారంభః.
దానిచలనమే సంఘర్షణకు కారణము. అప్పటినుండియే చరిత్ర మొదలిడుచున్నది.

57. అనేనైవ జ్యోతిషానిరస్యతే నిఖిలదౌర్జన్యాంధకారః.
దౌర్జన్యముయొక్క అంధకారమంతయు దానికాంతి వల్లనే చెల్లాచెదరగుచున్నది.

58. జాయతేహి దౌర్జన్యం రాష్ట్రాత్ సంఘాత్ పురుషాత్ వా.
రాజ్యమువల్లగాని, సంఘమువల్లగాని, వ్యక్తివల్లగాని దౌర్జన్యము పుట్టవచ్చును.

59. సర్వాత్మనా దౌర్జన్యస్య నిరసనమేవ సత్యాగ్రహః.
సంపూర్ణమైన ఆత్మశక్తిచేత ఈ దౌర్జన్యమును నిరసించుటయే సత్యాగ్రహము.

60. అధృష్యతేనైవ భవతి ఆత్మాన్.
ఆసత్యాగ్రహముచేత ఆత్మ అజేయమగుచున్నది.

61. నకదాచిత్ అపి పరాజయః తస్య.
దానికి అపజయ మెన్నడును లేదు.

62. తత్ర ప్రమాదాత్ క్లేశం తదనుష్ఠాత్ ఏవ.
అచ్చట ప్రమాదము కలిగినయెడల ఆకష్టము సత్యాగ్రహునిదే.

63. ననిశ్చయః అస్మిన్నేవ జన్మని సిద్ధిః సత్యాగ్రహిణ ఇతి.
సత్యాగ్రహి యీజన్మలోనే జయమందునను నిశ్చయము లేదు.

64. మరణేన స మహీయానేవ భవతి.
మరణముచేత అతడు మహిమాన్వితు డగుచున్నాడు.

65. ఆత్మాభివ్యక్తిసాధనమేవ దేహః,
ఆత్మోపలబ్ధి పొందుసాధనము దేహమే.

66. అభయప్రధాన మంత రేణ సత్యాగ్రహో దురాగ్రహః

ఇతరులకు అభయప్రధానము లేనిచో సత్యాగ్రహమే దురాగ్రహ మగును.

67. నిర్బంధోపి దురాగ్రహః
నిర్బంధ పరచుటకూడ దురాగ్రహమే.

68. తద్దైవ బహిష్కారం సంఘాత్.
సంఘమునుండి వెలిపెట్టుటకూడ దురాగ్రహమే.

69. స్వార్థాయ ప్రాయోపవేశశ్చ.
స్వార్థమునిమిత్తమైన ప్రాయోపవేశముకూడనిర్బంధమే.

70. అజాతశత్రుః సత్యాగ్రహి.
సత్యాగ్రహికి పుట్టుకనుండి విరోధులులేరు.

71. అనశనవ్రతేన ఈశ్వరప్రణిధానేన చ సత్యంజానాతి.
ఉపవాసమువలనను, ఈశ్వరజ్ఞానమువలనను (సత్యాగ్రహి) సత్యమును తెలుసుకొనును.

72. ఈశ్వర ఏవ తస్య నివాస శ్శరణం సుహృత్.
దేవుడే మనకు కాపురము(ఇల్లు)శరణ్యము,మిత్రుడున్ను.

73. మహాత్మానాంచ పంథానం అనుసరతి.
అతడు మహాత్ములమార్గమును అనుసరించును.

74. పంథానం ప్రహ్లాద నంద ప్రభృతీనాం.
ప్రహ్లాద, నందనారుప్రభృతుల వారిమార్గము.

75. తద్దైవ నాగ నారాయణ వల్లీనాంచ.
నాగపు,నారాయణస్వామి,వల్లియమ్మలమార్గముఇట్టిదే.

76. సత్యం శీలం దమః స్థైర్యం నిర్భయత్వంచ నమ్రతా
ఐకమత్యం శమస్త్యాగ సహిష్ణోః సహజగుణాః,

సత్యం, శీలం, ఇంద్రియనిగ్రహం, స్థిరత్వం, నిర్భయం, సమత, ఐకమత్యం, అంతరింద్రియనిగ్రహం, త్యాగము, కష్టసహిష్ణుత సత్యాగ్రహునకు సహజమైన గుణములు. (ఇవిపది)

77. సత్యాగ్రహో అయం వటః అనంతాః తస్య శాఖాః.
సత్యాగ్రహము ఒక మర్రిచెట్టు వంటిది. దానిశాఖలు అనేకములు.

78. అసహకారోద్యమః తత్ర ఏకః.
అసహకారోద్యమము దానిలో ఒకశాఖ.

79. శాసనోల్లంఘనం ద్వితీయా.
శాసనోల్లంఘనం రెండవది. (ధర్మబద్ధమైనది)

80. సహకారే పాపసంభిన్నే అసహకార ఏవ పరమోధర్మః.
సహకారము చేయుటచే పాపము ఆవరించునపుడు అసహకారమే ఉత్తమధర్మ మగుచున్నది.

81. స ఏవ సమ్యక్ అనుష్ఠితం నిరూఢం ప్రేమ భవతి.
దానినే పూర్ణముగా అనుష్ఠించినయెడల గాఢప్రేమ యగును.

82. పారుష్య సహితశ్చేత్ కలుషీ భవతి.
దార్ఢ్య సహితమైనయెడల అద్యాది కల్మషమగును.

83. పౌరుష్య రహితశ్చేత్ కాలుష్య ఉన్మూలకో భవతి.
దార్ఢ్యరహితమైనయెడల కలుషమునునిర్మూలించును.

84. ధర్మాత్మా రాజనీతిషు ధర్మమేవ ఆచరతి.
ధర్మాత్ముడైనవాడు రాజకార్యములందును ధర్మమునే ఆచరించును.

85. ఏకైకః పౌరస్స్వాధిః కృతః.
ప్రతిపౌరుడు రాచకార్యములో బాధ్యతపొందియున్నాడు

86. రాజనీతౌపి సంవృత్తి దోషః.
రాజకీయములలో రహస్యము దోషము.

87. శఠం ప్రతి శాఠ్య మితి తిలకః.
మోసగానిని ప్రతిమోసము చేయవచ్చునని తిలక్ మహారాజుగారి భావము.

88. శఠం ప్రత్యపి సత్య మితి గాంధిః.
మోసమునకు ప్రతిగాకూడ సత్యమే ఆచరించవలెనని గాంధిగారి మతము.

89. త్రాసావిష్టాశిష్టిః న స్థాతు మర్హతి,
భయముమీాదఆధారపడినప్రభుత్వమునిల్వఅర్హముకాదు

90. తద్దైవయా ద్యూత మద్యాదిక మనుమన్యతే.
జూదము, మత్తుపదార్థ సేవనము మొదలగువానిని ఆమోదించే ప్రభుత్వము కూడా.

91. ప్రాణదండన మపి దుర్జన శిష్టేః సుజనో వృణీతే.
దుష్టప్రభుత్వమునుండి ధర్మాత్ముడు మరణశిక్షనైనా వరించును.

92. అసహాకారోద్యమే సర్వేపి అధికారిణః — శాసనోల్లంఘనే కతి చ నైవ.
అసహాకారోద్యమమునకు అందరూ అర్హులే. కాని శాసనోల్లంఘనమునకు కొందరు మాత్రమే అర్హులు.

93. శాసనోల్లంఘనే శాసనానువర్తినః ఏవ అధికారిణః,

శాసనములను అనుసరించ నేర్చినవాడే శాసనోల్లంఘ
నము చేయ అర్హుడు.

94. నహి అస్మాత్ అరాజకత్వం అధర్మో వా.
శాసనోల్లంఘనము అరాజకత్వమునుగాని అధర్మమును
గాని కల్గించదు.

95. అహింస ఆశ్రితత్వాత్.
అహింసను ఆశ్రయించి యుండుటచేత.

96. నిర్వ్యాజం నిరవజ్ఞం నిర్మదం నిరసూయం నిరవయజ్ఞం
ఏవ ఇదం భవతి.
దానియందు మోసము, అవమానము, గర్వము,
అసూయ, పాపము లేవు.

97. ఏకోపి శాసనోల్లంఘకో విశుద్ధశ్చేత్ అధర్మోన్మూల
నస్య ప్రభవతి.
పరమ పవిత్రుడైన శాసనోల్లంఘకుడు ఒక్కడైనను
సరియే అధర్మోన్మూలనము జరుగును.

98. ప్రజానాం శాసనోల్లంఘనం యది అహింసా పరం
నిరోధం నశక్యం.
సమిష్టి శాసనోల్లంఘనము అహింసాయుత మైనయెడల
దానిని నిరోధించ నశక్యము.

99. ప్రజానాం దౌర్జన్యంతు రాజ్ఞాం దౌర్జన్యాత్ అధికతర
భయ హేతుః.
రాజుల దౌర్జన్యముకన్న ప్రజల దౌర్జన్యము అధికతర
భయావహము.

100. పరిజ్ఞాతే ప్రమాదే తతః ప్రతినివృత్య పునః సుపథ
ఏవ అనువర్తనం ధర్మః
పొరపాటుచేసినట్లు తెలిసినపుడు అటనుండి వెనుకకు
మరలి తిరిగిమంచిమార్గము అనుసరించుట ధర్మము.

101. నేతా సమూహైః ననీయేత
నాయకుడు మూకలచే నడుపబడరాదు.

102. రాష్ట్రాభ్యుదయః ప్రాయఃసంజాయతే క్రమికపరిణామేన
సాధారణముగా రాజ్యములు వరుస క్రమపరిణామము
పొందుచుండును.

103. ఆకస్మికేన పరివర్తనేన వ
అకస్మాత్తుగా విప్లవమువలనకూడ (అభివృద్ధిపొందును).

104. సత్యాగ్రహ ఏవ శస్త్రం భారతీయానాం.
భారతీయులకు సత్యాగ్రహమే ఆయుధం.

105. అనేనైవ తేషాం స్వారాజ్యసిద్ధిః
దానివలననే వారికి స్వరాజ్యము సిద్ధించును.

106. సత్యయుగం శనైః అభ్యేతి జగత్ సర్వం.
ఈలోకమంతయు మెల్లగా సత్యయుగమువైపుకు సం
చరించుచున్నది.

107. తన్మార్గదర్శి భారతవర్షం
భరతఖండము ఆమార్గమును చూపుచున్నది. (చూపు
నది తాను అనుటకు బదులు.)

103. దేశకాలాద్యనవచ్ఛిన్నః సనాతనో అయం ధర్మః
సనాతనమైన ఈధర్మము దేశకాలములచే బంధింప
బడలేదు.



గాంధిజననము:—

2—10—1869 సరియగు శుక్లనామ సం॥ర భాద్రపద బహుళ ద్వాదశీ శనివారం రాత్రి 3½ గంటలకు కర్కాటక లగ్న ఆశ్లేషనక్షత్ర ప్రథమపాదమందు గుజరాతు రాష్ట్రమందలి సుధామపురిలో]

ఉ॥ ఎవ్వని శాంతిమూర్తి యని యెల్లరు నారతమున్ భజింతురో
యెవ్వఁడధర్మమార్గమున నించుక యేనియు కాలుబెట్టఁడో
యెవ్వఁడు లోకమంతట నహింసయె యుత్తమమంచు జాటెనో
యవ్వరమూర్తి గాంధి ఋషికంజలిమోడ్చి నమస్కరించెదన్.

ఉ॥ శ్రీరంజిల్లు స్వరాజ్యసిద్ధికొరకై సేవించెదన్ గాంధినిన్
సారాచారవిశారదున్, పరహితున్. స్వారాజ్యసంపాదకున్
కారుణ్యావృతచిత్తవీధి నిలయున్, కస్తూరిభాయీపతిన్
కారాగారనివాసదీక్షిత మహోగ్రంభీర ధీశాలినిన్.

శ్లో॥ అస్థిరం జీవనంలోకే । అస్థిరం యౌవ్వనంధనమ్ ।
అస్థిరం దారపుత్రాది । ధర్మకీర్తి ద్వయం స్థిరమ్॥

శ్లో॥ పరిత్రాణాయ సాధూనాం । వినాశాయచదుష్కృతాం ।
ధర్మసంస్థాపనార్థాయ । సంభవామి యుగేయుగే ॥

# గాంధీమహాత్ముని సుభాషితములు

కాంగ్రెసు ఆదర్శము :—

1. ధర్మసమ్మతమైన, శాంతిపద్ధతులపై భారతీయులు సంపూర్ణస్వాతంత్ర్యమునుపొందుటే కాంగ్రెసుమహాసభయొక్క ప్రధానోద్దేశము.

2. అస్పృశ్యతానిర్మూలనము, ఖద్దరునిర్మాణము, అహింస సత్యము హిందూమహమ్మదీయ సఖ్యత అనుపునాదులపై స్వరాజ్యసౌధమును నిర్మించుటే కాంగ్రెసుమహాసభయొక్క ఐశయము.

3. ధనికులు, బలిష్ఠులు గుజాతులవారు దరిద్రులు, దుర్బలులు నగు జాతులను దోచుకొనుటయనే సామ్రాజ్యతత్వాన్ని నశింపచేయుటయే.

4. తినతిండి కట్టబట్టలేక శుష్కించిన శరీరముతో చావుబ్రతుకుల మధ్య కొట్లాడుచున్న భారతజాతి దారిద్ర్యదుఃఖములకు కారణభూతమై వారిని పీల్చి పిప్పిచేయుచున్న సామ్రాజ్యతత్వాన్ని ప్రభుత్వవిధానాన్ని నిర్మూలింపజేసి భారతీయులకు కడుపునిండాతిండి, కట్టుకొనుటకు బట్ట సమకూర్చుట,

5. కాంగ్రెసుగోత్రికులు అంతఃకరణశుద్ధికల్గి అవినీతికిలోనుగాక స్వార్థమునకాశింపక, సత్య అహింసలను ఆదరించే ఉత్తములు, బుద్ధిమంతులు, సమర్థులు కాకపోతే కాంగ్రెసుపవిత్రతకు భంగం కలుగుతుంది.

6. కాంగ్రెసుసంస్థలు పదవులకీచులాటకు రంగభూములుగా ఉన్నంతకాలం ఉత్తములు, బుద్ధిమంతులు, సమర్థులు కార్యనిర్వాహకులుగా దొరకడం దుస్సాధ్యం.

7. అనారోగ్యము, అజ్ఞానము, దారిద్ర్యము, పరాధీనత అను యీ నాల్గు భారతదేశమును పీల్చి పిప్పిచేయుచున్న పెనుభూతములు, వీనినినివారించుటే కాంగ్రెసు ఆశయము.

8. ఖద్దరు :— దారిద్ర్యపీడితమైన కోట్లకొలది భారతీయులకు కూడు గుడ్డనిచ్చి రక్షణకలుగజేయు సాధనము రాట్నమే, గాన దీని

నుద్ధరించుచే ప్రతిభారతీయునిధర్మము. కాన రాట్నములపై వడికిననూలుతో, మనగ్రామములోని మగ్గముపై నేయబడినబట్టను (ఖద్దరు) దీక్షగా కట్టి నిర్వ్యాపారులకువృత్తిని కల్పించుటే ప్రతివానికిని స్వధర్మమైయున్నది. ఇదే స్వదేశీవ్రతము. ఈ యోగమున భుక్తికేగాక ముక్తికికూడ ఇదియే సాధనోపాయము.

9. స్వదేశీ అనగా స్వధర్మము. ఇది అహింస, ప్రేమలనుండి జన్మించిన సుందరమగు ధర్మము.

10. గోరక్షణ, పశుపోషణ:—అరువదియారు రుచులు ఆవుపాల లో నిమిడియున్నవి. భారతీయ శిశువులకు గోక్షీరమే అమృతాహారము. భారతదేశవ్యవసాయమునకు పశువులే ఆధారము. గాన గోరక్షణము, పశుపోషణము భారతీయుల కర్తవ్యములు.

11. బ్రాహ్మణత్వము:—బ్రహ్మనెఱిఁగినవాడే బ్రాహ్మణుండు.

12 హిందూమతమందలి మహావిజ్ఞానమయుండగు బ్రాహ్మణుడు లేకున్నచో హిందూమతమే శిరస్సులేని మొండెమగును.

13. అజ్ఞానమే శూద్రత్వము. సుజ్ఞానమే బ్రహ్మత్వము.

14. ఇతరుల కష్టము లెవ్వడెరుంగునో అతడే వైష్ణవుడు.

15. బ్రహ్మచర్యము :— బ్రహ్మచర్యమనగా బ్రహ్మాన్వేషణము.

16. సర్వేంద్రియ నిగ్రహమే బ్రహ్మచర్యము.

17. బ్రహ్మచర్యమునకు వీర్యస్తంభనమునకంటెమనోవిజయమేముఖ్యము. మనోవిజయము మొదటిది. వీర్యస్తంభనము రెండవది.

18. వీర్యము శరీరపోషణమునకు ముఖ్యావసరము. ఇట్టి అమూల్యమగు వీర్యమును ఇంద్రియసుఖమునకు వ్యర్థపుచ్చుట అవివేకము.

19. వివాహములు, వైధవ్యము :— వివాహము పుణ్యకర్మ. ఇది శరీరములకు మాత్రము సంబంధించిన బంధము కాదు. ఆత్మల ఐక్యమే వివాహము. భార్యాభర్తలం దెవ్వరు మరణించినను ఈబంధము తెగిపోవునది కాదు. నరవిక్రయము మహాపాతకము. వివాహమునకై తల్లిదండ్రులు వైద్యుని

చుట దురాచారము. పశువులను కొనినట్లు కన్యలను కొని త్రాడుకట్టినంత మాత్రమున అది వివాహము కాజాలదు.

20. వివాహమనగా నేమో తెలియని చిన్నవయస్సుగల బాలికలకు తల్లిదండ్రులు గావించిన వివాహము నిజమైన వివాహము కాదు. ఇది నిర్బంధవివాహము. అట్టివివాహమువలన సంప్రాప్తమైన వైధవ్యము నిర్బంధవైధవ్యము గాన ఇట్టిబాలికలకు పునర్వివాహము గావించుటే ధర్మము.

21. భార్యమరణించినతర్వాత భర్తయు, భర్త మరణించినతర్వాత భార్యయు మనఃపూర్వకముగా వైధవ్యమనుభవించిననే ఆగృహము పావనమగును. ఆమతము వన్నెకెక్కును. కావున అజ్ఞానదశలో వివాహములు చేయరాదు.

22. సంతానము బడయుట సహజ ధర్మమే గాని దానికి మితియుండవలెను. మితికి మించినచో అది వ్యభిచారమే యగును. అందువలన శరీర నాశనమే గాక జాతికూడ నిర్వీర్యమయి, దుర్బలమయి దేశమునకుకూడ హాని కల్గించును.

23. భార్య సంసారయాత్రయందొక సహచారి. అంతియే కాని ఆమెవలన కేవల ఇంద్రియ సుఖములను మన మనుభవింప నిర్మితమయిన యంత్రము కాదు.

24. వితంతువులవలన దేశమునకు గృహమునకు కూడ ప్రమాదకరము. వీరి వైధవ్యము మనఃపూర్వకమయినది గాక నిర్బంధమయినదే యైనచో వారి ఆర్తి (రోదనము) గృహమునకు దేశమునకు గూడ అనర్థదాయకము.

25. మౌనము :— మౌనము మానసిక శక్తులను వృద్ధినొందించును కనీసము దినమునకు రెండు గంటల కాలము మౌనవ్రత మవలంబించుటకు ప్రయత్నింపుము. మౌనవ్రతమువలన అంతర్వాణిని వినగల్గుదుము.

26. ఉపవాసములు :— శరీరపోషణమునకు ఆహారమెట్లవసరమో అట్లే ఉపవాసములుకూడ అవసరము.

27. ఆకలికొరకే గాని భోగముకొరకు భుజింపరాదు. శరీరపోషణమున కవసరమగుదానికన్న ఎక్కువగా భుజించుట పరద్రవ్య అపహారణమే యగును. అందువలన మనము దురాశాపరులమయి దొంగలమగుచున్నాము.

28. శరీరపోషణము :— చెమటయోడ్చి ఆర్జించిన భోజనమును అనుభవింపుము. ప్రతిమనుజుడును తన శరీరపరిశ్రమచేతనే తన శరీరపోషణము చేసికొన్నచో దేశమునకు సంఘమునకును గూడ హాని కలుగదు.

29. మన సిద్ధికిమించిన వ్యయము చౌర్యము (దొంగతనము) వంటిదే. మనకోర్కెలను వృద్ధిపొందించుటలో సుఖములేదు. తగ్గించుకొనుటలోనే శాంతి కలదు. కోర్కెలను వృద్ధిపొందించుకొనుట ఒక అనారోగ్యకరమయిన వాంఛ.

30. అధికారపదవులు :— ఏ అధికారపదవినైనా స్వలాభదృష్టితో గాక ఆత్మార్పణబుద్ధితో నిర్వహించాలి.

31. గ్రామపంచాయతులు ప్రజాసేవకై కల్పింపబడిన అవకాశములే గాని వ్యక్తులు శాశ్వతాధికారముతో నేలెడు స్థిరరాజ్యములు కావు.

32. కామము :— అగ్నివలె భయంకరమయినది. ఇది ఇంద్రియములను, మనస్సును తన వశమొనర్చుకొని మనుష్యుని నాశనము చేయును.

33. విషయలోలత్వము (కామము) ఆత్మవినాశనమునకే సంపూర్ణ హేతువు.

34. కట్టెలు చచ్చినవారిని కాల్చివేయును - గాని కామము చింత జీవముతో నున్నవానినే భస్మము చేయును.

35. తన్ను తాను ఇంద్రియములను, (కామమును) జయించినవాడే మహావీరుడు.

36. గృహస్థాశ్రమము :— గృహస్థునకు జ్ఞానార్జనము మొదట విధి. బ్రహ్మచర్యము రెండవది. వానిని సద్వినియోగ మొనర్చుట మూడవది

ఈవిధులను ఉల్లంఘించిన గృహస్థు తాను చెడుటయే గాక, తనపోషణపొందవలసినవారి నెందరినో నష్టపరచిన పాపమును పొందును-

37. ఏ గృహస్థు తన దేశముకొరకు, సంఘముకొరకు, దైవముకొరకు, ధర్మముకొరకు పాటుపడునో అతడుమహాతపస్సంపన్నుండగు యోగి పొందగల్గు సద్గతినే పొందగలడు-

38 అన్నదానము, వస్త్రదానము, కన్యాదానము, విద్యాదానము చేయు శక్తి కలిగియుండి ఉపేక్షించరాదు, (శోభించునట్లు) సాయము కోరుడు ఉంచుకొన్నను- మాత సర్వదా దయచేదే-

39. గృహస్థునకు స్వధర్మమే అవశ్యాచరణీయము- అన్ని కర్మములు వృత్తులును సమానములే- చక్కగా వీధులునూడ్చు పాకీవాడును, ధర్మబద్ధముగా, రాజ్యపాలనము చేయు రాజును భగవంతుని దృష్టిలో సమానులే- ఎవడు యేవృత్తికి అర్హుడో అదియే వానికి స్వధర్మము-

40 బిడ్డలు, బంధువులు నావారేనని మురిసెదము- ఆలుబిడ్డలు' భోగభాగ్యములు ఆస్తికములు- వీరియెడ మోహమును మమకారమును తగదు- వీరెల్లరును జగన్నాథుని సంతానమనియు, నీవు వారిసేవకై నియోగింపబడితివనియు గుర్తింపుము-

41- సత్యము, అహింస, బ్రహ్మచర్యము త్రికరణశుద్ధిగా నవలంబించుటే సత్యశీలుని ధర్మము-

42. జీవితలక్ష్యము ;— జీవితము సేవకొరకే గాని భోగముకొరకు గాదు-

43- జీవితావసరములను తగ్గించుకొనుటే జీవిత లక్ష్యము-

44- జీవితమును ధనమార్జించుటకుండును, విద్యను ధనోపార్జనసాధనముగను వినియోగించు మానవుని జీవితములు వ్యర్థములు-

45- ఎవ్వడు తనశరీరమును దేవమందిరముగా భావించి, దానివ్యాపారింపజేయునో వానిదే సార్థకమగు మానవజన్మ-

46. మనచిత్తమును శాసించుకొననేరని మానవుడు ఎంతటివాడైనను ఉత్తముడు కానేరడు.

47. లెక్కలేని జీవరాసుల శాఖోపశాఖలై పెంపగుచు ప్రజాసేవ జేయుచున్న వటవృక్షము (మఱ్ఱిచెట్టు) ఒకప్పుడు అల్పమగు బీజరూపమున నున్నదేగదా ! ఇట్లే ప్రతిజీవియు తనయొక్క శక్తిని విజృంభింపజేసి ప్రజాసేవచేయుటకు ఉపయోగింపవచ్చును- ఇందులకే సృష్టింపబడెను-

48. సమత్వమునువీడి చుట్టును కంచె బిగించుకొని భేదబుద్ధితో స్వార్థదృష్టితో జీవించెడి జీవితము ఆధ్యాత్మికయాత్రకు అసహ్యకరము (ప్రజలకు) అవమానకరము- (తనకు, ఇతరులకును గూడా) ఇతరులను అవమానపరచినట్లే-

49. సర్వమానవ సోదరత్వమే మహాపురుషుల వాంఛితము.

50. దేవాలయములు ;— ప్రస్తుత దేవాలయములందు దేవుడుండజాలడు- అనేక దురాచారములకు లోనైన ఈ దేవాలయములయందు దయ్యమే పూజింపబడుచున్నది

51. వేశ్యలచే దేవాలయములయందు నృత్యము చేయించుట సైతానుని పూజించుటతప్ప వేరు కాదు.

52. ఒక బొమ్మను ఈశ్వరునిగా భావింపవచ్చును- కాని ఈశ్వరుని బొమ్మగా పూజింపరాదు.

53. పరిపూర్ణభక్తుడు ఈశ్వరునిజూడ దేవాలయమునకు బోడు- ఈశ్వరుడు వానిహృదయములో ప్రేమజ్యోతియై వెలుగుచుండును- అందువలననే ఈశ్వరుడు గోచరము కానేరని ప్రదేశమే లేదు.

54. మతము ;— అన్నిమతములందునుగల నీతిసిద్ధాంతము లొక్కటేయగును కాని వేరు కాజాలవు.

55. దోషము లున్నంతమాత్రమున మతమును విడనాడక దోషమును సంస్కరింపవలెను- ఎలుకలబాధకై ఇల్లు కాల్చుటయు, దోషమున్నందున మతమును విడుచుటయు అవివేకములు.

56. మనస్సును శుద్ధిచేయునదే మతము-; సర్వత్ర నిండియున్నదైన స్వరూపమును ఒక్కనామమునకు, స్వరూపమునకు బంధించుట మూర్ఖత్వమే యగును గాని మతము కాదు.

57. సనాతన హిందూమతమునకు ప్రధానము అంతఃశుద్ధియే గాని బాహ్యక్రియలు కావు- మతులు భిన్నమైనచో, మతములు భిన్నముగా గోచరించును.

58. సంఘసంస్కరణమువలన మతమును, రాజకీయసంస్కరణము వలన దేశమును ఉద్ధరింపబడగలవు- భారతదేశ దాస్యవిముక్తికి ఈరెండును ముఖ్యావసరములే.

59. అస్పృశ్యత — గోవులను, పాములను పవిత్రముగా పూజించు హిందూమతము మానవులను బహిష్కరించు దురాచారమును ఆమోదింపజాలదు- బాహ్యవేషములు మతమని భ్రమించుట అజ్ఞానము- అస్పృశ్యత నిల్చియుండిన, హిందూమతమంతరించును.

60. హిందువులు, మహమ్మదీయ క్రైస్తవులతో నెట్లు మెలగుచున్నారో, అట్లే స్వమతస్థులైన ఈ అంటరాని సోదరులను (హరిజనులను) జూచుట న్యాయమును, ధర్మమును, వారితో భోజనములు, పెండ్లిండ్లు చేసుకొనవలెనని నాయభిమతము కాదు- అట్టివి అనవసరము.

61. హిందూమత గ్రంథములం దెచ్చటను అస్పృశ్యులను ప్రత్యేక జాతియున్నట్లు కానరాదు- అంటరానితనము కర్మవల్లనేగాని జన్మవల్లరాదు- అంటరానితనము చేయుపనికేగాని చేయువానికి గాదు- పంచమహాపాతకము లొనర్చువారే జాతివారైనను పంచములే- పుట్టుకచే కాదు.

62. పిల్లలవిషయమై తల్లులు పాకీపని చేయుటలేదా? మన తల్లులు వైద్యులు చేయు పవిత్రకార్యములవలె, మన హరిజనసోదరులు చేయు ఈ మాదిగపనియు, పాకీపనియు సంఘమునకు ముఖ్యావసరవృత్తులనియు, పవిత్రములైనపనియు మనవి చేయుచున్నాను- కాన పాకీవృత్తి నీచవృత్తిగా జూచుటయు, పాకీవారిని అంటరానివారిగా జూచుటయు అజ్ఞానమే గాని

ను జ్ఞానము గాదు- హరిజనసేవయే హరిసేవ- జాతికన్న నీతిఘనము- సర్వేశ్వరునకు కులగోత్రములతో పని లేదు- లోకము చూపులో నాతడు నీచుడైయునను లోకేశుని చూపులో పవిత్రుడును, పూజ్యుడును.

63. యజ్ఞము - నిష్కామకర్మ :— యజ్ఞమనగా పరహితార్థ మొనర్చెడి కర్మ.

64. ఈశరీరము పరోపకారార్థమే లభించినది- కాన మానవుల యొక్క- సకల సంపదలును పరోపకారమునకే వినియోగపడవలెను-

65. నిష్కామకర్మంబె నిజమైనధర్మంబు- నిరాశతో కర్మ చేయుము- కోరికలేని సేవ సంసారసముద్రము నీదుటకు నావ- సేవయేజ్ఞానము- స్వార్థమే అజ్ఞానము-

66. త్యాగము :— త్యాగమనగా సంసారమును విడిచి అరణ్యమునకుపోవుట కాదు- సమస్తవ్యాపారములందును త్యాగభావమును కలిగియుండుటే సన్యాసము-

67. పశువు భోగించి ఆనందించుచున్నది- మానవుడు త్యాగమందు ఆనంద మనుభవించును- ఇదియే మానవునకును పశువునకును గలభేదము.

68. దౌర్జన్యరాహిత్యము - అహింస, సత్యము, ప్రేమ :— బల హీనులకు భగవంతుడే బలము- ఈఆర్యవాక్యములోని సత్యమును గ్రహించినచో దౌర్జన్యము అంతమొందును- ఆయుధబలముకన్న ఆత్మబలము యెన్నోరెట్లు అధికమైనది-

69. అహింసయన సర్వజీవులయెడ సంపూర్ణమగుప్రేమ.

70. సత్యమే శ్రీహరిప్రేమయు, పవిత్రతయు ప్రపంచమును పాలించును- ఈశ్వరప్రేమను దుర్బలులు పొందనేరరు- ఈశ్వరుడు సత్యస్వరూపుడు- ఆత్మశుద్ధిలేనిదే ఈశ్వరుడు మనవెంట నుండజాలడు- సత్యస్వరూపములు మరణమును మంగళకరముగా భావింతురు-

71 చిత్తము :— చిత్తమొక శాంతసాగరం- భావములే చిత్తసాగరంలో తరంగములు- చిత్తశుద్ధియే మోక్షమందిర ప్రథమ సోపానము-

72 మోక్షము — దుఃఖనివృత్తియే మోక్షము. తృష్ణయే బంధము. మోక్షమనగా బంధవిముక్తి.

73 దౌర్జన్యము దుర్బలత్వసూచన :— కత్తి పిరికివాని చిహ్నమే గాని వీరునిచిహ్నం కాదు. వీరుడనగా భయవిముక్తుడు. కర్తృత్వనిర్వాహణమందు అధైర్యము తగదు. దుర్బలత్వం పాపములలో నొకటి. సాహసము సంపదల నొసంగును. సోమరితనమే సకలవ్యాధులకు కారణం. విశ్వాసమే విజయమునకు మూలం. కార్యసాధనకు విశ్వాసమే పట్టుగొమ్మ.

74 ధనాశ - దారిద్ర్యము :— భాగ్యవంతులు తమ ఆస్తిసంపదలకు మితి యేర్పరచుకొన్నయెడల పేదలకు సులభముగా లభించును. దేశంలోని దారిద్ర్యమునకు ధనికుల లోభత్వమే కారణం.

75 పుణ్యాత్ముని హృదయం సంతోషమునకును, సంతృప్తికిని నిలయం. అందువలన అతడే మహాధనికుడు. ధనతృష్ణ అధికముగా నుండువాడే దరిద్రుడు. పేరాశయే పేదరికము. తృప్తియే మహాభాగ్యం.

76 ఒకవ్యక్తియొక్క విలువ అతని ధనరాసులపై ఆధారపడియుండదు. అతని విశాలహృదయమే అతనికి గౌరవమును చేకూర్చును.

77 మానవుడు బిడ్డలను గనుటయు, ధనమార్జించుటయు యంత్రం కాదు.

78 ధనమే దయ్యము. ధనముతో మురిసినవారికి ముప్పుతప్పదు. అక్రమం, అన్యాయం, అధర్మమైన పతనం అనివార్యము.

79 విషం విషం కాదు. ప్రజావిత్తమే విషం. విషం వల్ల ఒక్కడే చచ్చును. కాని ప్రజావిత్త మపహరించినచో పుత్రపౌత్రాదులు కూడ నాశనమగును.

80 లోకం చూపులో దరిద్రుడే, లోకేశుని చూపులో మహాధనికుడు. ధర్మమున్నచోట దైవముండును. అన్నివిద్యలకు అధిష్ఠానదేవత యగు సరస్వతి విభూతిధారియైన బ్రహ్మను వరించినట్లు విద్యలెల్లప్పుడు దరిద్రునే వరించును.

81 జ్ఞానం - అజ్ఞానం :— అజ్ఞానమే శూద్రత్వము సుజ్ఞానమే బ్రహ్మత్వం భక్తివిహీనమగు జ్ఞానం వ్యర్థం- ఆత్మజ్ఞానం కలిగినచో అజ్ఞానం నశించును- అజ్ఞానమే దుఃఖములకు కారణం.

82. సాధుత్వము, సహనము, పవిత్రశీలము, విశ్వాసము, జ్ఞానాభివృద్ధికి ముఖ్యావసరములు. జ్ఞానము వృద్ధినొందినచో సర్వత్ర పరబ్రహ్మ స్వరూపమే కానబడును,

83. దివాంధము తన దృష్టిదోషమును నిందించుకొనక సూర్యకాంతిని నిందించునట్లు అజ్ఞాని తన అవివేకతవలన సంప్రాప్తించు కష్టములకై భగవంతుని దూరుచుండును.

84. భక్తి:—ఈశ్వరుని చేరుటకు భక్తియే సులభమార్గము. మానవ కోటియొక్క బాధలను జూచుచు తాను కార్చుగల కన్నీరే నిజభక్తులకు విలువైన ధనరాశి. ఈ ప్రేమధనమునకు విలువలేదు, దీనిని దొంగలు హరింపజాలరు. అగ్నియు దహింప నేరదు.

85. బాహ్యపూజావిధానములతో గాక దివ్యమైన అఖండబాష్పములతో స్వామి నారాధింపుము. పరమేశ్వరుని పాదములకు విన్నబంధించు సాధనమే భక్తి, భక్తివలన భ్రమ, భయము, బంధములు తొలగును.

86. భక్తుని లక్షణములు:— యెవడు యెవరినిన్ని ద్వేషింపడో, యెవడు కరుణానిధియో, యెవడు నిరహంకారుడో, యెవనికి సుఖదుఃఖములు సమానములో, ఎవడు నిత్యసంతోషియో, ఎవడు మనస్సును, బుద్ధిని ఈశ్వరార్పణ చేయుచున్నాడో, ఎవనివలన లోకులు భయపడరో, ఎవడు లోకులవలన భయపడడో, ఎవడు పవిత్రుడో, ఎవడు శత్రుమిత్రులను సమభావముతో జూచునో, ఎవనికి మానావమానములు సమానములో, ఎవడు స్తుతివలన సుహృంగడో, నిందవలన ఖిన్నుడు కాడో, ఎవడు స్థిరబుద్ధిగలవాడో వాడే భక్తుడు. వాడే యథార్థ సత్యవ్రతుడు. వాడే నిజమైన సత్యాగ్రహి.

87. రాజనీతి;— రైతుల క్షేమమే రాజుల భాగ్యము. రాజు ప్రజల ప్రేమకు పాత్రుడు కావలెను, ప్రజలు నిరసించెడి కార్యములను రాజులు చేయరాదు.

88. గర్వియై, నిరంకుశాధికారముతో రాజ్యము నేలజూచు రాజు రాజ్యభ్రష్టుడు గాక తప్పదు. రాజ్యభద్రతకు ప్రజాదరణమే ముఖ్యము.

89. నిరంకుశ రాజ్యములను సైన్యములు రక్షింపజాలవు.

90. సర్వదా ప్రజాసౌఖ్యమును కోరు రాజు స్వసౌఖ్యమునుకూడ విడువవలెను.

91. రామరాజ్య, ధర్మరాజ్యము లే కాలమునకు పతనమై అస్తమింపః ఇక నిరంకుశ రాజ్యములు మాత్రము నిల్చునా? నిలువవు.

92. పరాధీనులయందు మూర్తీభవించెడి స్వాతంత్ర్యేచ్ఛయే దాస్యవిచ్ఛేదనమునకు మూలము. కొలిమితిత్తులు ఇనుమును సహితము బుగ్గిచేయునట్లు శక్తివంతమైన దీనుల కన్నీరు సామ్రాజ్యములను సహితము సడలించును.

93. లోకమెరుంగదగినది;— మానవుల లోపములను గుర్తించి వారికి మేలొనర్చుటకే ఈశ్వరుడు అవతరించును.

94. ప్రస్తుత కాలము గత కాలముయొక్క ఫలము. ముందు కాలమునకు బీజము.

95. పుణ్యపాప విచక్షణ లేక ధర్మదూరుడవై సంచరించినచో తిరిగి ఈ మానవజన్మ సంప్రాప్తమగుటకల్ల.

96 సుఖసౌఖ్యములు, భోగభాగ్యములు, సిరిసంపదలు స్థిరములు కావు. వీటినిజూచి భ్రమింపకుము. ఇవి మూన్నాళ్ల ముచ్చటలుసుమీ!

97. దాన, దయా, సత్య, శౌచములు కలిగి జీవయాత్రసాగింపుము. కష్టములు నిన్ను ఎదుర్కొననున్నవిసుమా! కాన ధైర్యవివేకములతో వాటిని ఎదుర్కొనుము.

98 జ్ఞానమార్జించి, భగవంతుని ధ్యానించి ముక్తిని సాధింపుము.

౯౯ సత్ప్రవర్తన:—సత్ప్రవర్తనగల మనుజులు సంఘమునకు మార్గదర్శకులు- మానవసంఘముయొక్క భాగమంతయు వారి భుజములపైననే మోపబడియున్నది- సత్ప్రవర్తనచే మానవత్వము దేవత్వముగను, దుష్ప్రవర్తనచే మానవత్వము రాక్షసత్వముగను మారుచున్నది- దుష్టుని రాజసౌధముకన్న సచ్ఛీలునిపర్ణకుటీరమే ఉత్కృష్టమైనది- విద్యాపివేకములకన్న సుశీలమే మనుజునియొక్క గౌరవమర్యాదలు చేకూర్చును- భారత జాతిలో కారణపురుషులగు మహనీయులెందరో నిర్ధన, దారిద్ర్యగృహములనుండియే జన్మించిరి. విద్యాజ్ఞానములకు వేషభాష అనవసరము. యావనమందు జీవితమున కవసరమగు ధనవిద్యాగుణసంపదలను గూడబెట్టుకొని వార్ధక్యమున వానిని యుక్తముగా వినియోగించుకొనుట వివేకి లక్షణము. సద్వర్తనము వలన మనుష్యత్వము సిద్ధించును. మనుష్యత్వము వలన సకల సౌభాగ్యములును కలుగును. నీప్రవర్తనమును బాగుపరచుకొన్నచో అదియే నీకు సకల సౌభాగ్యములును చేకూర్చును. దురభ్యాసములను దూరమొనర్చుము. సదభ్యాసములను అలవరచుకొనుము. మోతలు దుష్టుని బంధింపలేవు. కాని సత్ప్రవర్తనగల మనుజునికి ఒక్క వాక్కే బంధించును.

100. నాగరికత;—మానవునకు ధర్మమార్గమును గోచరింపజేయు ప్రవర్తనాపద్ధతియే నాగరికత- నాగరికతయన ప్రవర్తనమనియర్థము. (కాని పరదేశాలనుండి అనుకరించుచున్న ఇప్పటి వేషాలు కావు) ఇట్టి ధర్మము లోపించిన ఆధునిక నాగరికతను విషవృక్షాలతో పోల్చవచ్చును. పరాన్నభుక్కులగు ప్లీడర్లు, డాక్టర్లు మొదలైనవారి వృత్తులు దీనికి శాఖలు. రాను రాను ఈ నాగరికత మనుష్యుని యంత్రముగా మార్చివైచినది. కనుక ఈ ఆధునిక నాగరికత యెంత త్వరలో నశించిన అంత మేలు.

101. లాయర్లు;—ప్లీడర్లు, డాక్టర్లవలెనే పరాన్నభుక్కులు. స్వలాభమునకై వారు వివాదములను వృద్ధిచేతురు- ధనసంపాదన కిదియొక రాచబాట. వీరు జలగలవలె బీదల రక్తమును పీల్చివేయుచున్నారు- లాయర్లు చేయునట్టి కుపయోగమైన పనిలేని సోమరులు, భోగాభిలాషగల

సోమరులిట్టి వృత్తులనె అవలంబించెదరు. పీఠేమీదనుండియో ఊడిపడి నట్లు బీదలు భావించులాగు నటించెదరు. కష్టించు కూలివానికంటె వారు ఏవిధమున దేశమునకు లాభకారులు?

102. కోర్టులు :— ఇవి ప్రజాలాభముకొరకు స్థాపింపబడినవనుట పొరబాటు. ఇంగ్లీషువారి యధికారమును శాశ్వతముగా నెలకొల్పుటకవి యుద్దేశింపబడినవి. కాన మనదేశములో ఇంగ్లీషువారి యధికారమును స్థిర స్థాపితముజేసి దేశమునకు తీరని హానిగావించినవారు ఈలాయర్లే.

103. వైద్యశాలలు, డాక్టర్లు :— వైద్యవృత్తియను సాధనమువలన ఇంగ్లీషువారు మనలను తమ స్వాధీనములో నుంచుకొనుట కుపయోగించు చున్నారు. వైద్యశాలలు పాపమును వ్యాపింపజేయుట కేర్పడిన సంస్థలుగా మారినవి. దుర్నీతి హెచ్చుపెరుగుచున్నది. అందులో యూరోపియను డాక్టర్లు కడుంగడు పాపులు. మానవశరీర సంరక్షణార్థమై వారు వేలకొలది జంతువులను హింసించుచున్నారు. పరిశోధనలనిమిత్తము వారు నిండు ప్రాణముతోనున్న జంతువులను కోయుదురు. ఈడాక్టర్లు మన మతాచారములను తిరస్కరించుచున్నారు. యూరోపియను వైద్యవిధానము నేర్చుకొనుచు మనము మన ఆనిసత్వమును అధిక మొందించుకొనుచున్నాము. మానవకోటి నుద్ధరించుటకు గాక ధనార్జనకొరకే అనేకు లీవృత్తిని అభ్యసించుచున్నారు. తమ వైద్యజ్ఞానమును చాలా అట్టహాసముగా ప్రదర్శించి అసలు దమ్మిడీ ఖరీదుగల మందును అనేకరూప్యములకమ్ముచు అమాయకపు ప్రజలను మోసగించి దోచుకొనుచున్నారు. మానవసేవా తత్పరులవలె నటించు ఈడాక్టర్లకంటె సామాన్య దేశీయ వైద్యులే మేలు.

"మానవ సేవయే భగవంతుని సేవ"

"నిత్యం సన్నిహితో మృత్యుః"

"కర్తవ్యో ధర్మ సంగ్రహః"

# మూడవ భాగము

# ఉపనయ ప్రార్థన.

హరిః ఓం, హరిః ఓం, హరిః ఓం

శ్లో. ఈశావాస్యం ఇదగ్ం సర్వం యత్కించత్ జగత్యాంజగత్
తేనత్యక్తేన భుంజీతాః మాగృధః కస్యస్విధనమ్.

తా॥ సృష్టిఅంతయు ఈశ్వరుని మయము. అందు యేమార్పులు జరిగినను అనగా పుట్టుట, గిట్టుట, వృద్ధిపొందుట, క్షీణించుట మొదలగునవి అన్నియు ఆయనవలననే కావున ఆత్మసాక్షాత్కారము కావలసినవారు పరులసొత్తును అపహరింపక, ఆశింపక పరులను మాటలచేగాని చేతలచేగాని ఏవిధముగగాని హింసింపక, ఇతరులను చూచి అసూయచెందక, తనకు యున్నదానితో తృప్తిచెందుచు. తనకు అవసరమైనవాటినే గ్రహించుచు యుండే వైరాగ్యమే మోక్షమార్గము అని ఈశ్వరునిచే చెప్పబడినది. ఇది గురువు శిష్యునకు చేసెను ఉపదేశముగా నున్నది.

శ్లో. ప్రాతః స్మరామి హృది సంస్ఫురదాత్మ తత్త్వమ్
సచ్చిత్సుఖం పరమహంస గతిం తురీయమ్.

తా॥ తెలివితో నున్నప్పుడును, కలలుగను కాలమందును, గాఢనిద్రలోను, ఎయ్యది సర్వము నెఱుంగునో, జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థలను దాటి నాల్గవ యవస్థయగు సమాధిలోగూడ నెయ్యది సచ్చిదానంద స్వరూపమయి పరమహంసవలె గమనించుచు స్ఫురించుచున్నదో ఆయాత్మ

తత్త్వమును హృదయమందు ప్రాతఃకాలమున స్మరించుచున్నాను. నేను ఆ బ్రహ్మానే ప్రపంచములోని భూతజాలములో నివాసను గాను.

శ్లో. ప్రాతర్భజామి మనసోవచ సామగమ్యమ్
వాచోవిభాంతి నిఖిలాయదనుగ్రహేణ
యన్నేతినేతి వచ నైర్నిగమా అవోచుః
తం దేవదేవమజ మచ్యుత మాహురగ్ర్యమ్

తా॥ మనస్సునకును మాటలకును అందరానిదియేదో, దేని యనుగ్రహముపలన సకలవాక్కులును ప్రకాశించుచున్నవో కాదు—కాదు వ—వ అని ప్రపంచమును నిషేధించుచు (ఇదియని ప్రత్యక్షముగా జూపలేక) దేనిని వేదములు చెప్పినవో, నాశములేనట్టి అన్నిటికి మొదటిదగునట్టిదానినిగా దేనిని జెప్పుదురో దేవతలకు దేవుడగు అట్టి పరమాత్మను ప్రాతఃకాలమందు సేవింతును.

శ్లో. ప్రాతర్నమామి తమసః పరమర్క వర్ణమ్
పూర్ణం సనాతనపదం పురుషోత్తమాఖ్యమ్
యస్మిన్నిదం జగదశేష మశేషమూర్తౌ
రజ్జ్వాం భుజంగమయివ ప్రతిభాసితం వై

తా॥ అజ్ఞానమును దాటియున్నట్టిది, సూర్యునకున్న తేజస్సువంటి తేజస్సుగలట్టిది సంపూర్ణము (అనగా అఖండము) చిరకాలము నాటిది, పురుషోత్తముడను ఖ్యాతిని జెందియున్నది. గొప్పదియగు వస్తువును ప్రాతఃకాలమందు నమస్కరించుచున్నాను. ఏదానియందు మిగులు లేక సమస్తజగత్తును త్రాటియందు పాము భాసించునట్లు భాసించుచున్నదో అపరవస్తువును నమస్కరింతును.

శ్లో. త్వమేకం శరణ్యం త్వమేకం వరేణ్యమ్
త్వమేకం జగత్పాలకం స్వప్రకాశం
త్వమేకం జగత్కర్తృ పాతృప్రహర్తృ
త్వమేకం పరం నిశ్చలం నిర్వికల్పమ్

తా॥ నీవే రక్షకుడవు. నీవే శ్రేష్ఠుడవుగానవు. జగత్తును పాలించువాడవు. నీవే స్వప్రకాశము. నీవే జగత్తును చేసినట్టి, పాలించునట్టి, సంహరించునట్టి వాడవు. నీవే నిశ్చలము, భేదరహితము, పరము (అనగా నన్నిటి మీదిది) నైన వస్తుస్వరూపము నీ వొకడే యని పరబ్రహ్మ పరముగా నర్థము,

శ్లో. నమస్తే సతేతే జగత్కారణాయ
నమస్తే చితే సర్వలోకాశ్రయాయ
నమోద్వైతతత్త్వాయ ముక్తిప్రదాయ
నమో బ్రహ్మణేవ్యాపినే శాశ్వతాయ

తా॥ సత్ స్వరూపుడవగు నీకు నమస్కారము. (సత్ = ఉన్నది) జగత్తు నంతటిని పుట్టించిన నీకు నమస్కారము, సర్వలోకములకును ఆధారమయి చైతన్యరూపమగు నీకు నమస్కారము. (చిత్ = చైతన్యము) అద్వైత తత్త్వమయి ముక్తి ప్రదుడవగు నీకు నమస్కారము. శాశ్వతమై సర్వము నిండిన బ్రహ్మస్వరూపమునకు నమస్కారము. (ద్వైతం జీవుడు వేరు, బ్రహ్మవేరు అన్నది. అద్వైతం= రెండును ఒక్కటే యన్నది.)

శ్లో. భయానాం భయం భీషణం భీషణానామ్
గతిః ప్రాణినాం పావనం పావనానామ్
మహోచ్చైః పదానాం నియంతృత్వమేకమ్
పరేషాం పరం రక్షణం రక్షణానామ్

తా॥ భయములకుగూడ భయమగునట్టిది, భయంకరమైన వాటికిని భయముగలిగించునట్టిది, సకలప్రాణులకు ఆధారమయినది పవిత్ర వస్తువునను కూడ పవిత్రము చేయునది ఉన్నత పదవులను నియమించునది మిగుల నున్నవనివాని యన్నిటిమీద నున్నట్టి రక్షకములను వస్తువులకన్నిటికి రక్షకమయినట్టి పరమాత్మ నీ వొక్కటే.

శ్లో. వయంత్వాం స్మరామో వయంత్వాం భజామో
వయం త్వాం జగత్ సాక్షిరూపం నమామః
సదేకం నిధానం నిరాలంబమీశమ్
భవాంభోధి పోతం, శరణం వ్రజామః

తా॥ నిన్ను మేము జ్ఞాపకము చేసికొందుము. లేక తలతుము. నిన్ను సేవింతుము. జగత్తంతటికి సాక్షియైన నిన్ను మేము నమస్కరింతుము. చిద్రూపము, ఏకము, అంతటికి నాధారము, తన కాధారము ఇంకొకటి లేనిది (అనగా దనంతతానే నిల్చినదని తా॥) సర్వమునకు ప్రభువగునది, సంసారమను సముద్రము దాటించు నావయై యున్నది, రక్షకమయినది అగు దానిని శరణు జేయుచున్నాము. ఆశ్రయించుచున్నామని తాత్పర్యము.

శ్లో. అసతో మా సద్గమయ
తమసో మా జ్యోతిర్గమయ
మృత్యోర్మామృతం గమయ.

తా॥ అజ్ఞానములోనుండి నన్ను జ్ఞానములోనికి నడిపించుము. (చేర్చుము అని తాత్పర్యము) చీకటిలోనుండి వెలుగులోనికి జేర్పుము చావునుండి మోక్షమునకు పంపుము. (చావులోనికి పోయినచో తిరిగి జన్మించవలసి యుండును. మోక్షమునకు బోయినచో మరల జన్మము లేదని తా॥)

శ్లో. యంబ్రహ్మా వరుణేంద్ర రుద్రమరుతస్తున్వన్తి దివ్యైస్తోత్రై
ర్వేదైః సాంగపదక్రమోప నిషద్భిర్గాయన్తియం సామగాః
ధ్యానావస్థిత తద్గతేన మనసాపశ్యన్తియం యోగినో
యస్యాన్తం నవిదుస్సురాసురగణా దేవాయ తస్మైనమః

తా. బ్రహ్మాది దేవత లెవ్వనిని దివ్యమైన స్తుతులతో స్తోత్రము చేతురో, సామవేదము గానము చేయువారు పదక్రమ ఉపనిషత్తులతో, నాల్గువేదములతోను యెవ్వని గానము సేతురో, యోగులు ధ్యానముతో గూడి యతనిం జేరిన మనస్సుతో నెవ్వనిని దర్శింతురో, సురులు, అసురులు మొదలగువారుకూడ నెవ్వనియంతము కనుగొనలేరో అట్టి దేవునకు నమస్కారము.

శ్లో. గురుర్బ్రహ్మ గురుర్విష్ణు ర్గురుర్దేవో మహేశ్వరః
గురుః సాక్షాత్ పరబ్రహ్మ తస్మై శ్రీగురవేనమః

తా. గురువే సర్వదేవతా స్వరూపుడని దీని తాత్పర్యము-

శ్లో. నత్వహం కామయే రాజ్యం నస్వర్గం నాపునర్భవమ్
కామయే దుఃఖతప్తానాం ప్రాణినామార్తి నాశనమ్

తా. నేను రాజ్యము నెంతమాత్రము కోరను. స్వర్గమును గోరను- జన్మలేకుండ ముక్తిగూడ గోరను- (మరేమి కోరుదునంటే) దుఃఖముచేత తపించుచున్న ప్రాణులబాధ తొలగుగాకని సర్వదా నాప్రయత్నమని తాత్పర్యము-

శ్లో. కరచరణకృతం వాక్కాయజం కర్మజం వా
శ్రవణనయనజంవా మానసంవాపరాధమ్
విహితమవిహితంవా సర్వమేతత్ క్షమస్వ
జయజయ కరుణాబ్ధే శ్రీమహాదేవశమ్భో

తా. చేతులతోను, పాదములతోను, వాక్కుతోను, శరీరము తోను, పనులవల్లను నేచేసిన యపరాధమును గాని, చెవులవల్ల కన్నులవల్ల మనస్సునందు గల్గిన యపరాధమును గాని వేదము నిర్ణయించిన దానివల్లగాని, యేదయిన నపరాధము నేను చేసితినేని దానిని గూడ ఓ మహాదేవ శంభూ! దయాసముద్రుడా! సర్వమును క్షమింపుము. సర్వత్ర జయము గోరుదుము.

రఘుపతి రాఘవ రాజారామ్
పతితపావన సీతారామ్
సుందరమాధవ మేఘశ్యామ్
గంగాతులసీ సాలగ్రామ్ ॥రఘు॥
చండకిరణ కులమణి రామ్
శుద్ధబ్రహ్మ పరాత్పర రామ్ ॥రఘు॥
భద్రగిరీశా సీతారాం
భక్తవత్సలా సీతారామ్ ॥రఘు॥
ఈశ్వరు అల్లా తేరేనాం
సబ్ కో సన్మతి దే భగవాన్ ॥రఘు॥

(చండకిరణ= సూర్యుని కులములో రాముని జన్మ, మండనము = భూషణము తక్కినది సులభము.) అహింసా సత్యమస్తేయం బ్రహ్మచర్య మసంగ్రహం.

శరీరశ్రమ అస్వాదో సర్వత్ర భయవర్జనః
సర్వధర్మే సమానత్వే స్వదేశీ స్పర్శభావనా
హీయే కాదశ సేవామే నమ్రత్వే వ్రతనిశ్చయే.

తా॥ 1 ప్రాణుల హింసింపకుండుట 2 నిజమాడుట 3 దొంగపనులు చేయకుండుట 4 బ్రహ్మచర్యము చేయుట 5 నిలువచేయు

కుండుట 6 శరీరకష్టము చేయుట 7 ఆహారమున లొంగిపోకుండుట 8 ఏ విషయమున భయపడకుండుట 9 సర్వధర్మములందు సమానబుద్ధి 10 స్వదేశీవ్రతము 11 అస్పృశ్యతానివారణ ఈ పదకొండును సేవించుచుటుండుట నమ్రతతో ప్రవేశించుట సత్యాగ్రహులకు ముఖ్యము-

శ్లో. విపదో నైవ విపదః సంపదో నైవ సంపదః
విపద్విస్మరణం విష్ణోః సంపన్నారాయణస్మృతిః.

తా॥ ఆపదలు (అనగా లోకములో మనము అనుకొనేవి) ఆపదలే కావు విష్ణుదేవుని మఱచిపోవుటయే ఆపద, నారాయణుని స్మరించుటయే సంపద.



# మంత్రపుష్పము



ఓమ్॥ సహస్రశీర్‌షం దేవం విశ్వాక్షం విశ్వశంభువమ్। విశ్వం నారాయణం దేవ మక్షరం పరమం పదమ్। విశ్వతః పరమాన్నిత్యం విశ్వం నారాయణగ్ం హరిమ్। విశ్వమేవేదం పురుషస్తద్విశ్వముపజీవతి। పతిం విశ్వస్యాత్మేశ్వరగ్ం శాశ్వతగ్ం శివమచ్యుతం। నారాయణం మహాజ్ఞేయం విశ్వాత్మానం పరాయణం। నారాయణ పరోజ్యోతిరాత్మా నారాయణః పరః। నారాయణ పరంబ్రహ్మ తత్త్వం నారాయణః పరః। నారాయణ పరోధ్యాతా ధ్యానం నారాయణః పరః। యచ్చకించిజ్జగత్సర్వం దృశ్యతే శ్రూయతేఽపివా। అన్తర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణస్స్థితః। అనన్తమవ్యయం కవిగ్ం సముద్రేన్తం విశ్వశంభువమ్। పద్మకోశప్రతీకాశగ్ం హృదయం చాప్యధోముఖం। అధోనిష్ట్యావితస్త్యాన్తే నా

భ్యాముప రితిష్ఠతి। జ్వాలమాలా కులం భాతివిశ్వస్యాయతనం మహత్ సన్తతగ్ం శిలాభిస్తులమ్బత్యా కోశసన్నిభం। తస్యాన్తే సుషిరగ్ం సూక్ష్మం తస్మిన్సర్వం ప్రతిష్ఠితం। తస్యమధ్యే మహానగ్ని ర్విశ్వార్చిర్విశ్వతోముఖః సో౽గ్రభుగ్వి భజ న్తిష్ఠన్నాహార మజరః కవిః। తిర్యగూర్ధ్వ మధశ్శాయీ రశ్మయస్తస్యసన్తతా। సన్తాపయతిస్వం దేహ మాపాద తలమస్తకః। తస్యమధ్యే వహ్నిశిఖా అణీయోర్ధ్వావ్య వస్థితః। నీలతోయదమధ్యస్థా ద్విద్యుల్లేఖేవభాస్వరా। నీవారశూకవత్తన్వీపీతా భాస్వత్యణూపమా। తస్యాశ్శిఖాయామధ్యే పరమాత్మావ్యవస్థితః। సబ్రహ్మ సశివస్సహరిస్సేన్ద్రః సో౽క్షరః పరమస్స్వరాట్॥

ఓం తద్బ్రహ్మ। ఓం తద్వాయుః। ఓం తదాత్మా। ఓం తత్సత్యం। ఓం తత్సర్వం। ఓం తత్పురోర్నమః॥

అన్తశ్చరతి భూతేషు గుహాయాం విశ్వమూర్తిషు। త్వం యజ్ఞస్త్వం వషట్కారస్త్వం మిన్ద్రస్త్వగ్ం రుద్రస్త్వం విష్ణుస్త్వం బ్రహ్మత్వం ప్రజాపతిః। త్వంతదాప ఆపో జ్యోతీరసోమృతం బ్రహ్మభూర్భువస్సువరోమ్॥

తా॥ అనేక శిరస్సులు కలది, అనేక నేత్రములు కలది, సర్వమునకు సుఖము కలిగించునది, సమస్తమునువది, దివ్యరూపము నయల సముదాయమునందు నుండునది, నాశములేనిది, పరమపదమైనది, (ఆస్థానమే యన్నిటికైదని తా॥) అన్నిటిమీది దానికంటె మీదిది, నిత్యమైనది, నారాయణుండని, హరియని సర్వమును వ్యాపించియున్నది.

(అగుదానిం ధ్యానింతునని క్రింద తెచ్చుకొనవలయును,)

ఈ కనబడుచున్న ప్రపంచమంతయును ఆపురుషుని స్వరూపమే, దాని నాశ్రయించియే ప్రపంచము జీవించుచున్నది. విశ్వమునకు దానధిపతి; తనకు దానే యాధికారి, శాశ్వతము, మంగళకరము, నాశములేనిది, అందరి నరులలోను ఉండునది, గొప్పగా తెలియదగియున్నది. ప్రపంచ

మన కంతటికిని ఆత్మ (జీవాత్మ) రూపమైయున్నది. అదే పరమశక్తియై యున్నది.

పరుల లోనున్న యీ ఆత్మయొక్క యమిత తేజస్సు అదే పరమాత్మ. ఆ నారాయణుడే పరబ్రహ్మ. నారాయణుడే పరతత్వము. (అని చెప్పి)

ఇట్లు ధ్యానించువాడు నరుడగు నారాయణుడే. ఆ ధ్యానము ఉత్కృష్టమైన ఆ నారాయణుడే. (ధ్యానము చేయువాడు, ఆ ధ్యానము ధ్యానము చేయబడువాడు సర్వము నారాయణుడే. అదే పరమాత్మ, అదే పరతత్వము అని చెప్పి నిస్సందేహముగా తెలియుటకు) మనకు కనబడుచున్న, మనము వినుచున్న ప్రపంచ మేదికలదో అంతయు, మరియు మనము చూడనిది విననిది యగు ప్రపంచమంతయుగూడను, లోపలనున్నది బయటనున్నది, ఈ సర్వ ప్రపంచమును నిండి నారాయణుడున్నాడు. అంతము లేనిది, నాశము లేనిది, సర్వము తెలిసినదే, ఆకాశమందంతముగలది. (అనగా సముద్రమంటే ఆకాశము. ఆకాశ మెక్కడ నంతమగునో అచటనే దీని కంతము. ఆకాశమునకు అంతము లేదు, దీనికిని అంతము లేదు. అని తా॥) ప్రపంచమునకు సుఖము కలిగించునది.

(ఇట్లు పరమాత్మను జెప్పి జీవాత్మను అదియుండు స్థానమును వర్ణించుచున్నాడు.)

తామర మొగ్గ ఆకారముగా నధోముఖమై వ్రేలాడుచు బొడ్డుకు పండ్రెండంగుళాల మీదికి (ఒకవస్తువు) యున్నది. అది మంటలతో నిండి సమస్త ప్రపంచమున కాధారమయిన చోటది ఎల్లప్పుడు గర్తనాడులకు వ్రేలాడుచుండును. ఇంచుక మొగ్గవలె నుండును, (అనగా జీవనము గొంతసంటున్నదని తా॥) ఆ మొగ్గచివరను చిన్న రంధ్రముకలదు. ఆ చివర నంతయుగలదు. దానిలోపల గొప్ప యగ్నిగలదు. ఎటుచూచినను దానిలో మంటలు కలవు- అన్ని ముఖములను ఆమంటలు వ్యాపించును- ఆ యగ్నియే ఆహారమును మొదట తినువాడు- అరిగిన యీ యాహారమును అన్నిటికిని పంచు

చుండును- ఆ యగ్నికి మొదిమి లేదు- అన్నీ తెలిసినది- దాని కిరణములు అడ్డుగాను, నిలువుగాను, క్రిందుగాను ఉండి ప్రసరించుచున్నవి. తన దేహమందు తల మొదలు కాళ్లవఱకు నా యగ్నియుండి వేడిని గలిగించుచున్నది-

దానిమధ్యను సన్ననిదై మీదికి బ్రసరించుచుండు అగ్నిశిఖ అనగా అగ్ని జ్వాల కలదు-

నల్లని మేఘము మధ్యను మెఱపుతీగవలె ప్రకాశించుచు వరిముల్లు ఎంత సన్ననిదో అంత సన్ననిదై పసుపుపచ్చనిరంగు గలిగి అణుమాత్రమై చక్కగా (ఆహారమును) తినుచున్నది- ఆ అగ్నిజ్వాలలమధ్యను (అనగా నీ చెప్పినదంతయు జీవ విషయము. ఆజీవునిలోనే అని తా॥) పరమాత్మ యున్నది- అదే బ్రహ్మ- అదే శివుడు- అదే హరి- అదే ఇంద్రుడు- అదే అక్షర (నాశములేని) పర బ్రహ్మము స్వరాట్టు-

అదే బ్రహ్మ- అదే వాయువు- అదే ఆత్మ- అదే సత్యము- అదే సర్వమును అదే యందుగనబడునది- అది అన్ని భూతముల (జంతువుల) యందును లోపల సంచరించును- సకలశరీరములందును గుహలోనుండును- (గుహయనగా విదివఱకు జెప్పిన తామరమొగ్గ మధ్యనున్న ఆకాశము అది అంగుష్టమాత్రముండును- దానినే దహరాకాశమందురు.)

నీవే యజ్ఞరూపుడవు- నీవే వషట్ అని ఉచ్చరించి చేసిన హోమస్వరూపుడవు- నీవే ఇంద్రుడవు- నీవే రుద్రుడవు- నీవే విష్ణువు- బ్రహ్మవు నీవే- ప్రజాపతివి నీవే- నీవే యుదకము- ఉదకములోని తేజస్సు అనగా విద్యుత్తు నీవే- అందున్న రుచి నీవే- అమృతము నీవే-నీవే బ్రహ్మ- సమస్తలోకములును నీవే-

శ్లో॥ కాయేనవాచా మనసేంద్రియైర్వా
బుద్ధ్యాత్మనావా ప్రకృతేస్స్వభావాత్
కరోమియద్యత్ సకలం పరస్మై
నారాయణాయేతి సమర్పయామి॥

తా॥ శరీరముతో గాని, మాటలతో గాని, మనస్సుతో గాని, మఱియు నే యితర యింద్రియములతో గాని, లేక బుద్ధితో గాని, ఆత్మసాక్షిగా గాని, ప్రకృతి స్వభావము ననుసరించి గాని ఏవి పనులు చేతునో వాటి నన్నింటిని పరాత్పరుడగు నారాయణునికి సమర్పించుచున్నాను.

శ్లో. స్వస్తిప్రజాభ్యః పరిపాలయన్తాం
న్యాయేన మార్గేణ మహీం మహీశాః
గో బ్రాహ్మణేభ్యః శుభమస్తు నిత్యం
లోకస్సమస్తా స్సుఖినో భవన్తు.

తా॥ ప్రజలకు శుభము కలుగుగాక! న్యాయమగు పద్ధతులతో రాజులు ప్రజను పరిపాలింతురుగాక! గోవులకును బ్రాహ్మణులకును శుభమగుగాక! సమస్త ప్రపంచమును సుఖాబ్ధి నోలలాడుగాక!

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

(జాతీయ గీతము.)

వందేమాతరమ్,

1. సుజలాం, సుఫలాం, మలయజ శీతలాం
సస్యశ్యామలాం మాతరమ్ ॥వందే॥

2. శుభ్రజ్యోత్స్నా పులకిత యామినీం
ఫుల్లకుసుమిత ద్రుమదళశోభినీం
సుహాసినీం సుమధుర భాషిణీం
సుఖదాం వరదాం మాతరమ్ ॥వందే॥

తా॥ సుందరమయిన నదీనదములు గలదియును, వివిధ ఫలాన్వితమును మఱియు పర్వతపుచల్లనిగాలి గలదియును, సస్యసమృద్ధిగలదియును నగు మాత (భారతమాత)ను నమస్కరించుచున్నాను-తెల్లనివెన్నెలతో నొప్పు రాత్రులు గలదియును. పుష్పించి విరిసిన సుందర వృక్షములుగలదియును, చిరునవ్వులతో నొప్పునదియును తియ్యనిపల్కు (భాషలు)గలదియును, సుఖప్రదయును, కోరినవరములు నిచ్చునదియును నగు తల్లికి నమస్కరించుచున్నాను.

## (ఝుండా ప్రశంస.)

ఝుండా ఊంచారహే హమారా
విజయీ విశ్వతిరంగా ప్యారా
సదాశక్తి బర్సానేవాలా
ప్రేమసుధా సర్సానేవాలా
వీరోంకో హర్షానేవాలా
మాతృభూమికా తన మనసారా ॥ఝుండా॥

స్వతంత్రతాకే భీషణ్ రణమే
లఖ్ కర్ జోష్ బఢే క్షణ క్షణమే
కాంపే శత్రు దేఖ్ కర్ మనమే
మిట్ జావే భయ్ సంకట్ సారా ॥ఝుండా॥

ఇస్ ఝుండేకే నీచే నిర్భయ్
లే స్వరాజ్య యహ అవిచల నిశ్చయ్
బోలో భారతమాతాకీ జయ్
స్వతంత్రతాహీ ధ్యేయ్ హమారా ॥ఝుండా॥

ఆవో ప్యారే వీరో ఆవో
దేశధర్మ్ పర్ బలిబలి జావో
ఏకసాథ్ సబ్ మిల్ కర్ గావో
ప్యారా భారతదేశ్ హమారా ॥ఝుండా॥

ఇస్కీ శాన్ న జానే పావే
చాహేజాన్ భలేహీ జావే
విశ్వవిజయ కర్కే దిఖలావే
తబ్ హోవే ప్రణ్ పూర్ణ హమారా ॥ఝుండా॥

తా॥ ముచ్చటగా మూడు రంగులతో నొప్పునదియు, నిరంతరము నవీనోత్సాహమును పురికొల్పునదియు, ప్రేమామృతమును వర్షించునదియు వీరులను సంతోష తరంగితుల జేయునదియు, మాతృభూమికి ధన మాన

ప్రాణముల నొడ్డియు మన ప్రియమయిన పతాకము ఉన్నత పదవయై యొప్పుగాక !

ఘోరమయిన స్వాతంత్ర్య సమరమునందు వీరావేశ భరితులమయి శత్రువులు వణకి పోవునట్లు పోరుదుముగాక ! మనకుగల భయ భీతులను, కష్టనిష్ఠురములను, తొలగిపోవుగాక ! స్వతంత్రతయే మన ఆదర్శము. ఈపతాకచ్ఛాయను నిర్భయులమయి, దృఢనిశ్చయులమయి, "భారతమాతాకీజయ్" అను జయధ్వానములతో స్వరాజ్యమును చూరగొందుముగాక!

రండు! వీరులారా రండు! దేశముపట్ల మీరు నెరవేర్చవలసిన ధర్మము గావింపుడు- ఐక్యమత్యముతో ఒక్కమారు భారతదేశము మాకత్యంత ప్రియమైనదని వక్కాణింపుడు.

ఈపతాకము యొక్క అభిమాన గౌరవములకు భంగము వాటిల్లకుండుగాక! అసువులు బాసియైనను ప్రపంచమునంతను దిగ్విజయము గావించెదము గాక! అప్పుడే మన ప్రతిజ్ఞ నెరవేరగలదు.

## —: రాష్ట్రగానము :—

ఆంధ్రమాత శ్రీసమేత అనుపమ ప్రఖ్యాతచరిత
అఖిలభక్త పారిజాత అనఘ మంగళం
ఆంధ్రవిష్ణు శాలివాహ అమరవినుత రాజరాజ
ఆదినృపులగన్నతల్లి అమల మంగళం
కృష్ణరాయ రంగరాయ ఖడ్గతిక్కనాది శూర
మండలమును గన్న వీరమాత మంగళం

మొల్లముఖ్య కవయిత్రుల మల్లమాది సాధ్వీమణుల
అల్లరుద్రమదేవి గన్నతల్లి మంగళం
రామదాసాది భక్తరత్నములను గన్నతల్లి
తిక్కనాదికవుల గన్నదేవి మంగళం

నాగ్నజిత్తు ముఖ్యశిల్ప నాయకులనుగన్నతల్లి
అపస్తంభాదిమునుల అంబమంగళం
తిమ్మరుసు యుగంధరాది దివ్యరాజనీతిపరుల
వల్లభాది మతకర్తల తల్లిమంగళం ॥ఆంధ్ర॥

బోలో! విశ్వమాతకుజయ్- భారతమాతకు జయ్- ఆంధ్రమాతకు జయ్- మహాత్మాగాంధీకుజయ్.

ఓం సర్వేషాం స్వస్తిర్భవతు- సర్వేషాం పూర్ణంభవతు- సర్వేషాం శాంతిర్భవతు- ఓం శాంతి, శ్శాంతి. శ్శాంతిః.

# సూర్యనమస్కారములు



1 ఓం హ్రాం హగ్ం సశ్శుచిషత్ - ఓం హ్రాం మిత్రాయనమః
2 ఓం హ్రీం వసురంతరిక్షసత్ -ఓం హ్రీం రవయేనమః
3 ఓం హ్రూం హోతా వేదిషత్ - ఓం హ్రూం సూర్యాయనమః
4 ఓం హ్రైం అతిథిర్దురోణసత్ - ఓం హ్రైం భానవేనమః
5 ఓం హ్రౌం నృషత్ - ఓం హ్రౌం ఖగాయనమః
6 ఓం హ్రః వరసత్ - ఓం హ్రః పూష్ణేనమః
7 ఓం హ్రాం ఋతసత్ - ఓం హ్రాం హిరణ్యగర్భాయనమః
8 ఓం హ్రీం వ్యోమసత్ - ఓం హ్రీం మరీచయేనమః
9 ఓం హ్రూం అబ్జాగోజా - ఓం హ్రూం ఆదిత్యాయనమః
10 ఓం హ్రూం ఋతజా అద్రిజా -ఓం హ్రైం సవిత్రేనమః
11 ఓం హ్రౌం ఋతం - ఓం హ్రౌం అర్కాయనమః
12 ఓం హ్రః బృహత్ - ఓం హ్రః భాస్కరాయనమః
13 ఓం హ్రాం హ్రీం హగ్ం సశ్శుచిషద్వసురంతరిక్షసత్
ఓం హ్రాం హ్రీం మిత్రరవిభ్యాంనమః

14 ఓం హ్రూం హ్రైం హోతా వేదిషతిథి ర్దురోణసత్ - ఓం హ్రూం హ్రైం సూర్యభానుభ్యాం నమః

15 ఓం హ్రాం హ్రః నృషద్వరసత్ - ఓం హ్రాం హ్రః ఖగపూష భ్యాం నమః

16 ఓం హ్రాం హ్రీం ఋతసదోవ్యోమసత్ - ఓం హ్రాం హ్రీం హిర ణ్యగర్భ మరీచిభ్యాం నమః

17 ఓం హ్రూం హ్రైం అబ్జాగోజా ఋతజా అద్రిజా - ఓం హ్రూం హ్రైం ఆదిత్యసవితృభ్యాం నమః

18 ఓం హ్రాం హ్రః ఋతంబృహత్ - ఓం హ్రాం హ్రః అర్క భాస్కరా భ్యాం నమః

19. ఓం హ్రాం హ్రీం హ్రూం హ్రైం హగ్ం సస్సు చిషత్
వసుఃరంతరిక్షసత్
హోతా వేదిషత్
అతిథిర్దురోణసత్

ఓం హ్రాం హ్రీం హ్రూం హ్రైం మిత్రరవిసూర్యభానుభ్యోనమః

20. ఓం హ్రాం హ్రః హ్రాం హ్రీం నృషద్వరసదృతసదోవ్యోమసత్
ఓం హ్రాం హ్రః హ్రాం హ్రీం ఖగపూష హిరణ్య గర్భ
మరీచి భ్యోనమః

21. ఓం హ్రూం హ్రైం హ్రాం హ్రః అబ్జాగోజా ఋతజా అద్రిజా
ఋతం బృహత్
ఓం హ్రూం హ్రైం హ్రాం హ్రః ఆదిత్యసవిత్రర్క
భాస్కరే భ్యోనమః

22. ఓం హ్రాం హ్రీం హ్రూం హ్రై హ్రాం హ్రః హగ్ం సస్సు చిషద్వసు రంతరిక్ష సద్ధోతా వేదిష దతిథిర్దురోణ సదృషద్వరసదృత సదోవ్యోమ సదబ్జాగోజా ఋతజా అద్రిజా ఋతం బృహత్

ఓం హ్రాం హ్రీం హ్రూం హ్రైం హ్రౌం హ్రః మిత్రరవి సూర్యభాను
ఖగపూష హిరణ్యగర్భ మరీచ్యాదిత్య సవిత్రర్క భాస్కరేభ్యో నమః.

23, 24. (22 వలెనే)

25. ఓం సవిత్రే సూర్యనారాయణమః

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

[ఈ ఆరు బీజాక్షరములతోను ద్వాదశాదిత్యులను సంబోధించుచు ఒక్కొక్క జంటను ఉచ్ఛరించి ఒక్కొక్కమారు చొప్పున ఇరువది ఐదుసార్లు ఈ క్రింద చూపిన సూర్య నమస్కారము చేయవలెను. అనగా ఒక జంట ఒక మంత్రము. పది భంగిమలు ఒక నమస్కారము. మంత్రము పఠించేటప్పుడు మంత్రోచ్చారణ భంగిమలో చేతులు పైకి యెత్తి నిలువవలెను. ఆ మంత్రోచ్చారణ వెంటనే ఈ పది భంగిమల వ్యాయామ రూపకమైన నమస్కారము చేయవలెను. తరువాత రెండవ మంత్రము. ఈ రీతిని ఇరువది ఐదుసార్లు)

## * సాయంకాల ప్రార్థన *

హరిః ఓం హరిః ఓం హరిః ఓం

శ్లో. శాంతాకారం భుజగశయనం పద్మనాభం సురేశం
విశ్వాకారం గగనసదృశం మేఘవర్ణం శుభాంగం
లక్ష్మీకాంతం కమలనయనం యోగిహృద్ధ్యానగమ్యం
వందేవిష్ణుం భవభయహరం సర్వలోకైకనాథం.

తా. శాంతిరూపుడు, శేషశాయి, పద్మము నాభియందుగలవాడు, దేవతల కధిపతి, ప్రపంచమున కాధారమైనవాడు, ఆకాశమువలె (దేనిని అంటకుండ నంతటను) ఉన్నవాడు, మేఘమువంటి కాంతిగలవాడు, చక్కని శరీరము కలవాడు, యోగుల హృదయమందు ధ్యానముచేత తెలియదగినవాడు, సంసారభీతిని నశింపజేయువాడు, సకల లోకాధిపతియువగు విష్ణువి స్తుతింతును. నమస్కరింతును.

శ్లో. శరదిందు వికాస మందహాసామ్
స్ఫురదిందీవర లోచనాభిరామామ్
అరవిందసమాన సుందరాస్యామ్
అరవిందాసన సుందరీముపాసే.

తా. శరత్కాల చంద్రునివంటి చిరునవ్వుగలట్టి, వికసించుచున్న నల్లకల్వ రేకువంటి సొగసయిన కన్నులుకలట్టి, పద్మములతో సాటియయిన ముఖముగలట్టి, పద్మముమీద కూర్చున్న బ్రహ్మకు భార్యయగునట్టి, సరస్వతీదేవిని ప్రార్థించుచున్నాను. లేక ధ్యానించుచున్నాను,

శ్లో. సముద్రవసనే దేవి భూమాయాం పర్వతమూర్ధని
విష్ణుపత్ని నమస్తుభ్యం పాదస్పర్శం క్షమస్వమే.

తా. సముద్రమును వస్త్రముగా ధరించినట్టి, పర్వతములు శిరస్సుగా కలట్టి, విష్ణువునకు భార్యయగునట్టి ఓ భూదేవి! భూమియందు నా పాదమును మోపుటను క్షమింపుము.

శ్లో. అన్నపూర్ణే సదాపూర్ణే శంకరప్రాణవల్లభే
జ్ఞానవైరాగ్యసిద్ధ్యర్థం భిక్షాం దేహిచ పార్వతి.

తా. ఎల్లప్పుడును కొఱతలేకుండ నుండుదానా! యీశ్వరునకు ప్రాణప్రియురాలా! ఓయన్నపూర్ణాదేవి! పర్వతరాజు కూతురా! జ్ఞానము, వైరాగ్యము కలుగుటకు మాకు భిక్ష పెట్టుము. (అనగా నీవు మాకిచ్చిన యీభోజనము జ్ఞానమును, వైరాగ్యమును కలిగించునాకయని తాత్పర్యము.

శ్లో. పద్మప్రియే పద్మినిపద్మహస్తే
పద్మాలయే పద్మదళాయతాక్షి
విశ్వప్రియే విష్ణుమనోనుకూలే
త్వత్పాదపద్మం మయిసన్నిధత్స్వ.

తా. పద్మమునందు ప్రీతికలదానా! పద్మమును ధరించుదానా పద్మమువంటి చేతులు కలదానా! పద్మదళమువంటి కనులు కలదానా

ప్రపంచమునందు ప్రీతికలదానా! విష్ణువు మనసు నెఱిగి సంచరించు దానా! నీపాదపద్మములను నాలోచలనుంచుము. కనికరించుము.

శ్లో. విష్ణుర్వాత్రిపురాంతకో భవతు వా బ్రహ్మా సురేంద్రోథవా
భానుర్వా శశలక్షణోథ భగవాన్ బుద్ధోథ సిద్ధోథవా
రాగద్వేషవిషార్తి మోహరహితః సత్త్వానుకంపోద్యతో
యస్సర్వైస్సహ సంస్కృతో గుణగణైస్తస్మై నమస్సర్వదా.

తా॥ విష్ణువైనను గానిమ్ము, శంకరుడైనను గానిమ్ము, బ్రహ్మయో, దేవేంద్రుడో లేక సూర్యుడో, చంద్రుడో కాని భగవంతుడయిన బుద్ధుడు కాని లేక ఏసిద్ధుడైయినను కానిమ్ము (ఎవడైతే నేమి?) ఆకదాని యందు, ఆశ, ద్వేషము, అసూయ లేక దేనిని హింసింపక, అజ్ఞానము లేకున్న వాడు, జంతువులందు ప్రేమగలవాడు, అన్ని విధములయిన సద్గుణము లతో గూడియున్నవాడు నయి, యెవ్వడున్నాడో వానికి నమస్కారము ఎల్లకాలమందు గలుగుచున్నది. లేక ప్రవర్తించు గాక.

శ్లో. గురుర్బ్రహ్మా గురుర్విష్ణుర్గురుర్దేవో మహేశ్వరః
గురుస్సాక్షాత్ పరబ్రహ్మ తస్మై శ్రీగురవే నమః.

శ్లో॥ నత్వహం కామయే రాజ్యం న స్వర్గం నాపునర్భవమ్
కామయే దుఃఖతప్తానాం ప్రాణినామార్తినాశనమ్॥

శ్లో॥ కరచరణకృతం వాక్కాయజం కర్మజంవా
శ్రవణనయనజంవా మానసంవాపరాధమ్
విహితమ విహితంవా సర్వమేతత్ క్షమస్వ
జయజయకరుణాబ్ధే శ్రీమహాదేవశమ్భో॥

రఘుపతి రాఘవ రాజారామ్ పతితపావన సీతారామ్
సుందరమాధవ మేఘశ్యామ్ గంగాతులసీ సాలగ్రామ్ ॥రఘు॥

చండకిరణ కులమణ్డనరామ్ శుద్ధబ్రహ్మ పరాత్పరరామ్ ॥రఘు॥
భద్రగిరీశా సీతారామ్ భక్తవత్సలా సీతారాం ॥రఘు॥
అహింసా సత్యమస్తేయం బ్రహ్మచర్య మసఙ్గ్రహః
శరీరశ్రమ అస్వాదో సర్వత్ర భయవర్జనః
సర్వధర్మ సమానత్వే స్వదేశీ స్పర్శభావనా
హీయేకాదశ సేవావే నమ్రత్వే వ్రతనిశ్చయే.

శ్లో॥ విపదోనైవ విపదః సంపదోనైవ సంపదః
విపద్విస్మరణం విష్ణోస్సంపన్నారాయణస్మృతిః ॥

శ్లో॥ కాయేనవాచా మనసేంద్రియైర్వా
బుద్ధ్యాత్మనావా ప్రకృతేస్స్వభావాత్
కరోమియద్యత్ సకలం పరస్మై
నారాయణాయేతి సమర్పయామి ॥

శ్లో॥ స్వస్తి ప్రజాభ్యః పరిపాలయన్తాం
న్యాయేనమార్గేణ మహీంమహీశాః
గోబ్రాహ్మణేభ్యః శుభమస్తు నిత్యం
లోకాస్సమస్తాస్సుఖినోభవన్తు ॥

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

## * గీ తా ధ్య య న ము *

అర్జున ఉవాచ :—

శ్లో॥ స్థితప్రజ్ఞస్య కాభాషాసమాధిస్థస్య కేశవ
స్థితధీః కిం ప్రభాషేత కి మాసీత వ్రజేతకిమ్ ॥

తా॥ అర్జునుడు చెప్పెను:— ఓ కేశవా! స్థితప్రజ్ఞాన కనగా సమాధిస్థుని చిహ్నములేవి? స్థితప్రజ్ఞు డెట్లు మాట్లాడును, కూర్చుండును, మఱియు నడచును?

శ్రీభగవానువాచ ;—

శ్లో॥ ప్రజహాతి యదా కామాన్ సర్వాన్ పార్థ! మనోగతాన్
ఆత్మన్యేవాత్మనా తుష్టః స్థితప్రజ్ఞస్తదోచ్యతే ॥

తా. శ్రీ భగవానుడు చెప్పెను:- ఓ పార్థా! యెప్పుడు మనుష్యుడు మనస్సునందు దళయెత్తు సమస్త కామనల త్యజించుచున్నాడో మఱియు నాత్మ ద్వారముననే యాత్మయందు సంతుష్టుడయి యుండుచున్నాడో అప్పుడు స్థితప్రజ్ఞుడని చెప్పబడుచున్నాడు.

శ్లో॥ దుఃఖేష్వనుద్విగ్నమనాస్సుఖేషు విగతస్పృహః
వీతరాగభయక్రోధః స్థితధీర్మునిరుచ్యతే ॥

తా. దుఃఖముచే నెవడు దుఃఖితుడు గాడో, సుఖేచ్ఛను గలిగి యుండడో మఱియు నెవడు రాగము భయము మఱియు క్రోధమునుండి రహితుడగునో అతడు స్థిరబుద్ధియగు మునియని చెప్పబడుచున్నాడు.

శ్లో॥ యస్సర్వత్రానభిస్నేహస్తత్తత్ప్రాప్య శుభాశుభమ్
నాభినందతి న ద్వేష్టి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా ॥

తా. సర్వత్ర రాగరహితుండయి యేపురుషుడు శుభమును లేక యశుభమును పొంది హర్షింపడో, శోకింపడో వాని బుద్ధి స్థిరమయినది.

శ్లో॥ యదా సంహరతే చాయం కూర్మోంగానీవ సర్వశః
ఇంద్రియాణీంద్రియార్థేభ్యః తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా ॥

తా. తాబేలు శరీరమునందు నన్నివైపులనుండి యంగములు ముడుచుకొనుచున్నదో అట్లెప్పుడీ పురుషు డింద్రియములను వాని విషయములనుండి యుపసంహరించుకొనుచున్నాడో అపుడు వానిబుద్ధి స్థిరముయినదని చెప్పబడుచున్నది.

విషయావినివర్తంతే నిరాహారస్య దేహినః
రసవర్జం రసోప్యస్య పరందృష్ట్వానివర్తతే.

తా. దేహధారి నిరాహారిగా నున్నప్పుడు వానివిషయములు క్షీణించుచున్నవి. కాని రసము పోలేదు. ఆ రస మీశ్వర సాక్షాత్కార మగుటవలన శమించును.

యతతోహ్యాపి కౌంతేయ పురుషస్య విపశ్చితః
ఇంద్రియాణి ప్రమాథీని హరంతి ప్రసభం మనః.

తా॥ ఓ కౌంతేయా! చతురపురుషుడు ప్రయత్నము చేయుచున్నప్పటికి నింద్రియములు వానిమనస్సుగూడ బలాత్కారముగా హరించునట్టి ప్రమథనశీలములయి యున్నవి.

తాని సర్వాణి సంయమ్యయుక్త ఆసీత మత్పరః
వశేహి యస్యేంద్రియాణి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా.

తా॥ ఈ ఇంద్రియములు వశమునందుంచుకొని యోగి నాయందు దన్మయుడయి యుండవలయును. ఎందుకనగా దన ఇంద్రియము లెవనికి వశపడినవో వాని బుద్ధి స్థిరమయినది.

ధ్యాయతో విషయాన్ పుంస సంగస్తేషూపజాయతే
సంగాత్సం జాయతే కామః కామాత్క్రోధోభిజాయతే.

తా॥ విషయముల జింతించు పురుషునకు వానియం దాసక్తి పుట్టుచున్నది. మఱియు నాసక్తిలోనుండి కామన కలుగుచున్నది. కామననుండి క్రోధము పుట్టుచున్నది.

క్రోధాద్భవతి సమ్మోహ సమ్మోహాత్స్మృతి విభ్రమః
స్మృతిభ్రంశా ద్బుద్ధి నాశో బుద్ధి నాశా త్ప్రణశ్యతి.

తా॥ క్రోధమునుండి మూఢత్వ ముదయించుచున్నది, మూఢత్వమునుండి స్మృతి భ్రాంతియయి పోవుచున్నది. స్మృతి భ్రాంతమగుటనుండి జ్ఞాన

నాశన మగుచున్నది. మఱియును చెప్పఁగా జ్ఞానము నశించినచో వాఁడు మృత ప్రాయుఁడు.

శ్లో॥ రాగద్వేష వియుక్తైస్తు విషయానింద్రియైశ్చరన్
ఆత్మవశ్యైర్విధేయాత్మా ప్రసాద మధిగచ్ఛతి.

తా॥ కాని యెవని మనస్సు తన యధీనమందున్నదో మఱియు నెవని యింద్రియములు రాగద్వేష రహితములై వాని వశమున నుండుచున్నవో ఆమనుష్యుఁ డింద్రియ వ్యాపారములను చేయుచున్నను చిత్తప్రసన్నతను బడయుచున్నాఁడు.

శ్లో॥ ప్రసాదే సర్వదుఃఖానాం। హానిరస్యోపజాయతే
ప్రసన్నచేతసో హ్యాసు। బుద్ధిః పర్యవతిష్ఠతే.

తా॥ చిత్తప్రసన్నతచే వీని సకల దుఃఖములు తొలగిపోవుచున్నవి. మఱి ప్రసన్నతను పొందిన బుద్ధి తక్షణమే స్థిరమగుచున్నది.

శ్లో॥ నాస్తి బుద్ధిరయుక్తస్య నచాయుక్తస్య భావనా
నచాభావయతశ్శాంతి రశాంతస్య కుతస్సుఖమ్.

తా॥ ఎవనికి సమత్వము లేదో వానికి వివేకము లేదు. వానికి భక్తి లేదు. మఱియు నెవనికి భక్తి లేదో వానికి శాంతి లేదు. ఎచట శాంతి లేదో అచట సుఖ మెట్లు కలుగును?

శ్లో॥ ఇంద్రియాణాం హి చరతాం యన్మనోను విధీయతే
తదస్య హరతి ప్రజ్ఞాం వాయుర్నావ మివాంభసి.

తా॥ విషయములందు దారితప్పి సంచరించు నింద్రియములవెంట నెవనిమనస్సు పరుగెత్తుచున్నదో వానిమనస్సు, వాయువు నావను నీటియందీడ్చుకొనిపోవునో అట్లు వానిబుద్ధి నిచ్చవచ్చినచోటికి గుంజుకొని పోవుచున్నది.

శ్లో॥ తస్మాద్యస్య మహాబాహో నిగృహీతాని సర్వశః
ఇంద్రియాణీంద్రియార్థేభ్యః తస్య ప్రజ్ఞాప్రతిష్ఠితా.

తా॥ కావున్నో యోమహాబాహూ! ఎవని ఇంద్రియములు నలువైపుల నున్న విషయములనుండి వెడలి తన యధీనమునకు వచ్చివేయునో వానిబుద్ధి స్థిరమయి పోవుచున్నది-

శ్లో॥ యానిశాసర్వభూతానాం తస్యాం జాగర్తి సంయమీ
యస్యాం జాగ్రతి భూతాని సానిశా పశ్యతో మునేః.

తా॥ ఎప్పుడు సర్వప్రాణులు నిద్రించుచుండునో అపుడు సంయమి మేల్కొంచుచుండును- ఎపుడు జనులు మేల్కొంచుచుందురో అపుడు జ్ఞానవంతుడగు ముని నిద్రించుచున్నాడు—

ఆపూర్యమాణ మచల ప్రతిష్ఠం
సముద్రమాపః ప్రవిశంతి యద్వత్
తద్వత్కామాయం ప్రవిశంతి సర్వే
సశాంతి మాప్నోతి నకామకామీ.

తా॥ నదుల ప్రవేశముచే నిండుచున్నప్పటికి కూడ సముద్ర మెట్లు చలముగ నుండుచున్నదో ఆట్లే మనుష్యుని విషయమున సాంసారిక భోగములు శమించి పోవుచున్నవో వాడే శాంతిని బడయుచున్నాడు- కామనలు గలవాడు (బడయుట) లేదు-

విహాయకామాన్ యస్సర్వాన్
పుమాంశ్చరతి నిస్పృహః
నిర్మమో నిరహంకారః
సశాంతి మధిగచ్ఛతి.

తా॥ సమస్త కామనల విడచి యేపురుషుడిచ్ఛ, మమత, మఱియు నహంకార రహితుడయి సంచరించునో వాడే శాంతిని బడయును-

ఏషాబ్రాహ్మీస్థితిః పార్థ నైనాం ప్రాప్యవిముహ్యతి
స్థిత్వాస్యామంతకాలేపి బ్రహ్మనిర్వాణ మృచ్ఛతి .

తా॥ ఓపార్థా! ఈశ్వరుని గుర్తించు వానిస్థితి ఇట్టిది. దానిని బడసిన పిదప మఱల వాడు మోహమునకు వశుడు గాడు. మఱియు మరణకాలమునందును నిట్టిదే స్థితి నిలిచియున్నచో వతడు బ్రహ్మ నిర్వాణమును బడయుచున్నాడు.

## — కీర్తనలు —

(O)

పల్లవి॥ నీనామమే యెంతో రుచిరా నిఖిల సజ్జన గోచరా
మానసమున కింపు నింపు మహితవీణా రవమురా ॥నీ॥

1. మధురమైన నీనామమే మానులకు జపమురా
అధమాధముల నుద్ధరింప నంచిత సాధనమురా ॥నీ॥

2. అఖిలపాపములను బాప నదియె సిద్ధౌషధమురా
సుఖము నాత్మబలము నిచ్చు సురుచిరామృతరసమురా ॥నీ॥

3. భవ్యధర్మరంగస్థిత భక్తవీరకోటికి
నవ్యయోత్సాహమ్ము గొల్పు దివ్యభేరిరవమురా ॥నీ॥

పల్లవి॥ కొనియాడ దరమా నిన్ను
గుణలయ వినుత ॥కొని॥

1. దినకర శశితార గణముల వెలిగించు
ఘనతేజమును జూపు కాంతిమంతుడవీవు ॥కొని॥

2. బొంగరమ్ములమాడ్కి భూమ్యాది గ్రహముల
నింగి గిరగిర ద్రిప్పు నేర్పుకాడవు నీవు ॥కొని॥

3 ఒండొంటి ఢీకొనకుండ లోకముల ను
ద్దండరీతిని నడపు చండశాసనుడీవు ॥కొని॥

4. స్తుత్యమౌ నీసృష్టి సుందరమ్ముగ జేసి
యత్యద్భుతము జూపు నైంద్రజాలుడవీవు ॥కొని॥

8. అరిభీకర హలిసోదర - పరిపూర్ణ సుఖాబ్ధే
వర కాంతక నరపాలక - పరిపాలిత జలధే
హరిసేవక శివనారా - యణ తీర్థపరాత్మన్
మధుసూదన మధుసూదన - హరమామక దురితం

♦♦♦ ఖురాను షరీఫ్ ♦♦♦

సుబ్హానక అల్లాహుమ్మ వబి-హమ్దు-ఇక వతబారక్- అస్మ్-ఉ-కవత ఆలాజద్ద్-ఉ-కవలా ఇలాహ ఘైరు-ఉ-క అ ఊజుబిల్లాహిమిన్- అష్షైతా న్ ఇర్-రజీమ్

తా. దేవా! నీవు మహిమవంతుడవగుదువు గాక! నీవు స్తోత్రార్హుడవు. నీనామము ధన్యము. నీప్రభావము నిరతిశయము. నీవుతప్ప సేవింప తగిన వాడితరుడు లేడు. సైతానునుండి నన్ను రక్షింతువని నిన్ను శరణు జొచ్చియున్నాను.

"బిస్మిల్లా-ఇర్ రహ్మాన్- ఇర్ రహీం అల్-హందు ఉలిల్లా ఇర బ్బిల్ ఆలమిన్-అర్-రహ్మాన్ ఇర్ రహీం మాలిక్ ఇ-యౌం-ఇద్-దిన్ ఇయ్యాకనబుదు వ ఇయ్యాకనస్త" ఇన్ ఇహ్దినస్-షిరాత్-అల్- ముస్త ఖిం, షిరాత్-అల్లజినఅన్ "అనమ్త అలైహింగైర్- ఇల్ మఘ్-దూబ్ ఇ అలైహిం, వలద్దా అల్లిన్."

తా. దయాదాక్షిణ్యమూర్తియగు దేవుని పేర.

జగన్నాథా! దయా దాక్షిణ్యమూర్తీ! రక్షణది నాధినాథా! నీకు నతులు. మేము నిన్నే యారాధింతుము. నీకే మొరలిడెదము. మమ్ము ఋజుమార్గగాములఁ జేయుము. నీ కోపమునకు పాత్రులు కానివారును నీ వనుగ్రహించినవారును పోవు మార్గముననే మాకు దారిజూపుము.

ఋతం బృహత్ : అల్లా- ఉ అక్బర్
దేవుడు గొప్పవాడు

# పద్యములు

సీ. కోదమ కోయిల కంఠ కోమల స్వనమున
ఆలింపనిమ్మ నీ అమృతగీతి
ప్రకృతి శోభిల చేయు పాదపంబుల యందు
పరికింపనిమ్మ నీ పరమ శాంతి
సుమనోజ్ఞమగుచు తా సుప్రసూనములందు
వాసింపనిమ్మ అవ్యాజప్రేమ
మదికింపు నింపెడు మధుర ఫలంబుల
స్వాదింపనిమ్మ నీ స్వాంతమెల్ల

తే. గీ. అణువు మొదలు బ్రహ్మాండంబు నంతదనుక
నధివసించి వెలుంగు అనంతమూర్తి
నిశ్చలసమాధి స్థితిలోన నీ అమూల్య
దయాసుధాంభోధి మున్గివన్ దనియనిమ్మ.

ఏ ప్రభు నాజ్ఞచే వెలుగునిచ్చు ననారత మబ్జబాంధవుండే
ప్రభునాజ్ఞచే నెపుడు నెల్లెడ వీచెడి నా సమీరణుండే
ప్రభునాజ్ఞచే జరములెల్ల ధరించునో జీవనంబు లే
నా ప్రభు నా ప్రభున్నిను మదాత్మ దలంతు ననంతు సత్ప్రభూ

ఎవ్వనిచే జనించు జగ మెవ్వని లోపలనుండు లీనమై
ఎవ్వని యందుడిందు పరమేశ్వరు డెవ్వడు మూలకారణం
బెవ్వడ నాది మధ్యలయు డెవ్వడు సర్వము తానెయైన
వాడెవ్వడు వాని నాత్మభవు నీశ్వరు నే శరణంబు వేడెదన్.

ఒక సూర్యుండు సమస్త జీవులకు దానొక్కొక్కడై తో
చుపోలిక నేదేవుడు సర్వకాలము మహాలీలన్ నిజోత్పన్న

జన్య కదంబంబుల హృత్సరోజహాముల(?)న్ నానావిధానూనరూపకుడై
యొప్పుచునుండునట్టి విభు నే ప్రార్థింతు నశ్రాంతమున్.
నీపాద కమల సేవయు నీపాదార్చకులతోడి నెయ్యంబును
నితాంతాపార భూతదయయును తాపసమందార నాకు దయచేయగదే.

శా. అల్లాయంచు మహమ్మదీయులు, జహోవాయంచు తత్ క్రైస్తవుల్
ఫుల్లాబ్జాక్షుడటంచు వైష్ణవులు, శంభోయంచు శైవుల్, సదా
సోల్లాసంబున గొల్వ నెల్లెడల సంపూర్ణాయు రారోగ్య సం
పల్లాభంబులొసంగి ప్రోచు పరమాత్మా, నిన్ను సేవించెదన్

ఉ ప సం హా రం:— ఈ పై సూచనలన్నియు 1947 ఆగస్టు 15 వ తేదీ భారత స్వాతంత్ర్య దినోత్సవమునకు ముందు వ్రాయబడినది, ముద్రణ కిచ్చునప్పటికి స్వాతంత్ర్య అరుణోదయం కావడం, మన ప్రభుత్వ భవనములనుండి బ్రిటిషు పతాకం దిగడం, భారతజాతీయ త్రివర్ణ కేతనం ఎక్కి రెపరెపలాడుచు అలరారుచుండుట జరిగినది. ఈ హెచ్చరికలు, కార్యక్రమాలు, కట్టుదిట్టాలు అన్నియు స్వరాజ్య సంపాదన కేగదా. అది కాస్త అయిపోయింది. ఇంకా ఇక ఎందుకు అని కొందరనుకొనవచ్చు. అంటున్నారు కూడాను. మరికొందరు ఇంక కాంగ్రెసే అక్కర్లేదు. కాంగ్రెసే ప్రభుత్వమైపోయింది కాబట్టి అనుచున్నారు. కాని మానవకోటి ఉన్నంత కాలం ప్రజాజీవితమునకు ప్రభుత్వం అవసరమనియు, ప్రభుత్వాన్ని ఏర్పాటు చేయుటకు, ప్రభుత్వం సరిగా నడచునట్లు చూచుకొనుటకు ప్రజాసంస్థలు అవసరమనియూ ఈ గ్రంధములో ఎక్కడికక్కడ నిరూపించబడినది కాంగ్రెసు ప్రభుత్వమున్నను, మరి ఏప్రభుత్వమున్నను మానవకోటియున్నంత కాలమునకు వర్తించెడు సూచనలు చేయబడిన ఈ గ్రంధము ఎప్పటికిని కాలము తప్పిన గ్రంధమవదు. కావున ఈ గ్రంధముద్రణ విరమించకుండాను, రాజకీయముగా వచ్చిన ఈ ప్రభుత్వ మార్పువలన ఇందు ఏవిధమైన మార్పులు చేయవక్కర లేకుండగ నేయథాతధముగా ముద్రణకీయబడినది.

కన్న కష్టమైన ఉద్యమము. ఈవిషయములోకూడ అభివృద్ధి నిరోధకమును తొలగించివేసినారు కాదా. ఇక తమతమరూపురేఖలను దిద్దుకొనుటకు దేశీయుల చేతిలో విడిచిపెట్టియ్యకూడదా యనికొందరును (అనగా దేశములోని కాంగ్రెసేతర పార్టీలవారు) మరికొందరు (అనగా కాంగ్రెస్ పేరున చెలామణీయగుచున్న కొందరు ధీప్రులు) ఇప్పటికే కాంగ్రెస్ చాల బాధలకోర్చి, చాల శ్రమలుపడి, అనేక త్యాగములుచేసి ఈరాజకీయ స్వాతంత్ర్యమనే ఘనకార్యమును సాధించినది. ఇట్టి సమయములో సహజముగా పార్టీలవల్ల కలిగెడు క్లిష్ట కల్లోలిత పరిస్థితులలో మధనపడేదానికన్న కాంగ్రెస్‌ను రద్దుపరచుకుని అసంఖ్యాకమయిన సమస్యలతో కూడుకున్న ఖండమంతటి దేశమునకు రాజకీయ స్వాతంత్ర్యమును తెచ్చిన ఈగౌరవమును దక్కించుకొనుటయే ఉత్తమమనుచున్నారు. ఇది భీరుత్వము కాదా! బాధ్యతనుండి తప్పుకొని తిరుగుట కాదా? ఈ ఉభయవర్గములు కూడ నిద్రనుండి మేల్కొల్పబడినప్పుడు తృళ్ళిపడిలేచి ఖంగారుపడుచు చిందులు త్రొక్కుచున్న బాపతు మాత్రమే!

ప్రస్తుతము దేశమును ఈరెండురకముల శత్రువులు ఆవహించియున్నారు. కాంగ్రెస్ పేరును ఉపయోగించుకొనుచు ఉద్యమములో పాల్గొనకుండా, స్థానిక సంస్థల పెత్తందార్లుగా యుండుచున్నటువంటి భీరువులు రెండవవారు. తమతమ ప్రచారప్రభావమువల్ల కాంగ్రెస్ రద్దుపరచుకున్న విదేశ సహాయములతో సులభముగ దేశమును చేపట్టవచ్చునని మొదటివారు కాంగ్రెసే ప్రభుత్వమైపోయినదికదా, మనము యథాతథముగా పెత్తందార్లుగా యుండిపోవచ్చును. కాంగ్రెస్‌ను రద్దుపరచుటవలన ఇతరులెవరూ కాంగ్రెస్ ద్వారా ప్రజాసేవజేసి వారి స్థానములకు రాకుండ భద్రముగా నుండగలమనియు, ఇతరపార్టీల ద్వారా ప్రజాసేవజేసి ఈస్థానములకు ఇతరులు రాప్రయత్నించినను కాంగ్రెసే ప్రభుత్వము కనుక వీని అతి సులువుగానే త్రొక్కివేయవచ్చుననియును రెండవవారితలంపు, ఈరెండవవారి మొదటివారితలంపు యెంత సంకుచితమో వీరిరెండవవారిదికూడ అంత పిచ్చి

ఊహా, చిత్తమువిూద ఈరెండువర్గముల వారున్నూ దేశప్రజల సౌఖ్యమును గడకు హానికారులు.

ప్రజాసేవ పేరున దేశప్రజల మధ్య తచ్చుచున్న వారు మూడు తెగలు వీరిలో పైచెప్పబడిన రెండు తెగల వారు పోగా మిగిలిన వారు జాతి, కుల, మతవిచక్షణ లేకుండ భారత ప్రజానీకమునకు సౌఖ్య సంపదలను కూర్చుటయొక్కటే తమ పరమావధియని తనమనస్సులో ప్రతిజ్ఞపూని ఆరుతుగాను ఏకైక భారత జాతీయ సంస్థయైన కాంగ్రెసుద్వారా సర్వకాల సర్వావస్థలయందును అకుంఠిత సేవచేయుచున్న కాంగ్రెస్ వాదులు ఎవరివ్యాపారము వారు చేసుకొనుచున్నను యిట్టి కాంగ్రెస్ వాదులకు అన్నివిధముల సహాయము చేయుచున్న కాంగ్రెసు అభిమానులున్ను. దేశ పరిస్థితులనుగూర్చి ప్రత్యక్షముగా వీరు వహించినభాధ్యతే కాంగ్రెస్‌వహించిన బాధ్యత కాబట్టి, దీని కష్టనిష్ఠురములు వీరికి ప్రత్యక్షానుభవము. వీరే యీయుగపు స్థితప్రజ్ఞులు. స్నేహితులారా! మీకు మత్తు పెట్టి మిమ్మల్ని పరాయివారు యీవిధముగా మీభోగ భాగ్యాలను, మీసిరి సంపదలను దోచుకొనుచున్నారు. మేల్కొంచండి! ఈవిధముగా పునర్నిర్మించుకోండియని వీరు మేల్కొలిపినారు. ఇప్పుడిప్పుడే ప్రజలు మేల్కొన్నారు ఇట్లులేచి కళ్ళు నలుపుకొనుచున్నవారికి తగు యేర్పాటులు చేయవలసిన బాధ్యత వీరిపైయున్నది. ఇట్టితరిలో స్వార్థపరుల, కుతంత్రుల పరుష వాక్యములకు, బెదరింపులకు చీకాకుపడి తప్పుకొనుట బాధ్యతారహితమగును. ప్రజలను నట్టేట వదలిపెట్టినవారగుదురు. పైనవర్ణ ఆస్తికి పెత్తనం వహించిన ట్రస్టీలు ఆయాస్తిని కాజేస్తున్నారని దాని బాగోగులు తెలిసినవారు పోరాడి వారిని తొలగించినప్పుడు దానిబాగోగులు తెలిసి పోరాడిదానిని రక్షించినవారు ఆయాస్తిని చక్కబెట్టి ఇచ్చే బాధ్యతను వహించకుండా దానిసంగతి తెలియని మరియొకరి దయాదాక్షిణ్యములకు విడిచిపుచ్చినట్లేయగును. 40కోట్ల ప్రజలతో వివిధ జాతి, మత, కుల శక్తులతో కలిగి పెంపుడు కారణముగా మానవజాతి అభ్యున్నతికి ఏకైక మార్గమై

అతిరథ, మహారథుల స్థిరచిత్తముతో ఒడుదుడుకులు పడకుండ మహత్తరముగ సాగించుచున్న పోరాటమునకింకా ఆవశ్యకమని దేశములోని ఇతరజాతీయ పార్టీలు వీరే కమ్యూనిస్టుల మేలెక్కువలు ప్రపంచ దేశములలో ముందుకేచిన వారు కాబట్టి వీరే ఎక్కువ బాధ్యత వహించవలసినదిపోయి ప్రజలలో చీలి కలుగచేసేలాగున ఇట్లు బాధ్యతారహితముగా చిందులుత్రొక్కుచూ ప్రవర్తించుట మంచిదికాదు. కాని ఇదిమనకు క్రొత్తకాదు. కృష్ణుడు, ప్రహ్లాదుడు, త్యాగరాజు పోతనవంటి మహాపురుషులను వారిమహిమలను ఎప్పటికప్పుడు చూచుచుండినను కూడ ఆ కాలప్రవాహ వారిని మర్నాడు విస్మరించి మరల స్వార్థపరులముగనే యుండుచుండెడివారు. ఈఅజ్ఞానకర్మ యనవలెనో లేక స్వలాభకర్మయనవలెనో గాని ఇట్టిచర్యలవలన మనము చెప్పుచుండెడు సిద్ధాంతములకే అమలుజరుగకుండగ అడ్డుతగులుచున్నవారమగుచున్నామని మనమిప్పుడు గుర్తించుకోవలసియున్నది. లేకపోయినచో ఇందువల్ల మానవసౌభాగ్యమునకు కాంగ్రెసు చేయుచున్న ఏర్పాటులకు ఆలస్యము చేయుటయే కాక హెచ్చుజననష్టం అగుటకారణముకూడ అగుచున్నది. కావున ఇప్పటికైనను ఈపార్టీలవారు ఎంతతొందరగా కాంగ్రెసునకు అండగా చేరి దానిలో లీనమైపోయిన అంతశ్రేయస్సు.

ఇంక గ్రామములలోని ఏకొద్దో, గొప్పో చదువుకొని నిరుద్యోగులుగాయుంటున్న వేలు, లక్షలసంఖ్యలోగల యువకులగూర్చి ఒక్కమాట చెప్పవలసియున్నది. వీరు గ్రామమునకు సామాన్యముగా పది, పదిహేను మందిదైనను వున్నారు. వీరిలోకొందరు ఏచిన్న వుద్యోగము జేయుచున్నను, లేక తాతలుగడించినభూమిలో అవిభక్తమైనరాబోవు కాని, విడగొట్టుకొన్న యెడల వచ్చినగాని ఏరెండుమూడుఎకరములభూమిగురించియో వ్యవసాయము చేయుచున్నాను అనిపించుకొనుచున్న వ్యవసాయదారుడుగాయున్నను. మొత్తముమీద వీరందరూ మాత్రము పేకాటకాంపెనీని అతిశ్రద్ధతో అహర్నిశలు నిర్వహిస్తూ పోషిస్తారు. అంతేగాని మనము ఈవిధముగా కాలయాపన చేసివేస్తూయుంటే చివరకు మనకువచ్చేది రెండుమూడుఎకర

ము. వారితో పిల్లలను ఎట్లుపోషించుకొనేది, వారికి ఏమిజబ్బుచేస్తేది అని ఆలోచించవలదా? ఆయాలోచన స్ఫురించునుగాని ఆపేకాటలో కూర్చొనగానే ఆయాలోచనే ఎగిరిపోతుంది ఈఆలోచనే కాదు, ఏఆలోచనా రానివ్వదు. చివరకుదగ్గర డబ్బుఅయిపోతే ఆటకుమరల ఎక్కడనుంచి తెచ్చేదియనే అందులోని ముఖ్యసమస్యనైనా ఆలోచించుకొనుటనైనా స్ఫురణనివ్వదు. ఆటకు ముక్కలుకలిపే సమయములోకూడా సొనగను. మానవుడు ఏవృత్తి చేయుచున్నను, వుద్యోగము చేయుచున్నను, వ్యవసాయము చేయుచున్ననుసరే అదేకాలమందు తనకుగల ఏలోటుపాట్లగురించియో. ఇంటివిషయములగురించియో ఆలోచించుకొనుటకు వీలుండును. అందుకుగాను ఏర్పాటులుచేసుకొనుటకుకూడ వీలగును. కాని, తల్లిపోయినదంటే ఈదారినేకదా తీసుకువెళ్ళారుఅనిపించేఈ కాలాపహరణ మహామారి ప్రవేశనలోనుండగా మట్టుకు ఏఇతర ఏర్పాటులు చేసుకొనుటకు కానీగదా ఏదీఆలోచనచేయుటకుకూడ తావుండదు. పులి-మేక ఆట, కేరమ్సుబోర్డు ఆటమున్నగునవికూడ ఇట్టివియే. కాబట్టి యువకులు గ్రామమునుండి ఇట్టిమహామారిని తొలగించి, ఇందులకు ఉపయోగించుచుండిన కాలమును అగ్రామాభివృద్ధికిగాను కమిటీలుగా యేర్పడిపనిచేయుటకు ఉపయోగించిన కల్యాణదాయకమగును. ఆనాటినుండియే మీరందరు సిరిసంపదలతో, ఆయురారోగ్యములతో అలరారుచు అభ్యున్నతి బడయుటకు ప్రారంభించును. నిరుద్యోగముపోయి ఉద్యోగములు లభించును, ఒకరిచ్చేది ఉద్యోగములు కావు. స్వకల్పిత, సర్వాధికార, సగౌరవఉద్యోగములు. చాలినంత ఆస్తిలేనివారికి గౌరవవేతనములపై గౌరవోద్యోగములు ఉన్నవారికి ప్రజాసేవచేసే భాగ్యమునకు అవకాశము. కావలసినవారలకు ఆస్తులు, ఇవన్నీనిజమేనా? గాలిలోని మేడలా? ఎవరిస్తారు? ఇవిఒకరిచ్చేవి కావు. స్థానికయువకులు కల్పించుకోగలరు. ఎట్లు? నేడే గ్రామపేకాటకంపెనీ ఎత్తివేసి దానిస్థానములో గ్రామకాంగ్రెసు కమిటీనిస్థాపించి తద్వారా ఎప్పుడు పరిస్థితులనుబట్టి అప్పుడు అవసరమయ్యే విషయ

మును చూచుటకు ఒక్కొక్క ఉపసంఘమును నియమించుచు యుండవలెను.

మొదట ఆ గ్రామములోని పశుసంపదను ఆగ్రామస్థులందరి ఆరోగ్యమునకు సరిపడునంతగా వృద్ధిచేయుటకును, ఆపశువుల మేతకు వలసినసౌకర్యములను చూచుటకు గాను ఒక ఉపసంఘమును నియమించవలెను. గ్రామము యొక్క పటము జనాభా లెక్కలు తయారుచేయుటకు ఒక సబ్ కమిటీ. ఈకమిటీవారు ప్రతిఇంటను ఎంతమందియున్నది. అందు మగవారు ఆడువాళ్ళు, కులము విద్యవృత్తులు ఏవృత్తులనవలంబించుచున్నవారు; ఎంతెంత, ఆస్తులు, నిరుద్యోగులు, ఎవరిపోషణలో ఎంతమందియున్నది, నెలవారీమిగులా? లోటా? ఎంత? వారికిఉపవృత్తులుగాగాని, ఆస్తులుగాగాని గల పశువులు, కోళ్ళు, మేకలు, పందులు, గుర్రములు; మొదలగువివరములు కాలములువారీగా ఒకపట్టీ తయారుచేయవలెను.

ఈపట్టీ సహాయముతో వారిఅనుమతితో యేకృషి,యేఆధారము లేకుండా యున్న వారందరిని ఒక మొత్తముగా తీసుకువెళ్ళి సాగుకనుకూలమైన ప్రదేశమున ఎక్కడైనను కొన్నివందల ఎకరముల భూమిదరఖాస్తుపై సేకరించి అక్కడ వారికి తావులేర్పాటుచేయవచ్చును. లేదా వీలైనట్లయిన ఉన్నయూరు లోనే వారినిపోషింపగల ప్రజోపయోగకరమైన గృహపరిశ్రమనుగాని భారీపరిశ్రమను గాని పెట్టించవచ్చును. ప్రథమమున కాంగ్రెసుకమిటీ ఏర్పాటుచేసినవెంటనే ఆ గ్రామములోని యువకులలో విద్యాధికుని ఆఫీసు (కార్యాలయము) కార్యదర్శిగా నియమించి అతనిపైయున్న బరువునుబట్టి 40 లగాయతు 60 రూపాయలవరకు వేతనముపై నియమించవలెను. వివిధ ఉపసంఘములు తెచ్చేరిపోర్టులను గ్రామ కార్యవర్గము ముందుపెట్టి సమన్వయించుకొనే శక్తివంతుడుగా ఇతడు తయారగును. ఇతనికిచ్చు వేతనము ఇతర ఖర్చులు ఆ గ్రామము వారే భరించవలెను. అవసరమునుబట్టి ఇంకను ఒకరిద్దరినికూడ ఉద్యోగులుగా నియమించవచ్చును. వీరే ఆ గ్రామములో

బ్రాహ్మణులనబడుదురు. ఈయావత్ కార్యక్రమమునకు సంపూర్ణముగ కావలసిన డబ్బు వసూలు బాధ్యత సంఘాధ్యక్షులు గ్రహించవలెను. గ్రామము లోని సామాన్యప్రజలయొద్దనుండికూడా న్యాయమైన మేరకు అధ్యక్షుని అనుమతిమీద గ్రామస్థానికంగు సబ్ కమిటీవారు వసూలు [illegible] మంచిది. ఈవిధముగా ఆ గ్రామములో పరిశుభ్రతపై పరిశ్రమలను స్థాపించుకొన వచ్చును. కోఆపరేటివ్ స్టోరు పెట్టుకొనవచ్చును. చివరకు గ్రామమును ఒక ప్రక్కనుండివిప్పి ఆరోగ్యపద్ధతులపై ఒకసుందరమైన పట్టణముగా ఉద్యానవనముగా నిర్మించుకోవచ్చును. ఆ గ్రామములోని కార్మికులయొక్క యోగక్షేమాలను చూచేందుకుగాను కర్షకులయొక్క యోగక్షేమాలను చూచేందుకుగాను ఒక్కొక్క ఉపసంఘమును నియమించవలెను. ఆ గ్రామకాంగ్రెసు ఆఫీసునను సరించియే ఒక గ్రంథాలయము ముఖ్యావసరం ఇందు రాజకీయ, వైజ్ఞానిక గ్రంథములను సేకరించి పెట్టవలెను. హిందీ పాఠశాల నడుపువారే ఈ గ్రంథాలయమునుకూడా నడుపు ఏర్పాటుచేసినట్లవచ్చే ఆదాయము అందరికి సరిపోవును. ఈ ఆదాయం తక్కువవచ్చుచున్న సంఘం భరించుకొనుచు, రు 60—0—0 దాటిన సంఘమునకు చేర్చుకొనవలెను.

ప్రతిరాత్రి 8 గంటలనుండి 10 గంటలవరకు రాత్రిపాఠశాలలు నడపవలెను. ఇట్టి ఏర్పాటులన్నియు ఒక్కొక్కటిగా చేసుకొన్నచో నిరుద్యోగులుగాయుండి కాలహరణమహామారి ఉపాసనచేయుచున్న అనిర్భాగ్యపు యువకులకు మోక్షమార్గమైన దేశ ఉపాసన భాగ్యముతో ఉద్యోగములు లభించి, సద్భాగ్యులగుటయే కాక ఆ గ్రామపునర్నిర్మాతలు గాను ఆ గ్రామ సౌభాగ్యదాతలు గాను పరిగణింపబడుదురు. కాగా ఈపూనికలో కక్షలు పెట్టుకొని పార్టీలనుకట్టుకొని గ్రామములోనిప్రజలను చీలికలు చేసి చీకాకుపరచకుండా గ్రామమును ఒకేతాటిపై నడుపుటకుగాను ముందడుగు వేసిన సేవకుని చూచి సంతోషపడి అతనికి సర్వవిధములా సహాయపడవల సిన బాధ్యత మనపైయున్నది. ఇంక ఈ ఏర్పాటులలోను ఎన్నికలకుపోటీ పడుట సమాజమునకు హెచ్చినవారికి వ్యతిరేకించక; కక్ష పెట్టుకొకుండగా

ఉన్నతభావముతో (sportsman spirit తో) కరస్పర్శచేసుకొని ఆక మిటీ ప్రణాళికలు ఆచరణలో పెట్టుటలో తానే ఆకమిటీగాభావించుకొని పూర్తిగా సహకరించి పాటుపడవలసిన ధర్మమైయున్నది. అంతియేగాని మరుచటిసంవత్సరపు ఎన్నికలవరకు ఆస్థానములను లభింపజేసుకొనుటకై దుష్ప్రచారము చేయుచు ఆప్రణాళికలకు అడ్డుతగులుచూ కూర్చొనుట ఆగ్రామస్థులను ఇబ్బందిపెట్టుటయేకాక తమ్ముతామే వంచనచేసుకొనుట కూడయగును. కాబట్టి ఇట్టిజాగురూకతకలిగి, ఇట్టి ఉన్నతఆశయములతో నేడే ఈయువకులు పూనుకొందురుగాక! మనకేగాక యావత్ ప్రపంచము లోని పీడితప్రజాకోటికి వెలుగుదారులు చూపవలసిన ఈభారతీయ యువ కులు ఈఆదర్శోదయమును గుర్తించెదరుగాక!

వీరు ఈఅమాయక దౌర్భాగ్యపు ప్రజానీక సౌభాగ్యమునకుగాను పూనుకొనుటలో చేయవలసివచ్చు కార్యకలాపములో చేయవలసివచ్చు తీర్మానములకు మచ్చుకుగాను ఈక్రిందివిధము అవలంబించవచ్చును.

ఆంధ్రరాష్ట్రకాంగ్రెసు ప్రధానకార్యదర్శిగారు
ఆంధ్రరత్నభవనం; గవర్నరుపేట;
బెజవాడ.

ఆర్యా!

1947 సెప్టెంబరు నెలలో మదరాసులో జరుగనున్న ఆంధ్రరాష్ట్ర రాజకీయ మహాసభలో ఈదిగువ రెండుతీర్మానములను ప్రవేశపెట్టగలందు లకు ప్రార్థించుచున్నాను.

## మొదటితీర్మానం — భిక్షుకునివృత్తి.

తీర్మాన కారణము:— ఈదేశములో భిక్షుకవృత్యము భరింపరాని. అవమానకరము. ఇంటిలోనుండగా; వీధిలోనికిరాగానే, హోటేళ్ళలో భుజించుచుండగా, ప్రయాణములో రైళ్ళలో, సర్వత్రకుంటివారు, గ్రుడ్డి

వారు; కుష్ఠురోగులు, కురూపులు— ఐనటువంటివిన్ని, శరీర దార్ఢ్యము కల వారున్నకూడా భిక్షమెత్తుట ప్రత్యక్ష ప్రదర్శనము. ఈదృశ్యము కానరాకుండా యుండగల ప్రదేశము లేదనియే చెప్పవచ్చు. ఇప్పటికి మన ఏకైక; సగౌరవముసంపాదించుకొన్న జాతీయరాజకీయ సంస్థయగు కాంగ్రెసు సాగించిన ఉత్తమోత్తమమైన ధీరోదాత్త పోరాటవిధానము చే మనకు రాజకీయస్వాతంత్ర్యము వచ్చినది. ఇందువల్ల మనప్రతినిధులు సమాన రాజకీయ గౌరవప్రతిపత్తులతో ఇతర దేశములలో; ఇతర దేశస్థులతో తిరగ గలుగుచున్నారు.

కాని ఇతర దేశస్థులు మన దేశములో మనతో పర్యటన చేయునప్పుడు అడుగడుగునకు బాధాకరముగా కానవచ్చు మన భిక్షకులను చూపి, మనలను వేలు పెట్టి చూపక పోయినను "ఏమయ్యా! మీది మహోత్కృష్టమయిన సంఘమని, సంస్కృతియని చెప్పుకుంటారే! ఇదియేనా; నీసోదరుని ఇంత నిర్లక్ష్యము చేసినదేనా? మీవిజ్ఞానము?" యని సిగ్గుపడునట్లు అడుగుచున్నట్లుగా బాధపడవలసిన అవస్థలోనున్నాము అని ఈమహాసభవారు ఖేదపడుచున్నారు.

తీర్మానము:—(క) కావున ఈఆర్థికస్వాతంత్ర్య సంపాదనాప్రయత్నములో సంపూర్ణమయిన భిక్షకనివృత్తియే గమ్యస్థానముగ; ప్రధానాశయముగ పెట్టుకొని ఆంధ్రరాష్ట్రములో ఎక్కడను భిక్షకులు కాన్పించకుండునట్లుగా చేయుటకు ఈరాష్ట్ర కాంగ్రెసు సంఘము వెంటనే పాటు పడుటకు పూనుకోవలసినదిగా ఈమహాసభవారు కోరుచున్నారు.

(చ) ఇందుకుగాను రాష్ట్ర కాంగ్రెసుసంఘమునకు లోబడి ఒకసర్వాధికార ఉపసంఘమును (శాఖను) వెంటనేయేర్పరచి వారుముగ్గురుతనిఖీ ఉద్యోగులను (ఇన్‌స్పెక్టర్లను) నియమించి ప్రతిగ్రామమునను, పట్టణ డివిజనులలోను స్థానిక కాంగ్రెసుసంఘముల చే 'బీదగృహము'లను స్థాపించి నడుపునట్లుగా యేర్పాటుచేయవలసినదిగాను, ఇందుకుగాను ఈఉపసంఘము పని మొదలు పెట్టుటకు ఒక వెయ్యరూపాయిలు మంజూరు చేయవలసినదిగాను ఈరాష్ట్ర కాంగ్రెసుసంఘమును ఈమహాసభవారుకోరుచున్నారు.

గా (స్త్రీ కొరకుమకొన్న వస్తువుగా) ఉపయోగించుకొనుటకై ఎప్పుడూ అట్లా గునే యుండవలెనని యీ దాతలు దీవించుచున్నారన్నమాట. కావున అథ వమత్తోచే భిక్షకులకు గృహములను యేర్పాటుచేసి చాపలు అల్లుట బుట్ట లు తట్టలు అల్లుట వగైరా గృహపరిశ్రమలను పెట్టిన ఆబీదలకు జీవితకాల ఆధారమే దొరకును. ఇంటింటనుకూడ భిక్షపెట్టుచునేయున్నారు. దీనిని కూడ అభిక్షుకగృహములకు మరల్చిన ఈధర్మమువల్లకూడ భిక్షకులు వీధు లలో మెతుకులకొరకయి తిరుగుచు ఇంక యేపని చేయుటకు వీలులేకుండా యున్నపరిస్థితులనుండి తప్పించి వారికి జీవితకాలము యేర్పాటుచేసినవా రగుదురు. ఇహలోకమోక్షమునకుగాని పరలోకమోక్షమునకుగాని చేయు చున్నవారైనను స్వలాభముకొరకు చేయుచున్నవారైనను సరే యిందు వల్లనే ఎక్కువగమనించబడుదురు. కాబట్టి ఈవిధానము వచ్చినదని మాను కొకుండా ఇంకను విరివిగాముందునకు వచ్చెదరనియు హెచ్చుకృషిచేసెద రనియు ఇందులకుగాను "ఎవ్వరికైనను మహాచక్రవర్తికయినను సరే యేమి యూ చేయించుకొకుండగ యేదైనను ఇచ్చినగాని, భోజనముపెట్టినగాని మహాపాతకమని" మనశాస్త్రములలో నిరూపించిన సత్యమును ప్రచారము చేయవలసి ఉండుననియు యీమహాసభవారు నమ్ముచున్నారు.

## రెండవతీర్మానము — లంచగొండితనము.

తీర్మానకారణము —............లంచగొండితనమువల్లనే దొంగ వ్యాపారము,

తీర్మానము—(క) లంచగొండితనమును బాపుటకు ప్రభుత్వోద్యో గులను నియమించినను వారుకూడ ప్రభుత్వోద్యోగులే కాబట్టి......... రాష్ట్రప్రభుత్వమునకు లోబడి స్థానికముగ ఎక్కడికక్కడ ఇద్దరు అధికా రులు, ఇద్దరుస్థానికయువకులైన అనధికారసభ్యులతోనుకూడిన సర్వాధి కార పంచాయతీలను [illegible] నియమించునట్లుగా రాష్ట్రప్ర

భుత్వమును (కన్వీన్సుజేసి)నకు నచ్చచెప్పి చేయునట్లుగా చేయవలసినదని యీరాష్ట్ర కాంగ్రెస్ సంఘమును యీమహాసభవారు కోరుచున్నారు.

(చ) ఇట్లు చేయుటలో రాష్ట్రప్రభుత్వము జాగుచేయుచున్న సూచనలు కాన్పించినచో ఈ రాష్ట్రకాంగ్రెస్ సంఘమువారే అప్పుడు [illegible]లకు వేరే ఉపసంఘమును నియమించి వారిచే ఈ పంచాయితీలను స్థాపించే యేర్పాటు చేయించ పూనుకోవలెనని ఈ రాష్ట్ర కాంగ్రెస్ సంఘమును యీ మహాసభవారు కోరుచున్నారు.

(ట) ఈ రాష్ట్ర కాంగ్రెస్ సంఘమునకు అనేక ఉపసంఘములను నియమించవలసిన ఆగత్యమును, అందు ఈ సంఘ కార్యవర్గ సభ్యులే సర్దుకోవలసి వచ్చుచుండుట చేతను, అందువల్ల వీటి నిర్వహణలో చిక్కులు కలుగు ఇబ్బందిని ఈ మహాసభవారు గుర్తించినారు. కావున ఈ [illegible] నిర్మాణ ఉపసంఘము వేయవలసివచ్చినప్పుడు ఇందు పనిచేయుటకు గాను పత్రికా ప్రకటన ద్వారా ఉత్సాహవంతులను రావించవలసినది గాను, ఈ తీర్మానమును అమలుపరచుటలో, పని చేయకపోయినను లాంఛనప్రాయముగా వచ్చుచున్న 'సీనియార్టీ'ను, కాంగ్రెసు పేరును ఉపయోగించుకొనుచున్న వారిని గాక ఉత్సాహవంతులైన యువకులనే ముఖ్యముగా యుపయోగించవలసినది గాను ఈ రాష్ట్ర కాంగ్రెసు సంఘమును ఈ మహాసభవారు కోరుచున్నారు.

జై హింద్

సాధనాల పెద తిరుపతిరాయుడు,

ధవళేశ్వర పట్టణ ప్రతినిధి.

ఇదేరీతిని ఏకమిటీయైనను తీర్మానమును చేసి ఆ తీర్మానములలో ప్రభుత్వమునకు సంబంధించిన భాగములను తీసి ప్రభుత్వమునకును అటులనే ఎవరెవరికి సంబంధించిన భాగములను వారికిని పంపించవలెయును.

మరి పెద్దల కొక్క మనవి :—ఇంతకాలముగా విషయములు తెలుసుకొనుటకు దొరకిన అవకాశములను ఇతరులకు తెలియకుండా చేసి వాటిని పూర్తిగా మీరే ఉపయోగించుకొనుచు ఆస్తులను పెంచుకొనుచున్నారు. నిష్పత్తికన్న ఒకచోట ఆస్తి పెరిగేకొలది మరొకచోట శిథిలమగును. ఎవరైనను బాగుపడుటకు గాని ఇతరులను బాగుచేయుటకు గాని ప్రయత్నించుచున్న ఆటంకములు కల్పించుచు పుట్టుకలోనే గిల్లివేయుచున్నారు. ఈరీతిగ ఐపోయినదేదో ఐపోయినది. ఈఆర్థిక సమానత్వము సాధించుటకు ఆటంకమైన పరప్రభుత్వం వదలినది. కాని ఆ పరప్రభుత్వంలో తర్ఫీదైన ప్రభుత్వోద్యోగులుమట్టుకు ఇంకా అలాగునే యున్నారు. కావున ఇంక ఈ ఆర్థిక, సాంఘిక సమానత్వమునకై కృషి చేయవలసియున్నది. ధనమును కూడబెట్టుకొని తద్వారా అధికారములను హస్తగతం చేసుకొని గొప్పవారమనుకొనుచున్నవారికి పురుగులవలె తోచు బీదలు కూడ తమతోబాటు సౌఖ్య అనుభవములను, సమాన గౌరవములను పొందే అవకాశము కలిగినదన్నను, కల్పించబడున్నను, అట్టి ఏర్పాట్లు చేసుకొనుచున్నారన్నను, చేయుటమున్నను కట్టని విషయము. కాని కొద్దిమంది త్యాగుల ప్రబోధమువలనను, కృషివలనను మీకు పురుగులవలె కనబడుచు మీవల్ల అన్యాయము జరుగుచున్న బీదలలో కలిగినమార్పు. మెలకువ గమనించవలసి యున్నది. ఇంక ఇప్పుడు మీకు రెండే దార్లు, ఆహా ! ఈ బ్రిటిషు జండాను దింపటం మన జన్మలో చూస్తామా ఇదంతా వట్టిభ్రమ. ఎప్పటికీ జరగదు. అనేవారు అనేకమంది యుండేవారు. కాని అది జరిగింది- ఆజండా దింపి, మన జండా ఎత్తడం ఎంతనిజమో; ఈఆర్థిక సమానత్వం సాధించడంకూడా అంతనిజమేనని గ్రహించాలి- కాకపోతే ఇది గాంధీగారి అహింసా సిద్ధాంతముమీదనా ! లేక దౌర్జన్య విధానముగానా అన్నదే ఈ రెండు త్రోవలున్ను మీరే ఈయేర్పాట్లు చేయుటకు పూనుకున్నారా మీ సిరిసంపదలకు మీఅధికారమునకు ఈ ఔదార్యము వన్నె తెచ్చి దేహాప్రభృతులవలె ప్రజలచే పూజింపబడి కీర్తికాయులగు

పురు- ఈ ఏర్పాట్లను సంకుచిత, స్వలాభదృష్టితో నిరోధించుటకు ప్రయత్నించినారా కూడబెట్టుచున్న పాపపు ఆర్జనే కాక మనుష్యులుకూడ మిగల లేమోన నేటంతటి భయంకర పరిస్థితులు ఏర్పడుచుకొన్న వారనుకుడు-

కావున వీటన్నిటికి పునాదులైనట్టువంటివి, పంచాయతీబోర్డులు జిల్లాబోర్డులు, అధికార ప్రభుత్వముకన్న బలమైనట్టువంటివి కాంగ్రెసు కమిటీలు ఎట్లు ఏర్పడునో, ఎట్లు పని చేయునో బీదలకు తెలియనివ్వకుండా కాంగ్రెసు ప్రాథమిక సభ్యులుగా మీరే పేర్లు వ్రాసికొని, మీరేడబ్బు కట్టేసుకొని, మీరే కమిటీలు అయిపోవడం మానివేసి ఇప్పటికైనా ఈవివరములు బీదలకు తెలియజేసి, వారే కమిటీలుగా ఏర్పడి వారి కష్టసుఖములు గురించి వారేనిర్ణయము చేసుకొనేటట్లు చేయవలెను. వ్యవహారము సవ్యముగా నడచుటకు ఇదియొక్కటేదారి లేదా ఎప్పుడును కాకికేమి బాధయున్నట్లు ఊనహాణకు మీరే కాంగ్రెసుకమిటీలు, మీరే అధికార్లుగా యుండుటవల్ల బీదల సమస్యలకై పెట్టబడిన రేషను విధానములో కూడ మీకు కావలసినంత మంచిరకము బియ్యము తెచ్చుకొని అనుభవించుచున్నందున బీదలకు ఏగుర్తాల గడ్డివస్తున్నను అదికూడ దొరకక పస్తులుంటున్నను దిక్కులేకపోయినది. కావున ఒక్కటేమాట; ధనికుల చేతుల్లో అధికారము ఉన్నంత కాలము బీదలకు సమస్యలు జరుగవు; ధనము కూడేకొలది; అధికారములు సంక్రమించికొలది సర్వసాధారణముగా మనుజులయొక్క జ్ఞానదృష్టియనే కంటిపై ఒక నల్లనిపొర యొప్పడి దట్టముగనుండును. దట్టముగా మసిపూసిన గాజుపెంకులోనుండి చూచిన సూర్యుని కాంతియే కప్పడిపోవును. ఇట్టిదృష్టిలో ఆదైవ సమానులైన బీదలు కాన్పింతురా? నీచులుగానె కాన్పింతురు. కాగా వారి భౌతిక కండ్లకుమాత్రం మీకు అవకాశములు, అధికారములు వుండుటవల్ల వారిపు కార్యములకు పురిగొల్పు వస్తువులుమాత్రమే కనబడుచుండును. మీలో మీరుమాత్రమే సమానహోదాలో మాట్లాడుకొనుచుండును, వ్యవహారం

చుకొనుచుందురు. పోనీ ఈవిధముగానైన ఎల్లప్పుడు సాగిపోతాదా యంటే ఆదికల్ల ఎల్లప్పుడు సాగిపోతాదని భ్రమయుంటాది, అది భ్రమమాత్రమే. అది కొద్దికొద్ది కాలముమాత్రమే. మనం ఎంతమందిని చూచుటలేదు.- ధనమును, అధికారములను ఒకదాని సహాయముతో మరొకదానిని సంపాదించుట, వీటివల్ల గర్వభావము, ఎగుడుబాటు కలగటం, దానితో అధఃపతనం చెందటం, అక్కడితో తక్కిన జీవితమంతయు దుర్భర అవమాన పరిస్థితులలో గడపవలసిరావడం. ఈభ్రమణము, నుండి తప్పుకొని ధన్యజీవులైనవారెవరు. వారే నూటికి కోటికి ఒక్కరుగా యుంటున్న అనుమానీయులు. అట్లయిన, అధికారములు కలిగినపుడు గర్వపడక వీటిసహాయముతో జీవంకొఱకై, బాధనొందుచున్న వారికొఱకై త్యాగబుద్ధిని చూపినవారే తాను గౌరవముపొందవలెనన్న ఇతరులను గౌరవభావముతో చూడవలెను. తాను ఇతరులచే అవమానింపబడకూడదన్న తాను ఇతరులను అవమానించకూడదు. కావున ఈనిత్యసత్యములను దృష్టిలో పెట్టుకొని, రానున్న, మీరుకల్పించుకొనుచున్న భయానక పరిస్థితి నుండి తప్పుకుని శాంతముగా వ్యవహరించుకొనుటకు ఏర్పాట్లు చేయ ప్రారంభించవలసినదిగా మిమ్ములను, ఇట్టి ఏర్పాట్లు చేయ సంకల్పించుకుని ఇట్టి పెద్దలచే అలసత్వముగా చూడబడుచు అవమానములుపొందుచున్న స్వచ్ఛంద కాంగ్రెసు సేవకులు ఈపాట్లుపడలేక మహాత్ములతోవను విడచి తమ బ్రతుకుదెరువునకు వేరమార్గములు చూచుకొనుచున్నందున, దేశమునకు ఇట్టి అత్యవసర తరుణములో నిస్పృహ చెందక సత్యాగ్రహియొక్క సహజ ధైర్యముతో అచంచలముగా నిలువవలసినదని ఈ అసహాయశూరులను, వీటన్నిటిని సంఘటితపరచగల ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసుసంఘము వారిచే తలపెట్టబడిన కాంగ్రెసు సేవకులస్కీమును (పద్ధతిని) వెంటనే ప్రారంభించవలసినదిగా ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసుసంఘమును కోరుచు ఈగ్రంథముఖముగా ప్రస్తుతమునకు సెలవు.

జై హింద్

పోలీసులకు:—వీరిని చూడగానే ప్రజలకొకవిధమైన భయభ్రాంతిభావము, నీచభావము కలుగుచున్నది. నిజానికి వీరినిచూడగానే ప్రజలకు ఆప్యాయము, గౌరవభావము కలుగవలసినది. ఇదియెందుచేత? వీరు అమాయకప్రజలవద్ద బెదరించి లేదా, పావలా తీసుకుంటారనిన్ని, లేనిపోని చిక్కులు కల్పిస్తారనిన్ని ఒకసర్వసాధారణ అభిప్రాయము ఏర్పడిపోయినది. దీనికి కారణము ఇంతకాలము సాగిపోయిన దుష్టప్రభుత్వవిధానమే. ఇందులో పాపము వీరికిగల చిక్కులు వీరికి లేకపోలేదు. ముఖ్యము వీరికి కనీసజీవిత ప్రమాణముగానైనను జీతములు ఇవ్వకపోవడమే. దీనివల్ల వీరికుటుంబపోషణకుగాను ఇతరవిధములుగ సంపాదించవలసిన ఆగత్యము ప్రభుత్వముచే తప్పనిసరి చేయబడినదన్నమాట. కారణములచేత వీరు గ్రామప్రజలకన్న భిన్నమైన స్వరూపములుగా భావమేర్పడిపోయినది. దీనినుండి తప్పించుకొని మేముకూడా ప్రజలతోటి ప్రజలమే అని గౌరవముగా చూడబడవలెనన్న వీరు ప్రథమమున పోలీసు అనే పదమును మరచిపోయి రక్షకభటులమని భావించుకొనుచు ప్రజలతో గౌరవప్రతిపత్తులతో మసలుకొనుచు నీచపు వైఖరులను మానుకొనుటకుగాను కనీసజీవితప్రమాణభృతి కొఱకై సంఘములుగా ఏర్పడి కృషిసాగించవలసియున్నది.

ఇదే పద్ధతి తక్కినడిపార్టుమెంటులలోని ఇన్ఫీరియర్ సబార్డినేట్సు అనబడుచున్న బంట్రోతులు; గ్రామోద్యోగులైన కరణం మునసబులు మున్నగువారికి వర్తించుకోవలెను. ఈపద్ధతివలన పైఉద్యోగుల లంచగొండితనము, క్రిందవారిచే వెట్టిచాకిరి చేయించుకొనడం మున్నగు దుర్న్యాయములు కూడ కట్టుబడిపోవును. పాపము! క్రిందివారిలో ఈలాగునుగయుండుట వలననే పైవారి ఆటలు సాగుచున్నవి. సంఘములుగా ఏర్పడి యీలాగునుగ ప్రయత్నము చేసుకోగల్గేరా పైవారి ఆటకట్టినట్టే. క్రిందవారిలోని బలహీనత వీరిఇక్కట్లకు కారణం.

విద్యార్థులకు:—ఒకనాటి విద్యార్థే మరుచటినాటి ఉద్యోగి; వ్యాపారి; భూస్వామిన్ని. కాస్తజ్ఞాపకం పెట్టుకుంటే విద్యార్థిదశలోనున్నప్పుడే

డగుట) ఈరెండు అవినాభావధర్మము లగుట(విమర్శన చేయుటకున్న)అంత ఎడము చేయుచున్నారు కావున ఈక్షణభోగము నిత్యబాధలు అనే స్థితి నుండి తప్పించుకొని బయటపడవలెనన్న కార్యకర్తలు గాక మానవయువప్రను కొంచెము సహనము (ఓర్పు,) స్థైర్యము, పట్టుదలయున్నట్లైన కొన్ని కాలము బాధాకరముగా కావించినను చెప్పుటకన్న చేయుటమే ముఖ్యమనియు, విమర్శను, కార్యకర్తృత్వముగా చేయగల సంబంధమున్నదనిన్ని ఋజువై నిత్యసుఖమునకు త్రోవ ఏర్పరచు రెండువస్తువులను కలపగల మూడవ వస్తువు (సంబంధము - Medium) యున్నట్లే చెప్పుట, చేయుటయనే ఈ రెంటిని కలపగల సంబంధము సహనము, స్థైర్యము, కార్యశూరత్వము, పట్టుదలమాత్రమే. వీటికి సత్యము ప్రాణము. ఇదికూడ సత్యముయొక్క శాఖలే. ఇదియే సత్యాగ్రహిత్రోవ ఇదియే మహాత్ముల త్రోవ. సత్యాగ్రహియే మహాత్ముడు. సత్యాగ్రహియే ఆర్యుడు. ఇట్లు ఆచరించుచున్న వారు అక్కడక్కడ యెప్పుడూ ఉంటూనేయున్నారు. వారినే పురాణ పురుషులనియు, అవతార పురుషులనియు, పవిత్రులనియు, ఋషులనియు, యోగులనియు, ఉత్తములనియు, సిద్ధులనియు సాధ్యులనియు, దేవతలనియు వ్యవహరించుచున్నాము. ఇట్టివారివలననే చరిత్ర ఏర్పడుచున్నది. అనగా అమాయక, నిస్సహాయ ప్రజలకు దుర్మార్గులు (రాక్షసులు) పెట్టే బాధలు, చేసే మోసములను ఇట్టి స్వచ్ఛందసత్యాగ్రహి ఎదుర్కొన మొదలుపెట్టినప్పటినుండి (ఆర్యధర్మము-ఆర్య అనే పదమునకు అర్థమున్న) దుర్మార్గులు తమ ప్రాబల్యమును నిలుపుకొనుటకు స్వార్థముతో సాగించు దౌర్జన్యములవల్ల ఏర్పడే సంఘర్షణయే చరిత్ర. ఎవరు ఎంత ప్రదేశమునకుగాని, ఎంతమందికిగాని ఇట్టిసేవచేసిన అంతమట్టుకు అదిచరిత్రయగుచున్నది. చిన్నబీజమునుండి మర్రి మహావృక్షముగా వ్యాప్తిచెందినట్లు మానవుడు ఆత్మశక్తివలన విజృంభించగలడు. పశువునకు మానవునకు ఇదియే భేదము. కావున జీవియొక్క పరమపదముపొందే; అవకాశమిచ్చు ఉత్కృష్టమైన ఈమానవజన్మ లభించినందుకు దీనిపరమార్థమైన ఆత్మోపలబ్ధినికూడ

మాన్యముగా విద్యార్థులలో యుంటున్న ఈఅలవాటును మానుకొని వారితో కలసి మెలసి ప్రవర్తించుకొనుట మరియొకటి, తాము చేయకల్గినదే చెప్పుట చెప్పినది చేయుటకు ప్రయత్నించవలెను. తాము చెప్పదలచుకున్నది ఇతరులకు సుబోధకమయ్యేటట్లుగా మాట్లాడగల వక్తృత్వము అలవరచుకోవలెను. ఈవిధముగా తయారై విద్యార్థిదశనువదలిన వెంటనే ఏలక్ష్యమునకై తాము తయారైనారో అలక్ష్యమునకు సంబంధించిన వృత్తిలో ప్రవేశింపవలయును. దానితో విద్యార్థిదశనుండి కార్యకర్తలుగా పరిణామము చెందినారన్నమాట. అంతేగాని లక్ష్యములేకుండా, ముందుదృష్టిలేకుండా ఎందుకోఅంటే ఎందుకో చదివేమంటేమన్నట్లుగా తరువాత తనబ్రతుకు తాను బ్రతుకవలసివచ్చినప్పుడు విద్యాసంస్థలలో సంవత్సరములతరబడి గడచిన కాలమును, అందులక్ష్యములేకుండా నేర్చినవిద్యయు వృథాగా పరిణమించినదనియు, ఆవిద్య తనజీవితమునకును, తానుప్రజలకును భారమైయున్నట్లుగాను తెలుసుకొని చింతించవలసివచ్చును. ఏదో తనకు అర్థంకాని ఒక 30 రూపాయిల ఉద్యోగముకొరకు తంటాలుపడవలసివచ్చును. కావున ఒక లక్ష్యముతో విద్యనభ్యసింపవలెను. తద్వారా విద్యార్థిదశనుండి సరాసరి దానికి సంబంధించిన ఉద్యోగములోనికి పిలిచియిత్తురు కూడను. ఇట్టి పరిణామము చెందినవారు, ఇప్పటికే చెందియున్నవారుకూడా ఉద్యోగులైనచో ఏకొద్దిమందియైననుసరే సత్ప్రవర్తనగలవారని సంఘటితపరచి ఆఫీసులోనే ప్రజోపయోగకరమైన కార్యములు చేయు శాఖగా యేర్పాటు చేయవచ్చును. ఉదాహరణకు- కో-ఆపరేటివ్ స్టోర్సు, మెంబర్సు రోజొక్కొక్కరువంతున ఉపన్యసించే విజ్ఞానసంఘములు యున్నయెడల ఏర్పాటు చేయవచ్చును. దానితో ఒక్కరొక్కరు పేకాటసోమరులుగాకా ఖాళీసమయములో జ్ఞానవర్ధనమొదలిడుదురు, వ్యాపారస్థులైనచో వచ్చినటులైతే ఎక్కువమందితోనైనను కో-ఆపరేటివ్ పద్ధతిని వ్యాపారసంస్థలను ప్రారంభింపవలెను- దానితో బ్లాక్ మార్కెట్టు అంచగొండితనము అధికలాభాలు ఒకరికే ధనము పేరుకునిపోవుటపోయి ప్రజలందరికి సమానన్యాయముగాను, సులభముగాను వస్తువులు అందుబాటుగను- ఇంజనీర్లుఐనచో తాము

ఉద్యోగము చేయుచున్న చుట్టుపట్టుగల నీటివనరులను వ్యవసాయప్రాజెక్టులుగా నిర్మించుటకుగల అవకాశములను పరిశీలించుటకు ఇందుఉత్సాహమున్న వారిని సంఘములుగా (Expedition) యేర్పాటుచేయవచ్చును- మెకానికల్ ఇంజనీర్లైనచో నూతనయంత్రములను కనుగొనుటకుగాని చుట్టుపట్లయున్న యంత్రాగారములకు సులభపద్ధతులు ఇంకను భద్రమైన పద్ధతులు పొందలగు చేర్పులు దిద్దులు చేయవచ్చును-(Inventiou and Improvements) నూతన యంత్ర పరికరములు కనుగొనవచ్చును- ఖనిజ భూగర్భ శాస్త్రజ్ఞులైనచో తాము ఉద్యోగము చేయుచున్న చుట్టుపట్లలోగల ఖనిజసంపదలు తదితర ప్రకృతి సంపదలను పరిశీలించి వాటిని ప్రజోపయోగములోనికి తీసుకువచ్చుటకు వీలైన పరిశ్రమలు స్థాపించుటకు కృషిచేయవచ్చును. వైద్యులైనచో బీదప్రజలు తక్కువధరకు అందుబాటులో యుండేరీతిని రోగములు రాకుండా నిరోధించే బలవర్థక ఔషధములను తదితరమందులను కనిపెట్టి విరివిగాతయారుచేసే కంపెనీలను స్థాపింపవచ్చును. వచ్చినరోగికి యేదో వైద్యముచేసి పంపించివేయుటయే కాక ఆరోగము ఎందుకు ప్రాప్తించినదో అదిరాకుండా యుండవలెనంటే యేమి చేయవలెనో కూడ చెప్పుచుండవచ్చును. ఆరోగ్యశాఖోద్యోగులగుటకు చదివేవిద్యార్థులు ఉద్యోగులైనవారుకూడా పేటలలోకిపోయి బీదప్రజలకు ఆరోగ్యసూత్రములు చెప్పుచు వాటిఆచరణకు తగుయేర్పాట్లు చేయుచు ప్రచారము చేయవచ్చును. వ్యవసాయ శాఖోద్యోగులైనచో మనదేశములోను, ఇతరదేశములలోను అధిక ఫలసాయములు తీయుటకున్ను, మేలురకములు పండించుటకున్ను, పంటలకు ఫలవృక్షములకుపట్టు చీడలనుండి కాపాడు విధములు మున్నగువాటిగురించి చేయుచున్న పరిశోధనలున్ను వాటి ఫలితమున్ను గ్రామగ్రామములలోని రైతులకు కరపత్రములద్వారాను, పత్రికలద్వారాను తెలియచెప్పేటటువంటివిన్ని, అవిధానములకై కృషిచేసేటటువంటివిన్ని సంఘములను ఏర్పాటు చేయవచ్చును. అంతేగాని ఈ పైనుదహరించినటువంటి ప్రభుత్వోద్యోగులు మేము ఏమి చేసినను చేయక

పోయినను నెలాఖరకు మాజీతము మాకు మనోవృత్తివలె వచ్చునుగదా యని పేకాడుచు కూర్చున్నచో ప్రజాసంఘమునకు చీడవంటివారుగా మాత్రమే పరిగణించబడుదురు. వీరికి ప్రభుత్వమువల్ల కలిగిన అవకాశములు అధికారములు, పలుకుబడిని వృథాపోనీయక దేశప్రజలను సౌభాగ్యవంతులుగా చేయుటకు ఉపయోగించెదరుగాక, వ్యవసాయకులైనచో ధాన్యము, కొబ్బరి, బెల్లము, వేరుశెనగ మున్నగు ఉత్పత్తులను వీరికి గిట్టుబాటు కాని ధరలకు పైనుండి ఎవరో జావమాడనంతలో తలవొగ్గి భరించవలసివచ్చుచున్న పరిస్థితులనుండి తామే ధరలు నిర్ణయములు చేయుటలో పాల్గొని వ్యవహరించకల్గునట్లుగా రైతు కాంగ్రెసు సంఘములను స్థాపించవచ్చును. వీటి ద్వారా ఎరువులు, వ్యవసాయ పనిముట్లు, జనపవిత్తనములు మొదలగునవి రైతులకు కష్టములేకుండా న్యాయముగా లభించునట్లొనర్చవచ్చును. ప్రజలలో ఎవరైనా ఇటి కాంగ్రెసు సంఘాలలోను, విద్యార్థులు విద్యార్థి కాంగ్రెసులోను చేరకుండ ఉన్నట్లయిన దానికి వారి పిరికితనమే కారణము. పోనీ మాకీ రాజకీయములతో ప్రసక్తి లేదు అంటారేమో దీనిగురించి ఈ గ్రంథమున ఇంతకుముందే నిరూపించబడినది. ప్రతివానికి రాజకీయములలో బాధ్యతయున్నదనియు రాజకీయములే ప్రజలు కాబట్టి ఈ అవినాభావసంబంధమును ఎవరైన వదలగొట్టుకొనదలచిన అది వట్టిభ్రమయే అగును. కావున ఇప్పటి సంఘవ్యవస్థనుగూర్చి శుష్కవాదనలు చేయక తాము ఇదివరకు చేసిన ప్రతిజ్ఞలు పాటించి ప్రహ్లాద, నందనార, రామ, కృష్ణ, క్రీస్తు మహమ్మదు బుద్ధ గాంధి నెహ్రూ రాజా రామమోహనరాయ్ వీరేశలింగంపంతులు సర్. ఆర్. వెంకటరత్నంనాయుడువంటి మహాత్ముల త్రోవను నడచుటకు విద్యార్థులు విద్యార్థి సంఘములు ఈపై సూచనలను ఈ గ్రంథములోని గాంధి సూత్రములు యనబడే గాంధి స్మృతిని గమనించి స్థితప్రజ్ఞులగుదురుగాక! తద్వారా ఈ పీడిత మానవకోటి ఉద్ధరించబడి సర్వ సౌభాగ్యవంతముగాను సౌఖ్య ప్రదముగాను యగుగాక!

కాంగ్రెసు ఝండా :— ఈనాడు ఎక్కడచూచినను కాంగ్రెసు ఝండాయే. ఎవరిచో కర్రలమీద చూచినా ఎవరిటో పీలమీద చూచినా కాంగ్రెసు ఝండాయే ఎంత పెద్ద బ్లాక్ మార్కెట్టుదారు అయితే అంత పెద్దఝండా. ఎంత లంచగొండి అయితే మరి అంత పెద్దఝండా తన ఇంటికొకటి, ఆఫీసులో ఒకటి పిల్లల కొక్కొకటి ఇదేవిధముగా కాంగ్రెసు కమిటీలలో చాలామందిగా యున్నటువంటి అవినీతిపరులు (బురఖావారు) కూడా ఇట్టి పెద్దఝండా ప్రదర్శనలు జరుపుతున్నారు. పైగా వీరుకూడా ఈఝండాను తిరక్రిందుగా చేసి పెట్టుచున్నారు. అంటే వీరికి అసలు కాంగ్రెసుఝండా అంటే ఏమిటో దానిని ఏమిచేయవలెనో ఎట్లు పెట్టవలెనో తెలుసుకోవలసిన అగత్యముకూడా లేదన్నమాట. ఎఱ్ఱ పైకి ఆకుపచ్చ క్రిందకు యుండేలాగున ఎగురవేయవలెనని యే తెలియదన్నమాట. కొందరు గాలిలేకపోయినను ప్రదర్శనముగా కనబడేలాగున కర్రకు అడ్డముగా మరియొక కర్రముక్కనుకట్టి దానికి ఝండాను రెపరెపలాడుచు స్వేచ్ఛగా ఎగురకుండా నాచికట్టివేయుచున్నారు, మరి కొందరు కొయ్యకు కొంత క్రిందుగా యుండేలాగున కట్టుచున్నారు. ఇది ఝండాను సంబంధించిన గౌరవనీయులు ఎవరైనా చనిపోయినప్పుడు విచారసూచకముగా వేయుపద్ధతి (హాఫ్ మాస్టు) ఈవిధముగా కాంగ్రెసు ఝండా అంటే ఏమిటో అసలు కాంగ్రెసు అంటే ఏమిటో కాంగ్రెసుకమిటీ మెంబరు యేమి చేయవలెనో తెలియకుండాను తెలుసుకోకుండాను యున్నవారు కాంగ్రెసుకమిటీ పెద్దలుగాను కాంగ్రెసుపేరు చెప్పుకొని చెలామణి యగుచున్నవారుగను యుంటున్నందుననే ప్రజలకు ఈ యిబ్బందులున్ను ప్రజలు కాంగ్రెసును తిట్టుకొనడమున్ను కలుగుచున్నవి. కాంగ్రెసు కమిటీ పెద్దలు ప్రజలలోనికి పోయి వారి కష్టనిష్ఠురములను చూచి వాటికి సంబంధించిన ఉద్యోగులను, ఉపాధ్యాయులను ఒక్కొక్క ముం కాలక్రమాను పోటు పాడుచుచు తగిన యేర్పాటులు చేయుచుండవలెను. ఇది చేయుచుండిన కాంగ్రెసు అంటే యేమిటో దానంతటది అదియే తె

యును. ఇట్టి ప్రజాసేవలో అనేక విషయముల పరిష్కారములో తగిన కాంగ్రెసు పెద్దలతోను ప్రభుత్వోద్యోగులతోను సంప్రతించవలసి వచ్చు చుండును. అందుచే అనేకవిషయములు తెలిసికొనుటకు అవకాశములు కల్గును. ఈవిధముగా దినదినప్రవర్ధమానమగుచుండెడి విజ్ఞాన సముపార్జన అనుభవమును పెద్దలయొక్కయు అధికారులయొక్కయు పరిచయమును అగ్రామ సౌభాగ్యమునకు సులభముగా ఉపయోగించవచ్చును. ఇట్టిసేవచే యుటకు ఇచ్ఛగించనివారు కమిటీలనుండి తప్పుకొనవలెను. లేదా ఇట్టికృషి చేయువారును; చేయుటకుత్సాహముకలవారును వీరిని తప్పించి తాము కమిటీలలోనికి రావలెను. ఇట్టిసేవచేయుటకుద్దేశించిన వారలు ఇందుకు పూర్తి సహాయపడవలెను. అంతేగాని కాంగ్రెసు యేమిచేయుచున్నది. కాంగ్రెసు ప్రభుత్వము యేమిచేయుచున్నది అనిఅంటే అర్థములేనిమాట. తనను తాను దూషించుకొన్నట్లే. పైనుంచి ఎవరో కాంగ్రెసుపెద్దలువచ్చి చేయవలెననియు; ప్రభుత్వమొచ్చి చేయవలెననియు అనుట యేమిచేసినను పైవారేనని వారికేసి చూస్తూ కూర్చొనుట హానిప్రవృత్తి యగును. మనకు యేమికావలయునో మనమే చేసుకొనుచు అందులకేమైనా పైనుంచి కావలసిన సహాయమును పైవారిచే చేయించుకొనవలెను. అంతేగాని ప్రభుత్వము మనకయి ఇచ్చు ప్రణాళికలను అధిగమించుము; కాంగ్రెస్సు చేయుననేదిచేయుకుండాను స్వలాభమునకై (స్వలాభమనగా ఇతరులను మోసగించి తాను ఎక్కువవాడు కాజూచుట, ఇట్లుమోసగింప బడుటచే ప్రజలు పాడైపోవుదురు. ఇట్టిపాడైపోయిన దేశములో తానుమాత్రమెట్లు సుఖముగ నుండగలడు?) వాటికి భిన్నముగా ప్రవర్తించుకొనుచుతద్వారా తిరిగి ఇంకొక రూపమున బాధలుపొందుచు ఇవి మాకేమిచేయుచున్నవి అని యనుట చాలతప్పు. ఉదాహరణకు, ఒకప్రభుత్వోద్యోగి ఇలాగఅన్నాడనుకోండి. ఆప్రభుత్వోద్యోగి లంచములు పుచ్చుకొనుట మానుకున్నాడేమో కనుక్కొన్నాని. తన సా మధంచే గా! తనకిచ్చినవానికి చూపించగలిగేటందు

తన్ను తనవైవారికి లంచములివ్వలేక చస్తున్నావని మొరపెట్టుకునేందుకున్నూ ఎవరివానిని విమర్శించేటందుకు; దూషించేటందుకు తాను ఎట్టివాడో యేమి చేసినాడో ముందట తనకు తాను చూచుకొనవలెను.

* * * *

ఇదివరకు గవర్నమెంటు డిపార్టుమెంటులలో యేలాగో గొప్ప లంచగొండితనమున్నను రయిల్వే; పోస్టల్, ఎగ్రికల్చరల్, కో అపరేటివ్ డిపార్టుమెంటులు మట్టుకు ఈ నుచ్చులేకుండాయుండేవి. అంటే ఇవి నిగ్రహంగాయున్నవా అని కాదు. వీటికి అవకాశము లేదు కాదు. కాని మొన్నటియుద్ధమువచ్చి ఈ కాస్త పుణ్యముకట్టుకుంది. ఒక్క పోస్టల్ శాఖ, తప్పించి తక్కినయన్నింటికి పూర్తి అవకాశములు లభించినవి. వీటికితోడు కంట్రోల్. సప్లయి; రేషనింగు డిపార్టుమెంటులు పుట్టినవి. దానితో ఇంక లంచగొండితనం; దొంగమార్కెట్టు అన్నవానికి దేశములో హద్దూ-పద్దూలేకుండాపోయింది. దీనికి లెఖ్ఖా పద్దా (ఆడిటు) వ్రాయుమంటే ఆ చిత్రగుప్తుడుకూడా బేజారైపోతాడు మూలనున్న ముసలమ్మ దగ్గర నుంచి చిన్నపిల్లలవరకు ఈ బ్లాక్ మార్కెటింగు తెలివితేటలు అలవడిపోయినవి. ఇవే పెద్ద తెలివితేటలనుకొని పెద్దపెద్దయ్యగాడా లెగ్ కేనే పెద్దవ్యాపారస్తులు మనీ చేస్తున్నారు. ఇదంతా చూస్తే బుర్రగిర్రునతిరిగిపోతుంది ఇవి సర్వత్ర పెరిగిపోయినవి కాబట్టి ప్రజలు చివరకు లంచగొండితనం, బ్లాక్ మార్కెట్టు అన్నపదాలే వాడవద్దనియనుకొనుచున్నారు. ఒకవేళ యేపిచ్చివాడైనా ఈపరస్పర దోపిడీవిధానాన్ని, ఈబీదప్రజలను కాల్చుకుతింటున్న విధానాన్ని ఎక్కడైనా ఎదిరించబోతే అతడు వట్టిసన్యాసి అనుచున్నారు. పిల్లలంజ; తల్లిలంజ ఐతే పైగా ఎవడోవచ్చి ఏడ్చినట్టు అనుచున్నది. కావి; పాపం! ఆపోస్టల్ వారికికూడా ఈ కాస్త అవకాశం కల్పిస్తే ఈవిరాట్ స్వరూపం పూర్తిచేసి పుణ్యంకట్టుకున్నవారవుతారు. ప్రభుత్వము అప్పుడు అపూర్వస్వరూపాన్ని చూచినదైనా విల్లంబులు తీసికొని బాణం బులు సంధించి పోరాడుటకు ప్రయత్నించుటకు సమకట్టునేమో? దానితో

నైనా శ్రీమహావిష్ణువునకు కూడా భస్మాసురుని పాపము పండనిదే వధించుటకు శక్యము కానట్లు అగునేమో?

* * *

ఏది ఎట్లున్నను మనపురాణములలోను, బైబిలులోను, ఖురానులోను చెప్పినట్లు గాను, వీరబ్రహ్మము గారు, మహాత్ముడు, వేమన మున్నగు అనేక మంది త్రికాలజ్ఞులు చెప్పినట్లుగాను ప్రస్తుత పరిస్థితుల ననుసరించి దేశములో కాదు—ప్రజాపాలనవర్గ కోటిలోనే పాపము పండినట్లు కనబడుచున్నది. కావున యువకులారా! లేవండి! రేపటిసంగతులకు మీరే బాధ్యులు. స్వాతంత్ర్యమునకై పోరాడినవీరులు మొన్న ఆగష్టు 15తో రాజకీయ స్వాతంత్ర్యము రాగా, ఇంక కావలసిన ఆర్థిక, సాంఘిక స్వాతంత్ర్యముల కొరకై అర్రుండా క్రిందనే ఇట్టిదుష్టశక్తులను ఎదుర్కొనుచున్నారు, అరుగులమీదకూర్చొని విమర్శించుట కాదు- ఇది సమయము కాబట్టి మీ తావులో ఇట్టికృషి చేయుచున్న వారితో కలసి కొద్దికాలము అహర్నిశలు పని చేసినారా ధన్యులవుతారు. ప్రజలారా! లేవండి! మీరు చాల కాలముగా కాంక్షించుచున్న ఇట్టికృషిని చేయుచున్న యువకబృందములకు అన్నివిధముల సహాయము చేయుచు వారోత్సాహములను కొల్పుచు మీరు కన్నకలలయందు కృతకృత్యులవ్వండి- గత 20 సంవత్సరముల మాంద్యపురోజులలో పల్లెగ్రామములలో బ్రహ్మాండమైన కృషి చేయవలసిన. చేయుటకు నియోగింపబడినఎగ్రికల్చరల్ (వ్యవసాయశాఖ) డిపార్టుమెంటు, కో-ఆపరేటివ్ (పరపతిసంఘముల శాఖ) డిపార్టుమెంటుల వారు వందలకొలది జీతములు తింటూ కదలకుండా కూర్చొని అంచములకు జనపవిత్తనములు, బండిపట్టాలు మొదలగు ఇనుపవ్యవసాయపనిముట్లు, ఎరువులు మున్నగు వాటి బ్లాక్ మార్కెట్టుకు అవకాశము వచ్చినది- కావున ఎక్కడచూచినను ఇప్పుడు వినబడుచున్న ఈకోణములలో మీ యువకబృందముల కృషిద్వారా ఈ రెండుడిపార్టుమెంటులచే గ్రామగ్రామములలోను సరియైనసేవ చేయించుకొండి, శాస్త్రరీత్యా 'పండించిన ఇప్పటి ఆదాయములకన్న ఎకరమునకు రెండుమూడురెట్లు తీయవచ్చును- ప్రతిగ్రామమునకును 'పాడి-పంట' యనే ప్రభుత్వ[illegible]వ్యవసాయ

ప్రతిజ్ఞచేస్తున్నట్లు చేసుకోండి. ఏ గ్రామము నుంచి వచ్చినను ఆ గ్రామములోని కో-ఆపరేటివ్ స్టోర్సు వారిని తిట్టుకునేవారే కాని వారిలో ఒక్కరు స్టోర్సును ఈవిధముగా నడపవలెను. అని చెప్పగలవారుండరు. అది ఏమి లాభం? మీ గ్రామయువకులలో ఒకరిని కో-ఆపరేటివ్ పద్ధతిని గూర్చిన విద్యాభ్యాసమునకు పంపించండి-ఈలోపు ఈలో విద్యపూర్తి చేసుకున్న వారిని ఒకరిని మీస్టోర్సుకు మేనేజరుగా నియమించుకోండి. లేని గ్రామాల్లో స్టోర్సు పెట్టుకోండి. అధికధరలకు వస్తువులనుకొని మీరందరు గత్యంతరం లేక ఇచ్చే అదనపులాభాలు ఒక్క షాపుకారికే చేరిపోకుండాను, కావలసిన వస్తువులు లేదనిపించుకోకుండాను అమ్మకం పైని మీరిచ్చుకునే న్యాయమైన లాభాలుకూడా తిరిగి మీకే ఎలాగ చేరుతవో ప్రతివారు వెంబట్లు ఆయి తెలుసుకోండి. ఈవిధముగా మీకు తెలియకుండా, కనపడనినష్టము కొద్దికొద్దిగా మీచేతిమీదనే పోగొట్టుకొనుచు మొత్తముమీదగుండము ఆయి పోవుచున్న నష్టమును తెలుసుకొని బాగుపడండి. కోటన్నిటికి మూలాధారమైన మన జాతీయధ్వజం అంటే ఏమిటో. తెలుసుకోండి అమెరికా, ఇంగ్లండు మొన్నగు దేశముల ప్రజలు వారి జాతీయ ధ్వజం అంటే ఏమిటో దాని రంగులు ఎట్లు ఎందుకు ఎప్పుడు ఏర్పాటు చేసుకున్నారో- వాటిని నిలబెట్టుకొనుటకు వాటి గౌరవములు నిలబెట్టుకొనుటకు వారు ఎప్పుడెప్పుడు ఏయేరీతిని, ఎంతెంత త్యాగములు పోరాటములు చేసినారో తెలుసుకుని ఆధ్వజముల యొక్క పవిత్రభావముతో, ప్రభుత్వములలో ప్రజలు, ప్రభుత్వోద్యోగులు, ప్రజాసంస్థలు దేశసౌభాగ్యమునకై అనగా దేశప్రజల సౌభాగ్యమునకై కో-ఆపరేటివ్ పద్ధతులపై కడకు వ్యాపారముదగ్గరనుండి జాయింటు స్టాకు కంపెనీలుగా ఏర్పడి ఎట్లుమసలుకొనెదరో తెలుసుకొని మీరుకూడామనజాతీయధ్వజం ఎప్పుడు ఎట్లు ఎందుకు ఈత్రివర్ణములు ఏర్పాటుచేసుకొన్నామో దీనిని ప్రతిష్ఠించుటకు ఎప్పుడెప్పుడు ఏయేరీతిని ఎంతెంత త్యాగములు పోరాటములు చేసినామో యీనాడు మన 40కోట్ల భారతీయులకే కాక నేటి కల్లోలిత, అనిశ్చిత వాతావరణములో బాధపడుచున్న ప్రపంచ

పీడిత మానవకోటికే పూర్వమొకప్పుడు ప్రపంచమంతటికి భారతదేశము వేగుచుక్కయై విలసిల్లినదని చెప్పుకొనుఖ్యాతి యీనాడు ప్రత్యక్షముగా మనము చూచునట్లు తిరిగి సంపాదించుకొన్న ఖ్యాతిని తెలుసుకొని యీ ఖ్యాతిని నిలబెట్టుకొనుటకు ఇట్టి పవిత్ర జాతీయుద్యమ కాలములలో ప్రభుత్వములలో ప్రజలు; ప్రభుత్వోద్యోగులు, ప్రజాసంస్థలు ఎట్లు మసలుకొనవలెనో తెలుసుకొని ఆరీతిని నడచుకొని సర్వాంగసౌష్టవమైన దేశవ్యవస్థను నిర్మించుకొని సౌభాగ్యవంతముగా, గౌరవప్రదముగా; సౌఖ్యప్రదముగా జీవించెదరు గాక!

ఇవి తెలుసుకొనుటకు కాంగ్రెసు చరిత్ర, గాంధి, నెహ్రూ; ఆజాద్ రాజేంద్రప్రసాద్; బోస్, జయప్రకాశ్ మున్నగు దేశనాయకుల చరిత్రలు మన దేశ చరిత్ర తెలుసుకొనవలెను. ఇందుకుతోడు ప్రపంచములోని ఇతర దేశముల చరిత్రలు; వాటినాయకుల చరిత్రలు కూడ తెలుసుకొనిన చాల ఉపకరించును. ఇట్టిపుస్తకములు ఆంధ్రకాంగ్రెస్ బుక్ డిపో, ఆంధ్రరత్న భవనం, గవర్నరుపేట బెజవాడకు వ్రాసిన దొరకగలవు. ఈవిధముగా సముపార్జించిన విజ్ఞానముద్వారానే గాని యిట్టి ఆర్భాటాలవల్ల మొండిపట్టుదల వల్ల అరుగులమీద కూర్చొని చేసే విమర్శనలవల్ల నిత్యసుఖములకు ఏర్పాట్లు చేసుకొనలేరు. కావున మానవకోటితరించుటకు ఏకైకమార్గమయిన ఇట్టి రాజకీయ విజ్ఞానగ్రంథముల ద్వారాను ఇట్టివిజ్ఞానఖనులైన ఇట్టిఏర్పాట్లు చేయుచున్న జాతీయవీరుల ద్వారాను ఏర్పాట్లు చేయించుకొనుచు మీగౌరవమును, మీ దేశ గౌరవమును, మీజాతిగౌరవమును; మీఝండాగౌరవమును నిలబెట్టుకొని సౌభాగ్యవంతులై సుఖించెదరు గాక!

## కాంగ్రెసు - ప్రభుత్వాలువచ్చి చేసినదేమిటి?

స్వరాజ్యం వచ్చేకానే ఇంకా కష్టాలు ఎక్కువైనాయి. బ్రిటిషు గవర్నమెంటు యున్నప్పుడే బాగుండేది అని కొంతమంది అనుకున్నారు ఇది వట్టి అపోహయే. కాంగ్రెసు వచ్చి రాజకీయ చైతన్యము కల్పించుట వలనను, మానవకోటి బ్రతుకునకు కావలసిన సదుపాయములను అడుగుట

సంపాదించుకొనుట, అనుభవించుటకు ప్రజాబాహుళ్యమునకు త్రోవలు చూపుచు, అవకాశములు కల్పించుటచేతనే నేడు ఇట్లు అనుటకు మార్గమేర్పడినది. త్రోవలు, అవకాశములు వెల్లడియగుటచే ఈ ఆశయసౌకర్యములకు అవకాశములు కల్పించుకున్నవారు, కనీసం కోరేవారు ఎక్కువైపోయినారు. కాని ఈ నూతనముగా లక్షలకొలది; కోట్లకొలది తయారైన వినియోగదారులకు సరిపోవు సౌభాగ్యవస్తుసంపద తయారు కాలేదు. అందుచేత ఇదివరకు బ్రిటిషుప్రభుత్వముయుండగా ఏకొద్దిగానో యున్నటువంటి సౌఖ్యసంపద యేకొద్దిగానో యున్నటువంటి తెలిసియున్నవారు ఉపయోగించుకొనుటకు సరిపోవుచుండెడిది. తక్కినకోటానుకోట్ల ప్రజలకు అవిద్యావాలని ఆశయున్నాలభించే అవకాశములు తక్కువగుటచే నిరాశచెందియుండేవారు. లేదా ఆశయున్నను కనీసము కావలెనని కోరుటకు వాక్స్వాతంత్ర్యముకూడ లేకపోవుటచేతను ఆనాటికన్న ఈనాడు అనుభవించుటకు అవకాశములు, అడుగుటకు వాక్కు ఏర్పడిన కారణముచేత ఇప్పటి ప్రభుత్వముకన్న అప్పటి ప్రభుత్వమే మేలు అనుకొని భ్రమపడుచున్నారు. మన దేశమునకు ఇట్టి అవకాశములు కల్పించుటే కాంగ్రెసుయొక్క తప్పిదమైనదన్నమాట.

ఆశకల్పించుట తప్పుకాదా యనిగాని, ఏకొద్దిమందియో ధనవంతులు రాజ్యాధిపతులగుటకు చేసిన ప్రచారము అనిగాని యనదరేమా? ఆశయనునది అందరకు సహజముగా యుండునదే! అది ప్రకృతి. కాని ధనముందు, భోగమందు ఆశగల ధనవంతులు అలాగునే ధనరాసులు అర్జించుకొనుచు భోగము అనుభవించుచు ఆనాడు ఈనాడుకూడ అట్లాగు నేయుచున్నారు. అంతకుపూర్వమూ అలాగు నేయుండేవారు, ఇకముందూ అలాగునే యుంటారు. ఇకపోగా భోగములను భారీగా అనుభవించిన ధనవంతులలో కొందరి హృదయముగల ఏకొద్దిమందియో: “ఎంతరెందరో లేమిచేకుమిలిపోతూ బాధపడుచుండగా, యుండి అనుభవించుట గొప్పయేనా?” యని తలచి, వారి హృదయములు కరగి సకల భోగభాగ్యములను అందరికొఱకు

త్యాగము చేసి సర్వులకు ఇట్టి అవకాశము కల్పించుటకై కృషి (తపస్సు యనిగాని మహాయజ్ఞమనిగాని యనవచ్చు) చేయ ప్రారంభించెదరు. ఒక మధురఫలమునుండియే గాని అట్టి యనేక మధురఫలములు సృష్టిపొందుటకు మరి యేయితరములవల్ల సాధ్యపడదుగదా! భోగియైనగాని యోగి కాజాలడు అని యోగివేమన అన్న సత్యము అనుభవయోగ్యమేకదా! ఇది ఈనాడే కాదు. సృష్టి మొదలిడినప్పటినుండి, పురాణకాలమునుండి బౌద్ధుడు, అశోకుడు, గాంధీ, నెహ్రూ, పటేల్, రంగాజీ మొదలగు నేటి ప్రభృతులవరకు దుష్టశిక్షణ, శిష్టరక్షణ జరుపుచూవచ్చినదే ఈమానవకోటి పురోభివృద్ధి చరిత్ర దీనిలో ఎవరు ఈకష్టములన్నియు పడకుండా హాయిగా వారిభోగ భాగ్యములను అనుభవించుచు కూర్చున్నవో అడిగేదెవరు?

మరి వీరి జీవితమంతయు తలచుటకే భయకంపితులను చేయునట్టి ఇట్టికష్టములను పడుటను పొట్టకూటికై పగటివేషాలు వేసేవారిగా చెప్ప సాహసించగలరా? అంతియే గాని బీదలను బీదలే బాగు చేయువలెను. అని ఆసౌభాగ్యములేమిటో, అవిసమకూర్చుకొనుటఎట్లో తెలియని, గాలిలోని మేడలవలె ఊహాగానమునకు మాత్రమే తోచినసమర్థత లేని, అనుభవము లేనివారు చెప్పేమాటలను ఎట్లువిశ్వసించదగును?

కాగా ఇట్టిమాటలను విశ్వసించుటవలన అనుభవపూర్వకసమర్థులైన మహాత్యాగులు మనకై చేసే మహాయజ్ఞమునకు పెద్దఆటంకమగుటయే గాక వారితపస్సువల్ల వారు ఎలాగా కీర్తికాములు అగుదురు. వారు చెప్పినది, చేసిచూపినది చేయకపోవుటచే మీరుమట్టుకు యథాతథంగానే యుండిపోవుదురు.

అందుచే ఈఅనుభవములేని తొందరపాటు ప్రచారములను నమ్మక కారణాకారణములను తెలుసుకొని యోగ్యతను గుర్తించుకోవలెను. మన కులభించినది అరుణోదయముమాత్రమేయని ముందుపుటలలో తెలియపరచుకొన్నాను. అందరూ సౌభాగ్యవంతమయ్యే ఏర్పాటులు చేసుకొనుటకు

ప్రథమావసరమైన స్వతంత్రపెత్తనమును మాత్రమే ఇప్పటికి లభించినది. ఇంత కాలముగా పెద్దవాడు చిన్నవానిని, చిన్నవాడు అంతకన్నా చిన్నవానిని కొట్టుకుతినే పద్ధతిని ఒక ప్రభుత్వయంత్రమును తయారుచేసి పర ప్రభువులు మన దేశమునకు ఏర్పాటుచేసియున్నారు. ఇప్పుడు చిన్నవారి ఆర్జితము చిన్నవారికే యుంటూ, పెద్దవారి ఆర్జితములో కూడ తగినంతగా మనదేశ సౌభాగ్యమునకై ఎవరికి కష్టము తోచని పద్ధతిని మరియొక ప్రభుత్వయంత్రమును తయారుచేసి మన దేశమునకు అమర్చవలసియున్నది.

ఇదివరకు ఒక పనికిమాలిన యంత్రముగల బస్సుయున్నదనుము. అది తోవలో ఎక్కడ పడితే అక్కడ ఆగిపోవుచు ప్రయాణీకులు తిండి లేకను, గమ్యస్థానమునకు అనుకున్న వేళకు వెళ్ళలేకపోవుటచే తీరని నష్టమును కలిగెడిది, దానికి తగిన మంచి యంత్రమును పెట్టుకొనే కోరికతో మనము ఆ బస్సును కొనుక్కున్నాము. నూతన యంత్రము. నూతన యంత్రమును తయారు చేసుకొనుచున్నాము. తయారు అయిన తరువాత పాత యంత్రమును తీసి కొత్తది అమర్చవలసియున్నది. మనమిప్పుడు ఇదే స్థితిలో యున్నాము. ఇంత కాలముగా మనము తలంచిన సౌకర్యములు సమకూర్చగలిగిన రీతిని మన ప్రతినిధులు మన కాన్స్టిట్యూయంట్ ఎసెంబ్లీలో (రాజ్యాంగ పరిషత్తులో) ఒక ప్రభుత్వయంత్రమును తయారు చేయుచున్నారు. ఈ యంత్రమును అమర్చువరకు పాత యంత్రముతోనే పనిజరుగుచున్నది. మన యంత్రము తయారగులోపల మన భారతనౌకకు అసలు ఏ యంత్రము లేకుండా తీసివేసుకో జాలము గదా! ఏ దేశమునకైనను ఏదో ఒక ప్రభుత్వయంత్రము లేకపోయినచో అరాచకమైపోయి ప్రజలు దిక్కులేక అల్లాడిపోవలసివచ్చును గదా!

ఇంతమాత్రమునకే అర్థము చేసుకోలేక వివిధరకములుగా చెప్పుకొనుట ప్రారంభించినవారు తప్పు పాతయంత్రమును తీసివైచి కొత్తయంత్రమును అమర్చే మాధ్యమములో స్వార్థపరులు, కృత్రిమపార్టీలవారు [illegible] ఇక సాగదని తలచి ఆఖరుసారిగా వారి వారి యావచ్ఛక్తిని

ఉపయోగించి దుష్ప్రచారములు సాగించి అమాయక ప్రజలను కలవరపరచే ప్రయత్నమున ఎంతవిగ్రహశక్తి అవసరమో ఆలోచించుకోవలసియున్నది. అంతేగాదు. ఈలోపున మనజాతీయప్రభుత్వము దేశమునకు ఏమి చేయ లేదు అని తలచుట పొరపాటు. దానివలన ఈవిమర్శకులు తాము తమకొఱకై చేసుకోవలసిన ఉడుతాసాయము చేసుకొనకపోవుటయే కాక, కనీసము తమకొఱకై ఏమి ఏర్పాటులు చేయబడుచున్నవో అనిగానైనను తెలుసుకొనుచుండుట లేదన్న మాట. నూతనస్వాతంత్ర్యము వచ్చువరకు అబద్ధము అస లేకపోయినట్టి అనూహ్యమున నడక అసలేలేకుండా చేసినస్థితిగాక ఈభారత నౌకను ఈలోపున చేయవలసిన (Running repairs & improvements) మరమ్మత్తులు, పురోభివృద్ధికార్యములు చేయుచునేయున్నారు.

ఫ్రాన్సుప్రజలు రెండువందల సంవత్సరములున్ను, అమెరికావారు వందసంవత్సరములున్ను ఈవిధముగా రష్యా, స్పెయిన్, ఇంగ్లండువంటి అనేకదేశములు తమతమ స్వరాజ్యముకై సంవత్సరములు తరబడిపోరాడి సంపాదించుకొని అస్వరాజ్యసంపాదనా పోరాటాలలో ప్రధానభూమిక వహించిన మెజారిటీపార్టీ స్వరాజ్యమును చక్కబెట్టుటకు అధికారము స్వీకరించిన వెంటనే కొద్దిరోజులలోనే మరియొకపార్టీవారు అర్ధరాత్రివేళ ఒక్కుమ్మడిని ఆప్రధానపార్టీ పెద్దనాయకులను హత్యచేసి రాజ్యాధికార మపహరించుకొనుచు, వీరుఅధికారమునకువచ్చి నాగికములు, కలములు చూచుకొనక ముందువీరిని మరియొకపార్టీవారు హత్యచేయుచు ఈవిధముగా రాజధానిలో ఒకపార్టీ ముఖ్యులను ఇంకొకపార్టీవారు హత్య చేసినవెంటనే దేశమంతటా ప్రతిగ్రామములోను పల్లెలోనుకూడా ఈ పార్టీహత్యలు. వారిసానుభూతిపరులహత్యలు వేలు, లక్షలసంఖ్యలో జరుగుచు రెండుమూడు సంవత్సరములపాటు ప్రజలుదిక్కులేక అల్లాడిపోవుట కలుగుచేది.

ఈప్రయత్నము మనదేశములోనూ జరుగకపోలేదు. పరాయిదేశ ఏజెంట్లుఅయిన కమ్యూనిస్టులు, మతప్రధాన మతఛాందసులు ఉగ్రవా

త్నము చేసియేయున్నాను. కాగా ఇంతవరకు ఏడు పుటలలో నిరూపించి యున్నట్లు మన కాంగ్రెసు అగ్రనాయకులు ప్రపంచములో ఎప్పుడూ, ఎక్కడా తలపెట్టని మొదటగనట్టి అతిరథ, మహారథవిజ్ఞానకోవిదులు కాబట్టి అహింసయే ప్రధానప్రతిజ్ఞగా పెట్టుకొని మనలను ఈవిపత్తునుండి యింతవరకూ కాపాడినారు.

ఒకప్రక్క ఈ చీకాకు పడుచునే మనదేశములోని మూడువంతుల జనాభాకలిగి బ్రిటీషు వారి సృష్టియైన ఎనిమిదివందల సంస్థానాల సమస్యను తమ సమగ్రతతో సమన్వయింపచేయగలిగి భారతజాతీయ కాంగ్రెసుకు ఈ అపూర్వ కీర్తి కాంతను చేకూర్చాడు కార్మికనాయకుడు, రాజదండధరుడు సర్దార్ పటేలు. స్వాతంత్రము సంపాదించుకొన్న ఇతరదేశాలకు ఇటువంటి సమస్య యేర్పడగనే యున్నప్పుడు మన దేశ జాతీయ నాయకులు చూపిన శ్రేష్ఠమైన సమన్వయ భావము చూపలేక పరస్పర యుద్ధములలోనికి దిగి ఇందువల్ల ఆయా ప్రజలను ఈ కష్టనష్టములకు కూడ పాల్పడి చివరకు ఎవరికివారే విడిపడి పరస్పర విద్వేష స్వతంత్ర రాజ్యములుగానే యుండి పోవలసి వచ్చినది. ఈవిధముగా ఏర్పడినవే పోలెండు, హాలెండు, ఆస్ట్రియా, హంగేరి, ఇంగ్లండు, ఐర్లండు మున్నగు చిన్నచిన్న అనేక రాజ్యములు. ఇవి ఒక్కొక్కటి మన జిల్లాలంతకూడ యుండవు కాని వీటి ఒక్కొక్కదాని స్వతంత్ర మనుగడవలన ప్రక్కనున్న ఇతర ప్రభుత్వములకు ఎప్పుడూ సుఖము లేకుండా పోవుచున్నది.

'మన స్వదేశ సంస్థానాల ప్రభువులను యేమి చేయకుండా అలాగునే గౌరవముగా యుంచని నెహ్రూ చూశారా! అందుచేతనే దీనిని పెట్టుబడిదార్ల, జమీందార్ల, ప్రభువుల సంస్థ యని అంటాం. వీరిని శిక్షించలేదు. వారి రాజ్యములనుండి తరిమివేయలేదు' అని ఇతరపార్టీలవారు అంటారు. అంతేకాదు. రష్యాలో ప్రభువులను సమూలంగా నరికివేశారుకూడా

డాక్టర్ జవహర్
పండిత్
నెహ్రూ

—o—





ఉక్కు
సర్దార్
పటేల్

—o—



ఆంధ్రకేసరి టంగుటూరి
ప్రకాశంగారు



డాక్టర్ పట్టాభి
సీతారామయ్యగారు







ఆంధ్రరాష్ట్రమునకే కాదు
యావద్భారత దేశమునకే
పండిత నెహ్రూ తరువాత
బాధ్యత వహించే
అర్హత పొందిన
జాతీయ, అంతర్జాతీయ వాది

ఆచార్య రంగాజీ



ఆంధ్రరాష్ట్ర సేవాదళనిర్మాత
ఆంధ్రరాష్ట్ర జాతీయ శ్రేముయూనియన్
కాంగ్రెసు అధ్యక్షులు

సర్దార్ గౌతు లచ్చన్నగారు
(ఎమ్. ఎల్. ఎ.)



ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెస్ సేవాదళము
జి. ఓ. సి. లు, కమాండర్లు



(శిక్షణ పొందిన ఆఫీసర్లు)



మహమ్మదీయ ప్రపంచ
ఆదర్శ జ్యోతి
మౌలానా అబ్దుల్ కలాం
ఆజాద్



భారత నౌకా వ్యాపార
పునః స్థాపకులు
శ్రీ వాల్చంద్
హీరాచంద్



ఆంధ్ర రాష్ట్ర
ప్రధాన కార్యదర్శి,
రాయలసీమ ముద్దుబిడ్డడు
శ్రీ కందుల
ఓబుల రెడ్డిగారు.



అహర్నిశలూ విరామము
నెరుగని రాష్ట్రకార్యాలయ
కార్యదర్శి.
శ్రీ నన్నపనేని
వెంకట సుబ్బయ్యాగారు

ఆంధ్రరాష్ట్ర
రైతుకాంగ్రెస్
ఉద్యమస్తంభం
(అధ్యక్షులు)
శ్రీ కొత్తపాటి
వెంకటసుబ్బారావుగారు





ఆంధ్రరాష్ట్ర యువజనకాంగ్రెస్
అధ్యక్షులు శ్రీ తుమ్మలపల్లి
సత్యనారాయణ మూర్తిగారు.





ఆంధ్రగాంధి, ఆధునికమహర్షి,
సర్దార్ శ్రీ గొల్లపూడి
సీతారామశాస్త్రిగారు





యువజనకాంగ్రెస్ నిర్మాత,
అఖిల ఆసియా యువజన
పరిచయసమితి సభ్యులు
శ్రీ పతానేని
విశ్వేశ్వరరావుగారు.



తూ॥ గో॥ జిల్లా యువజనకాంగ్రెస్
అధ్యక్షులు శ్రీ ముట్నూరి సోమ
సుందరంగారు ఎమ్. ఎ. బి. ఎల్.

ఇంకా కొన్ని రాజ్యాల ప్రజలు ప్రభువులను తరిమివేశారుకూడా. దీని ఫలిత మిద్వేషాలకే దారితీయును. వారిని అభిమానించినవారు గాని, వారి సంతతివారు గాని ఎప్పుడో ఒకప్పుడు తిరుగబడుటకు ప్రయత్నించి పోరాటమునకును, సంక్షోభమునకును దారితీయును. అలెగ్జాండరు పురుషోత్తముని గౌరవించినరీతిని యేదేశము కొనియాడుచుండలేదు? భారతపురాణములలో విన్నామే గాని ఇట్టి ప్రేమపూరితసౌహృద్యములు, దూరదృష్టివ్యవహారములు లేదు. ప్రపంచమానవకోటి కల్యాణమునకై భారతజాతియు కాంగ్రెసుచే అడుగడుగునకు అనుష్టింపబడుట చూడగల్గుచున్నాము. మనకు స్వరాజ్యము వచ్చిన వెంటనే బ్రిటిష్‌వారు ఒప్పగించివెళ్ళిన తమతమస్వంత చెలగాటపోదాలను నిలబెట్టుకొనుటకై తహతహలాడుచున్న ఈవందలకొలదిగా యున్న మహారాజులను, నవాబులను ఒక్కసారిగా రాజ్యభ్రష్టులుగా చేసి అగౌరవపడే విధానమున వ్యవహరించబోతే, వీరందరుయొకసై ఒక్కుమ్మడిగా తమకున్న యావత్తు సైన్యసంపత్తులతో తిరుగుబాటుచేస్తే మనదేశము యేపరిస్థితులలోనుండేదో కొద్దిగాయోచించుకోండి. కృత్రిమసృష్టియైన ఒకచిన్నమతోద్రేకపాక్ కాశ్మీరులోఉత్తరాదినీ, ఒకేఒకసంస్థానము(హైదరాబాదులో) దక్షిణాదినీ ఎదిరించినంతనే యావత్తుదేశప్రజలూ యేరీతిని తల్లడిల్లిపోయేరో, ఎంతెంత నష్టపడినారో చూచియేయున్నారు.

అందుచేతనే "మీరు పరిపాలన చేసుకొనుట తెలియని మూలాన్నే మీకు స్వరాజ్యమివ్వటం లేదు" అని చెప్పిన బ్రిటిషుప్రభుత్వంతో ప్రపంచంలోని అన్నిదేశములును మనకాంగ్రెసుయొక్క పరిపాలనాదక్షత. ఇట్టిచిక్కులలోని కార్యనిర్వహణను చూచి జోహారులర్పించుచున్నారు. ప్రపంచమునకంతకును ఒకదారిచూపించి నడపగలిగినది భారతజాతియు కాంగ్రెసేయని విశ్వసించుచున్నారు. స్వతంత్రభారత ప్రథమప్రధాని, డాక్టర్, పండిత నెహ్రూగారున్నను బ్రిటిషు కామన్వెల్తు రాజ్యాల ప్రధానులసభకు లండను వెళ్ళినప్పుడు దానినిబూజావుచేసి ఆకీర్తికాంతను

కూడ మనకు స్ఫురింపవచ్చును. ఒక్క పదము మార్పుతో. ఒక్క మాట పలుకులో మన నాయకులు కోటానుకోట్ల ప్రజలను రక్షించగలరు. మార్పులేక అది. "బ్రిటిషు" స్థితిచేసి స్వతంత్ర రాజ్యాల సమాఖ్య అని సిఫారసుచేసిన ప్రతిపాదనను అంగీకరించడంలో, ఇంతకాలమిట్లు పరస్పరఅనుమానాలతో యుంటూన్న అమెరికామున్నగు దేశములు ఒక్కొక్కటే అన్ని దేశముల ప్రజలచిరకాలవాంఛితమైన ప్రపంచ రాజ్యాల సమాఖ్యలో జేరుతున్నాయి.

ఈరీతిని భారతజాతీయ కాంగ్రెసు ఒకప్రక్కను మన జాతీయశాంతిని కాపాడుచు, మరియొకప్రక్కన అంతర్జాతీయశాంతి స్థాపనకొరకు కూడ అతిసమర్థతతో నిర్వహించుచున్నది. మేమొక్కరమే అంతర్జాతీయ వాదులమని చెప్పుకొనే రష్యా ఏజంట్లయిన కమ్యూనిస్టులకు ఈసాదృశ్యమైన జవాబు చక్కచేయాలిగదా! ఈరీతిని తెలుసుకొనేవారికి అడుగడుగునకు, ప్రతినిమిషములోను, ప్రతివ్యవహారములోను కాంగ్రెసు సాదృశపూర్వకముగా చేయుచున్న కృషిగోచరించును. మాటలుచెప్పి చేతలు చేయనివారు చెప్పేమాటలు వకటి, చేసేది మరియొకటిగా యున్నవారు మనదేశమునకు చాలమంది కలరు. చెప్పినంత చేయునదియే కాంగ్రెస్.

కాంగ్రెసులోకూడ దగాకోరులు కొందరుదూరియున్నారు కావున స్వరాజ్యమువచ్చాకా దేశమును బాగుచేసుకొనే కార్యక్రమములో కాంగ్రెసునుండియు, ప్రభుత్వమునుండియు ప్రజలకు ఈసౌకర్యములు అందకుండా మధ్య వీరిఆటంకము ఎక్కువగానుండునని పూర్తిగా గ్రహించియే కాంగ్రెసులో ఇట్టివారికి తావులేకుండా చేసుకొనుటకు వీలుగా విశ్వస్త సేవకుల (Effective workers) విధానమును అమలుపరచుచున్నారు. అనగా తమకు సేవచేయగలవారినే కాంగ్రెసు కార్యకర్తలుగా వ్యవహరించుటకు కమిటీలలోనికి ప్రజలఇష్టప్రకారము పంపుకొనుటకు వీలుకల్పించబడ్డది. దీనివల్ల కృత్రిమనాయకులు, స్వలాభపరులు ఒక కాంగ్రెసు ద్వారా

తగిలించుకొని మేము కాంగ్రెసు నాయకులమని చెప్పుకొని ప్రజలకు, మంత్రులకు మధ్యఅటంకముగా నిలబడుటకు ఇకవీలుండదు.

ఈరీతిని ఒకప్రక్కను ప్రజలు సుళువుగా ఉపయోగించుకొనగల ప్రజాయంత్రమును, మరియొకప్రక్కను ప్రజలకుసౌకర్యములు చేకూర్చగల ప్రభుత్వయంత్రమును తయారుచేయబడుచుండగా ఎప్పటికప్పుడు ఈవివరములకొరకు ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసునకు వ్రాసి తెలుసుకొనుట ప్రజలదే లోపమైయున్నది. అనేక గ్రామములవారు ఇట్లు ఆచరించి తెలుసుకొని సుఖించుచున్నారు. ప్రతిగ్రామములవారుకూడ ఏజాతివారైనను, ఏమతమువారైనను, కార్మికులైనను, కర్షకులైనను, బుద్ధిజీవులైనను, కళాకారులైనను మరియేయితరవృత్తిచే జీవించుచున్నవారైనను ఎట్టిబాధలున్నను ఇట్లువ్రాసి తెలుసుకుని ఆప్రకారము ఏర్పాట్లుచేసుకొని సుఖించెదరని ఆశించుచున్నాము.

ఇందుకుగాను ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్‌సంఘము సాలుకుకొన్ని వేలు ఖర్చుపెట్టుచున్నది. నెలకు కనీసం రెండు మూడుచొప్పున వేలకొలది గ్రామములున్నటువంటి 13 జిల్లాలకు సర్క్యులర్లు, ప్రకటనలు పంపుటకు కాగితము, ప్రింటింగు, పోస్టేజిఖర్చులకు రాష్ట్రకమిటీకి కొన్నివేలున్ను, జిల్లా కమిటీలకు కొన్నివందలున్ను ఖర్చగుచున్నది. ఐనను నామమాత్రమునకు యున్న కొన్నిస్థానికకమిటీలు వీటికి బూజుపట్టిస్తున్నారు. ఆగ్రామప్రజల గురించి యేమివచ్చినదో తెలియుటలేదు. ప్రజలకు తెలియజేయుటకుగాను రాష్ట్రమువారుకొన్ని వేలున్ను, జిల్లావారు కొన్నివందలున్ను ఖర్చుచేయుచున్నప్పుడు గ్రామకమిటీలవారు ఈఖర్చును నిరర్థకము చేయకుండాను, తమగ్రామప్రజలు బాగుపడుటకుగాను, పదిరూపాయలయినా ఖర్చుపెట్టి ఆప్రకటనలను అచ్చొత్తించి ఆగ్రామప్రజలకు పంచిపెట్టవలదా! ఐనను ఇట్టి గ్రామకమిటీలు నిర్దుష్టమగు లోపున ఆయాగ్రామములలోని ఆసక్తికలవారు ఈవిధమగు కార్యాపహారణవల్ల నష్టపడకుండా తమకేమైనా సంఘములున్న

చోట్లవాటిద్వారాను, లేక తమంతటతాముగాను సాలుకు ఐదురూపాయిలు కట్టినచో రాష్ట్ర కాంగ్రెస్ సంఘము వివిధవిషయములగూర్చి ఏ నెల చేసిన కార్యములు ఆ నెల అచ్చొత్తించుచున్న పుస్తకరూపమైన బులెటిన్లను నేరుగా పొందగల అవకాశము కల్పించినారు.

ఈవిధముగా ఒకవంక (Main stays) మూలస్తంభములను ఏర్పాటుచేయుచునే మరియొకవంక మనరాజ్యాంగయంత్రములో ఏమిఏర్పాటులు చేయుచున్నారో చూద్దాం. ఏ దేశమయినను స్వరాజ్యము సంపాదించుకున్నాక నాలుగైదు సంవత్సరములు ఒకరికత్తులు వకరు నరుకుకొనుచూ అరాచకముతోనుండి; అందరకు కాళ్లులాగి దానినుండి బైటపడి ఒక సుస్థిరప్రభుత్వము ఏర్పడ్డతర్వాత; అప్పుడు ప్రజల సౌకర్యముల కొరకు పంచవర్ష ప్రణాళికను తయారుచేసి అమలుపర్చుకొనగలిగిరి. ఒకటిరెండుపంచవర్ష ప్రణాళికలు నడచినగాని ప్రజలకు స్వాతంత్ర్యము యొక్కరుచి తెలియదు.

మనదేశమునకు అంతసంక్షోభము లేకుండగా చేయుటయే కాక అంత కాలము అగనవసరము లేకుండా అప్పుడే పంచవర్ష ప్రణాళికలు తయారు కాబడుచున్నవి. అంతియే కాదు. నూతన రాజ్యాంగముప్రకారము ప్రభుత్వము ఏర్పడి వీటిని అమలుపర్చేవరకు అగనవసరము లేకుండా ఈలోపుగనే ఎట్టిస్కీములు అమలు జరుపుచున్నారో గమనిద్దాం.

కార్మికులు ఇంత కాలముగా కోరుచున్న న్యాయమైనహక్కులతో సహా కార్మికులనుగురించి ఎంతెంతో ఉపన్యాసాలిచ్చి, ఎంతెంతో శ్రమ పడుచున్నాం అని చెప్పేవారుకూడా కలలోకూడా అనుకోనటువంటి సౌకర్యములనుకూడ కల్పించుచు ఏర్పాట్లు చేయుచున్నారు.

కార్మికులకు గృహనిర్మాణము చేసేస్కీములో ప్రప్రథమముగా అప్పుడే 10,00,000ల గృహములుకట్టుటకు సేంక్షను చేసినారు.

పరిశ్రమలో కార్మికుడు యజమానితో భాగస్వామియేయను సూత్రమును గమ్యస్థానముగా పెట్టుకుని ఈరీతికి చేర్చుటకు ఉభయులకు కష్టముతోచనిరీతిని తగుసన్నాహములు చేయుచున్నారు. దీనికి నాంది ప్రస్తావనయే కార్మికులు సహకారపద్ధతిపై తమవృత్తిని 'స్వంతముగా సాగించుకొనుటకు అవకాశము కల్పించిన ప్రభుత్వవిధానము.

ఏమి? మాటాడితే ఉభయులకు కష్టముతోచనిరీతి అని ప్రతివిషయములోను చెప్పుచున్నారు- ఇదివరకునుండి అనుభవించుచున్న హక్కు అధోగతి పాలుజేసి కక్షతీర్చుకోకుండా యని అంటారు కొందరు దుడుకుతనపు సోషలులు.

ఈ కక్ష తీర్చుకొనుటవలన సంభవించేకష్టపరంపరలుగూర్చి ఇంతకు ముందే తేటతెల్లముగా విశదపరచబడ్డది. ఐనను ఈ సహేతుకమైనవిషయమును అర్థముచేసుకోలేనికొందరు 'ఎప్పుడో ముందువచ్చేదానికేమి? ఇంతవరకు మాకుజరిగినదానికి ప్రతీకారముచేసివేసే తక్షణం మేము అనుభవించవలసినదే గాని ముందుఎప్పుడో మామీద కక్ష సాధించుకోబోయేటప్పుడు చూచుకొనవచ్చులే. అనవచ్చును.

ఇంకా ఏమియులేనిదే ఎప్పుడోవచ్చేసుఖములను కక్షిదారులు ఎదిర్చి తీసుకుపోకుండా చూచుకోవచ్చులే నేటప్పుడు- ఈనాడు సుఖములను అనుభవించుచున్నవారిని మాకొఱకై కొద్దిత్యాగమునైనను చూపవలసియున్నది లేకపోయిన ముందుఇబ్బందిపడవలసి వస్తుందినుమా'' యని మేమునచ్చచెప్పుట ఎంతకష్టమో కొంతయోచించుకోవలసియున్నది. ఆచరణవిషయములో ఇంతఇబ్బందియున్నను, ఏదోవిధముగా ప్రభుత్వముచే శాసనములు చేయించుచు, కొంత కాంగ్రెస్ పలుకుబడిని ఉపయోగించుచు ముఖ్యముగా జాతీయ కార్మికులతోడ్పాటువల్ల కొంతకొంతగా సాధించుకొనుచు రాగలుగుచున్నాము, ఈవిధానమువల్ల పైపెట్టు సాధించేటప్పుడు

యజమానులకు కొంతకష్టము కలిగినను మరుచటి పెట్టు సాధించే సమయము నకు ముందు కలిగిన కష్టమును మరచిపోవుటకు సావకాశము ఏర్పడు చున్నది. అంతేగాని ఒక్కుమ్మడిని యజమానులను నాశనముగా మారిపో మన్న అదివారికి ఎంతవిడ్డూరముగాతోచి, ఆస్థితికి పాల్పడకుండాచేసు కొనుటకు ఎంతప్రతిఘటన- అప్రతిఘటనలో ఎట్టివిధానములు అవలంబింతు రో దానివల్ల కలిగే పర్యవసానము సులభముగానే గ్రహించుకోవచ్చును, అంతవరకు ఎందులకు! యూనియన్లు ఏర్పడుటకు అవకాశములుగల కార్మికు లను "మీకు పెన్షన్సు, ఏక్స్ట్రాగా పాప రెండుమూడురూపాయలజీతము; జీతముమీద అలవెన్సులు, బోనసులు మున్నగునవి సమయములు ఉన్నవి గదా! ఇంకను ఒక్కరు, కొల్లకొల్లరిగా ఉన్నటువంటి ప్రతిదినము పని యుండునని చెప్పలేనటువంటివన్నీ , అసలుపనులు దొరకకుండా యున్నటు వంటివాన్ని కార్మికులు. వీరలు ఉన్నారుగదా! వారు పాపము చాలకష్ట ములుపడుచున్నారు. మీరు వారితోవంతులప్రకారము పనులుపంచుకొనుట యో లేక వారిగురించి మీ జీతములో కొంతత్యాగమో చేయవలసినది" అని ఎవ రైనా ఫేక్టరీ కార్మికులను కోరినచో వారికెంతకష్టముతోచునో, ఎంతకోప మువచ్చునో ఊహించుడు. అందుచేతనే ఎవరికికష్టముతోచనటువంటిన్నీ కావలసినపని జరిగేటటువంటిన్నీ ఉత్తమపద్ధతి మహాత్ముని మనోరూపమైన కాంగ్రెసుచే అనుసరించబడుచున్నది.

ప్రపంచములో ఏదేశములోనైనను గాని, ఏకాలమునైనను కాని, యెవరి వల్లనైన గాని ఇట్టిసమస్యలేవైనా ఉద్భవించినప్పుడు మహాత్మునిముందు పెట్ట బడుచుండెడిది. పాశ్చాత్యరాజ్యాలలో కొన్నిచోట్ల ఈమధ్యను (అనగా దాదాపు 20 సంవత్సరములక్రితమునుండి) దిగంబరత్వము (Nuadism) మానవకోటికి ఉత్తమమార్గమనెడి ఒక వాదన; ఒక ఉద్యమము బయలుదేరినది. కొన్నికొన్ని ప్రదేశములను కేటాయించుకొని వాటిలో ఈజీవనమును అవ

లంబించేవారు కుటుంబసహితముగావచ్చి దిగంబరులుగా వ్యవహరించుట మొదలిడిరి.

ఈవిషయమును గూర్చి మహాత్ముని అభిప్రాయము కోరగా సిద్ధాంతము మంచిది కాదనలేను. కాని ఆచరణలో పెట్టినప్పుడు అనేకతరములుగ మానవునస్వభావమునకు యేది ఆచరిస్తే విరుద్ధముగా తోచునట్లు అలవాటుపడియున్నారో అట్టివిధానము మంచిదైనప్పటికి ఒక్కుమ్మడిగా ఆచరణలో పెట్టుట అంతపరిజ్ఞానముకలవారికితప్ప సామాన్యప్రజలకు అది విపరీతముగా తోచును (It will shock the common people) కావున యుక్తము కాదు శ్రేయస్సు కాదు అనెను. *

హరిజనాభ్యున్నతికి ఇట్టివిధానమే అవలంబించబడినది. మొదట ప్రచారము సాగించబడెను. అట్టిపరిజ్ఞానముకలిగి దానిని ఆచరణలో పెట్టగల ధీశాలురు సాధ్యతము _ ఆచరణలో పెట్టుటయే ఇట్టిఉత్తమసంస్కారములకు విస్తృతములు తరువాత ధర్మకర్తలు ఇష్టపడినచో వారిప్రజాసంస్థలలోనికి ప్రవేశించగలుగుటకు మార్గమేర్పరచిరి. దానివల్ల సామాన్య ప్రజలకు ఇష్టము లేకున్నను [illegible] కలిసి తిరుగుటకు అలవాటుపడిరి. దానికై పైమెట్టుగా మొన్న పబ్లిక్ సంస్థలలోనికి రానివ్వకుండా ఆటంకపరచుట కాని అంటరానివారుగ వ్యవహరించుట కాని శిక్షార్హమగునని శాసనము చేసిరి. ఇప్పుడు గ్రామములోనికి తీసుకవచ్చుటకు యేర్పాటులు చేయుచున్నారు.

ఈవిధముగ మనదేశప్రజలకు ఎవరికి యేమి కావలయునో, వారికి అదిలభింపజేయుట ఎట్లో తెలిసి ఆచరించుకొనుచు పోవుచున్నదే భారత జాతీయ కాంగ్రెస్ విధానము. కార్మికులు ఏదిక్కు లేకుండా కష్టబెట్టబొట్ట

* మనదేశములోకూడ ఇట్టి ఉద్యమమువచ్చె ([illegible] లో) వ్రతాచారి ఉద్యమమను పేర కొద్దికాలము ప్రచారము సాగినది కాని అది ఇప్పుడేమైనదో తెలియదు.

బడుచు బానిసలవలె పనిచేయుచున్న రోజులలో 1920 ప్రాంతాలలో గాంధీని స్ఫూర్తి ప్రేరితులయి సర్దారు పటేల్ అహమ్మదాబాద్ బట్టలమిల్లు కార్మికులకు శ్రీ వి. వి. గిరిగారు బి. ఎన్. ఆర్. రయిల్వే కార్మికులకు ఆన్డ్రూస్ బారింగు తాతా ఇనుప ఉక్కు కర్మాగారములలోని కార్మికులకు ఈవిధముగా దేశమాన్యులలో గొందరు మహానుభావులు కార్మికులకు నాయకత్వము వహించి, కష్టనిష్ఠురములు సరిదిద్దుకొనుటకు నలుగురునుకూడ దీసేటప్పటికే ప్రభుత్వము విరుచుకు పడేరోజులలో, ప్రచండమైన పోరాటములు సాగించి బ్రిటిషుగవర్నమెంటును తల్లడిల్లజేసి చివరకు కార్మికులు తమసౌఖ్యమునకై న్యాయమైన హక్కులుకోరి సంపాదించుకొనుటకు గాను యూనియనులుగ ఏర్పడుటకు ప్రభుత్వముచే ఒప్పుకొనునట్లుగా చేయగలిగిరి. అదియే 1925 ట్రేడుయూనియన్ ఏక్టు.

కార్మికోద్యమమును ప్రభుత్వముచే గుర్తింపచేసే అంతటి బలవత్తరమయినదానిగా చేయుటకుగాను వీరు ఈక్రిందివిధానము అవలంభించ వలసివచ్చెను.

ఏదైనను ఒక కార్మికసంఘము తమయజమానులకు తమ కష్టసుఖము లను తెలుపుకొనుచు తత్సంబంధమైన కనీసహక్కులను కోరినపుడు ఎవ రైన కాలపరిణామమును గుర్తించని తలబిరుసు యజమాని వాటినిగూర్చి ఆలోచించుటకు కాదుగదా! కనీసము వినుటకుకూడ నిరాకరించి నప్పుడు న్యాయపద్ధతమయిన, వినయపూర్వకమయిన అన్నిపద్ధతులు వినియోగించేక కడకు తప్పనిసరిగా మహాత్ముడు ఇచ్చిన సహాయనిరాకరణ అస్త్రమును (సమ్మె) ప్రారంభించవలసివచ్చినపుడు యజమానులు పైనుండి వేరె కార్మికులను (Black-legs)ను తెచ్చి సమ్మె ను భగ్నపరచ కలిగియుండిరి. కార్మికులను ఈఇక్కట్టునుండి తప్పించుటకు గాను ఇట్టియూనియనులను అన్నిటిని జేర్చి అఖిలభారత ట్రేడ్ యూనియన్ కాంగ్రెసును స్థాపించిరి. ఏదైన యొక కార్మికసంఘమునకు సమ్మెచేయ

గిరి ముఖ్యుగ మన పెద్దలను నమ్మించి వారినే ఈ కార్మికత్రిసంస్థకు పెద్దలు
గా ఉంచుకొని వారిచేతనే తాము నాయకులుగా యున్న యూనియను
లకు ఉపకారములు చేయించుకొనుచు వీరు కాంగ్రెస్‌లోనేయుండి
కాంగ్రెసు పలుకుబడితో కార్మిక సంఘములలో దూరకల్గిరి.

ఇట్లు అఖిలభారత ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు లో తమ అధిక
సంఖ్యా ప్రాబల్యమును సంపాదించుకొని 1942 ఉద్యమములో మన నాయ
కులు సేవకులు కారాగారములలో యున్నతరి. ఇంతకుముందు ఈ కార్మిక
సంఘములకు ఎట్టిరాజకీయసంస్థలతోను సంబంధము లేదని నమ్మించుచు
చెప్పుచున్నవారు ఇదే సమయమని తమనిజరంగులతో బయటపడి బ్రిటిషు
దానిసత్వమునుండి బయటపడుటకు మనచరిత్రాత్మకమయిన తుది పోరాట
సమయములో వీరు బ్రిటిషువారితో చేతులు కలిపి ప్రభుత్వ సహాయ
ముతో ఈ కార్మిక సంఘములను కమ్యూనిస్టుసంఘాలుగ వ్యవహరింపజేస్తు
కార్మికులవద్దనుండి రష్యాదినమని, మే డే యని, స్టాలిన్ జన్మదినమని
సమ్మెలకు సన్నాహాలని, ఏవేవో పేర్లతో డబ్బు వసూలు చేస్తూ అనుభ
వించుచు,తమ పార్టీని బలపరచుకొనసాగెరు,ఇదేవిధముగా విద్యార్థిసంఘాలు
ను, యువజనసంఘాలను, మహిళాసంఘాలను రైతు, కూలీసంఘాలను అది
వనులలో కమ్యూనిస్టు సంఘాలుగ వ్యవహరింపజేయుసాగేరు.

మనదేశనాయకులు తిరిగి జైలునుండి బయటకు వచ్చాక ఈవిషయ
మును చూచి మనదేశప్రజలకు కలుగనున్న ఈభయానక విపత్తునుండి కా
పాడుటకు దేశమంతట పల్లెపల్లెల వాడవాడల పర్యటించి కర్తవ్యప్రబోధ
ము కావించిరి. అంతట ఈవివిధవర్గప్రజలు తమకు జరిగిన మోసమును, తమ
జాతీయతా ధర్మమును గుర్తించుకొని వెంటనే ఈపరదేశవలలైన సంఘము
లనుండి విడివడి విద్యార్థికాంగ్రెస్, యువజన కాంగ్రెసు, మహిళా కాం
గ్రెసు, రైతు కాంగ్రెసు, రైతుకూలి కాంగ్రెసులను ఏర్పాటు చేసుకొనిరి,

కొద్ది కాలములోనే అక్కడను పుష్టియైన కమ్యూనిస్టు సంఘములు వట్టిపోయి బోర్డులుమాత్రముకు మిగిలిపోయి నామరూపాలు లేకుండా పోయినవి.

కాని కార్మికులలో విద్యగలవారు తక్కువగుటచే రాజకీయ పరిజ్ఞానము కల్గుటకు అవకాశములు తక్కువ గాన, ఇతర వర్గముల వారు తామంతట తాము స్వేచ్ఛగా విడబడి జాతీయసంఘములుగా మార్పుజేసుకొని వాటి నుండి తమతమ జిల్లా, రాష్ట్ర, అఖిలభారత వర్గ కాంగ్రెసు సంఘముల ను నిర్మించుకున్నట్లుగా చేసుకొనలేకపోయిరి. పెద్దపెద్ద పట్నముల లోని రాజకీయ చైతన్యముగల * ఏ కొద్ది యూనియనులో తప్ప తక్కిన వారందరు అమాయకులగుటచే తమకు ఏమిజరుగుచున్నదో, దానికి ఏమి చేసుకొనవలయునో తెలియక • అట్లనే యుండిపోయిరి.

మిగిలియున్న ఈ ఒక్క అవకాశమును తీసుకొని ఈ రాజకీయ చైతన్యములేని కార్మికులను ఉపయోగించుకొని మనదేశమునకు దానితో పాటు మన కార్మికులకు కూడ ద్రోహము తలపెట్టి పరాయి దేశమునకు ఒప్పగించుటకు సమకట్టిరి. ఒకప్రక్క ముస్లింలీగువల్ల ఘోర రక్తపాతము జరుగుచుండ మరియొకప్రక్క వీరు ఎల్లెడలా సమ్మెలను లేవదీసిరి. తాము కూర్చున్న కొమ్మను తమ చేతనే నరకించుచున్నారని ఈ అమాయకులకు

---

* పెద్దపెద్ద పట్నములలోని కొన్ని పరిశ్రమలలోని కార్మిక యూనియనులలో తమ ఉద్యోగులకు, మంత్రులకు కూడ పాఠము చెప్పగల విద్యార్థులు యుండురు.

• గత తొమ్మిది సంవత్సరములనుండి జిల్లా కమ్యూనిస్టు ఆఫీసునుండి నడపబడుచూకూడ తాము కమ్యూనిస్టు నాయకత్వముక్రింద యున్నామని తెలియని యూనియనుకూడ ఎరుగుదుము.

తెలియదు. తాము జీవయాత్ర యనే ప్రయాణమును సాగించుచున్న ఓడకు చిల్లులు పెట్టి తామే కాక తమతోయున్నట్టి ఇతర ప్రజలనుకూడ ముంచు కొనుచున్నారని తెలియదు. ఈ సమ్మెలవల్లనే వివిధ పరిశ్రమలలో అనగా బట్టలు, ఆహార పదార్థములు, గృహ, రవాణా, వైద్యము మున్నగు మన నిత్య జీవితమునకు అవసరమయ్యే సిమెంటు, రాయి, బొగ్గు, ఇనుము, నూనెలు కిరసనాయిలు మున్నగుపదార్థములు ధర లెక్కువగుటకు కారణమని తెలియదు.

ఈవిపత్తునుకనిపెట్టి మనదేశ కార్మికులకొరకు ఆదిలో పునాదులు వేసిపెట్టిన మననాయకులే, నూతనముగా మనకువచ్చిన స్వరాజ్యమును పుట్టినప్పటికే ఇంటా బయటాకూడ కలిగియున్న అనేక సమస్యాదుర్గతులనుండి రక్షించుకొనే ముఖ్యమగు కార్యములలోను, దేశపునర్నిర్మాణ కార్యములలోనుకూడ నిమగ్నులైయున్నను, కమ్యూనిస్టులు ఈ కార్మికుల అమాయకత్వమును ఉపయోగించుకుని, ఈ కార్మికులతోపాటు మనదేశము మొత్తమునకే కలిగించనున్న ఈపద్రవమునుండి కాపాడుటకు మనదేశీయ కార్మికులు మరెప్పుడు, ఎవరి చేతిలోను ఆటవస్తువులుగా ఉపయోగపడే స్థితిలో నుండకుండ తాము పూర్తి రాజకీయచైతన్యులై స్వతంత్రముగా వ్యవహరించుకొనేరీతికి వచ్చునట్లుగా చేయుటకుగాను ఒక సంస్థను స్థాపించుటకు మరల శ్రమ తీసుకొనవలసి వచ్చినది. దీనికి జాతీయ రాజకీయ చైతన్యముగల యూనియన్ల ప్రతినిధులు పెక్కుమందివచ్చిరి. యీ అనుభవశాలురయొక్క పూర్వ అనుభవములను, ఇప్పటి దేశపరిస్థితులను, ముందు మనదేశీయులకు ఒనగూర్చనున్న సౌకర్యప్రణాళికలను దృష్టిలోనుంచుకుని, యువజన, విద్యార్థి, రైతు మున్నగు కాంగ్రెస్‌లవలెనే మనదేశీయ కార్మికులకు అఖిల భారత జాతీయ ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్ అనుసంస్థను ఏర్పరచిరి.

జాతీయభావము, దేశభక్తి కల్గి జాతీయ కాంగ్రెస్ నాయకత్వమును అభిమానించిన కార్మికులెల్లరు తమ యూనియనులను వెంటనే ఈసంస్థలో

చేర్చి, ఈసంస్థయొక్క సభ్యత్వమును సంవత్సరములోపుననే చేతులలోనికి తీసుకువచ్చి ఈసంవత్సరపు అంతర్జాతీయ కార్మికమహాసభలకు ప్రతినిధులను పంపుకునే మెజారిటీ అర్హతను సంపాదించుకుని భారతదేశ కార్మికులు కూడ దేశములోని యితరప్రజలవలె అధికసంఖ్యాకులుగా కాంగ్రెసుపక్షాన్నే యున్నారనిబుజువు చేసినారు.

ఈఅంతర్జాతీయ కార్మికసభలు తక్కిన అంతర్జాతీయవర్గ మహాసభలకు వలెనే ఏటేటా పేరిస్, లండన్, జెనీవా మున్నగు ఒక్కొక్క దేశ ముఖ్యపట్టణములో జరుపుచుందురు. ప్రతిదేశమునుండి ఒక్కొక్క కార్మికప్రతినిధి వర్గముచొప్పున వచ్చి మొత్తముమీద ఏఏ దేశములోని యేయే కార్మికులకు యెట్టికష్టములుగలవో, యెట్టిసౌకర్యములు చేయబడినవో ఇంకను యెట్టిసౌకర్యములు కావలసియున్నవో, ఆసౌకర్యములుకలుగజేయుటకు ఏవిధానములను అనుసరించవలసినదిగా ఆయాప్రభుత్వములను కోరవలెనో మున్నగుసమస్యలు చర్చించి నిర్ణయించెదరు. కాని ప్రతిదేశంలోను అనేక రాజకీయపార్టీలు ఒక్కొక్కపార్టీని అనుసరించే ఒక్కొక్క కార్మికసంస్థ యున్నవి. ఆయాదేశములు యేకార్మిక సంస్థనుండి తమ దేశకార్మిక ప్రతినిధులుగా పంపుట! ఇందులకుగాను ఒక్కొక్క దేశము తమదేశములోని వివిధ కార్మికసంస్థలు ఎంతెంతమంది కార్మికులకు ప్రాతినిధ్యం వహించుచున్నవో లెక్కలు సేకరించి వాటిలో మెజారిటీ కార్మిక ప్రాతినిధ్యముగల సంస్థనుండి తమదేశ కార్మిక ప్రతినిధులుగా పంపించెదరు. యీసంవత్సరము అంతర్జాతీయ కార్మికసభ మనజాతీయ ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు యేర్పడిన దరిదాపు 10 మాసములలోనే జరుగుట తటస్థించెను. ఐనను మనదేశములోని తక్కిన కార్మికసంస్థలకన్న ఎక్కువమంది కార్మికులు ఈభారతజాతీయ ట్రేడ్ యూనియన్ కాంగ్రెసులోనే యున్నారని లెక్కతేలుటవల్ల యీసంవత్సరము ఉత్తర అమెరికాలోని సాన్‌ఫ్రాన్సిస్కోలో జరిగిన అంతర్జాతీయ కార్మికమహా

సభలకు భారతదేశ ప్రతినిధులుగా ఈ భారతజాతీయ ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్ ప్రతినిధులనే పంపించినారు. అందు వరుసగా ఆంధ్ర దేశము నుండి మన ఆంధ్రరాష్ట్ర జాతీయ ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్ గౌరవాధ్యక్షులు, కార్మిక బాంధవుడు, రైతుకూలీ ప్రజా రాజ్యాశయాధినేత, ఢిల్లీ శాసన సభాసభ్యుడు, ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెస్ అధ్యక్షుడు, అఖిలభారత కాంగ్రెస్ కార్యవర్గసభ్యుడు, రాజ్యాంగపరిషత్ సభ్యుడు, కేంద్ర శాసన సభలోను, ఆంధ్ర రాష్ట్రములోను పరిశోధక సంస్థల స్థాపకుడు, గ్రామపంచాయతీ రాజ్య వ్యాప్తి కృషీవలుడు, అఖిల భారత ప్రపంచ రైతు ఉద్యమస్థాపకుడు, అఖిల భారత చేనేత కాంగ్రెస్ స్థాపకుడు; వ్యవసాయకూలి కాంగ్రెస్ స్థాపకుడు, చిన్నవయస్సులోనే ఆంగ్లదేశములోని ఆక్స్‌ఫర్డు విశ్వవిద్యాలయములో ఎం. ఎ. బి. లిట్ పట్టభద్రుడై భారతదేశములోని వివిధ వ్యాపక వ్యాప్తికై, ఇంగ్లాండు, అమెరికా, ఫ్రాన్సు, ఇటలీ, జర్మనీమున్నగు దేశములు పర్యటించిన జాతీయ, అంతర్జాతీయ రాజకీయజ్ఞుడు; ముఖ్యముగా పార్టీలు, కక్షలతో బహుకాలముగా కుమిలిపోవుచు ప్రజలను నలిపివేయుచున్న ఆంధ్రరాష్ట్ర బహునాయకత్వ రాజకీయములను యేకత్రాటి పైకి తీసుకొని రాగల్గి ఆంధ్రప్రజలు ఇక నిర్భయముగా, నిబ్బరముగా బ్రతుకగల్గునట్లొనరించి ఆంధ్రప్రజల పాలిట కల్పతరువా యనిపించుకొన్న వైషమ్య విరోధి, విరోధసమన్వయ సంధానకుశలుడునైన ఆంధ్రసహాత్రి ఆచార్య రంగాజీని పంపుకున్న గౌరవమును ఆంధ్రజాతీయ కార్మికులు పొందగల్గిరి.

అంతేకాదు, కమ్యూనిస్టులవలెనే, కాంగ్రెస్‌లోనే యుండి పలుకుబడి సంపాదించమదిరి, స్వంతముగా వ్యవహరించుటకు తగిన బలవంతుల మయ్యేమని తలచి మొన్నను నిజరంగులతో బయటపడిన సోషలిస్టుపార్టీ శాసనసభలలో కాంగ్రెసు పేర సభ్యులుగానున్న తమపార్టీ సభ్యులను బయటకుపిలచి అంతటితో ఆగక కాంగ్రెసుకన్న కమ్యూనిస్టులకన్న తక్కిన అన్ని ఇష్టులకన్న ఈ దేశములో మాకే ఎక్కువ ప్రజాబలమున్నదని చాటు

దలచి అసెంబ్లీకుజరిగిన ఉపయెన్నికలలో పోటీ చేసినారు. ఉత్తరాదిని సంత్రం ఆల్ ఇండియా సోషలిస్టుపార్టీకే తలమానికమైనఆచార్యనరేంద్రదేవుయున్ను మనమదరాసుశాసనసభకు విశాఖతూర్పుగోదావరిజిల్లాలనియోజకవర్గంనకుఈనియోజకవర్గమునుండియేగతఎన్నికలలో కాంగ్రెసుటిక్కెట్టుపై శాసనసభకు కార్మికసభ్యుడుగా ఎన్నిక అయిన శ్రీ మల్లిఖార్జునరావుగారున్ను పోటీచేశారు. కమ్యూనిస్టులుకూడా ఇదే సమయమున తమకులభించిన ఈ అవకాశమును మనదేశములో తమ అభివృద్ధి ప్రయత్నము గావించి కార్మికులంతా మా వెనుకనే యున్నారని నిరూపించుకో దలచి ఈ యెన్నికలలో పోటీ చేసినారు ఈ రెండుపార్టీలుకూడ ఇతర పార్టీలపై దూషణలతో ప్రచారము సాగించినారు. కాంగ్రెసు ప్రచారకులకు ఇట్టి పరదూషణ అవసరములేదు. ఈపార్టీలవారు అక్కడితో ఆగారా? కాంగ్రెస్ పెట్టుబడిదారి, జమీందారి సంస్థయైనదన్నారు. ఇట్లు అంటూనే ఇక్కడి సోషలిస్టు ఎన్నికల ప్రచారము ఫక్తు ఒక్క మహారాజా ప్రాపకమున, వారిధనముతో, వారి వాహనములతో; సిబ్బందితోనే సాగించబడినదని ఎంతమందికి తెలుసు. ఈ కాంగ్రెస్ ప్రచారకులకుగాని, అభ్యర్థులకుగాని ఏ జమీందారు పోషణ లభించింది. పైగా మన ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ నాయకామణి రంగాగారు ఒక సామాన్య రైతుబిడ్డనిగాని, మన కాన్స్టిట్యుఎన్సీకి ఈపోటీకి కాంగ్రెస్ తరపున నిలబెట్టబడిన సర్దార్ గౌతు లచ్చన్నగారు ఒక బీద కార్మికబిడ్డనిగానిఎంత మందికి తెలుసు కావుననే ఈపార్టీల మోసపు ప్రచారమును నిజాయితీయైన కాంగ్రెసు వర్కర్ల ప్రచారమువల్ల తెలిసికొని మన దేశీయ కార్మికులు కాంగ్రెసుకు అఖండ విజయమును చేకూర్చుటేగాక. ఆంధ్రరాష్ట్ర జాతీయ ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్ అధ్యక్షులు; రైతుకూలి ప్రజారాజ్య యోధుడు; విశాఖ సింధియా షిప్‌యార్డు లేబర్ యూనియన్ అధ్యక్షులు; ఒరిస్సా సరిహద్దు. రాష్ట్రేతరాంధ్రుల సమస్యా పరిశీలక సంఘ సభ్యులు; బర్మాలోని ఆంధ్ర కార్మిక సువ్యవస్థాపక సంఘసభ్యులు; ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ సంయుక్త కార్యదర్శి; ఆంధ్రరాష్ట్ర సేవాదళనిర్మాత; విశాఖజిల్లా ఖాన్కులు ఇచ్చుతున్న సర్దారు బిరుదునుబట్టి వీరయొక విశాఖజిల్లాకే కాదు-

యావత్ ఆంధ్రదేశమునకే సర్దారు అని ఆంధ్రకేసరి ప్రకాశంగారిచే కొనియాడబడిన సర్దారు గౌతు లచ్చన్న గారిని తమ సభ్యునిగా శాసన సభకు పంపుకోగల అదృష్టము పొందగలిగారు.

అంతే కాదు తమ వినాశనమునకు హేతువగు ఈ మోసపు పార్టీలు మళ్ళీ తలయెత్తకుండా సోషలిస్టుపార్టీకే తలమానికమైన ఆచార్య నరేంద్రదేవుని అక్కడను తాను ఇంతవరకు కాంగ్రెస్ పేరట అధ్యక్షుడుగా యుంటూయున్న రైల్వే వర్కర్సు తక్కాగన్న యూనియను, స్టీమరు షిప్పర్సు యూనియనులను వదలుకొనవల్సినగా ఇక్కడను ఓడించి వీరితో పాటు మరల యెన్నడూ అబద్ధప్రచారపు గొంతులు వేయకుండ కమ్యూనిస్టులకు కూడా గుణపాఠము నేర్పి తమయొక్క దేశభక్తిని, కాంగ్రెస్ విశిష్ట నాయకత్వమోకమును మరియొక్కసారి ఉద్ఘాటించి మనదేశ గౌరవమును కాపాడినారు మనజిల్లా కార్మికులు.

కమ్యూనిస్టుల దౌర్జన్య దుర్మార్గ దౌర్బల్యము :— అంతే కాదు కమ్యూనిస్టులు తమ ఆట కట్టిపోవుచున్నదని తమ వాదనను వినిపించుకొని వారిని, వ్యతిరేకించిన వారిని బరిసెలతోను, బాకులతోను పొడిచి చంపుటకు దిగినారు. తమ వాదన నచ్చని వారిని, తమపద్ధతిని వ్యతిరేకించిన వారిని అనగా నలుగురు పెద్దలు కూర్చుని కొందరు రామాయణ కాలక్షేపము, మరికొందరు భారత కాలక్షేపము చేసుకొందామని గాని, కార్మికులు తమ కనీస కోర్కెలు కోరుటలో కొందరు రెండు రూపాయలనియు మరికొందరు మూడు రూపాయలని గాని అభిప్రాయ భేదములు వచ్చినంతలో, వకరినొకరు తెగబడిచంపుకొనుటయుని మానవత్వప్రబోధకులు చేయవలసినపని. కాంగ్రెసు యెప్పుడైనా పరప్రభుత్వమువల్లగాని స్థానిక ధనవంతులవలనగాని రాజకీయపరిజ్ఞానములేని అమాయకప్రజలవల్లగాని యెంతెంతహింసలుపడినను ఈనీచమయిన తమయొక్కయు యెదుటి వారియొక్కయు ఆలుబిడ్డలను క్షోభపెట్టేటటువంటి దౌర్భాగ్య. పిరికి విధానాలకు దిగినారా? ఉత్తమధైర్య లక్షణమైన అహింస ప్రేమలఆచరణవలననేగదా కాంగ్రెసుకు ఇంతటి నైతిక ఆత్మిక అంగబలము చేకూరినది.

కమ్యూనిస్టులు ఇట్టినీచవిధానములకు దిగబట్టే ఇతర నాయకులవలె మరి ఏఇతర వ్యాసంగములు లేకుండా ఆదినుండియు ఒక్క కార్మికోద్యమమునకే ఏపార్టీతో సంబంధం లేకుండా తనజీవితమంతను అంకితముచేసి పని చేయుచున్న భారత కార్మికోద్యమనిఘంటువు శ్రీ ఎన్. ఎమ్ జోషీగారు, ఇంతకాలముగా అఖిలభారత ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్‌కు ప్రధాన కార్యదర్శిగా యుంటున్న పదవికి, ఇట్టిదౌర్జన్యవిధాన పార్టీ ప్రాబల్యముకల సంస్థలో ఇంకయుండజాలనని మొన్న రాజీనామా చేసినారు. ఇంతకాలముగా కొందరు పరదేశయోజంట్లు చేసిన మోసపుబోధనలునమ్మి కమ్యూనిస్టులుగా పనిచేయుచున్నవారుకూడ ఇప్పుడు ఒకొక్కరే కమ్యూనిస్టు పార్టీకి రాజీనామానిచ్చి కాంగ్రెస్‌వర్కర్లుగా చేరిరో లేక స్వంతవ్యాపారములు సాగించుకొనుచునో యున్నారు,

ఇంకనూ కొందరు మందుపట్టుకమ్యూనిస్టులు పేటలలో దాగి రహస్యసమావేశములు జరిపి అమాయకప్రజలను అయోగ్యము మామూలువ్యవహారములకు భంగము వాటిల్లునట్లుగా అరాచకము చేయ పురికొల్పుచున్నారు ఇట్టి అండర్‌గ్రౌండులో యున్నట్టి కమ్యూనిస్టుల అరాచకవాదులను పట్టి ఇచ్చుబాధ్యత ప్రజలదని, ఇట్టివారికి దాగుటకుస్థలమునిచ్చినవారు పెద్ద శిక్షార్హులని తెలియవలెను. ప్రభుత్వము కాంగ్రెస్‌కమిటీలుకూడ ఈహెచ్చరికను ప్రకటించిరి.

ఇంతేకాక ఎంతచెప్పినను ఇంకను తమచర్యలు దిద్దుకొనకుండా వ్యవహరించుచున్న లంచగొండిఉద్యోగులు కొందరున్నారు. వీరివల్లనే బ్లేక్‌మార్కెట్టుసాగుటకు అవకాశము కల్గుచున్నది. ఇది ప్రజలకు పెద్ద ఇబ్బందిగా నేయున్నది ప్రజలు యెవరిమట్టుకువారు బాధపడుచున్నను మొఖమాటముకల్ల వీరినిపట్ట లేకున్నారు.

ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసుసేవాదళము:— ఇంటనున్న ఇట్టి దౌర్జన్యములనుండియు; ఏస్వతంత్ర రాజ్యమునకైనను బయటనుండివచ్చు దౌర్జన్యమును ఆపుటకు తమసైన్యములు మాత్రమే కాక ప్రజలసర్వవిధతోడ్పాటుకూడ అవసరము కావున బయటనుండివచ్చే ఇట్టిఇబ్బందులనుండియు ఎవరికి బాధలేనిరీతిని సమిష్టిగా కాపుకొనుటకుగాను, శాంతిసమయమున స్థానికముగా అయాగ్రామములకు కలసిన సౌకర్యములకొఅకు నిర్మాణకార్య

క్రమము ఆచరించుటకు ఉపకరించునట్టి ఆంధ్రరాష్ట్ర సేవాదళము అను పేరున ఒక ప్రజాశాంతి సైన్యము నిర్మించబడుచున్నది. ఈ నిర్మాణము చేసినప్పుడు భారము సర్దార్ శ్రీ లచ్చన్నగారు వహించినారు ఇందుకు గాను మొదట శిక్షకులను తయారుచేయ సంకల్పించి గత సంవత్సరం ఏప్రెల్; మే, జూన్ నెలలో మూడుమాసములు పాటు మన రాష్ట్రములోని వివిధజిల్లాలనుండి; నైజాంలోని ఆంధ్రజిల్లాలనుండి కూడ అభ్యర్థులను రావించి మొదటిసారిగా 100 మంది యువకులకు 20 మంది యువతులకును శిక్షితమైన సైనిక శిక్షణతో బాటు గ్రామ పునర్నిర్మాణమునకు అవసరమైన వివిధ రంగములలోని సమస్యల పరిష్కార విధానములు కూడ నేర్పబడెను. జర్మనీలోను, ఇటలీలోను 9 సంవత్సరములు సైనిక అనుభవం కల్గి కీర్తికాయుడు నేతాజీ సుభాస్ బాబు జర్మనీ వెళ్ళిన వెంటనే మొదటిసారిగా అజాద్ హింద్ ఫౌజు (హింద్=భారత; అజాద్=స్వతంత్ర, ఫౌజు = సైన్యము)ను స్వయముగా నిర్మించిన ప్రథమశ్రేణిలో ఒక ముఖ్యుడైన ఐ. ఎన్. ఎ. ఆఫీసర్ కలనల్ శ్రీ అప్పారావుగారు ప్రధాన సైనికాధికారి (జి. ఒ. సి)గను, 1942 ఆగష్టులో తమ దేశ జాతీయ నాయకులను అన్యాయముగా బంధించినందులకు ప్రజలు దేశభక్తిప్రపూరితులయి మహోజ్జ్వలగ లేచిన విప్లవములో ఒక ప్రధానభూమికను వహించిన చీరాల వాసులను కాల్చవలసినదిగా బ్రిటిష్ గులామైన ఒక పోలీస్ ఉన్నతోద్యోగి ఆజ్ఞాపించగా అటు పరప్రభుత్వఉద్యోగమునకు, ఇటు స్వప్రభుత్వమునకై తపించుచున్న దేశభక్తి ప్రపూరితులకు మధ్యనిలచి సమయస్ఫూర్తిగా తన కర్తవ్యమును గుర్తించుకొనగల్గి; తన ఆత్మసాక్షి ప్రబోధమును తోసివేయక తనచేత పిస్తలును పారవైచి (Essential services) అత్యవసర నౌకరీ నిర్బంధచట్టముక్రింద రాగల తన ప్రాణత్యాగమునకైనను సిద్ధపడి తన ఉద్యోగమును విరమించి తదాదిగా దేశతక్షణావశ్యకత నెరిగినవాడగుటచే కాంగ్రెస్ ద్వారా ప్రజాసేవ చేయుటకు పూనుకున్న సబ్ ఇన్‌స్పెక్టరు శ్రీ హనుమంతరావుగారు అసిస్టెంటు జి. ఒ. సి.గాను పనిచేసి శిక్షణనిచ్చిరి- దౌర్జన్యమతాలు గెరిల్లాచర్యలకు గడంగినచో వారిని అదుపులోనికి తెచ్చుట ఎట్లో, పెద్దపెట్టున శత్రుసైన్యనివహములు ఎన్నెన్నిజట్లుగ ఏయేపరికరాలతో ఏయేవ్యూహములుగ పన్నుకొని బయళ్ళు, కొండలు, నదులు, గనుల

ద్రతీరములు మున్నగు వివిధప్రదేశములలో వచ్చుచున్న మన రక్షణసైన్యములు యేయేరీతిని ఎట్టివ్యూహరచనలు చేసుకుంటూ పోవలెనో, అవసరమైనప్పుడు యేపరిస్థితిలోనున్నను నష్టంలేకుండా ఉపసంహరించుకొనుట; తిరిగి బలీయమగు వ్యూహరచన చేసుకొని ముట్టడించుట మున్నగు విషయములతో ప్రత్యక్షముగ కొండలలో తర్ఫీదునిచ్చినారు.

మంత్రులు, దేశనాయకులు ఒక్కొక్కరేవచ్చి ఈశిక్షణను చూచి పోయినారు. యీసమయముననే ఆంధ్రకేసరి ప్రకాశంగారు వచ్చినప్పుడు సర్దార్ లచ్చన్నగారియొక్క ఈప్రయత్నమును సేవాదళనిర్మాణకృషిని అంతవరకెల్లు అనేక ఇబ్బందులను త్రోసిరాజని ముందుకు నెట్టుకుంటూపో గలుగుచున్న వారి నిర్మాణ కౌశల్యమును చూచినప్పుడే ఈసర్దార్ యీ విశాఖజిల్లాకే కాదు; మన యావదాంధ్రదేశమునకే సర్దార్ అని ప్రకటించి నది. ఈ నిర్మాణం చేయుటకు 60,000 రూపాయిలు ఖర్చుపెట్టవలసి వచ్చి నది. ఇంతటి భారమైన కార్యమును తలపెట్టుకున్నప్పుడు వసతులు ధన వస్తు సహాయంలే చాలముఖ్యమైన సమస్యలు. ఈసమయాన సహాయమునకు పూనుకుని తమతావునకు యీశిక్షణాశిబిరమును ఆహ్వానించి అన్నివిధముల యీశిక్షణను జయప్రద మొనర్చిన ఉత్తరవిశాఖజిల్లాలోని పలాసావాసులు దేశభక్తులు శ్రీప్రభా రామకృష్ణారావు గారు ఎంతయు అభినందనీయులు. యీమూడుమాసములపాటు దగ్గర నేయుండి అన్నివిధములసహాయపడుటకు తమకార్యాలయాన్నే పలాసాకు మార్చుకున్న ఉత్తర విశాఖజిల్లా కాంగ్రెస్ సంఘంవారి బాధ్యతాయుక్తమైన సమయోచితజ్ఞతకు ఆంధ్రప్రజలు జోహార్లర్పించవలసి యున్నది.

ఈమహాకార్యమునకు విరాళములిచ్చి తోడ్పడిన దాతలకు ఈ రాష్ట్రప్రజలు ఎప్పటికీ కృతజ్ఞులై యుండవలసియున్నది. బ్రిటిషు ప్రభుత్వం ఇట్టి అవకాశము ఇవ్వక గాని ఏదేశయువకులయినను సైనికశిక్షణ పొందుటకు కుతూహలురయ్యే యుందురు, అది వారిబాధ్యత, కర్తవ్యముకూడాను ఇట్లు తమబాధ్యతయైనను ప్రభుత్వము గా మనదేశములోని యువకులందరకు శిక్షణనిచ్చు అవకాశము లభించగానే అట్టిశిక్షణనిచ్చే శిక్షణపొందుటకు పిలుపు అందగానే వెంటనే ముందుకువచ్చి తమజీవితమును ప్రజా

సేవకై అంకితము చేసిన ఈ ఉద్యోగ అభ్యర్థులకు దేశ మెప్పుడును ఋణపడి యుండును.

ఈవిధముగా శౌర్యత నెరిగిన ప్రముఖుల కృషివలన విజయవంతముగా తయారు కాబడిన ప్రథమ ఆంధ్ర రాష్ట్ర సేవాదళ ఆఫీసర్ల జట్టు విశాఖ నగరము మొదలు మదరాసువరకుగల ఆంధ్రజిల్లాలంతటను ముఖ్య పట్నములలో పర్యటించి తమ సైనిక విన్యాసములను ప్రదర్శించి అప్పటికే తాత్కాలిక ప్రభుత్వమును ఏర్పరచుకొని స్వాతంత్ర్యమునుకూడ ఏర్పరచుకొనుటకు సిద్ధముగానున్న తరిలో, చేతిలో ముద్దయైనను నోటిలో పడేవరకు నమ్మకము లేదనే సామెతగా చాలమంది 15 ఆగస్టు 1947 వరకు కూడ ఇంటా-బయటాకూడ యున్న అనేక చిక్కు సమస్యల కారణముగా నమ్మలేక ఒక వేళ వచ్చినను ఇన్ని సమస్యలు స్వాతంత్ర్యము ఎప్పుడు ప్రకటించుకుంటారాయని ఎదురునిలచి బెదిరించుచుండ ఇంత కష్టముతో తెచ్చుకున్న స్వరాజ్యమును ఏవిధముగా కాపాడుకొనగలము! అట్టి రాబోయే సంఘటనల వల్ల కలిగే భయంకర బాధలు కలుగకుండ కాపాడుకొని జీవించుట ఎలాయని తలపోయుచు ఖిన్నులైయున్న తరిలో ప్రజలకు ధైర్యమును, ఉత్సాహమును, నమ్మకమును కలుగజేసి ఆనందింపజేయుచు దిగ్విజయ యాత్ర సలిపెను.

హైదరాబాద్‌లో అత్యాచారాలు జరుపుచున్నపుడు ఈ ఆఫీసర్లు అనేకమంది సత్యాగ్రహ శాంతి సైనికులను తయారుచేసి హైదరాబాద్‌లోనికి ప్రజారక్షణకై పంపగలిగిరి. హైదరాబాద్ మూకలు సరిహద్దులు దాటి వచ్చుటకు ప్రయత్నములు సాగించినప్పుడు హైదరాబాదు-ఆంధ్ర సరిహద్దు పొడవునా 40 వరకు సేవాదళ సైనిక శిబిరములను నెలకొల్పి సరిహద్దుప్రజలను కాపాడగలిగిరి.

ఇప్పటికే అనేకమందిని తమగ్రామములలోని యువకులకు శిక్షణనిప్పించుకొనుచు తమ గ్రామసేవ చేయించుకొనుచున్నందున మరల రెండవ జట్టు గుంటూరుజిల్లాలోని చిలకలూరిపేటలో తయారు కాబడుచున్నది.

తమతమ గ్రామములలో తమకు ఇబ్బందిగాయున్నను మొగమాటము చేత ఆచిక్కులను తొలగించుకొని పరిష్కరించుకొనలేకున్నారనియు, ముం

దురాబోయే పరిస్థితులను గుర్తించుకొన్న బాధ్యతాయుతులును, తమగ్రామ పునర్నిర్మాణ కార్యములు చేయించుకొని ప్రజాసేవ చేయదలచిన ఉదారులును ఇదివరకే తమ గ్రామములో కాంగ్రెసు సంఘముగాని-కాంగ్రెసునకు అనుబంధసంఘముగానియున్నచో వాటి ద్వారాను లేనిచో సేవాదళ సంఘమును ఏర్పాటు చేసుకొని దాని ద్వారాను ఇట్టిసుశిక్షితులైనఒక ఉద్యోగిని రావించుకొని తమ గ్రామమును రక్షించుకుంటూ సేవచేయించుకోవచ్చును.

ఈవిధముగా ప్రభుత్వముగాని కాంగ్రెసుగాని దేశప్రజలకు చేయుచున్న కార్యములు అనేకములుయున్నవి. ఈ పైచూపిన విధముగా కార్మికులకు సామాన్యప్రజలకు రక్షణ ఏర్పాటుచేయుచున్నట్లే పారిశ్రామికులకు, వ్యాపారస్థులకు, నౌకావ్యాపారమునకు మున్నగు అన్నవర్గములవారికికూడ రక్షణనిచ్చునట్టి అభివృద్ధికరమైనట్టి ప్రణాళికలను తయారుచేయుచున్నారు. అట్టివిధానములను అనుసరించుచున్నారు. ఇదే విధముగా అందరకు అందుబాటులోనుండే అభివృద్ధికర విద్యావిధానమునుకూడ అమలుపరచుచున్నారు. వీటినిగూర్చి విపులముగ ఏమేమి ఏర్పాటులు చేయుచున్నారో అందుకొని తెలుసుకొనే విధానము నెరుగక చాలమంది ఏమియుజరగనట్లు విమర్శించుచున్నారు. కాని ఆయావర్గములవారు స్థానికముగ ఎక్కడికక్కడే తమకుసంబంధించిన కాంగ్రెసు అనుబంధసంఘములుగయెప్పటి ఆయావిషయములగూర్చిన రాష్ట్ర,కేంద్రప్రభుత్వముల ప్రకటనలను రావించుకొనినచో తెలియగలదు.

రైతులగోడు.— కార్మిక సంఘాలని, పారిశ్రామిక సంఘాలని, వర్తక సంఘాలని, ఉద్యోగుల సంఘాలని ఎవరిమట్టుకు వారు సంఘీభావముగ తమతమ బాధానివారణకు పాటుపడుచున్నారు కాని అందరకు తిండి పెట్టుచున్న మా రైతులకొఱకు చేసేవాయని నేవారు లేరుఅని చాలాగ్రామములలోని రైతులుగోడు పెట్టుటచూచుచున్నాము. వీరుసభ్యముగ చేసుకోరు. వీరికొఱకై ఇతరులుచేయుచున్న కృషిని తెలుసుకోరు. ఇదే వారొక్కరే రక్షణలేకుండా యున్నవారని తలచుటకు కారణం. ఇది ఎంతటివిచారాస్పదము, వీరిగురించి రైతు కాంగ్రెసును స్థాపించి ఆచార్యరంగాజీ చేసిన చేయుచున్న కృషిని తెలుసుకొండి.

విదేశములనుండి విశేషవిద్యాప్రాభవముతో తిరిగివచ్చిన ఈమహానీయుడు ఈ వారీతెన్నూలేని పనికి పూనుకొనుటచూచి తన శ్రేయస్సుకోరిన అనేకమంది బంధువులు స్నేహితులుకూడ "ఇదేమిది? నీకేమైనా పిచ్చి ఎక్కినదా? నీకు హాయిగా ఆచార్యత్వమును సుఖముగ చేసుకొనుచూ భోగభాగ్యములను సుఖమును అనుభవించకుండ కాదుకూడను దేశసేవస్వరాజ్య సంపాదనే ముఖ్యమైనచో తక్కిన కొందరు పడకకుర్చీ నాయకులవలె సుఖముగ ప్రదర్శిక నాయకత్వమునువహించినను నీసమాజసమర్థతవల్ల అతి సులభముగ యేప్రధానియో, గవర్నరో అవగలవుగదా, దేనికి సంవత్సరములు తరబడి ఈ జైలుయాత్రలు గ్రామగ్రామములోనికిపోయి నిద్రాహారములు సరిగలేక ఆరోగ్యమును కోల్పోవు బాధలున్నూ, ఫ్యాక్టరీవాండ్రు కాలం కూక కూసేటప్పటికి గేటుయొద్ద ఒకజండా పెట్టుకొని కార్మికులనుకూడదీసి సంఘములు ఏర్పాటుచేసి నడుపుట, ఒక పుత్రవానికి ఒక నోట్రీసు వ్రాసియిచ్చి ఒక సైకిలుయిచ్చి ఒకగంటసేపు నలుగురుదగ్గరకుపంపించి పారిశ్రామికులు, హోటల్ యజమానులు మున్నగు ఇతర వర్తకసంఘముల వారు సమావేశమగుట సులభమేగాని చెట్టుకొకరు పుట్టకొకరు గట్టుకొకరుగాయుండి రాత్రి పగలు ఉదయం సాయంకాలం అనిగాని అందరకు ఒకే సమయమనిగాని లేకుండా పనిచేసుకొనుచున్న వారినికూడదీసి ఈ ఉద్యమము నడపడమనేది వేమి? యని బ్రతిమాలజొచ్చిరి. వీటికే బలహీనమైపోయి వీరులొంగిపోయినచో ఈ రైతుఉద్యమమును, ఈ రైతులను ఏమైయుండెడివారోగదా! ఇంకనూ ఇట్టి దిగజారుడు ప్రేరితఘట్టములు ఈయన మహాతపస్సులో ఎన్నివచ్చియుండునోకదా! దీనినే నిగ్రహించుకొనలేకపోయినచో ముందువచ్చిన అనేకఘనమయిన ఘట్టములను నిగ్రహించుకొనగల్గియుండెడివాడా!

ఈవిషయమున ఏమేమిచేయదలచుకొని, అట్లుచేయగలమని ఎంతటి ఆత్మవిశ్వాసముండి ఈమహాదాశయకృషి మొదలిడెనో, ఈనిరంతర; నిష్కళంకకృషిఇక్కడలోనే ఆగక అఖిలభారతదేశమునకును; దానినిమించి యావత్ప్రపంచమునకుకూడ దారిచూపునట్టి జాతియు, అంతర్జాతీయఖ్యాతిని సమార్జించగల పటిమ ఈయనలో ప్రజ్వరిల్లుచున్నదని పాపమీశ్రేయో

భిలాషుల కేమి తెలియును. యావత్ప్రపంచమునకే ప్రబోధించగలట్టి ఈమన లోగల ఆచార్యత్వమును ఒక్క కాలేజీయొక్క నాల్గుగోడలమధ్య బంధించుకొని యుంచలేరనికూడ వీరికేమి తెలియును?

రైతు సేవకున్నట్టి ఏర్పాట్లు చేయుటకు వీరు ఏమి చేసిరో వివరముగా తెలుసుకోవలెనన్న వేలకొలది పేజీల గ్రంథమగును. ఐనను వీరి 49వ జన్మదినోత్సవ సందర్భమున జన్మదినోత్సవకమిటీ వారు ప్రకటించిన రంగాగారు రైతుకూలీ ప్రజాలోకమునకు చేసిన సేవయొక్క దిఙ్మాత్రచరిత్ర ఈ క్రింద పొందుపరచబడినది. దీనిమూలమున రైతులకు జరుగుచున్న యేర్పాటు కొంతవరకు తెలుసుకొనవచ్చును.

---

# ఆచార్య రంగా

మన భరత రైతుల - తలమానికము రంగా
మన తెలుగుసీమలో - జనియించె రంగా
రంగ రంగాయంచు - రైతులోకంబెల్ల
సంగరాంగణమందు - జయభేరి మ్రోగించు ||మన||
ఆధరంబు కదిలితే - అశ్రుధారలతోడ
చదువు రైతుల పాలి - శ్రమలన్ని పాటలుగ ||మన||
పలుక మొదలిడితేను - పంట కాపుల శక్తి
పరవళ్ళు త్రొక్కుంచి - పలికించు శౌర్యంబు ||మన||
కులుక మొదలిడితేను - కూలిరైతుల శక్తి
తొలకరీ మెరుపులా - తళుకుమనిపించేను ||మన||
పగవారి మోపెట్టి - ప్రజలను ప్రోద్బోధిస్తె
దిగ్దిగంతరములు ప్ర - తిధ్వనించాలంటె ||మన||
కారాగృహాములోన - కాలుమడిచాడంటె
కలము కాగితములో - కదంద్రొక్కించాడు ||మన||

బయట నున్నాడంటె - పగలు రాత్రిలేమి
కాలచక్రమోలెన్న - కదువడిగ తిరగాలి ॥మన॥
రైతుకూలీ ప్రజా - రాజ్యంబు సాధింప
కాంగ్రెసులో కంత - కదలిరమ్మంటాడు ॥మన॥

1948 వ సంవత్సరం నవంబరు 7 వ తేదీనాటికి ఆచార్యరంగా 48 సంవత్సరములు పూర్తిచేసుకొనగలవారగుదురు. ఈ మహాపురుషుడు 49 వ జన్మదినమున నొకసారి తన జీవితమును సింహావలోకనము జేసి చూచుకొని ఏమనితలపోయగలడు? ఈ48 సంవత్సరములలో 22 సంవత్సరములు ప్రజాసేవయందు, అందునూ కర్షక కార్మిక లోక సేవయందు సమర్పించిరి. నేడా రైతుకూలీ ప్రపంచమున క్రొత్తయాలోచనలు తోచును?

ఆచార్యరంగా గుంటూరు జిల్లాలో నొక సామాన్య గ్రామములో నొకసామాన్య రైతుగృహమున 1900వ సంవత్సరమున నవంబరు 7వ తేదీన జన్మించిరి. వీరు 26సంవత్సరముల వరకు యావత్ప్రాయమునను విద్యావ్యాసంగముననే వినియుక్తులై యుండిరి. అందులో ఆరు సంవత్సరములు ఆంగ్ల దేశమున అక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయమున అధ్యయనము నొనర్చుటకును, ఫ్రాన్సు ఇటలీ, జర్మనీ మొదలగు ఐరోపీయ రాష్ట్రములయందు జ్ఞానసముపార్జనకై పర్యటించుటకును వినియోగింపబడినవి. అప్పటికి వీరు బి. లిట్., పట్టభద్రులయిరి.

1927 వ సంవత్సరమున రంగాను మద్రాసు నగరమందలి ప్రసిద్ధ పచ్చయప్ప కళాశాలలో ఆచార్య పదవి లభించెను. తదాది 1930 వ సంవత్సరందనుక ఆకళాశాలలో రంగా యం. ఎ. విద్యార్థులకు ఆచార్యక మొనరించిరి. ఆదేకాలమున రంగా ప్రజాసేవాపరాయణుడై తనవిశ్రాంతి కాలమునంతటిని రైతుకూలీ ఉద్యమమును ప్రారంభించుటయందును, నడుపుటయందును వినియోగించెను.

1930 వ సంవత్సరమున రంగా తన ఆచార్య పదవికి రాజీనామా నిచ్చితన సర్వశక్తులనూ, సర్వకాలమునూ ప్రజాసేవకై వినియోగింప దొడగెను. నాటినుండి నేటివరకు ప్రజాసేవయే వీరిజీవిత పరమావధి.

ఇట్లు 22 సంవత్సరములుగా సేవాదీక్షగైకొని వీరు ప్రజకుచేసిన మేలెట్టిదో [illegible]. రంగాప్రజాసేవలో ఒక ప్రత్యేకత, ఒకవిశిష్టత,

కొనువారే, ఇట్లు చదువను నడి ఎరుంగక, ప్రభుత్వమనగా నేమియో, సంఘమనగా నెట్టిదియో ఎరుంగక, దేశకాల పరిస్థితుల నెరుంగక. వీటిఆవతల ఉన్నవో లేవో తెలియనేరక దీనమగు స్థితిలోనున్న రైతుకూలీ ప్రజ నాటి జనసంఖ్యలో 100 కి 97 గురుగ నుండిరి.

ఇట్టి పరిస్థితిలో రైతుగృహమున జన్మించిన రంగా కర్తవ్యమేమి యనవలెను? అప్పటికే మహాత్ముడు స్వరాజ్య సమరమునకు సర్వసైన్యాధిపత్యము వహించి నడుపుచుండెను. సహాయ నిరాకరణోద్యమము యావద్భారత దేశమును కదల్చివైచెను. ఒక నూతనోత్సాహము, ఒక నూతన చైతన్యము దేశమున రూపొందుచుండెను. రంగా ఒక ప్రక్క రైతుకూలీపునరుద్ధరణకై రైతుఉద్యమమును ప్రారంభించెను. ఈద్వివిధ కార్యక్రమములోని విశిష్టతను గమనింపుడు. విద్యావంతులై ప్రభుత్వోద్యోగులు అయిన వారందరూ సహాయ నిరాకరణ చేసినచో భారతదేశమున ఆంగ్లేయాధికారము పెండలంట కూలిపోవును. కావున స్వరాజ్య సంపాదనకై ప్రత్యేకించి కృషి చేయువలెనన్న నాటివిద్యాధికులనుకూడగట్టి స్వరాజ్యపోరాటమును నడుప వచ్చును కాని అట్టిప్రయత్నమువలన కలుగబోవు ఫలమేమెంత? అది సిద్ధించునదెవరికి? విజయనగరసామ్రాజ్యము దాదాపుగా దక్షిణ భారత దేశమునంతటిని అఖండవైభవోపేతముగా, నిరంకుశముగ పరిపాలించినది. అయ్యది దక్షిణభారతీయులకు స్వరాజ్యమేగాని పరరాజ్యముకాదు. కాని ప్రజా సామాన్యము మాత్రము ఆంగ్లేయ పరిపాలన నాటికంటె ఎక్కువ సౌఖ్యమననుభవించియుండలేదు. జవహర్‌లాల్ జీ తన "Glmpse of world History"లో విజయనగరసామ్రాజ్యమొకధనికుని యాడంబరము మాత్రమేనని వక్కాణించిరి. ఈ మాట హిందూరాజ్యములన్నింటికిని వర్తించును.

యూరోపా దేశములలో ప్రతియుగమున, ప్రతిశతాబ్దమున; ప్రతితరమున; విద్యాధికవర్గములలో ఉదారులగు మహాపురుషులు జన్మించి దీనప్రజల కళ్యాణమును కాంక్షించి వారి ప్రగతికి; సముద్ధరణకు, వలసిన విజ్ఞానవ్యాప్తిని చేయుచువచ్చిరి. కనుక ఆదేశములలో విజ్ఞానము, సంస్కృతి; సాంఘిక రాజకీయచైతన్యము జన బాహుళ్యమున చక్కగా వ్యాపించియున్నది. దేశమునకెప్పుడెట్టి మేలు కలిగినను అది ప్రజాబాహుళ్యమున కంతటికిని ఉపకరించుచు వచ్చినది. హిందూదేశమున, అందును ఆంధ్ర

మునగల ప్రజలస్థితిగతులు దీనికి భిన్నములై యుండెను. స్వరాజ్యమను మేలు లభించిన పిదప అది సర్వజనులయొక్క కళ్యాణమునకై ఉపకరించుటకు అనువయిన పరిస్థితులను కల్పించవలసిన ఆగత్యముండెను. అట్టి పరిస్థితులను కల్పించుటకు రంగా రైతు ఉద్యమమును ప్రారంభించెను. ఇది రంగా ప్రత్యేకత.

ఒక వైపున సంఘమును సంస్కరించుట, మరొక వైపున దేశదాస్యవిముక్తి కయి ఆంగ్లసామ్రాజ్యతత్వముతో పోరాడుట. అను నీ రెండు కార్యములను పరస్పర విరోధము లేకుండ అత్యంతమనస్కతతో కొనసాగించుటకు రంగాకు రెండుపూర్వసాధనములు వైశిష్ట్యములై లభించెననవచ్చును. ఒకటి, ఆయన మానవ ప్రతిభావిశేషము. రెండు, ప్రగతిశీలమయిన అప్పటి విశ్వవిద్యాలయములలో దీర్ఘకాల విద్యాభ్యాసంగము, విరోధాభిప్రాయములతో సుపరిచయము, విరోధించువారి సాహచర్యము, ఆర్థిక, రాజకీయ సాంస్కృతిక సంస్థలతోడి ప్రత్యక్షానుభవము. రంగా రైతుఉద్యమ సందర్భమున సాంఘిక, ఆర్థిక, రాజకీయ, వైజ్ఞానిక రంగములలో వెలయించిన వివిధ సంస్థలు ఉద్యమశాఖలు ఒక విచిత్రసృష్టియనవచ్చును, ఈసృష్టికి పరమావధి రైతుకూలీ ప్రజాకళ్యాణము. లక్ష్యము నెట్లు ఎంతవరకు రంగా సాధించెనో మాత్రము. రైతుఉద్యమముయొక్క కార్యక్రమమును, దాని సంస్థలను కొంత పరామర్శించి చూచిన యీ విషయము స్పష్టమగును.

రైతునాయకులు ప్రతిగ్రామమునకు పోయి రైతుకూలీల స్థితిగతులను గూర్చియు, దేశమునందలి రాజకీయ, ఆర్థిక పరిస్థితులనుగూర్చియు, ప్రభుత్వమునకు, సాంఘిక విధానములకు, ప్రజాసామాన్యమునకుగల పరస్పరసంబంధములగూర్చియు, ప్రజల హక్కులను గూర్చియు, ధర్మములను గూర్చియు; రాష్ట్రధర్మములగూర్చియు, విపులముగ ఉపన్యసించునట్లు చేసిరి.

పూర్వము మనదేశమున ప్రజాసామాన్యములో మతప్రచారమునకై హిందూమత ప్రచారకులు పెక్కుపోకలపోయిరి. గ్రామములలో పురాణములు చెప్పుట, దేవతలకు కల్యాణములు చేయుట, భజనలు చేయుట, సప్తాహములు, బ్రాహ్మణ సంతర్పణలు, యజ్ఞములు, కొలువులు, జాతరలు' వ్రతములు మొదలగు వానిని చేయుట, భిక్షమెత్తి బ్రతుకుట నొకవృత్తిగా కల్పించి, అట్టివృత్తివంతులకు పాటలు, పద్యములు వ్రాసియిచ్చి దేశము

లో పాడించుట మొదలగు పెక్కు మార్గములను త్రొక్కిరి. కాని ఈ సంస్థలు, సాధనములు సామాన్యప్రజయొక్క ఆర్థిక, రాజకీయ, సాంఘికాభివృద్ధికి గాని, ప్రజలలో ఆత్మవిశ్వాసము, ఆత్మగౌరవము, ఆలోచనా శక్తి, స్వతంత్రేచ్ఛ, మొదలగు పురుషలక్షణములను పెంపొందించుటకు గాని, సర్వజన సౌభ్రాతృత్వము, సమత మొదలగు ఉత్తమభావములను వర్ధిల్లజేయుటకు గాని ఉపయోగ పడియుండలేదు

రైతుఉద్యమ నాయకులు ఈకొరతను దీర్చినారు. గ్రామగ్రామము లయందూ, వాడవాడలయందూ, జరిగిన కిసాన్ ఉపన్యాసములవలనను, రైతు భజనావళిబుర్రకథలవలనను, జరిగిన రాజకీయ సాంఘిక ఆర్థిక విజ్ఞానప్రచారము అనిర్వచనీయము, అద్భుతావహము. "బిళ్ళబంట్రోతు"ను చూచినతోడనే ఆలోచనా శూన్యమై దిక్కుతెన్నూతోచక నుడివడిపోవుచుండెడి రైతు బుద్ధి యిప్పుడు ఎట్టి అధికారి తారసిల్లినను, ఎట్టిసమస్య యెదురొక్కనినను, తనస్థితిని; ఎదిరిస్థితిని కలిపి ఆలోచించి, న్యాయాన్యాయములవిచక్షణజేసి, ఉచితానుచితముల నిశ్చయించి, కర్తవ్యమును నిర్ణయించుకొనుటకు కొంత వరకుసమర్థుడయినాడు. ఇది రంగా 25 ఏండ్లకృషి ఫలితములలోనొక్కటి.

గ్రామగ్రామమునా రైతుకూలీసంఘముల స్థాపించుట, ఆయా సంఘములు తమతమ కష్టనిష్ఠురములగూర్చి ఆయా గ్రామములకు చేరువగానున్న ప్రభుత్వోద్యోగులకు విన్నవించుకొనునట్లు చేయుట రైతుఉద్యమ కార్యక్రమములో మరికొన్ని అంశములు. ఈ కార్యక్రమముయొక్క ఆశయము ప్రభుత్వోద్యోగులన్న సామాన్యప్రజలకుగల బెదరుతిప్పుటయూ, ప్రభుత్వమునకు ప్రజలకు పరస్పరసంబంధము ప్రత్యక్షముగ ప్రజలకు అరమగునట్లు చేయుటయు, ప్రజలు తమకోర్కెలను, కష్టనిష్ఠురములను ప్రభుత్వమునకు తెలియజేయుపద్ధతులను నేర్పుటయును ఆయియున్నది. ఈ కార్యక్రమమును పరిశీలించినప్పుడు రంగా ప్రతిభావ్యుత్పత్తులకు ఆశ్చర్యపడుదుము. వలసరాజ్యముల పరిపాలనావిధానసూత్రములపై ఆంగ్ల, ఫ్రెంచి, డచ్చి, జర్మను సామ్రాజ్యవాదులు గ్రంథములు రచించిరి, ఆగ్రంథముల తెల్పెడిది ప్రజలసంఖ్యాకులగు శ్వేతముఖులు నిరంకుశముగ పరిపాలించవలెనన్న ఏమి ఉపాయములుపన్నవలెనా యనువిషయము. ఏనుగకన్నులలో అద్దపు పలుండుటవలన దానికి మనుష్యుడొక చిన్నగొంగవలె కన్పట్టునట. అట్లను

ఘిక సమస్యలను తీర్చుటకువలసిన గ్రంథముల రచించుట జరిగియుండలేదు. ఈరంగమున రంగా చేసినకృషి అద్వితీయము, రైతువిద్యాలయముల నెల కొల్పి వీరు ఒక్క ఆంధ్రదేశముననే 1500 మంది రైతు కూలీ సేవకులను తయారు చేసిరి. కిసాన్ ప్రచురణాలయము స్థాపించి సామాన్యప్రజలకు వల సిన రాజకీయ ఆర్థిక సాంఘికవిషయములనుగూర్చిన బహు గ్రంథములను ప్రచురించిరి. రాజప్రతినిధి, రైతు కూలి అందరూ మనుష్యులేనన్న చైత న్యము నిచ్చినాడు. సంఘమన్న నేమియో, రాజ్యమన్న నేమియో తెలియ చెప్పినాడు. ఇక ఈసంస్కారము చిరస్థాయిగానుండుటకు కావలసిన ఆర్థికదోహానము నిచ్చుటకై అనేక ప్రణాళికలను సిద్ధముచేసి ఆచరణలో పెట్టించుచున్నాడు. ఆంధ్రదేశమున చేనేత మొదలగు అర్థోత్పాదన చేయు వృత్తు (predective professious) లెన్నిన్నికలవో వానినన్నింటినీ ఈ అర్థశాస్త్రాచార్యుడు శాస్త్రీయవర్గములుగా నేర్పాటుచేసి వారికి వర్గచైతన్యము నిచ్చినాడు. జమీందారీ వర్గపుబాధల నెదుర్కొనుటకు జమీన్ రైతులకు బాసటయైనాడు.

సంఘమేశ్వరంప్రాజెక్టు 20 00,000 ఎకరములభూమిని సాగుచేయ గల మహోజ్వలనిర్మాణము, ఇప్పుడు పడినిరర్థకపు పాడుగను; బీడుగను న్న శుష్కక్షేత్రములను హేమకేదారములుగామార్చి క్షామదేవతను ఆంధ్ర దేశమునుండి పారద్రోలగల మహానిర్మాణమూ సంఘమేశ్వరం ప్రాజెక్టు. అట్టి దానిని ప్రప్రథమమున ఊహించి ఒక రూపమునకుదెచ్చి ప్రభుత్వపుదృష్టి లోనికిదెచ్చినఅర్థోత్పాదనవేది రంగా- ఇదిరంగా రైతుకూలీప్రజాలోకము లకు చేసినసేవయొక్క దిఙ్మాత్రచరిత్ర-

స్వరాజ్య సమరంలో మహాత్మునకు నమ్మినయోధుడై రంగా చేసిన సేవ అపూర్వము. ఆమహనీయుని ఆదరాభిమానములను చూరగొన్నాడు- ప్రపంచమునందలి సకల ఆధీన దేశములయు వలసదేశములయు స్వాతంత్ర్య సమరములను చక్కగాగమనించుచూవచ్చినాడు- ప్రపంచమందలి సకల జాతీయవిప్లవములను సమన్వయించి సామ్రాజ్యములను కూలద్రోయుటకు వలయుపథకములను వేయుచువచ్చినాడు- ఈసందర్భమున తానుగమనించిన విషయములను; వేసినపథకములను వివరించుచూ అనేక గ్రంథములను రచించినాడు-

1) World Role of National Revolution.

2) Outlines of National Revolutionary Path.

3) Colonial and Coloured Peoples Freedom Front.

అను గ్రంథములు ఈతరగతికి చెందినవి.

ఈయన ఢిల్లీశాసనసభ్యుడుగ ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు అధ్యక్షుడుగా కాంగ్రెసు కార్యవర్గసభ్యుడుగా రాజ్యాంగపరిషత్ సభ్యుడుగా దేశమునకు ప్రశంసనీయమగు సేవచేసినాడు- చేయుచున్నాడు-

ఢిల్లీశాసనసభయొక్క అంతర్జాతీయ విషయసంఘసభ్యుడుగానైనా న్యాయకమిటీసభ్యుడు- ద్రవ్యోల్బణ విరోధకసంఘాధ్యక్షుడుగా ఉండి రంగా చేసిన చేయుచున్న అమూల్యసేవకు మురిసిపోయి భారతప్రధానమంత్రి నెహ్రూశాసనసభలో ముక్తకంఠముతో ప్రశంసించినాడు- రంగా కాంగ్రెస్ సేవక సంఘములను పెట్టి కాంగ్రెస్ సంస్థకుబలము చేకూర్చినాడు-

రంగా తానుచేసిన దేశసేవను తలచుకొని యదార్థమునకు గర్వించవచ్చు- "యావద్భారతకర్షకోద్యమ విధాతా నీకు దీర్ఘాయుష్షే"...

— జన్మదినోత్సవకమిటీ.

ఈమహోత్సవసభలు కాంగ్రెసు కమిటీలు, యువజన కాంగ్రెసు, రైతు కాంగ్రెసు జాతీయ ట్రేడుయూనియన్ కాంగ్రెసు, మహిళా కాంగ్రెసు; విద్యార్థి కాంగ్రెసు మున్నగు సంఘములు పల్లెపల్లెలా వాడవాడలా జరుపుకొని రంగాగారి సేవాగౌరవార్థం అనాడు ఏగ్రామములో వసూలైన విరాళములను వారి అభిమతం ప్రకారం ఆయాగ్రామాల్లోని ఆయా కాంగ్రెసు సంఘాలులేక ఆయా కాంగ్రెసు అనుబంధసంఘాలకే ఇచ్చివేయబడినవి.

ఇట్టిమహనీయుల చరిత్రయే వారునడిపిన ఉద్యమముల చరిత్రయగును కావున రైతుఉద్యమచరిత్ర తెలుసుకోగోరువారికి ఉపకరించురీతిని ఇచ్చటపొందుపరచుట సముచితమే యగునని నాతలంపు.

వీరు ఈకృషికి ప్రాణాధారముగా రచియించినగ్రంథములు,

1. Economic organisation of Indian Villages 2vl. 2. Handloom Weaving Industry 3. Economic Condi-

tion of Zamindari Ryots 4. Tribes of the Nilgiris - Their Economic Condition 5 Agricultural Indebtedness Remedial Measurers 6. Labour in South India 7. Modern Indian Peasant 8. Kisan Speaks 9. Peasants and Congress 10. History of the Kisan Movement 11. Kisan Hand book 12. Wither Indian Peasant 13. Kisans and the Communists 14. World Role of National Revolution 15. Outlines of National Revolutionary Path 16. Challenge of World Peasantry 17. Colonial and Coloured Peoples Freedom front 18. Indian Adult Education 19. Why Kisans and Artisans support the Gandhian Plan 20. Beware of American 'Manifest Destiny' 21. Life and Thought of a Political Prisoner 22. Students role in Colonial Revolution & The National Congress.

23 ఆధునిక రాజ్యాంగ సంస్థలు 2 సంపుటాలు 24 హరిజననాయకుడు 25 రైతు కూలీ ప్రజారాజ్యము 26 పాకిస్థాన్.

## ఆచార్యరంగా దేశసేవలోని కొన్ని ప్రధానవిషయములు.

(1) రిసెటిలుమెంటు ఆందోళన. (2) సంగమేశ్వరంప్రాజెక్టు (3) పెదకళ్ళపూడి ప్రాజెక్టు.(4) గ్రామపంచాయతీ వ్యాప్తికై కృషి (5) కాంగ్రెసు సోదరసేవాసంఘములను గుర్తించునట్లుచేసి సర్వవర్గ చైతన్యమును కల్పించుట (6) కేంద్రశాసనసభలోను; ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘములోను పరిశోధకసంఘముల స్థాపన (7) కేంద్రశాసనసభలో కర్షకవర్గ స్థాపన (8) ప్రపంచకర్షకోద్యమ స్థాపన (9) ప్రపంచ ఆహారోత్పాదకుల ఫెడరేషన్ స్థాపన (10) అఖిలభారతచేనేత కాంగ్రెసు స్థాపన(11) అఖిలభారత జాతీయ ట్రేడ్‌యూనియన్ కాంగ్రెసుకు ప్రపంచ ట్రేడ్‌యూనియన్ సంస్థలో సభ్యత్వముసంపాదించుట (12) అ॥భా॥ కిసాన్ కాంగ్రెస్సు స్థాపన (13) వ్యవసాయ కూలీ సంఘ స్థాపన (14) జాతీయవిజ్ఞాన పరిషత్తు స్థాపన (15) వెంకటగిరి జమీందారీ అటవీ సత్యాగ్రహము.

తమకొఱకై ఇంతటి బ్రహ్మాండమైనకృషి జరుగుచుండనీ కాకిరైయుపోయి నట్లుగా రైతులు కూర్చొనినిద్రించుచుండుట హాస్యాస్పదము కాదా? మీరు తమజిల్లారైతు కాంగ్రెసు కార్యాలయమునకుపోయి చూచినచో తమకొఱకు ఎంతెంత పనులు ఎంతెంత ఖర్చులతో జరుగుచున్నవో బోధపడగలదు. తమజిల్లా రైతు కాంగ్రెసు కార్యాలయముయొక్క విలాసము తెలియకపో యినచో ఆంధ్రరాష్ట్రరైతు కాంగ్రెసు ఆంధ్రరత్నభవనం బెజవాడ యని వ్రాసిన తెలియజేయబడును.

అనేకరకముల పంటలు పండించే రైతులు ఉండుటచే ఇట్టి ఉద్యమము కలగాపులగం కాకుండా ఉప్పురైతులకు, చెరకురైతులకు ఈవిధముగా ఎవరికివారికే వారి ప్రత్యేకసమస్యలను చూచుకొనగలిగిన శాఖలుగా ఏర్పాటుచేయబడెను. ఇదంతయు రైతులయొక్కశక్తి కాదా! ఇంత శక్తి తమ యందుంచుకొని ఇట్లు బేలలగుట న్యాయమేనా?

రైతులను ఇంతశక్తివంతముగా చేయుటకుగాను రైతులకు కొంత తీరిక దొరకగనే ఏప్రిల్, మే ప్రాంతాలలో ఏటేటా ఒక్కనెలపాటు వేసవికాల రైతాంగ విద్యాలయములు నడుపబడెను. దీనికి పల్లెపల్లెలనుండి రైతు బిడ్డలను రావించి తన బహుముఖప్రజాసేవలో తీరికలేకపోయినను ఇందుకరించి తప్పక తీరిక చేసుకొని వచ్చి తానే స్వయముగా ఆచార్యత్వము వహించి రైతుసమస్యలతోబాటు ఆర్థిక, సాంఘిక, రాజకీయవిషయములను బోధించుచునే ఉపన్యసించుట, తాము నేర్చిన విజ్ఞానమును ప్రజాబాహుళ్యమునకు అందించుట మున్నగు సంఘటితమార్గములు బోధించిరి. ఇట్టి సుశిక్షితరైతుసైన్యముచే ఆంధ్రదేశమున పెక్కు రైతుయాత్రలు నడిపిరి. అవసరమయినచోట్ల బ్రహ్మాండమయిన పోరాటములు జరిపిరి. ఈవిధముగా తయారయినవారిలో ఒకరేమన సర్దార్ అచ్చన్నగారు. మనదేశమునకు ప్రప్రథమముగా ఉత్తరాదిని రైతు సత్యాగ్రహము, అహమ్మదాబాదుమిల్లు కార్మికులపోరాటములు బ్రహ్మాండముగానడిపి వల్లభాయిపటేలు సర్దారైనాడు మదరాసువీధిలో లక్షలాది ప్రజలు సమావేశమయ్యియుండ పోలీసులుతుపా

కిలు బారు చేయగా ఇంతమంది ప్రజలు అక్కడి నాయకులతో సుద్ధా పారి పోవుచుండ తనరొమ్మును ఎదిరిచ్చి తాను నిలచి పోలీసుల సాక్ష్యమగునట్లు చేసి తక్కిన ప్రజలనుకూడ నిలబడునట్లు చేసి మీటింగును శాంతముగా జరిపించి ఆంధ్రకేసరి ఐనాడు ప్రకాశం. ఉత్తరవిశాఖజిల్లాలోని ఎస్టేటు రైతులు పడుచున్న దుర్భర బాధలను పోగొట్టుటకయి వేలకొలది రైతు జనముతో దండయాత్ర జరిపి కొందరు మరణించునట్లు జమీందారు పోలీసులు కాల్పులు సాగించినను ధైర్యసాహసములతో తాను నిలబడి రైతుల ధైర్యమును నిలిపి విజయమును సాధించి సర్దారైనాడు మన గౌతులచ్చన్న. ఈ విధముగా తాము చెప్పిన ధర్మసూత్రములను ప్రత్యక్షముగా బహిరంగముగా ధైర్యసాహసములతో చెప్పి మరీ ఆచరించినవారే గాని నక్కబొరియలలో, ఎలుకకన్నముల పండుకొనిగాని బిరుదులు పెట్టుకున్నవారు కాదు మనజాతీయనాయకులు.

ఈరీతిని కృషి చేసుకొనివచ్చిన ఆంధ్రరైతుసేవకులే ఈనాడు రాష్ట్ర కాంగ్రెసు ప్రధానసేవకులు (కమిటీ) అయినారంటే దానికదే చెప్పుకొనుచున్నది ఈ రైతుసేవకులు చేసిన నిష్కళంక సేవాగరిమ. ఇది రైతులు సగర్వముగా, సగౌరవముగా చెప్పుకోతగ్గ విషయము కాదా? వీరు రాష్ట్ర అధ్యక్ష ప్రధాన, సహాయ కార్యదర్శులయినను వీరిని రాష్ట్ర కాంగ్రెసు నాయకులు అనకుండ సేవకులు అని నేను వ్రాయుటవలన వీరు పడకకుర్చీ నాయకుల వలె నాయకులని పిలిపించుకొనుటకు ఇచ్ఛగించరు.

మన ఆంధ్రదేశమునకు కో[illegible]యిన విజ్ఞాన, ధైర్య, నాయకత్వములను ఆచార్యరంగాగారు ఈవిధముగా కూడగట్టుకొని వచ్చుటే గాక ఇంత కాలముగా ఏమిలేక పోయినను నామమాత్రమున కాయన్నట్లుగాయుంటూ వచ్చుచున్న డాక్టర్ శ్రీభోగరాజు పట్టాభి సీతారామయ్యగారి అఖిలభారత కార్యవర్గసభ్యత్వమును కూడ యావత్ప్రపంచమునకే భారతదేశమును అట్టి భారతదేశమునకున్నూ ఆంధ్రదేశము విజ్ఞానసత్రము అనిపించుకొన్న కీర్తి

నుండి మనము ఈనాడు బహునాయకత్వముతో అధోగతి యగుట చూచి మనకు కనువిప్పు జేసి సరిదిద్దుకొనునట్లు చేయుటకాయన్నట్లు డాక్టరు పండిత నెహ్రూ అధ్యక్షులైనప్పుడు మనకున్న ఈ శాస్త్రపదవిని కూడ తగ్గించగా శక్తితో సహా యన్నట్లు తిరిగి ఆంధ్రుల సభ్యత్వము తనకు తనతోబాటు పట్టాభిగారికి కూడ లభింపజేసుకొనుటయే గాక 60 సంవత్సరముల నుండి ఏనాడు లభించని అఖిలభారత అధ్యక్షతను తొలిసారిగా తాను ఆంధ్రరాష్ట్ర అధ్యక్షుడుగానున్నప్పుడు ఆంధ్రునికి లభింపజేసుకున్న గౌరవము తాను పొంది ఐకమత్య గౌరవములను ఆంధ్రులందరికీ కూడ తీసుకువచ్చినాడు.

తనవలెగాని తనకుమించినగాని ఇతరులు తయారు కావలెనని విజమయిన నాయకుడు వాంఛించును. ప్రతిఒక్కడు ఒక్కొక్క మహాత్ముడు కావలెనని గాంధీజీ ఆశించెను. ఇది మహాత్ముల త్రోవ. ఈత్రోవను అనేకమందిని నడచునట్లు చేయగలిగెను

నిరుడు ప్రభుత్వము రైతులకు బాధాకరమయిన విధానమున ధాన్యసేకరణ చేయబోవుచున్నదని తెలిసి ఈవిధముగా బాధించినచో రైతులు తిరగబడగలరనుమీయని రైతుబాంధవుడు రంగాజీ ప్రభుత్వమును హెచ్చరించగా ఈయనయొక్క విశ్వరూపము నెరుగక కాబోలు అప్పటి ఆహారశాఖామంత్రి రాజన్ గారు ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు అధ్యక్షులయిన రంగాగారిని అరెస్టుచేయిస్తాననగా ఒక్క రంగాను అరెస్టుచేస్తే ఎన్నివేలు, లక్షల రంగాలు బయలుదేరివస్తారో తెలుసునా? జాగ్రత్త! యని ఆంధ్రకేసరి గర్జించి రంగాజీయొక్క ప్రతిబింబమయిన విశ్వరూపమును చూపించేటప్పటికి ఆమంత్రివరేణ్యులు మరిమారు మాటాడలేకపోయిరి.

ఈఒక్క సాదృశ్యము చాలదా. కాంగ్రెస్ సంస్థ ప్రభుత్వమునకు తొత్తు కాబోయినదని దుష్ప్రచారకులు, అజ్ఞానులు చేసే బాధ్యతలేని ప్ర

కారమునకు పరమార్థమేమి? స్వరాజ్యము వచ్చిన ఈ కొద్దికాలములోనే కాంగ్రెస్ సంఘాలు కాంగ్రెస్ అనుబంధసంఘాలు కాంగ్రెస్ ప్రభుత్వమును సరియైనమార్గములో పెట్టుటకు ఇట్టి సాధ్యమయిన పనులు ఎన్నియో చేసినవి. వీటిని ఆయా కాంగ్రెసుసంఘాలకుపోయి చూచిన తెలియును గాని ఇంటిలోకూర్చుని ఏమీ లేవు అనుకుంటే ఏమి తెలియును. బాధలుపడటం మనుష్యులకు తెలుస్తాది. కావున నూతనముగా స్వరాజ్యము వచ్చిన తరిలో అధికారములు ప్రజలహస్తగతము కానున్నసమయము చూచి కొంతమంది స్వలాభపరులు అమాయక ప్రజలను చేసి ముందుకు గెంటుకవచ్చి కాంగ్రెసుపేరిట అనుచున్న ఆటలు కొన్నిచోట్ల ఇప్పుడు సాగిపోవుచున్నవని ఇకముందుకూడా సాగిపోవునని నిర్వీర్యులయి, నిరుత్సాహులయి ఇంకెందుకొచ్చిన కాంగ్రెసు (అసలు న్యాయాన్యాయములకొరకు పోరాటము ఇక ఎందుకు) అనే అర్జున విషాదయోగమును చక్కగా వదలిపెట్టి తమకు ఎక్కడైనను ఏవిధమయినదైనను ప్రభుత్వముపేర ఎవరయినా అన్యాయము చేయుతలపెట్టిన తమ కర్తవ్యమును నిర్ణయించుకొని తమ స్థానిక కాంగ్రెసుసంఘముల ద్వారా ఆ కార్యకుల ఆటలను నిలబెట్టి న్యాయమును చేకూర్చుకొందురు గాక!

—o—

# కార్యాచరణకు కొన్ని ఉదహారణలు

---

మిగులుజిల్లాయైన తూర్పుగోదావరిజిల్లాలోనే రంపచోడవరం గిరిజనులో అమాయకత్వ కోయప్రజలనుచూసి అక్కడి ముఠాదార్లు (మునసబులు) ఇతరప్రభుత్వోద్యోగులు బియ్యమును అసలే ప్రజలకు అందకుండాచేసి బ్లాక్ మార్కెట్టుచేసుకొనుట ప్రారంభించుటవలన అక్కడిప్రజలు ఒక్కొక్కరు రెండేసిమూడేసి నెలలపాటు ఒక్కగింజయైనను నోచుకొనక చింతగింజలుకాల్చుకొని, తాటికాడ ముక్కలుగా కొట్టుకొని ఆకలిబాధనణచుకొనుటకు తినుటవలన ఊసరికాళ్ళు ఊసరిచేతులు బూరిపొట్టలు తయారై విరేచనములుపట్టుక చనిపోవుచుండ జిల్లాయువజనకాంగ్రెసు అధ్యక్షులు శ్రీ మట్నూరి వెంకటసోమసుందరంగారు పూనుకొని స్వయముగా అచ్చటకుపోయి పరిస్థితిని ప్రభుత్వదృష్టికితేగా స్థానికఉద్యోగుల తప్పుడురిపోర్టును ఆధారముచేసుకొని ప్రభుత్వము మిన్నకుండ ఈలోపున ఉచితఅంబలి, జావ కేంద్రములను ఏర్పాటుచేయుచునే కాంగ్రెసుపెద్దలకు తెలియబరచగా ఆంధ్రకేసరి ప్రకాశంగారు, ఆచార్యరంగాగారు వెంటనే వచ్చివారలీ ఈహృదయవిదారక దృశ్యములనుచూచి ప్రభుత్వమును గద్దించగా తక్షణం లారీలపై బియ్యము సప్లైచేయబడినసంగతి అందరకువిశదమే కదా! కేంద్రప్రభుత్వపు ఆర్థికశాఖామంత్రి ఒక్కతప్పుచేసినందుకు తొలగవలసివచ్చినసంగతి తెలిసినదేకదా! ఇట్టిపెద్దసంఘటనలూ, స్థానిక సంఘటనలూ ఎన్నియోకలవు.

నూతనముగావచ్చిన ఒక హరిజనఉద్యోగిని తనఆఫీసులో తనతోటి ఉద్యోగులు అంటరానివానిగాచూచినప్పుడు ఆపట్టణకాంగ్రెసుసంఘం వారు తెలియపర్చినంతనే వెంటనే పి. డబ్ల్యు. డి. శాఖామంత్రి శ్రీ భక్తవత్సలంగారు వారిని తీవ్రముగా మందలించినారు.

సాధారణఉద్యోగి తనకుగల చిన్నపరిమితిలోని వ్యవహారముల గూర్చిన ఫైళ్లను (కాగితములను) బల్లపై తనకిరువైపుల పెద్దఎత్తునపెట్టుకొని పేటితో చస్తున్నానంటాడు. ఇటువంటి అనేకమందికి పైఉద్యోగిగాయున్న వారు ఆమొత్తమువ్యవహారముల ఫైళ్లలో మునిగిపోయేనంటారు. ఇటువంటి అనేకశాఖల కేంద్రమైన రాష్ట్రప్రభుత్వముల వ్యవహారములన్నియు చూడ వలసిన కేంద్రప్రభుత్వఅధిపతి భారతప్రధాని నెహ్రూజీకి ఎంతవత్తిడి యుండునోగదా! ఇంతవత్తిడియుండి ఒకవైపు బహిరంగసమావేశాలకు, ప్రదర్శనలకు, ప్రచారములకు, ప్రారంభోత్సవాలకు హాజరగుచు, ఒకవైపు అంతర్జాతీయశాంతికొరకు కృషిచేయుచు, అట్టిసమావేశాలనుజరుపుచు, అందులకై ఇతరులుజరిపే సమావేశాలకుహాజరగుచు, ఒక్కొక్కదేశముతోనే సుహృద్భావసంబంధబాంధవ్యములనునెరపుచు, ఆయాదేశాలకు తగురాయబారులను నియమించుచు ప్రపంచములోని ఇతరరాజకీయరంగములవల్ల ఒక్కొక్కదేశములోను ఎప్పటికప్పుడు ఉద్భవించేటటువంటిన్ని, తారుమారయ్యేటటువంటిన్ని సమస్యలను వీరుపంపించునప్పుడు గ్రహించుచు వాటికి తగు సలహాలిచ్చుచుయున్న నెహ్రూ ఒకప్రక్కఇంటిలోపోరువలె, కడుపులోపుండువలె రేగుచున్న కాశ్మీర్, హైదరాబాద్ సమస్యలను పరిష్కరించుకొనుచున్న సమయములోకూడ సామాన్యముగా ప్రజలుచులకనగాచూచే ఒకసామాన్యబంట్రోతువిషయములో అన్యాయముజరిగినదని తెల్పినంతనే రాత్రిరాత్రికే ఆరాష్ట్రశాఖామంత్రికి న్యాయముకలుగచేయవలసినదిగా తెలుపుచు మూడవరోజునకే విమానటపాద్వారా సమాధానము అందజేసిరి. ఒకలంచగొండి దొంగవ్యాపారవిషయములో తెలిపినంతనే నాల్గవరోజునకే కేంద్రప్రభుత్వ అపరాధపరిశోధకులను (సి. ఐ. డి.) ఆ పరిశీలనకు చేయునట్లుగా పంపించిరి.

ఈవిధముగా ప్రపంచములో ఎప్పుడూ ఎక్కడాజరగని అపూర్వ గౌరవపద్ధతిని సంపాదించుకొన్న స్వరాజ్యమును, దేశప్రజలసౌఖ్య, సౌభా

న్యములకై అనేకరాజ్యములు కొనియాడుచున్నరీతిని సంఘ, ప్రభుత్వయంత్రముల సంస్కరణకై జరుగుచున్న విశ్రాంతినెరుగని అవిరళకృషినియెరుగక, మానవచరిత్రనెరుగని చాకబారువిమర్శలకు దిగక తమకై జరుగుచున్న కృషిని తెలుసుకొనుచు దానికి తాముకూడ దోహదముచేసుకొని త్వరితగతిని సుఖించెదరుగాక !

ఈవిధముగా ప్రతివిషయములోను, స్థానికవిషయాల్లోను మంత్రులు నేరుగ కలుగజేసుకొనుట బాగులేదు, కలుగజేసుకొనకూడదుయని కొందరు ప్రభుత్వోద్యోగులు, కొందరు పెద్దలువలెకనబడు స్వలాభపరులున్ను అనుచున్నారు. కొందరు కొందరుపెద్దలకు పెర్మిట్లు, లైసెన్సులు మున్నగునవి ఇప్పించుటవంటివి కాక ప్రజలకు కలిగే అన్యాయములనుతీర్చుటకు మంత్రులు పూనుకొనపోతే వీరు న్యాయమునుండి దూరమైపోవుచున్నట్లుగాదా ? మేము న్యాయమైన శాసనములుచేసినాము అనిచెప్పి ఆశాసనములను ఈరోజులలో ప్రభుత్వోద్యోగులకు ప్రజలకువదలిపెట్టి చేతులుముడుచుకొని కేంద్రములలోకూర్చొనగలరా? ఇంతకాలముగాజరుగుచున్న అన్యాయములను న్యాయముగామొనర్చుకొనుటకుగాదా దేశప్రజలు బహుప్రయాసపడి జాతీయమంత్రివర్గాలను ఏర్పాటుచేసుకొన్నది, మంత్రులువినదికూడాను? అంతేగాని తమతమ అన్యాయనాటకాలను ఇంకను కొనసాగించుకొనుటకు మద్దతుగా నిలచుటకే ఇంతకష్టపడి ఈమంత్రులు గద్దెనెక్కినదని తలపోయుచున్నారు కాబోలు ఈపెద్దలు.

కాని ఇక్కడ ఒకయదార్థవిషయము చెప్పకతప్పదు. ఇటువంటి స్థానికసంఘటనలను ప్రతిదానిని తొలుదొల్తనే మంత్రులయొద్దకు కొనిపోవుట అవివేకమును, అసమర్థతనే చాటును. మంత్రులుచేయవలసిన సుదీర్ఘ ఆలోచనావిషయములకు ఆటంకము కల్పించుకొన్నవారమే యగుదుము. కావున ఇట్టివిషయములను మొదటిదానికి సంబంధించిన అధికారితోను అతడుబిగిసియున్న అతనిపై ఉద్యోగితోను ఈవిధముగా మెట్టుమెట్టుగా

పైకిపోయి న్యాయముకలుగునట్లు పనిచేయించుకొని కానిపో అప్పుడు మంత్రులవరకువెళ్లుట ఉత్తమపద్ధతి.

ఇట్టివిషయములపరిష్కారమునకు ఆయా సంఘములద్వారా కృషి చేసిన తేలికగా పనిజరుగునని ఇదివరకే తెలుసుకొంటిమి. కాని పేరునకు ఇటువంటిసంఘములు చాలాఉన్నాయి. వీటిలో చాలామట్టుకు అసలు ఉన్నవా ? లేవా ? అనిపించుకుంటూ ఏపనీచేయకుండా యున్నవి. అటు వంటప్పుడు వీటిద్వారా పనిచేయించుకొనుటయెట్లు ? అనిఅడుగుచున్నారు. అధ్యక్షునికి, కార్యదర్శికి సరిపడదనియో, ఆకమిటీలో పార్టీలుండుట వలనో, లేక ఆకమిటీని సరియైన సేవాసంఘముగా పనిచేయించవలెననే ఉత్సాహము నాకున్నదిగాని తక్కినవారి కెవరికిపట్టనప్పుడు నేనుఒక్కడను ఏమిచేసేది ? యనో ఈమొదలైనరీతులుగా ఈఫిర్యాదులుయుంటున్నవి. ఇందుకు కారణములు ఏమైనను అసలు రెండునోరులుచేరినచోట విభేద ములువచ్చుట సహజముకాబట్టి కమిటీలో సేవజరుగవలెననే ఉత్సాహము గలవారు ఒక్కరున్నను ఉభయవాదనలను వినగలఓపికయుండి అందు ఒకరివాదన ఆకమిటీలోని ఇతరసభ్యులకు ఎంతహాస్యాస్పదముగాయున్నను, రెచ్చగొట్టిగాని, అవమానపరచిగాని అవతలకుపోవునట్లుగా కాళ్ళనుతన్ను కోకుండా ఉభయవాదనలనుండి సామరస్యదృష్టితో ఎంతవరకు సమన్వయ పరచి ఆచరణలోనికి తీసుకొనిరాగలమోయని చర్చకుతీసుకువచ్చుటద్వారా ఆయాకమిటీలు పనిచేయునట్లొనర్చగలరు. ఈవిధముగా నేనొక్కడనే చేయుచున్నా తక్కినవారు కలసిరావడంలేదు అని చెప్పుటవల్లకూడా కమిటీలకు ఇట్టిఅవాంతరము వచ్చుచున్నది. ఇందువల్ల తనకువచ్చే సహకా రముకూడదుసరిగదా తనమట్టుకుతను నలుగురులో చేలాచేసుకొనుచున్నా డన్నమాట. కావున ఆఉత్సాహవంతుడే అట్లుకలసివచ్చు ఒక్కనిగాభావిం చుకొని మనమందరం కొంతకొంతచేయుచునేయున్నాము, మనందరంకలసి పనిచేసినచో ఆపనులే బ్రహ్మాండముగాను తేలికగాను జరుగునుఅనేధోరణి

అవలంబించిన ఈనాడు కాకపోయిన ఎప్పటికైనను ఆకమిటీ నిర్దుష్టముగాను సమిష్టిగాను వ్యవహరించునదిగా యగును.

నేనే అపరగాంధీనియని చెప్పుకొనే మరికొందరుగలరు. ఇట్టిమెట్ట వేదాంతములువదలి అసలువేదాంతములోనికివచ్చుటచాలఅవసరము. నీకుఅందరికన్న తెలివైనవారమనుకొని వంటరిగాయుంటూ నాకుఅధికారముఅక్కరలేదు పదవులుఅక్కరలేదు తోచినంతవట్టుకుప్రజాసేవచేసుకుంటూ నేయుంటాను అనిచెప్పతూయుంటారు. నేనుఇలాగచెప్పేను ఎవరూ వినలేదు. అలాగచేసేను. ఎవరూ చూడలేదుఅని నిత్యంగోలపెడతారు. ఇట్లుగోలపెడుతూనే ఒక్కసారిగా పెద్దఅధికారాలకొరకు కుట్రలుపెట్టుకుంటూయుంటారు. ఇదిఒట్టిపిచ్చి, భ్రమయున్ను. లేదా సమర్థతయుండికూడ కష్టపడుటకుగాని, అందరకుచేయవచ్చునని సమిష్టికృషిచేయుటకు ఇచ్ఛగించకగాని తన్నుతాను వంచనచేసుకొనే బూటకమైనా అయియుండాలి లేక అసమర్థతయైనా అయియుండాలి. ప్రజాసంస్థలద్వారాగాని, ప్రభుత్వముద్వారాగాని అధికారము లేనిదే సర్వతోముఖ ప్రజాసేవచేయలేరు. తిరిగి ఆప్రజాసంస్థలలోగాని, ప్రభుత్వములోగాని ప్రజాసేవచేయుటవలననే అధికారము లభించును. ఈ రెండింటికిన్ని ఇట్టి అవినాభావసంబంధముయున్నది. అనధికారముగా ప్రజలతరఫున వ్యవహరించపోవుట తప్పుకాదాను. కావున ఈమెట్టవేదాంతివారు వట్టినోటిమాటలుతప్ప ప్రజాసేవచేయనివారని ఋజువగుచున్నది.

<u>విపరీతధరలు, దారిద్ర్యోల్బణము</u>:— ఇటీవల ముఖ్యముగా అటు ధనికులుకూడా ధరలెక్కువైపోయినాయనిన్ని, ఆహారవస్తువులు, బట్టలు మొదలగు అత్యవసరవస్తువులు కొనలేకుండా యున్నామనియు, బ్రిటిష్ప్రభుత్వమే బాగుండేది, కాంగ్రెసు వచ్చి ఏమీచేయలేకపోవుచున్నదనియు ఏమేమో ఎంతోపరిభుత్వాలసంగతి తెలిసినవారివలె చెప్పుకొనుచున్నారు. గతయుద్ధములో అనేకదేశములలో కొనసాగించిన భూదగ్ధవిధానములవలనున్నుయుద్ధపర్యవసానముగా ఏర్పడిన మరిఅనేక వినాశకరపరిస్థితులవల్లను

ఏర్పడిన ఆహారకిరువుగురించి యుద్ధము ఆఖరైపోయినవెంటనే వివిధదేశ ముల ఆహార ఆర్థిక గణితశాస్త్రజ్ఞులు అమెరికాలో సమావేశమై ఏయే దేశ ములో ఎంతెంతఆహా మున్నదో అది ఆయాదేశప్రజలకు ఎన్ని నెలలకు సరి పడగలదో, ఏమైనా మిగులుయున్న దేశాలనుంచిగాని లేక తమ ఆహారవిని యోగపరిమితిని ఇతరదేశప్రజల ప్రాణములను కాపాడుకొఱకు తగ్గించు కొని (రేషనింగుచేసుకొని) మిగల్చగలిగినదిగాని అత్యవసరమైన ఏయే దేశములకు ఎంతెంతపంపగలరో విచారించుటకుకూర్చొనిరి. ఇంచుమించు అన్ని దేశములలోను నాలుగైదుమాసములకే సరిపడునంతగా కొఱత తేలినది. ఇంక దీనినిబట్టి ఎంతెంతతగ్గించుటయనే ఆలోచనలోపడ్డారు. జర్మనీ, ఇంగ్లండు, రష్యాయున్నగుదేశములు చాలకొరతలోనున్నవి. దానిలోకి ఇండియా అత్తగారియిల్లు దానముచేసేఅల్లుడిపెత్తనంలోనుండుటచేత మరింత కొరత కనబడినది. అందు దక్షిణదేశమునకు విపరీతకొరతకన్పడినది. అదే సమయమునకు మన స్వపరిపాలనా ఎన్నికలుజరిగి మహాత్ముడువద్దన్నను స్వంతప్రతిభతో ఒహుజనఅభిప్రాయమునుబట్టి ఈదక్షిణదేశమగు మదరాసు రాష్ట్రమునకు ఆంధ్రకేసరి ప్రకాశంగారు ప్రధానియగుట తటస్థించెను. అక్కడ అమెరికాలో సమావేశమైయున్న ఆహారవిధానవిజ్ఞానులు కడు ఆందోళనతో మదరాసువంక తమదృష్టులను కేంద్రీకరించి ఈముక్కనూటి వీరుడు, ఈలోకమునెరుగని యదార్థపంకన్న ఏరీతిని తనప్రజలను మృత్యు ముఖమునుండి కాపాడుకోగలడాయని తలపోసిరి. ఎసెంబ్లీమొదటిసమావేశ ములోనే ఆహారపరిస్థితి ఇంతభయపెట్టుచున్నను 'మాస్తూకూర్చొనుటకేనా నేము ఈపదవులకు అవలంబించుట. నారాష్ట్రములో నేను చావకముందు తిండిలేకుండా ఎవరినీచావనీయను. ఎవరైనా తిండిలేకచచ్చినయెడల నేనే ముందు పొడుచుకుచస్తాను' యని ప్రకటించినారు ప్రధానిప్రకాశం. అదే రీతిని పెంటనే ఢిల్లీ, ఇండోనీషియా, అమెరికా మున్నగుదేశములకు విమా నములలో తగునవర్తులైనవారిని పంపించి ఓడలలో వేలకొలది టన్నుల

బియ్యము, గోధుమలు, మొక్కజొన్న, దుంపపిండి ఈవిధముగా ఏమిదొరికిన అదికొల్లతీసుకవచ్చి మనఅందరిప్రాణములు కాపాడినాడు. ఇంతేకాదు. కాంగ్రెసుప్రజలకు సేవా చేయుచున్న మహాశయులన్నియు ఒక్కుమ్మడిగా ప్రవేశపెట్టినప్పటికి ఈయన త్యాగము చూచి మహాత్ముడనదగ్గవాడని, నెహ్రూవంటినాయకులు, ప్రజలు అపోజిషన్‌పార్టీలవారుకూడా ప్రశంసించినారు.

ఈవిధముగా మన కాంగ్రెసునాయకులు ఈవిషయములో మనలను కాపాడుకొనుచువచ్చిన ప్రతిచర్య చెప్పుకొనవచ్చుటకెన్న. మొత్తముమీద ఈక్రిందఉదహరించినవిషయము ఒక్కటిచెప్పిన చాలునుకుంటాను. ధరల పెరుగుదల, ద్రవ్యోల్బణమువిషయములో నేనాడు ప్రపంచములోని తక్కినదేశములన్నిటికన్న మనదేశము కొన్నిరెట్లును ఒకదేశముకన్న వెయ్యిరెట్లున్న మెరుగైయున్నదని మీకుతెలుసా? చైనాలో యుద్ధపరికర అవసరములకై ఊరికేఅచ్చుగుద్ది పారవేయుచున్నడబ్బుకుతగ్గ పదార్థములులేక ధరలు పైకిపాకనారంభించి చివరకు ఒక్కకోడిగుడ్డు 25డాలర్లు ఒకకోడిపెట్ట 500 డాలర్లు (1 డాలరు=సుమారు $3\frac{1}{2}$ రూపాయిలు) ఈ విధముగా ఒకచొక్కా కుట్టించుకోవలెనన్న బజారునకు ఒకసూట్‌కేసుతో నోటు తీసుకువెళ్ళవలసినస్థితి ఏర్పడినది. నాలుగైదుసంవత్సరములక్రితమే ఆహారపదార్థములులేక ఒకరాష్ట్రప్రజలు (హోపేరాష్ట్రమనిజ్ఞాపకము) అక్కడబహుకొద్దిగాయుండే చెట్లచేమలఆకులను అవికూడా అయిపోగా రొబ్బలను తర్వాత చిన్నకొమ్మలను వేరడును ఆఖరకు వేళ్ళుకూడాత్రవ్వుకొనితినుకుంటూ కాలిసదకసు ఆరాష్ట్రము వదిచి లక్షలకొలదిప్రజలు పోనారంభించిరి. రాష్ట్రమంతటా ఎక్కడా ఒకపచ్చనిమొక్కకూడా లేకుండా బావురుమని ఒక ఎడారివలె, ఒకస్మశానవాటికవలె వెలవెలబోయినది. ఆహారములేనందున తల్లిపాలులేక బిడ్డలుచనిపోవుచుండగా ఎక్కడకక్కడే విడిచిపెట్టుచు ఆకలికిఓర్వలేక తినుటయేగాని ఆకులుఅల

ములు తినుటవలనను చలిబాధవన్న ఆరోగ్యములు వెంటనే చెడి పెద్దవారు కూడ దారిపొడుగునా ఎక్కడికక్కడే నేలకూలి మృతినొందిరి. ఆ దేశమున అప్పటినుండియు కష్టములు ఎక్కువగుచునే వచ్చుచున్నవిగాన ఈనాడు ఆదేశప్రజలు ఎట్లుజీవించుచున్నారో భగవంతునికే యెరుక. దీనికంతకు కమ్యూనిస్టులు జాతీయప్రభుత్వమును సుమారు 15 సంవత్సరములనుండి చికాకుపరుస్తూ ఎదిర్చి నేటికీసాగిస్తున్న యుద్ధకారణముగా నేయని తెలుసుకొనవలెను. ఇదీకమ్యూనిస్టులపంధా. వీరిప్రచారములు, చర్యలు ప్రజలను కష్టపెట్టుటకో బాగుచేయుటకో తెలియుచున్నదిగద! ఈవిధముగా ఏదైన వస్తువుకొనుటకు వెళ్ళుటకుగాని వ్యాపారములో ఇచ్చిపుచ్చుకొనుటలోగాని ఇన్నేసినోట్లకట్టలను తీసుకుపోవలసివచ్చుచుండుటచేత ద్రవ్యోల్బణము హెచ్చేకొలది దానినిబట్టి ధరలుపెరిగేకొలది 1,000 డాలర్లనోట్లనుండి 10,000 డాలర్లనోట్లు అక్కడనుండి 1,00,000 డాలర్లనోట్లు అచ్చుగుద్దుచు వచ్చి ఆఖరికి మొన్న కొద్దిమాసములక్రిందట 10,00,000 డాలర్లనోట్లుకూడా అచ్చొత్తుటకు గడంగినట్లు తెలియవచ్చుచున్నది.

అసలు ఒకదేశములోని ప్రజలఆర్జనబట్టి, ఆ దేశములో ఉత్పత్తిఅగుచున్న పదార్థములనుబట్టి ధరలునిర్ణయించి ఆధారలకిమ్మత్తుకు సరిపడగా మాత్రమే ధనమును ప్రజలలోనికి విడుదలచేసిన ఆధనముతో ఆధనమునకు సరిపడా వస్తువులుండుటచే అందరు సమానముగా తమకుకావలసిన వస్తువులను కొనుక్కొనగలిగియుందురు.

యుద్ధములో మనదేశములోకూడ బ్రిటిషుప్రభుత్వము సైన్యముల జీతములకొఱకు, యుద్ధసామగ్రికొనుటకు, తమసామ్రాజ్యయుద్ధమును నిర్వహించుకొనుటకు వలసిన ఇతరసాధనసంపత్తి సేకరించుకొనుటకు, యుద్ధప్రచారము సాగించుకొనుటకు విపరీతముగా నోట్లను అచ్చొత్తి వినియోగించింది. దానివల్లనే గుమ్మడికాయ రూపాయికిఅమ్మడందగ్గరనుంచి అన్ని వస్తువులు దాదాపు 7 రెట్లుపెరిగి ప్రజలు చాలఇబ్బందిపడజొచ్చిరి. ఈనోట్ల

చాలామందికి తగినన్ని సాధనములులేక చిల్లరకూడ చాలబాధపడిరి. కనుక నాణ్య పరిమాణాన్ని గురించియే అప్పటికి ఇంకా బ్రిటిషుప్రభుత్వముండినను కాంగ్రెసు తన పలుకుబడిని ఉపయోగించి 1,000 రూపాయలనోట్లను ఉపసంహరించిరి. నేటికికూడా ఆయుద్ధకారణముగా ఎక్కువైన సాధారణ కరెన్సీనికూడ క్రమేణా తక్కువపట్టుచున్నట్లు తోచుచున్నది. అందుచేతనే ఈమధ్య కొన్నిమాసములుగా వ్యాపారస్థులలో డబ్బుదొరకబడుటలేదని కటకటగాయున్నదనేమాట వినబడుచున్నది. ఇదివరకు ఇన్ఫ్లేషన్ (ద్రవ్యోల్బణం) జోరుగాయున్నరోజులలో వ్యాపారస్థులకు అనేకరెట్లుగా మితిమీరి వచ్చెడు లాభములకు అలవాటుపడియుండుటచే ఈనాటికీ హెచ్చులాభాలను ఘటించియున్నను వీరికి కష్టముతోచుటలో ఆశ్చర్యములేదు. ద్రవ్యోల్బణము వల్ల ధనవంతులకే దేశములోవున్న ధనమంతయు చేరిపోవుచు వస్తువులను కొనుగోలు శక్తిఎక్కువగుచు, బీదలు ఇంకనుబీదలగుచు అవసరవస్తువులుకూడ కొనుక్కొనలేని పరిస్థితిలోనికివచ్చుచుందురు. ఈద్రవ్యోల్బణమును తగ్గించుకుంటూరావడంవల్ల ధనికులపరుగును కొంతతగ్గించుకుంటూ బీదలకొనుగోలు శక్తిని అభివృద్ధిపరచుచుండును.

ఈవిధముగా తక్కినదేశములలోవలె దివాళాకోరుపద్ధతిని ఈద్రవ్యోల్బణము పెరుగకుండా తగ్గించుకొనుచువచ్చుచున్నందువల్లనా ఈకాంగ్రెసును, కాంగ్రెసుప్రభుత్వాలను దూషించుటకుకడంగుట, లేక ప్రభుత్వ అధికారము లేనప్పుడుకూడ ప్రజాధికారముతో ప్రభుత్వాధికారముగల శత్రువుచేకూడ కొన్నిప్రజోపకారపనులు చేయించుకోగలశక్తియుక్తమై నడచుచున్నందువల్లనా, * లేక పెద్దకరువు, బందరుకరువు, గుంటూరుకరువు

* హైదరాబాదుసమస్య విషమించియున్నప్పుడు అచ్చటిఅన్యాయ నిర్మూలనకు శాంతిస్థాపనకుగాను సైనికచర్యలు తీసుకోవలసివచ్చినప్పుడు అందుగానే నైజాంప్రభుత్వాధికారములోయున్ననుకూడా భవనములు, పెట్టెడములు నాశనముకాకుండాను ,రక్తసిక్తంతులు ప్రవహించకుండాను,

మిగిలియున్నవారుకూడా కొన్ని సంవత్సరములు నానాయిడుములు పడవలసి వచ్చె. మోటయుద్ధపద్ధతులనుండి కాపాడుటకుగాను సామాన్యముగాజరుగు నట్లు దేశములోని సంపదను ధనరూపములోగాని, వస్తురూపములోగాని బయటకుపోనీయకుండాను కట్టుదిట్టములుచేయకల్గిరి. ఈవిధముగా కాంగ్రెసుఅధికారములోనున్న శక్తిపుతోకూడ పనిచేయించుకొన్నపనులు వివిధ రంగాలలో వివిధవిషయములలో వేలకొలదిగా యున్నవి.

---

అని పిలవబడే పట్టణం (చెన్నపట్టణం) లోసిక్కిపోయిన తిండిదొరకునని ఆకలిబాధచే దిక్కులేక వెర్రివ్యామోహితులై వేలకొలదిప్రజలు ఒరింకు రోడ్డుపట్టి పోనారంభించి దారిపొడవున చచ్చిపోవుచు ఆరోడ్డుకిరుప్రక్కల వారిఎముకలు పెద్దగుట్టలవలె తయారగునట్లుచేసిన కరువులవంటివి; తూర్పు దేశాలలోకి సుందరమైనట్టి, పెద్దదైనట్టి రంపవలందనుయని పేరుగన్న కలకత్తానగరవీధులలో తమప్రక్కనే లక్షలకొలది బియ్యపుబస్తాలు పర్వతములవలె పెట్టుకట్టియున్న రాసులప్రక్కనే 36 లక్షలప్రజలు తినుటకుగింజలేక అమ్మా గింజియనుటకుకూడ ఓపికలేక నేలకూలి ప్రాణములుండగనే నక్కలు కుక్కలు పీక్కొనితినునట్లు చేసినకరువులవంటివి జరగనిచ్చిన బ్రిటిషుప్రభుత్వమువారివలెకాక వారు ఏమిలేకుండగా గుల్లచేసిపోయినందున క్షయపెట్టుటకు నిలచినకరువుపిశాచిని కూడరాకుండా, ప్రజలనుతాకకుండా కాంగ్రెసుప్రభుత్వాలు తమగౌరవ, సుహృద్భావ, నైతిక, వస్తుపరపతులతో ముఖ్యముగా తమఅహింసా ప్రేమతత్వములవల్ల ప్రపంచమంతయు గాలించుకొనివచ్చి మనలను కాపాడుట తప్పనియూ లేక యీదేశములోగాని ప్రపంచములోని తక్కినదేశములలోనగాని ఇతరరాజకీయసంస్థలవలెగాక ప్రతిమానవునకు ప్రతిసంఘమునకు అడుగడుగునకు అవసరమయ్యే పోరాటములలో అప్రతిష్టయనకొని తామపట్టినపట్టును వదలక-మహాప్రళయంలో కొట్టుకుపోవుచున్న పడవను రక్షించుటకేర్పడినను దానికి తాళ్ళు వేసి దరిచేర్చినప్పుడు ఆంతర్ప్రవాహముగా, సుడిగుండములునెరుగక ఏక

విఫలతచెంది నష్టపడునట్లు ఆత్మబలహీనత, తమ్ముతాము వంచించుకొని నాశనమగుటయే (Inferiority complex & self condemnation) యగును. కావున ఈభ్రమను విడచి శాశ్వతమైన పునాదులువేయబడిన ఈ రజ్జుద్రేమ (రజ్జు=త్రాడు) వంటికాంగ్రెసులో నిశ్చయముగాచేరి మన దేశమునకు, ప్రజలకుచేకూరిన అపూర్వ గౌరవప్రతిపత్తులను ఇంకను బలపర్చుకొని, ఇనుమడింపజేసుకొని ఆగౌరవమును కాపాడుకొనుచు తమతోటి వారలలో గౌరవముపొందుచు సుఖించి, ఆనందించెదరుగాక !

ఇన్ని సందేహములుపోగా నేడుప్రజలలో మరిఒక్క సందేహముమాత్రము మిగిలియున్నట్లు తోచుచున్నది. నెహ్రూ, పటేల్, ఆజాద్, రాజేంద్రప్రసాద్ వంటిప్రముఖులు నేడు ప్రభుత్వఅధిపతులుగాయుండ కాంగ్రెసు నిర్మొగమాటముగా ప్రజలసంస్థగా వ్యవహరించగలదాయని. అందులోను ప్రజలకు నూతనముగా స్వరాజ్యము హస్తగతమైన ఈతరిలో ఈప్రశ్నకు ప్రాముఖ్యము ఎక్కువ. దీనికికూడా భారతస్వరాజ్యము యావత్ప్రపంచ స్వారాజ్యసౌభాగ్యాభివృద్ధికే దారిచూపినదియను యశస్సుసంపాదించుకొనే భావియున్నదోయన్నట్లుగాను, ఏసౌఖ్యసౌభాగ్యపురోభివృద్ధులకై మనము స్వరాజ్యము సంపాదించుకొన్నామో అట్టిసౌఖ్యసౌభాగ్యపురోభివృద్ధికి సరియైన, సుస్థిరమైన పునాదులు పడుటకోయన్నట్లుగాను, మహామేధావి, గాంధీసిద్ధాంతకాంగ్రెసుచరిత్ర భాష్యకారుడు, ఒకరిసమస్యలు ఒకరిసమస్యలకు పొత్తులేని యొనిమిదివందల సంస్థానాలలోని ప్రజలందరికి నాయకత్వముహించి ఒకదరిజేర్చినట్టి, సర్వతోముఖ ప్రత్యక్షనిర్మాణకౌశల్యముగలట్టి నిర్మొగమాటు స్వప్రతిభాశాలి డాక్టర్ భోగరాజు పట్టాభిసీతారామయ్య గారు ఇప్పుడిప్పుడే నూతనముగా స్వరాజ్యమువచ్చిన ప్రజలకు ఒకపేరుపెట్టి ఒకవరవడిదిద్దించి, ఒకనూతననడక నేర్పవలసిన ఈతరుణములో అఖిల భారత కాంగ్రెసుఅధ్యక్షుడగుట దేశప్రజలభాగ్యము.

ఈసందేహములన్నియుతీరగా మిగిలియున్న ఒకసమస్యగూర్చి ట్టి కు చర్చించవలసియున్నది. ఈపైనుదహరించిన సమన్వయము, కాంగ్రెసు త్వ దూరదృష్టితో ఎదుటవారిమంకుపట్టు తప్పయినను కొంతకుకొంతలోటుతో నైనను కావలసినదని ఆటంకపడిపోకుండా పనిజరిగిపోవుచు ఆలోచునా కూడ తరువాత తీర్చుకొనే కాంగ్రెసువిధానముతోనే పాకిస్థాన్ వాదన కార్యరూపములో నిలబడజాలదని కృత్రిమసృష్టియని ఎంతమందివిజ్ఞులు చెప్పినను ముస్లింలీగువారు ఆలకించక పెడచెవినిపెట్టి స్వాతంత్ర్యముగాకుండా మనకు బ్రిటిషువారికి అక్కరలేనియుండగా మనకు కావలసినది జరుగుపోవుటకు ప్రస్తుతము బాధాకరమైనను తరువాత దేశసమైక్యత చేకూర్చుకొనగలధైర్యముతో ఈపాకిస్థాన్ కోరికకు ఒప్పుకోవలసివచ్చినది.

అబద్ధమాడుట ప్రమాదకరమనుటకు నిదర్శనముగా అప్పుడే ఆకృత్రిమసృష్టి అసలుంగు ఆనమ్మినప్రజలకే బయల్పడి కనబడుచున్నది. ఆనాయకులలోనే వారిననుసరించిన ప్రజలలోనే విభేదములు ఏర్పడి తీవ్రరూపము దాల్చుచున్నది. ఒకఅబద్ధమును సమర్థించుకొనుటకు ఒకటివెంబడి ఒకటిగా అనేకఅబద్ధములాడవలసివచ్చును. చివరకు ఈఅబద్ధములన్నియు అనేకపెనుభూతములై ఎదురుతిరుగును. ఇట్టిరీతిని కొంతదేశమును సంపాదించుకొనుటకేయనండి, లేక బాధ్యతనెత్తిమీదపడునని యెరుగక ఇదిఒక ఆటమాత్రమేయని తేలికగాదెంచి బ్రిటిషువారికి ఏజంటుపనిచేయుటకే యనండి, ముస్లింలీగువారు నమ్మించి చేసిన తీరనికోర్కెలతోకూడిన కృత్రిమప్రచారములన్నియు అప్పుడే అన్నిరకాల పెనుభూతములై నోళ్ళు, గోళ్ళుచాచుకొని ఆదేశఅధిపతులకు ఎదురుతిరిగి దేశమంతటా వికటాట్టహాసము సల్పుచున్నది. ధనవస్తురూపములో భారతప్రభుత్వము ఇవ్వతేలినవన్ని ఇచ్చివేసి, పాకిస్థాన్ ఇవ్వతేలినవి ఇంకను ఇవ్వకున్నను, హైగానైజాంపెట్టుబడిపెట్టినను, ఇంకనుచాలక అర్థించగా కరుణామయగాంధీజీవల్ల మనదేశము 45 కోట్లరూపాయిలిచ్చినను అక్కడిప్రజలకు ఆహార, అవసరవస్తువులా

కష్టమై, వ్యాపారములు కుంటుపడి దేశము కనీసపరిస్థితులలోనికి పోయిన దనియు, ప్రపంచవ్యాపారములలో ఉన్నతసరళిలో నడచుచున్న సినిమా పరిశ్రమ తూర్పుపాకిస్థాన్‌లో బొత్తిగాకట్టివేయవలసివచ్చినదనియు విను చున్నాము. ఇట్టి దివాళాకోరుతనమును కప్పిపుచ్చుకొనుటకు తక్కిన దుం దుడుకు రాజ్యములవలెనే అప్పుడే యుద్ధమునకుకూడా కడంగుచున్నది. తక్కిన సమస్యలవలెనే ఈవిషయమునుకూడ సవ్యముగా, సుఖాంతముగా భారతజాతీయకాంగ్రెసు పరిష్కరించగలదని ఆశించుట సముచితమే యగును.

ఇకపోగా భారతప్రజలు, భారతజాతీయకాంగ్రెసు స్వతంత్ర భారత కాంగ్రెసుప్రభుత్వము మిగిలెం. వీటిమధ్య ప్రజలకు రాజకీయచైత న్యము లేమియనే అవకాశము (Vaccum) ను ఉపయోగించుకొని మసుగా గడించేసుకుందామని కొందరు స్వార్థపరులువట్టుకుయున్నారు. అంతమాత్ర మున, ఇంటిలో ఎలుకలున్నవని ఇలుతగులపెట్టుకుంటామా? ఆఇంటిని వదలి పెట్టుకొనిపోతామా? కాంగ్రెసు మనయింటిని సంపాదించిపెట్టినది. అందుమ నలను ప్రవేశపెట్టినది. పరప్రభువులు నేర్పినవిద్యపుణ్యమాయంటూ అందులోనే ప్రవేశించియున్న ఈఎలుకల బాధనుండి తప్పించుటకు బోనులు తయారుచేయు చున్నారు. ఎప్పటికీ వీనిపట్టుకుంటూయుండుటే పనియాయని ఈఎలుకలుచేరి బాధించలేనిరీతిని ఇంటిని పునర్నిర్మించుచున్నారు. ఇంతచేయుచుండగా *

* కాంగ్రెసు అధికారపదవులలోనున్నవారెవరు బ్లాక్‌మార్కెట్టు, లంచగొండితనం, అవినీతులకు పేరుగాంచిన వ్యాపారపర్మిట్లు, లైసెన్సులు పొందరాదనియు, అట్టిపర్మిట్లువుండుచో వెంటనే వాటిని రద్దుపరచుకో వలయుననియు రాష్ట్రకాంగ్రెసు జారీచేసిన సర్క్యులరు గమనించవలెను.

గొర్రె పచ్చికబయళ్ళకు తోలుకొనిపోవు గొల్లను నమ్మకుండా కబేళాకు తోలుకొనిపోవు కసాయివానికూడా పోవునట్లు, రోగికికష్టముగానుండు మందులిచ్చి, లంఖణాలుకట్టి, పథ్యమునకుతీసుకువచ్చు వైద్యునితిట్టుకొనుచు

పరమాన్నము పెట్టిచంపు వైద్యుని మెచ్చుకొన్నట్లుగా, మంచిచేయువాని పోనాడుకొని వెనుకవిచారించు మానవదౌర్బల్య పరిపాటినుండి మేల్కొని పూర్వమెన్నడు ఎరుగనిరీతిని యావత్ప్రపంచము ఎవరినిగోల్పోయినందులకు గారినకన్నీటికాల్వలతో తడసి తేలిపోయినదో, అట్టిశవపేటికయొక్క మహాత్మ అభిమానించి, ఆశీర్వదించిన కాంగ్రెసు చేయుచున్న మానవసేవను తెలుసుకొనుచు, తోడ్పడుచు సుఖించెదరుగాక!

ప్రపంచశాంతిదూత, విశ్వమానవకళ్యాణప్రదాత, భారతభాగ్యవిధాత, పూజ్యపితబాపూజీని హత్యచేసుకొని ప్రపంచదృష్టిలో భారతజాతికి కించపరచగల, ప్రతిదేశీయుని శిరస్సును సిగ్గుతో నేలకువ్రాలునట్లు చేయగల ఒకకళంకమును తెచ్చిపెట్టుకున్నాం. ఆహత్యనుండిలేచిన దివ్యమైన, చిరస్థాయియైన తేజస్సును, సందేశమును దివిటీవలెచేబూని ఈమహాత్ముని ఆశయసిద్ధికి పురోగమించుచున్న కాంగ్రెసుయనే మహాజగన్నాథరథమును, ఈభారతనౌకను చక్రములలో ఆటంకముగా ఎవరూ శెడ్డలు వేయకుండా, త్వరితగతిని ఈమహాత్ముని ఆశయమైన సౌఖ్యప్రదమైన గమ్యస్థానముచేరుకొనుటకు ప్రతిభారతీయుడు ఎవరిశక్త్యానుసారము వారుఒకచెయ్యివేసి అందువల్లకలిగే ఫలితముగా ఈకళంకమును బాపుకొనవలసియున్నది.

ఎక్కడచూచినను గాంధిజీవిగ్రహప్రతిష్టాపనలు చేయుచున్నారు. ఆఉత్సవమునకు ఎంతెంతోడబ్బుఖర్చుచేసి పెద్దఅట్టహాసముచేయుచున్నారు ఇట్టివిగ్రహప్రతిష్టాపనలు అవసరమే. కాని ఇవి కేవలము డంబాచారమునకేయైనచో ఆప్రతిమాస్వరూపుని ఆత్మను క్షోభింపచేయుటయే యగును. శ్రీరామనవమి మున్నగుపండుగలకు ఎల్లెడల వందలు, వేలుఖర్చుపెట్టి ఉత్సవములు చేయుచునేయున్నారు. ఇంతకాలముగా జరుపుచున్న ప్రజాకోటిలో సామాన్యముగా నీతినియమనిగ్రహములు అలవడినసూచనలు కానరాకుండుట ఈఉత్సవములు సార్ధకముగా జరుపబడుటలేదుయని తేలుటలేదా! ఆధనమునే ఆమహాపురుషుల ఆశయసిద్ధికి కృషిచేయుటకు వినియో

గించినవారిఆత్మలు ఆనందించును. మనకు అట్టిమోక్షము లభించును. కావున ఈగాంధీవిగ్రహములను మనకు అడుగడుగునకు మనగమ్యస్థానమై తనఆశయమును జ్ఞాపకముచేయుననిగా మార్గము నిర్దేశించుననిగాయెంచి ఆవిగ్రహప్రతిష్ఠాపకులు ఆవిగ్రహముచుట్టునే ఆవిగ్రహస్వరూపుని ఆశయములను, ప్రబోధములను ఆచరణలో పెట్టుటకు తగుఏర్పాటులుకూడ చేసిననేతప్ప 'ఛాతీని గ్రీగ్రం సీసులు—దూరెని.....గుడెసెలు' అన్నట్లుగా వర్తించుకొనెవారు ఇట్టిపవిత్రమూర్తుల విగ్రహములను ప్రతిష్ఠించుట తగదు.

ఇదేవిధముగా ఏనాడో సార్థకముగా (అర్థముతోకూడుకొన్నవిగా) ఏర్పాటుచేయబడిన అనేకవిషయములు ఈనాడు అర్థములేకుండా ఆచరించబడుచున్నవి. నేడు మనదేశమును సౌఖ్యప్రదముగా పునర్నిర్మించుకోవలసిన, పునర్నిర్మించుకోగల పరిస్థితులు, అవకాశములుఏర్పడిన ఈతరుణంలో ఈవిషయములకే కాలగర్భంలోవచ్చినమార్పుల కనుగుణముగా ఆచరణలోనున్నవాటిని చూచి, గ్రహించి, అనుసరించవలసినఅగత్య మెంతేనికలదు. ప్రత్యక్షముగా ఆచరణలోనున్న మహాపురుషుల ఆశ్రమములుండుటచే అచ్చటుకుపోయి చూచి తెలుసుకొని తరించుటకుగాను కాశీమున్నగుప్రదేశములకు మహాశయులు వెళ్ళుచుండెడివారు. అందుచేతనే ఆప్రదేశములు తీర్థస్థలములాయెను. ఈనాడు అక్కడ ఆరాతికట్టడములుతప్ప అక్కడఏర్పడిన మహానగరములలో తక్కినమహానగరములలోవలె పరస్పరమోసములుచేసుకొనుచు జీవించుచున్న పతితజీవనులుతప్ప భక్తి, జ్ఞాన, ఆశ్రమధర్మములు మున్నగువాటిలో తమకుమిగిలియున్న ఏఅంతిమసందేహమును తీర్చుకొనుటకో, లేక తామునడచుకొనుటకుగాను మహాత్ములత్రోవను సాదృశముగా చూచుటకోగాని వెళ్ళేమహాశయులకు చెప్పుటకుగాని చూపుటకుగాని అచ్చట ఆఋషులులేరు. మోక్షమువచ్చునని ఈనాడు కాశీమొదలగుక్షేత్రములకు సాధారణముగావెళ్ళుచున్నపోకడ వట్టిభ్రమ. ఇదివరకు కాశీవెళ్లిన మోక్షమువచ్చునని చెప్పేదానికి అర్థముకలదు. నేడు అది నిరర్థకమైనది. తమ

బిడ్డలను గురుకులాశ్రమమునకు పంపుకొనుటకుగాని వైద్యవిద్యకైగాని మరి ఏఇతరమైన ఆధ్యాత్మిక సన్యాసత్రోవను జీవించదలచినను వాటికి తగుసలహాపొందుటకుగాని వెళ్ళుటకు నేడు ఆచరణలోయున్న వినయాశ్రమమువంటి ఆశ్రమక్షేత్రములే తీర్థస్థలములని చెప్పవలయును.

ఇదివరకుటిశాస్త్రములన్నిటితోపాటు, లేక ఇంకాఎక్కువగానుఅని చెప్పవచ్చు మనపశువైద్యశాస్త్రము చాల క్షీణదశపొందినది. నేడుగ్రామసీమలలో సాధారణముగా ఏదైన పశువునకురోగమువచ్చిన ఆరైతు తనకు తోచినకలో, గంజోపోసి ఆవాలుగైదువందలరూపాయల ఖరీదైనసొమ్ము తనకు దూరమైపోవుచుండుటను కళ్ళుతేలవేసుకొని నిస్సహాయుడైచూస్తూ కూర్చుండవలసివస్తున్నది. కాని ఏగ్రామమునకాగ్రామములోని రైతులు పలుగురూ నాలుగింతలువేసుకొని తమగ్రామమునుండి ఒకరిని (విద్యార్థికైనమేలు) ఏపశువైద్యశాలకో పంపించి పశువైద్యముబాగుగానేర్పించుకొనియుండిన ఆగ్రామములోనివారికి ఇట్టి ఎన్నైదువందలనష్టముగాకుండా కాపాడుకొనవచ్చును.

ఇదేవిధముగా గ్రామమున ప్రస్తుతము కనీసము ఒకరైనను కో-ఆపరేటివ్ ట్రెయినింగుఅయినవారు అవసరము. సహకారపద్ధతిపై ఏదైన పరిశ్రమచేయదలచుకొన్న తాము ఐదువేలరూపాయలు ప్రోగుచేసుకొన్నదానికి నాలుగురెట్లు అనగా ఇరువదివేలరూపాయిలు కో-ఆపరేటివ్ బేంక్ ఇచ్చునట్లుగా ఏర్పాటుచేయబడియున్నది. ఈపెట్టుబడితో ప్రొవిషన్ స్టోర్సు (అవసరవస్తువులమకాణములు) పాలసప్లయి ఒకడేమిటి అన్నిరంగములలోను ఈపద్ధతిని నడుపుకొనవచ్చును. కాని ఇటువంటివి అనేకము సరిగా నడవకపోవుటనుచూచి భయముచెందనక్కరలేదు. కో-ఆపరేటివ్ పద్ధతి తెలియకగాని కో-ఆపరేటివ్ శిక్షణపొందినవారుయున్నచో ఈసంస్థలను సవ్యముగా నిర్వహించుకొనగలరు. రేపుమనదేశము కో-ఆపరేటివ్ కామన్వెల్తు ఆవ్ సోషలిస్టు రిపబ్లిక్ గా నడవబోవుచున్నది. గ్రామమునకు ఇద్దరు.

ముఖ్యముగాకూడ ఇట్టిశిక్షణపొందినవారు అవసరమయ్యెదరు. కావున ఆదర్శప్రాయమైన, ఉత్సాహవంతులైన విద్యాధికయువకులు కో-ఆపరేటివ్ (ట్రైనింగుస్కూల్సుకు) శిక్షణాలయములకువెళ్ళి శిక్షణపొందుటమంచిది.

ఇంకను ప్రభుత్వముచేయుచున్న, చేయనున్న మరికొన్నిపనులు పరికిద్దాం. మనదేశములోనిపంట మనదేశప్రజలకు దరిదాపు 5 మాసములకు మాత్రమేసరిపడి తక్కినదానికి ఇతరదేశములపై ఆధారపడవలసివచ్చుచుండెను. దీనికి మనదేశము విదేశాలనుండి సాలుకు 100 కోట్లరూపాయిల విలువగల ధాన్యాదులను కొనుక్కొనవలసివచ్చుచున్నది. కావున ఇంత డబ్బు మనదేశమునుండి పైకిపోకుండాను ముఖ్యముగా ఆహారమునకు మనము ఇతరదేశములపై ఆధారపడనవసరములేకుండాను సుమారు నాలుగు వందలకోట్లరూపాయిలఖర్చుతో మూడుకోట్లఎకరముల అదనపుపంట పండేటటువంటి జలాశయనిర్మాణములకు పూనుకున్నారు. దీనివల్ల సాలుకు వెయ్యికోట్లరూపాయిలపంటవచ్చుటేకాక దరిదాపు 50 లక్షల కిలోవాట్ల విద్యుచ్ఛక్తి ఉద్భవించును. దీనిబట్టి మనదేశమునుండి పైకిపోవలసినడబ్బు ఎంతమిగులుచున్నదో దానిబట్టి మనదేశము ఎంతసౌభాగ్యవంతమైనదో యగునో ఊహించుకొనగలరు. కాకపోయిన ఫలితమును నెమ్మదినెమ్మదిగా పొందుటకు కొంచెము ఓపికపట్టుట అవసరము. అదియైన నిర్మాణము అంతా పూర్తిఆయ్యేవరకూ ఆగనవసరములేదు. అప్పుడేకొన్నిటికి పరిశోధనలు పూర్తియై కట్టడంపని ప్రారంభించినారు. మరికొన్నిటిపరిశోధనలు జరుగుచున్నవి. ఈపరిశీలనలోను, కట్టడంలోనుకూడ లక్షలాది, కోట్లకొలది ప్రజలకు ఉద్యోగముకలుగుచున్నది. కూలీలు, మేస్త్రీలు, కమ్మర్లు, వడ్రంగులు, ఫిట్టర్లు, టెక్నీషియన్లు, ఎలక్ట్రీషియన్లు, వివిధయంత్రనిపుణులు, డ్రాయింగు, ఇంజనీరింగుశాఖల ఉద్యోగులు మున్నగువారికి 'ఎడతెరిపిలేకుండా నిరుద్యోగసమస్య తీరిపోవుచున్నది. కొన్నిశాఖలకు ఇంకను చాలకయున్నారు. కావున కొందరు కడుపుబ్బువారు చెప్పుమోసపుమాటలనునమ్మి

కూర్చున్న చోటనే కూర్చొని ఇంకా ఎక్కువజీతాలు కావాలని అడుగుటమాని తాముచేయుచున్న పనిలో ఇంకా పైమెట్టుకు అవసరమైనపనితనపువిద్యను నేర్చుకొనుచు ఎంతయైనను పైకిపోవుటకు అవకాశమున్న ఈరోజులను ఉపయోగించుకొనుట మంచిది. ముఖ్యముగా మధ్యమతరగతులచదువుకల వారు ఈవృత్తులకు అవలంబించుటమేలు. ఇప్పుడుచేయుచున్నవారుకూడా చదువులేదుఅని నిరుత్సాహముచెంది అభివృద్ధిలేకుండా కూర్చుండవలసినవసరము లేదు. ఇట్టివృత్తుల సాంకేతికవిద్యనభ్యసించి అభివృద్ధిచెందుటకు తగుపాటవము చేకూర్చగల ప్రయోజన విద్యావిధానముకూడ అమలుపరచబడుచున్నది ఇట్టిపనులకువెళ్ళిన చోట సమిష్టిగా ఇట్టిఏర్పాటు వెంటనేచేసుకొనవచ్చును. ఇంకను ఈజలాశయనిర్మాణములకు అనుబంధముగా ముందుగానే ఆయా ప్రదేశములలో మహానగరములు సృష్టిజరుగును. వాటికవసరమగు నిర్మాణములు, పరిశ్రమాగారములు, పారిశుధ్య, ఆరోగ్య, వైద్యశాఖలుఏర్పడును. ఆ చుట్టుప్రక్కల, రోడ్లు, కాలువలు, నూతన క్వారీలు (గనులు) ఏర్పడును. వీటికి అన్నివృత్తులలోనివారు లక్షలాదిప్రజలకు పనులు లభ్యమగును.

ఇదివరకు ప్రజలయందు బాధ్యతలేనిప్రభుత్వము అవలంబించిన గొప్పవారిని బీదవారిగాను, బీదవారిని మిక్కిలిబీదవారుగాను భిక్షకులుగాను తయారుచేయువిధానమునుండి నేడు క్రిందనుండి పైకిలేవగొట్టుకొనిపోయే పనులు చేయబడుచున్నవి. ఐతే ఈవిధముగా పనులుకల్పింపబడినవారికి ఆహార, ఇతర అవసరవస్తువులను ఆప్రదేశములకు సరఫరాచేసి అందచేయవలసియున్నదికావునను వారికిసరిపడుజీతములు కోట్లకొలదియిచ్చుచుండవలసియుండును కావునను ఈప్రాజెక్టులపంటఒకటి ఒకటిఅందుకునేవరకు ఆహారపదార్థాలధరలు ఎక్కువగాయున్నదిఅనేమాటకు కొంతఓపిక పట్టవలసియున్నది. ఇంతేకాదు. వీటివల్ల దేశమంతటా పల్లెపల్లెలా వాడవాడలా విద్యుత్తు అందుబాటులోనికివచ్చి ఈనాడు అక్కడక్కడా శ్రీమంతుల గృహములలో విద్యుత్ శక్తివల్ల కలుగుచున్న సౌకర్యములనుచూచి ఇది మనకు

ఎప్పుడు కల్గునాయని తలపోయుచున్న వారికందరికు ఎంతటిబీదవారైనను ప్రతిగృహమునకు ఈనాటికిరసనాయలుకన్న చాలతక్కువఖర్చులతో లభించును. నూతులనుండి నీరుతోడుట గానుగలుత్రిప్పుట మున్నగు వ్యవసాయిక పనులకు అందుబాటుయగును. చిన్నపెద్ద అన్నిపరిశ్రమలకు ఉపయోగపడును.

మైదానములలోని వ్యవసాయమునకు అనేకట్రాక్టరులను అప్పుడే విడచిపెట్టినారు. ఇంకను వేలకొలది విడ దలచేయనున్నారు.

ఇదివరకు వారమురోజులకుకూడా వార్తలు అందుబాటులేనిగ్రామములు లక్షలకొలదిన్ని, తనఇంటిలోకూర్చొనియుండి దేశములోని ఏమహా నగరములోనున్న ఏవ్యక్తితోనైనను కొద్దినిముషములలోనే మాట్లాడుటకుగల సౌకర్యములుగల పట్టణములు బహుకొద్దిగాయున్నవి. ఇప్పుడు ఐదువేల జనాభాగల ప్రతిగ్రామమునకును తంతి, తపాలాసౌకర్యములు చేకూర్చుటకు ఏర్పాటుచేయుచున్నారు.

ఐదువేలజనాభాగలగాని కొంచెముతక్కువున్నచో శివారుగ్రామములను కలుపుకొనిగాని పంచాయితీబోర్డు ఏర్పాటుచేసుకొనుటకు ఏర్పాటు చేసినారు. కాని ఈనాడు చాలమంది ఈపంచాయితీబోర్డులయందు నమ్మకముపోయి అసహ్యించుకొనుచున్నారు. దీనికికారణము అయోగ్యు ప్రజలే. బయలుదేరినవాడు ఎంతటిస్వలాభపరుడు, మోసగాడుయనిగాని సిగ్గులజ్జాలేక ప్రతిదానికి రోడ్డునపడి జుట్టూజుట్టూపట్టుకొనువాడనిగాని తెలిసియుండియుకూడా ఏరెండురూపాయిలకో, నాలుగుబళ్ళఇటికె తోలించి ఒకరామాలయముకట్టిస్తాననో, లేక నాలుగుబారలరోడ్డు వేయిస్తాననో చెప్పినంతమాత్రాన, లేక తన గుమ్మములోనికివచ్చినారనే ఒక్కరోజు గౌరవమునకు, ఒక్కరోజుపొట్టకూటికిలోబడి మూడుసంవత్సరములపాటు మోసమునకు అగౌరవమునకుపాల్పడు దౌర్బల్యమువల్లనే. వీనికిగాను గౌరవ వంతులుమామూలుగా తమంతటతాము బయలుదేరరు. కావున అట్టిగౌరవ

వంతులను, నీతిమంతులను, న్యాయవంతులను కోరి నిలబెట్టి సేవచేయించుకొనిన ఈమేలుచేయుటకు ఏర్పాటుచేబడిన స్థానికపరిపాలనయంత్రము కృషిచేయుటమాని మేలుచేయుటకే ఉపయోగపడును.

ఈవిషయంలో ఒకఉదాహరణ: ఒకగ్రామములో యువకులు తమగ్రామాభివృద్ధినికోరి ప్రజాసేవచేయుటకు యువజనకాంగ్రెసు స్థాపించుకొని ప్రథమమున ఆగ్రామమునకు కళంకము, అనారోగ్యము, అపహాస్యముగాను యుండునట్లు ఎక్కడపడితేఅక్కడ మలవిసర్జనచేయు పద్ధతిని రూపుమాప సమకట్టిరి. ఇంచుమించు ప్రతిగ్రామములు ఈ స్థితిలోనున్నవి. ఏమార్గముగుండానైనసరె ఎవరైనా ఒకగ్రామములోనికి వచ్చినప్పుడు వారిని ఆగ్రామములోనికి మొదటఆహ్వానించేది సుందరమైనఉద్యానవనాలు కాదు, రాజమార్గసింహద్వారకుడ్యాలు కాదు,—కూమానవరీతి సువాసనదే. ఇట్టికళంకమునుబాపుకొని గ్రామఆరోగ్యమును కాపాడుకొనుటకుగాను, అమానుషముగా ఎక్కడపడితేఅక్కడ మలవిసర్జనచేయకుండాను, సంచరించేనడవలలో సిగ్గులేకుండా బహిరంగముగా ఇట్టిపనులుచేయకుండాను ఆగ్రామప్రజలకు విజ్ఞప్తిచేస్తూ ఆయాప్రదేశములలో బోర్డులుకట్టి ప్రచారముచేసినారు. అంతేకాదు. ఇందుకుగాను గ్రామమునకు నాల్గుమూలలా మరుగుప్రదేశములను ఏర్పాటుచేసినారు. తరువాత ఆగ్రామములోని బాటలకు ఆటంకముగాను చీకాకుగానుయుండే ముళ్ళతుప్పలు, రాళ్ళు వగైరా బాగుచేయుట బేడా, పావలాఖర్చులతో సాగించ మొదలుపెట్టినారు. ఒకగ్రంథాలయమును, వయోజన రాత్రిపాఠశాల ప్రారంభించినారు ఏమీచేయనివారికి ఏమీకనబడదు, కాని ఒక్కొక్కటేచేస్తుంటే అంతకన్న మేలైనమార్గములు విషయములు కనబడుచుండును. అవిచేయుటకుకూడ తగుఅనుభవము, పలుకుబడి (సహాయ, సానుభూతులు) కూడ వచ్చుచుండును. ఆగ్రామములోను ఆగ్రామమునుండి ఎటుపోవలెనన్నను ఒకఅరమైలు వరకు వానకాలమందు మోకాలులోతు అడుసువలెనుండును. ఈఅడుసు

అలాగునచున్నా బాగా చేయుండెడిది. దీనికితోడు ఏ ధర్మాత్ముడో వారి ధర్మమాయంటూ ఎన్నాడో ఒక్కసారి వేయించిన కంకరరోడ్డును మరిమళ్ళా చూచినవారులేకపోవుటచే ఆ కంకర కాస్తా ఆ అడుసులో కలిసిపోయి మోకాళ్ల వరకు ఏగరళ్లు, పాదాలు తెగిపోయి పుండ్లగుచున్నవి. ఆ గ్రామ రైతులు ఇతరవృత్తుల, వ్యాపారముల పనిమీద రోజూ తమపనులకు వెళ్ళుట తప్పదు కాబట్టి ఆ తెగిపోయిన గాయములతోనే మరల ఆ రాళ్ళతో కూడుకొన్న అడుసులోనుండి నడవవలసివచ్చుచున్నది. ఆ గ్రామయువకులు ఇట్టి పెద్దఖర్చుతో కూడిన సదుపాయము చేయుటకు పంచాయితీబోర్డు ఆవశ్యకతనుగుర్తించి అందుకు తమగ్రామజనాభా కొంతతక్కువగుటచే శివారుగ్రామములను కలుపుకొని 5000 లకు పూర్తిచేసుకొని పంచాయితీబోర్డుకొరకు ప్రభుత్వమునకు వ్రాసుకొనిరి. ఇది సెంక్షనుఅయినదని తెలుసుకొని ఆ గ్రామములోని కొందరు స్వలాభపరులు ఆ పంచాయితీబోర్డును చేపట్టవలెనని తీవ్రప్రయత్నములు సాగించమొదలిడిరి. అంతట జిల్లాయువజన కాంగ్రెసువారు ఆ గ్రామములోని అన్నిపక్షముల పెద్దలతోను, సామాన్యప్రజలతోను సంప్రదించి ఒక బహిరంగసభ ఏర్పాటుచేసినారు. అందుగ్రామస్థులు తమయువకులు చేసిన సేవను, వారు ముందు చేయవలసియున్న సేవకొరకుగాను పంచాయితీబోర్డును గల్పించిన విషయమును గుర్తించియు, మరియేవిధానమునైనను ఆ గ్రామములో పార్టీలువచ్చే సూచనలుండుటవల్లను, ఆ పంచాయితీబోర్డును ఏర్పరచినదగుటకు ఆ గ్రామయువజనకాంగ్రెసునకే అధికారమునిచ్చుచు ఏకగ్రీవముగా తీర్మానించిరి. ఇట్టి ఏర్పాటులు ఎక్కడైనను చేసుకొనవచ్చును. ప్రభుత్వములు వీటికి దోహదమిచ్చుచున్నవి.

ఇంకను ప్రభుత్వం (ట్రాన్సుపోర్టు) ప్రయాణసౌకర్యాలను ఒక్కటొక్కటే జాతీయంచేయుచున్నది.

నేడు ఆహారంతో బాటు ప్రజాధారమైన కాగితం, సిమెంటు మొదలగు ముఖ్యావసరపదార్థముల నుత్పత్తిచేసే పెద్దఫేక్టరీ పరిశ్రమలనుకూడ

జాతీయంచేయుచున్నది. ఇందువల్ల వీటిని ఉత్పత్తిచేసే కార్మికులదోపిడీపోయి వారికి న్యాయమగు జీవనభృతి కల్గుటయేగాక వీటివినియోగదారులకుకూడ వీటిని సేకరించుట లోగడ వానుడుమూతకష్టములుపోయి సులభముగా లభ్యమగును.

400 కోట్లరూపాయిలలో లక్షలకొలది ప్రజలుజీవించగల రేడియో పనిముట్లు తయారుచేసేటటువంటి, యంత్రములపనిముట్లు, ఎలక్ట్రికల్ సామగ్రి, టెలిఫోన్ సామగ్రి తయారుచేసేటటువంటి ఫేక్టరీలను నిర్మించుచున్నారు. ఇందు మనదేశీయులైన అనేకమంది నిపుణులకు, పనివారలకుఉద్యోగములుకల్గి మరిఅనేకమందికి ఉత్పత్తిప్రణాళావిద్య నేర్చుకొనుటకు అవకాశము లభించుటేకాక ఇంతవరకు వీటికై విదేశములకుపోవుచున్న కోట్లకొలదిధనము మనదేశీయులలోనే యుండిపోవును.

అడవులలోనిచెట్లునరికి వాటిని చెక్కలుగాకోయు యంత్రములను నడుపువారు, గనులలోనిఇనుము, బొగ్గుత్రవ్వువారుదానినికరగి ఇనుపరేకులు, కమ్ములు వగైరాచేయువారు, వీటన్నిటిని ఒక్కదశనుండి మరియొకదశకు అందించు రవాణాచేయువారుమొదలు ఓడలనుకట్టుటకు అవసరమయ్యేవివిధ వృత్తులవారు, వీటన్నిటినీనడిపే ఆఫీసుసిబ్బందివరకు లక్షలకొలది కుటుంబములవారికి వృత్తికల్గించే సింధియానౌకానిర్మాణకంపెనీని కొనివేయుటకు ఆలోచనచేయుటేకాక మనదేశమున ఇట్టి మరియొక నౌకానిర్మాణకేంద్రమును నిర్మింప తలపెట్టినారు.

శాంతముగా సముద్రములోఓడలు ప్రయాణముచేయుదానికి అపాయముకల్గించుటకు శత్రువులు సముద్రములోనాటే మందుగనులకు విరుగుడైన రాడర్ యంత్రములను తయారుచేయుఫేక్టరీని, విమానములతయారీకి, అటంశక్తిపరిశోధనకు పూనుకున్నారు.

కార్మికుల ఆనందజీవితమునకు వలయుసౌకర్యములు సమకూర్చుటలో కార్మికజీవితభీమాబిల్లు, కనీసవేతనబిల్లుకూడ చేర్చబడినవి.

కార్మికులయొక్క, యజమానులయొక్క, ప్రభుత్వముయొక్క ప్రతినిధుల సమిష్టిసమావేశమునుజరిపి, పారిశ్రామికసంధి (Industrial truce) యను ఒకఒడంబడికను చేసినారు.

రైతులకు ప్రభుత్వానికి మధ్యనున్న మధ్యవర్తిదారుల నిర్మూలనకై జమీందారీలను, ఈనాందారీలను రద్దుపరచుచున్నారు.

విభేదములనుకల్పించు కులశాఖ నియోజకవర్గములను రద్దుచేయుచున్నారు.

ఇల్లువల్లుగుల్లచేసి కుటుంబమును నానాబాధలుపెట్టి తికను మట్టముచేసి అగౌరవపరచు మధ్యపిశాచిని రూపుమాపినారు. ఇందువల్ల ప్రభుత్వమునకు ఎన్నికోట్లరూపాయిలు ఆదాయముపోవుచున్ననుసరే లెఖచేయక కేత్రాగుడువల్ల నాశనమగుచున్న కోటానుకోట్ల బీదప్రజానీకమును రక్షించుటకొరకు ఈకార్యమును తలపెట్టిరి. ఇందువల్ల ఎన్నికోట్లకుటుంబములు రక్షింపబడినవోకదా!

స్త్రీలకు ఆస్తిహక్కును కలుగజేస్తున్నారు.

ఇంతకాలముగా కాంగ్రెసుచేసిన ప్రబోధాంశములన్నియు ఒక్కటొక్కటిగా ఆయావిషయములగూర్చి పనిచేయుచున్న ప్రజాసంస్థలతో సంప్రదించుచు అమలుపరచుటకు తీవ్రకృషిచేయుచున్నారు. కాంగ్రెసు ఎన్నికలప్రణాళికననుసరించి ప్రభుత్వాలు నిర్వర్తించవలసినకార్యక్రమం ఇంకాచాలాయున్నది. ఆర్థికాభివృద్ధికై నేషనల్‌ప్లానింగ్‌కమిటీ ఒకప్రణాళికను తయారుచేయుచున్నది. వీటిని అమలుపరచుటలో ప్రతిపౌరుడు తన ధర్మమును నెరవేర్చవలసియున్నది. విభేధాలుమరచి ప్రతివారు దేశశాంతి భద్రతను కాపాడ్డంతోసహా ఆర్థిక, సాంఘికపురోభివృద్ధికై ప్రభుత్వాలతో సహకరించాలి. ప్రభుత్వాలు ఏర్పడినరెండవరోజే ఒక్కుమ్మడిగా అన్నీ సమకూర్చలేవు. మనదేశంలో మన ప్రభుత్వాలేర్పడి ఒకసంవత్సరంమాత్రమే ఐనా తమశాయశక్తులా కాంగ్రెసుఆదర్శాలను ఆచరణలోపెట్టాలని పాటు

పడుచూనే యెన్నో జటిలసమస్యల నెదుర్కొంటోంది. పాకిస్థాన్ యెన్నో కుట్రలుపన్నుతూ మనకు కష్టాలుతెచ్చిపెట్టుచున్నది. ఆభూభాగంలో పెట్టబడుచున్న బాధలకేగలేక వచ్చుచున్న కాందిశీక అపారధారావాహినికి వసతులు, భృతికల్పించి సముద్ధరించుట పెద్దసమస్యఅయినది. ఇందుకుగాను ప్రత్యేకముగా కేంద్రప్రభుత్వములో ఒకశాఖను ఏర్పాటుచేసి ఒకమంత్రిని నియమించవలసివచ్చినది. ఇట్టికాందిశీకులకు ప్రత్యేకముకొన్ని కాలనీలు (నివేశనస్థలములు) ఏర్పాటుచేసిప్రత్యేకగ్రామములనే తయారుచేయవలసివస్తున్నది. ఒకవంక దేశంలో అధికలాభాలకోసం వర్తకులు ప్రజలకుకల్పించే యిబ్బందులు, యిన్ని శతముఖసమస్యలను నిన్నమొన్న అధికారంలోకివచ్చిన ప్రభుత్వాలు దక్షతతో నిర్వహించడమంటే సామాన్యమా? యిలాంటియిబ్బందులలో ఒక్కసారిగా దేశాన్ని స్వర్గతుల్యంజేయమని ప్రభుత్వాన్ని గోలచేయడం సమంజసమేనా? యీక్లిష్టవాతావరణంలో ప్రతిపౌరుడు దేశక్షేమదృష్ట్యా ప్రభుత్వానికి సహాయపడాలి. ఇదిలేకపోగా కమ్యూనిస్టులు, సోషలిస్టులు ప్రభుత్వానికి చిక్కులుతెచ్చిపెట్టి వాటిని స్తంభింపజేయాలని ప్రయత్నించడం మహాపచారం-ప్రజాద్రోహం. యీసమయంలో ప్రజలను బలవంతపరచి, బెదిరించి, హింసించి, హత్యలుమున్నగు అత్యాచారాలు చేస్తూనే ఇట్టిఅరాచకచర్యలనుండి శాంతినికాపాడవలసిన ప్రభుత్వాలను ప్రాథమికహక్కులపై దాడిచేస్తున్నాయని గోలపెట్టడం ఎంతసమంజసముగాయున్నది? ఏదేశమూ ఈవిధానాన్ని సహించలేదు. ఏవర్గమైనా యీలాంటిచర్యలద్వారా ప్రభుత్వంమీద యుద్ధంప్రకటిస్తే ప్రభుత్వంవాళ్ళమీద తప్పకయుద్ధం ప్రకటిస్తుంది.

కమ్యూనిస్టునియంతృత్వం ఏలాంటిది? :— వీరు 'కోమిన్‌ఫారం' (రష్యాఆధిపత్యమును ప్రపంచమంతటికీ తీసుకొనిపోవు ఏజంట్లసంఘం) ద్వారా వివిధదేశాలలో కమ్యూనిస్టులు దౌర్జన్యయుతముగా ప్రభుత్వాలను వశపరచుకొని ప్రతిపక్షపార్టీలను నిర్దాక్షిణ్య, అశాస్త్రీయమార్గములతో

నిర్మూలించడమే తమ అంతర్జాతీయపోలసీగా పెట్టుకొన్నారు. ఇందుకుగాను ఎంతటిఘోర హింసాత్మకమార్గాన్ని అనుసరించడానకైనా వెనుదీయరు. మొన్న మొన్న చెకోస్లోవాకియాలో జరిగిందదే-అసలు తూర్పుయూరోప్ రాజ్యాలలో కమ్యూనిస్టుప్రభుత్వాలు యీవిధంగానే స్థాపించబడ్డై. యుద్ధానంతరం రష్యన్ సేనల ఆక్రమితదేశాలలో వాటిఆధ్వర్యాన కమ్యూనిస్టుపార్టీలు బలీయంచేయబడి తదితరపార్టీలు నిర్మూలించబడినవి. రష్యన్ ఆక్రమితకొరియా, తూర్పుజర్మనీలో ఇదేజరుగుచున్నది. బెర్లినులో ఇదే విధానమువలన తృతీయప్రపంచమహాయుద్ధమునురేపే ప్రమాదమును తెచ్చిపెట్టుచున్నారు. మనకంటె వెనుకస్వాతంత్ర్యమువచ్చిన బర్మాలో ప్రజల అభిమానమంత్రులను చంపివేసి బర్మానుకూడ ఒక అరాచకనరకకూపముగా తయారుచేసిరి. మలయా, సింగపూర్, ఇండోనేషియాలలో ఇదేతతంగం ఆడుచున్నారు. అంతేగాక యిదంతా ఒక నియంతృత్వవ్యవహారం. ఆరాజ్యాలలో వ్యక్తిస్వాతంత్ర్యం, ప్రాథమికహక్కులు నామరూపాలులేవు. యీమధ్య తూర్పుయూరోపురాజ్యాలలో ప్రతికక్షిపార్టీనాయకులను చాలమందిని 'దేశద్రోహులుగా' నిర్ణయించి మరణశిక్షలు విధించినారు. వీరు, మట్టుకు మనదేశములో హత్యలు అరాచకములుచేస్తున్నప్పటికి, ప్రజలకు, దేశమునకు ప్రమాదముకలుగకుండా జైలులో భద్రపరచునప్పటికి కాంగ్రెసుప్రభుత్వము మానవసత్యాలనే హరిస్తున్నదని గోలపెట్టేస్తున్నారు. వీరే ఈదేశమునకు ప్రభుత్వాధిపతులైనచో కోట్లకొలదిగల కాంగ్రెసువాదులను, సోషలిస్టులను, షెడ్యూలుకేస్ట్ ఫెడరేషనువారిని, రేడికల్ డెమొక్రెటిక్ పార్టీవారిని ఇంకావీరికి ఇష్టమువచ్చిన ఇతరప్రజలను ఊరికేఊరి తీస్తారెందుకుకాబోలు! మొన్నను యుగోస్లావియా 'నియంత' మార్షల్ టిటో ఇంకాస్టాలినుబొమ్మగాఉంటానికి ఒప్పుకొనక తనవ్యక్తిత్వం, దేశస్వాతంత్ర్యంకోరినందున మాస్కో క్రెమ్లిన్కు తదితరబంటురాజ్యాలగు బల్గేరియా, ఆల్బేనియాల ఆగ్రహానికి గురికావలసివచ్చినది. దీన్నిబట్టి తేలే

విషయం అన్ని కమ్యూనిస్టు దేశాలు జాతీయత, వ్యక్తిత్వం కోల్పోయి రష్యా కనుసన్నలలో రష్యా ఆదేశించిన ఆటలాడాలన్న మాట. అంటే ప్రతి దేశంలో వుండే కమ్యూనిస్టులు రష్యా క్షేమమే దేశ క్షేమంకన్నా ప్రధానంగా యెంచి రష్యా ఆజ్ఞలననుసరించి తమ దేశాల స్వాతంత్ర్యాన్నయినా తాకట్టు పెట్టడానికి సంకోచించరు.

కావున ఒకవంక ఇండియా, ఇంగ్లండు, అమెరికా, ఫ్రాన్సు మున్నగు దేశములు ప్రపంచములోని దేశములు ఎవరి మట్టుకు వారు స్వతంత్రులుగా, వ్యక్తిగతము గలవారిగా మనుటకు వీలగు అంతర్జాతీయ ఏర్పాటులు చేయుచుండ ఈ కమ్యూనిస్టులు ప్రపంచములోని అన్ని దేశములను ఒక ఘోర కగకు విధానానికి బానిసత్వానికి ఒక్క రష్యాకు అమ్మజూపే అంతర్జాతీయ కుట్రలు పన్నుతున్నారు. మన దేశంలోని కమ్యూనిస్టులు మొదట్లో 'నెహ్రూ ప్రభుత్వాన్ని బలపరచండి' యని పొలికేకలు పెట్టి తర్వాత అమాంతంగా నెహ్రూ ప్రభుత్వం నశించాలని ప్రచారం చేసేరు. మొదట్లో అంతర్జాతీయ రంగంలో ఇండియా రష్యాల సంబంధ బాంధవ్యాలు బాగున్నప్పుడు మన ప్రభుత్వాన్ని మంచిదని యుక్రెయిన్ దేశంతో భద్రతా సమితి సభ్యత్వం కోసం ఇండియా పోటీచేయడం మున్నగు విషయాలలో ఇండియాకు రష్యాకు భేదాలు వచ్చే సరికి మన ప్రభుత్వాన్ని కూలద్రోయుటకు కుట్రలు పన్నేరు. రష్యా క్షేమం కోసం కమ్యూనిస్టులు జాతీయ విద్రోహానికైనా వెనుదీయరని దీన్నిబట్టి గ్రహించవచ్చునుగదా! దీన్నిబట్టి ప్రతి హిందుడు ఈ ఘోర ఉపద్రవములో పడకుండా తమను తమ గ్రామములను ఎంతో మెలకువతో బాధ్యత వహించి కాపాడుకొనుచు జాతీయ ప్రభుత్వములను బలపరచుకోవలసియున్నదో గ్రహించవచ్చు. ఇందువలన మన దేశశాంతి, పురోభివృద్ధికేగాక 20వ శతాబ్దములో ఈ ఉపద్రవములో నెమ్మదిగా మునిగిపోవుచున్న ప్రపంచమునే కాపాడిన కీర్తిని యుగయుగాలవరకు ప్రపంచములోని అన్ని దేశప్రజలు పురాణములుగా వ్రాసుకొని చెప్పుకొను గౌరవమును కూడా పొందగలము.

ఇకను సోషలిస్టులవిధానం కేవలం అవకాశవాదంగాయున్నది. వీరు కూడా కమ్యూనిస్టులవలెనే కాంగ్రెసులోనేయుంటూ, కాంగ్రెసుప్రజా ప్రభుత్వాలు క్లిష్టసమస్యలతో తికమకపడుచున్న సమయములో సహకరించ డానికిబదులు అధికారవ్యామోహంతో ఇదేసమయమని కాంగ్రెసును బల హీనపరచి కూలద్రోయుటకుగాను విడిపోయేరు. కాంగ్రెసుపై కమ్యూనిస్టు లుమోపే ఆధారంలేనినిందలే వీళ్ళూమోపుచున్నారు గాంధీజీ దివంగ తులైనప్పుడు దేశం, కాంగ్రెసు శోకసముద్రంలో మునిగియున్నప్పుడు వీరు కాంగ్రెసునుండి విడిపోయి కాంగ్రెసును బలహీనపర్చాలని యత్నించేరు. మొదట కాంగ్రెసుకార్యవర్గంలోచేరమంటూచెప్పి తర్వాత కొన్నాళ్ళకు చేరారు. అవిధంగానే రాజ్యాంగపరిషత్తు ప్రజలకు ప్రాతినిధ్యంవహించదని ప్రచారంమెదలెట్టి కాంగ్రెసువాదులు దానిలోచేరరాదంటూ హెచ్చరించి ఆరోజులలో వీరు పరిషత్తుకువెళ్ళేరు. ఒకచెంప తమకు అధికారవాంఛ లేదంటూ చాటుకొంటూ మరొకచెంప తమకు ప్రాబల్యంవుండేపక్షంలోనే ప్రభుత్వంలో పదవులు స్వీకరిస్తామనడం అధికారవాంఛకు నిదర్శనంకాదా? పండితనెహ్రూకు సర్దార్‌పటేల్‌కు విభేదాలుకల్పించి మొత్తంజాతీయప్రభు త్వానికి ఆధారముగాయున్న, మోయుచున్న ఈరెండుచక్రములను విడదీసి మనజాతీయప్రభుత్వాన్ని కూలద్రోయాలని ప్రయత్నించేరు. వీరికేకాదు ఇట్టిసమయాలలో అవసరమైనప్పుడల్లా 'నెహ్రూయేవారికున్న నాయకుడని' అటచంచల ఉక్కు-సర్దార్ ప్రకటించి ఇటువంటివారి ఆటలను సాగనివ్వ లేదు. సర్దార్‌పటేల్‌పై లేనిపోనిఅభాండాలువేశారు. దాంతో ఆయన విసిగి యేరాష్ట్రాన్నయినా అధికారంస్వీకరించి నిర్వహించండనిసవాలుచేస్తే సోష లిస్టులు ఆసవాలునందుకొని ముందుకురాలేదు. దీనివల్లనే 'అలాగచేసేయాలి' 'ఇలాగచేసేయాలి' యని ఉపన్యాసాలిచ్చే వీళ్ళఆత్మబలం, ఆత్మవిశ్వాసం కూడా గుర్తించవచ్చు. ఏమాత్రతెలివియున్నవారన్నా ఇటువంటివాళ్ళను ఎట్లాపట్టుకొనివేళ్ళాడి అనుసరించగలరు?

కావున ఇట్టి దూరదృష్టి అనుభవముగల పెద్దలు చెప్పేటటువంటి, చూపేటటువంటి ఆకాశమేడలను, గగనకుసుమములను చూచి ముఖ్యముగా నూతనభావాలుపుట్టుచుండే వయసుగలయువకులు అనుకరించకుండాను, ఈ ఎండమావులవంక నడవకుండానుయుండుదురుగాక! చిన్నప్పుడు సాధారణంగా ఈవయస్సులోనున్నప్పుడు తామే ఏకాలేజీవిద్యాధికులమనుకొనో లేక మరికొంతమంది తామే అన్నివిషయాల్లోను నిపుణులమనుకొనో ఒక్కొక్క విషయములో తాము అనుకున్నదే వేదమనిచెప్పటమో లేక అటుచేసివేసియో తరువాత వారి కాలమునడచినకొలది, అనుభవములు కలుగుచున్నకొలది అవి ఎంత హాస్యాస్పదమైనతప్పులో తెలుసుకొని ఒక్కొక్కటి సందర్భవశాత్తు జ్ఞాపకమువచ్చినప్పుడల్లా సిగ్గుపడి అప్రయత్నముగా నాలుక కరచుకొనుచుందురు. కాని ఇది తనమట్టుకే ఏనాడో గతించిపోయిన రోజులకు సంబంధించినదనితలచక ఆఒక్కొక్క తప్పుడుభావప్రచారము, తప్పుడు ఆచరణ తనతో సహా అందుకుసంబంధించిన అనేకమందికి ఎల్లకాలము బాధకలిగించునదియని తెలుసుకొని—అనుభవపూర్వకముగా అప్పుడేకనిపెట్టబడి ఉపయోగపడుచున్న రేడియోలను ఇంకనువిరివిగా తయారుచేసుకొని ఉపయోగించుచు అనుభవించక, ఇదివరకు వాటితయారింపులో అవలంబించిన ఆసూత్రములనే విడిచిపెట్టి, ఎన్నిసంవత్సరాలకు కృతకృత్యులవగలరో తెలియని లేక అసలు కృతకృత్యులగుదురని హామీయే లేనటువంటి తనస్వంతపద్ధతులపై మరల నూతనముగా రేడియోనుకనిపెట్టుటకు కూర్చొని కాలమువృథా వొనరించుకొనినట్లుగా చేసుకొనక—ఒక్కొక్కరు ఒక్కొక్కటిగా మొత్తము మీద సంపూర్తిగా అమర్చిపెట్టిన ఆహారమును తినకుండా తాను మరల స్వయముగా ఒకవిత్తనమును పట్టుకొనివెళ్ళి, ఎక్కడో భూమిసంపాదించుకొని, దానిలో పంటపండించి, ఆపంటనుకోసి, నూర్చి, ఆధాన్యమును బియ్యముగాచేసుకొని, ఇంతచేసియు దానినివండుటకు కావలసినకుండను తయారుచేసుకొనుటకై బయలుదేరి దానికనువగుమట్టి ఎచ్చటదొరకునో పరిశోధనకు

బయలుదేరి దానినితెచ్చి, దానికుపకరించు ఇసుక యెచ్చటదొరకునో పరిశోధించుటకుపోయి దానినితెచ్చి, వీటిలో ఏ గాయిలేకుండా త్రొక్కి, కుండ చేసి, కాల్చి, ఈవిధముగా తనభోజనమునకు అవసరమగు ప్రతివస్తువును తాను మరల స్వయముగాకనిపెట్టి చేసుకొనుటకు పూనుకొని అప్పుడు తినుటకు ఊహించిబయలుదేరి తనజీవితసమయమును వృథాచేసుకొన్నట్లొనరించక-అన్నివిషయాలలోను, అన్నికాలములకుసరిపడు అనుభవములు ఈవిధముగా స్వయముగాగడించి, తదనుగుణంగా ఏర్పాటుచేయబడియున్న శుభప్రదమార్గములనడచుకొని తమజీవితములను సుఖముగా, సుళువుగా నడపుకొనుచు తమతమ నూతనపార్టీ ఆందోళనలనే వేలంవెర్రిఉత్సాహములవల్ల వారు ఏ సౌఖ్యములకొరకైయని కేకలుపెట్టుచున్నారో అట్టిమీ ఆశయమునకుపూర్తిగా భిన్నముగాజరుగునని గుర్తించుకొనుటయేగాక అభివృద్ధికై పురోగమించ మొదలుపెట్టిన మొత్తందేశప్రజలకే తీరని ఆలస్యంకలుగునని కూడ గుర్తించుకొని, ఏక్షణము విశ్రాంతిఎరుగని తాపత్రయ ఆదుర్దాల నుండి విముక్తిపొంది ఇందువల్ల తనకులభించు నిర్మలవిశ్రాంతిసమయమును తమ తక్షణఆనందమునకు, భావివిజ్ఞాన సముపార్జనకు, ప్రకృతిసంపదవినియోగ నూతనపరిశోధనలను మేలుగావినియోగించుకోవచ్చును. ఈవిధముగ మహాత్ముని మార్గమున నడచుకొనుటవల్ల తమకు ఇతరులకుకూడ మేలు చేకూరును.

అధికాహారోత్పత్తి:—ఈవాదు పెద్దఉద్యోగులు, ధనవంతులు 'అధికాహారోత్పత్తి, అధికాహారోత్పత్తి' యని సభలలో, సమావేశాలలో ఎలుగెత్తి అరచుచు తమకున్న పెద్దబంగళాలచుట్టూ ఎకరములతరబడియుండు విశాల ఆవరణాలలో రొంకపూవు అడవులు పెరగనిస్తూ ఇంటిచుట్టూమట్టుకు క్రోటన్సులను, ఎందుకూపనికిరాని గొడ్డుమామిడిచెట్లు మొదలగువాటినితోటమాలినిపెట్టి ఎంతోఖర్చుచేసి శ్రద్ధతో పెంచెదరు. నీరు, మనవాకిరీకూడా లభించుటకు అందుబాటులోనుండే భూమిలభించుట దుర్లభమనే యథార్థ

మును గుర్తించుకొని ముఖ్యముగా నేటియువకులు అదృష్టవశాత్తు తమకు లభించిన ఇట్టిపవిత్ర అంగుళం నేలలోను కూరగాయలను, కాయధాన్యములను. ఆగొడ్డుమామిడివంటి మహావృక్షమునకుబదులు అమృతతుల్యమైన మన అసలు మామిళ్ళు చేతులుచాపుకున్నట్లుగా పెద్దఆకులతో స్తంభములవలెనుండుచెట్లకు బదులు బొప్పాయి, డొంకపూవుల తుప్పలకుబదులు సీతాఫలచెట్లు, ఇక్కడ ఫలించనటువంటిఖర్జూరము, ఖర్జూరజాతులచెట్లకుబదులు తాటి, కొబ్బరి, అరటిచెట్లనువేయుటకు ఉద్యమించుటచాలమేలు. (An apple a day Keeps the doctor away) రోజుకొక ఏపిలు*పండుతినుట డాక్టరును దూరముగానుంచును యను ఆంగ్లలోకోక్తిననుసరించి ఏఋతువులోని ఫలములను ఆఋతువులో తినుటవల్ల మంచిఆరోగ్యవంతులుగా యుందురనే సత్యమును గుర్తించుకొని దేశఇతరప్రజల ఆరోగ్యములనుకూడ దృష్టిలోపెట్టుకొని ఇట్టితమ ఇంటియావరణలలోనేకాకుండా తమ గ్రామములలో అవకాశమున్నచోటనెల్ల ఫలవృక్షములనునాటించి పెంచుట నేటియువకుల ముఖ్య కర్తవ్యము.

సౌందర్య కళాపోషణకుకూడ రకరకాల పూలమొక్కలు అవసరమే. కాని ఉన్నస్థలమంతటినీగాని, కొంత పూలమొక్కలనుపెంచి తక్కినదంతయు ఊరకేవిడిచిపెట్టుటగాని కూడదనిభావము.

**సత్యాగ్రహవిధానము:**— నేటియువకులే రేపటిపౌరులు. కావున రేపటిసుస్థిరసాంఘిక, ప్రభుత్వవ్యవస్థలను నిర్మించుకొనేబాధ్యత ముఖ్యముగా యువకులపైనున్నది. ఇట్టిసుస్థిరసౌకర్యాభివృద్ధి కార్యములుచేయుటకు ఇంకను అడుగడుగునకు అడ్డమువచ్చుచున్న ఉద్యోగుల, స్వలాభపరులవారి నుండి అధిగమించుటకు ఈమధ్యనే ఒకగ్రామయువకులుచేసిన కార్యమును

---

* మనలో ఈవిషయములో ఈఏపిలుపండుకు సమానమైనది, ఇంకా ఎక్కువైనదికూడాయని చెప్పవచ్చు రాచఉసిరి (పెద్దవుసిరి)

ఉదహరణగా తీసుకొందాం. ఏజెన్సీప్రాంతమునుండి కోరుకొండమీదుగా వెల్లడిప్రాంతాలైన రాజమండ్రి, కాకినాడలకువచ్చు మోటారుబస్సురూట్లు మీదసీట్లు ఖాళీయున్నను దారిలోని ప్రయాణీకులను ఎక్కించుకొనక ఇబ్బందిపెట్టుచుండుటవల్ల కోరుకొండ యువజనకాంగ్రెసువారు బస్సుప్రయాణీకుల సంఘమును ఏర్పాటుచేసి ఆబస్సు యజమానులతో సంప్రదింపులుసాగించిరి. అందుకొంతమంది సుహృద్భావులు సుముఖముగయున్నను కాలమార్పును గుర్తించలేని ఒకతలబిరుసుయజమాని చేయగలమట్టుకైనా సవ్యముగాచేయమనికోరెడు సంప్రదింపులకు ఒప్పుకొనకపోవుటయేగాక ఈకమిటీవారు ట్రాఫిక్ బోర్డువారికివ్రాసినను కక్షబూని ఆసెంటరునుండి ప్రయాణీకులను అసలే తీసుకొనివెళ్ళము యని బెదిరింపుకుదిగెను. ఆచుట్టుపట్ల దరిదాపు పదిగ్రామములవారికివ్యాపార, వ్యవహారములకుపోవుటకు ఈకోరుకొండయేకూడలికేంద్రము. ప్రతిదినము ఈబస్సులపై ప్రయాణమైపోవుటకు ఈగ్రామములనుండివచ్చు ప్రయాణీకుల జాబితాయొకటి ఈయువకులు వ్రాయుచునేయున్నారు. ప్రయాణీకునిపేరు, ఏగ్రామమునుండి వచ్చుచున్నది, ఎచ్చటకువెళ్ళుటకు, బస్సుపైప్రయాణసౌలభ్యము కలిగినదా, లేదా యను వివరములు సేకరించగా సగటునరోజునకు ఈకేంద్రమునకు 150 మంది ప్రయాణీకులురావడం, బ్రతిమలాటలతో టిక్కెట్టు బ్లేక్ మార్కెట్లతో అతికష్టముపై 50 మందిమాత్రము ప్రయాణము సాగించగలిగి తక్కినవారు ఇంక ఈమార్గముపై రైలు, కాలువ, బళ్ళు మొదలగు ఏయితర సౌకర్యములు లేకపోవుటచే పనులు, ప్రయాణముచెడి ఇండ్లకు తిరిగిపోవలసివస్తున్నది. ఇట్టివారికి గోరుచుట్టుపై రోకటిపోటు యన్నట్లున్ను, ఇదివరకే గుడ్డిలోమెల్లగా కొంతమంది కాకపోయిన కొంతమందైనా వెళ్ళగలిగేవారము. ఇప్పుడు ఈయువజనకాంగ్రెసు కల్పించుకొనుటవల్ల అసలేచెడ్డాము యని ఆగ్రామముల ప్రజలుతలచి యువజనకాంగ్రెసుమీద దురభిమానము కల్గుటవల్ల ఇచ్చటయువజనకాంగ్రెసు పతనముచెంది మన ఆటలకు అడ్డేవారు

ముండరనితలచియు, అసలే ఆసెంటరునుండి ఎవ్వరిని ఎక్కించుకోము అని ఆతలబిరుసుయజమాని చెప్పినదానికన్న అవమానములేదని అట్టి అన్యాయ అసభ్యప్రవర్తనను ఎంతమాత్రము సాగనీయరాదని ఆగ్రామముల యువజన కాంగ్రెసువారు నిర్ణయించుకొనిరి. ఆమరుచటిదినము ఉదయమునకే ఆయజమానిబస్సే రా తటస్థించినది. అందు 14 సీట్లు ఖాళీగాయున్నవి. అప్పటికప్పుడే ఆకూడలి స్థానమునకు సంబంధించిన వివిధగ్రామములనుండి 50మంది ప్రయాణీకులువచ్చియున్నారు. దానిలో 14 మంది ప్రయాణీకులనే తీసుకు వెళ్ళవలసినదిగా కోరగా ఎదర ఎవరిగురించియో ఆసీట్లు అట్టేపెట్టేమనే సమాధానముచెప్పి బస్సును ఆపకుండాపోజాచిరి. రిజర్వేషనుకు ఇది టేక్సీ కాదు. ఒక్కసీటు ఖాళీయున్నను ప్రథమమువచ్చిన ఒకప్రయాణీకుని వెస్సునట్లుగా రహదారిలైసెన్సుపొంది తీరాలైసెన్సునిచ్చేక ఇట్టిప్రభుత్వ ఏర్పాట్లు (Rules& Regulations) సామాన్యముగా అందరికి తెలియక పోవుటను*అవకాశముగాతీసుకొని తమస్వలాభముకొరకు ఇష్టమువచ్చినట్లు

*సర్వసాధారణపౌరహక్కు, బాధ్యతలకు సంబంధించిన ప్రభుత్వ ఏర్పాట్లు తెలుసుకొని ఆవిధముగా తమకు, ఇతరులకుకూడ ఏఅనవసర ఆటంకములులేకుండా అందరూ సుఖముగా బ్రతుకుటయే రాజకీయ పరిజ్ఞానము (చైతన్యము) కలిగియుండుట.

ఉపయోగించుకొనుట సాగదని పబ్లిక్ (ట్రాఫిక్‌రూల్సు (ప్రయాణవిధులను) తెలిసిన ఆగ్రామయువజనకాంగ్రెసువారుచెప్పి, ఆబస్సుచుట్టూపడుకొని తమ గ్రామముల ప్రజలకొరకు సత్యాగ్రహము ప్రారంభించి వెంటనే జిల్లాయువ జనకాంగ్రెసు కార్యాలయమునకు కబురుచేసిరి. ఆబస్సులోనేయున్న యజమానిబంధువు ఒకరు లంచములుపట్టి స్వలాభపరుల పనులుజరిపే పైఉద్యోగు లున్నారుగదాయనే ధీమాతో ఇంతమాత్రమునకే లొంగేవారముకాదు. ఇందుకు తగినపనిమాకూ చేతనవునని చెప్పి ఆకారులో కిక్కిరించుకకూర్చొనెను. తమకై యువకులుచేయుచున్న త్యాగమునుగుర్తించి ఆప్రయాణీకులు,

ఆగ్రామములనుండివచ్చిన సానుభూతిపరులుకూడా ఈసత్యాగ్రహులచుట్టూ తాముకూడా కూర్చుండిరి. వార్తఅందినవెంటనే జిల్లాయువజనకాంగ్రెసు కార్యకర్తలు పోలీసు అధికారితో టెలిఫోనులోమాట్లాడి, సంఘటనప్రదేశమునకు వచ్చుసరికే ఈలోపున కబురుఅందిన ఆబస్సుయజమాని ఆతావునకు వచ్చి ఒకమహాప్రజాసముద్రముమధ్యన ఖైదీ అయియున్న తనబస్సునుచూచి, సమయోచితముగా తెలివిగాప్రవర్తించుకొని తనబస్సుకండక్టరును వదలించుకొని ఆయువజనకాంగ్రెసువారి పట్టీప్రకారం మొదటి 14 మంది ప్రయాణీకులను తనబస్సునెక్కించుకొని తీసుకవెళ్ళిపోయెను.

ఈవిధముగా ఎక్కడి సాధారణసమస్యలను అక్కడివారు అసాధారణకోర్కెలతో నింపకుండా, కాంగ్రెసుద్వారా, అచ్చటిప్రజల అభిమతానుగుణముగా సవ్యముచేసుకొనుటకు సత్యాగ్రహదీక్షబూనిన అచ్చటిప్రజల సానుభూతిసహాయములు ఎల్లప్పుడునుకల్గును. అందుచేతనే ఈసత్యాగ్రహము కొద్దిగంటలలోనే విజయము చేకూర్చగలిగెను. అప్పటినుండియు ఈయువకులు సుహృద్భావముతో యజమానులతోను, ప్రభుత్వముతోను నడిపిన సంప్రదింపులఫలితముగా ఇదివరకు నాలుగుబస్సులుండే ఆరూట్‌మీద నేడు తొమ్మిదిబస్సులు తిరుగుచు ఆమార్గప్రయాణీకులందరకు సౌకర్యముగానున్నది.

సత్యాగ్రహమనగా ఈవిధముగా జాతి, మత, కులవివక్షతలేకుండా లోకమును దృష్టిలోపెట్టుకొని సరియైనకారణమునకు సరియైనసమర్థతతో చేయునదేకాని ఏనాడూ సామాన్యప్రజలకు సేవచేసియెరుగక, నక్కబొరియలలోనుండి నేడుబయటకువచ్చి ఇళ్ళల్లోకూర్చుని దేశమును మేము బాగుచేస్తామనిచెప్పి రైళ్ళనుఆపుట ఒక్కటే కార్యక్రమముగాపెట్టుకొని సత్యాగ్రహమనే పదముయొక్క అర్థమే తెలియక ఇదియేసత్యాగ్రహమని భ్రమించి సత్యాగ్రహమనుపేర జరుపుచున్న ఆర్. ఎస్. ఎస్. సత్యాగ్రహము సత్యాగ్రహము కానేరదు.

<u>ఆర్. ఎస్. ఎస్. సత్యాగ్రహ నిజస్వరూపము</u>:—ఎదుటొకటిచెప్పి చాటునొకటిచేయు కమ్యూనిస్టులవలెనే వీరును ప్రవర్తనాచరిత్రకూడ కలదు. ఇంకను వీరు కమ్యూనిస్టులనే మేలనిపించేరు. లోపల దురుద్దేశపూరితమైనను పైన ప్రజలసానుభూతి సంపాదించుటకునుగాను కమ్యూనిస్టులు ప్రపంచములోని ఇతరులందరు ఆమోదించి అనుసరించుచున్న సాధారణ సమాజనడతలలో కొన్ని నిర్మాణకార్యక్రమములైనను ఆచరించు పైకిరావలెనని చూచిరి. కాని ఈ ఆర్. ఎస్. ఎస్. వారు ప్రజోపయోగకరనిర్మాణ కార్యక్రమములేవియు ఆచరించకుండానే నెయ్యిలేని నేతిబీరకాయవలె వట్టి ఉయ్యాటికబుర్లుచెప్పిమాత్రమే నమ్మించి పైకిరావలెనని ప్రయత్నము. ఇదొక్కటేపే తేడా. తక్కినదంతా చిన్నతేడాలతో మొత్తముపైపోలికే. ఈ ఉభయులూకూడ ఎదుటవారికేకాదు ఒకటిచెప్పి అందువల్లపొందే సహాయముతో తాము మరొకటిసాధించుకొనుట. రష్యానుండి బ్రిటనుకు అందు కమ్యూనిస్టుఆదేశములను తమకు సమాచారముగామాత్రమే ఉపయోగించుకొని అక్కడితోచంపి *బ్రిటన్నుండి బ్రిటిష్వారికి ఉపయోగపడురీతిని

---

* బ్రిటనులోని కమ్యూనిస్టుపార్టీ రష్యాకమ్యూనిజంవ్యాప్తికై ఉపయోగపడు 'కోమిన్టరన్' ఏజన్సీకాదు. అట్టిరూపములోనేయుండి రష్యాయొక్క ఎత్తుగడలను తెలుసుకొనుటకు ఉపయోగపడు బ్రిటిష్గూఢచారి ఆఫీసుమాత్రమే. అది బ్రిటిష్రాజతంత్రజ్ఞత! గమనిక:- రష్యానుండి ఇండియాకు నేరుగాసమాచారముపంపుటకు ఇటునుండి అచ్చటుకుజేరుటకు అవకాశములేదు.

---

బొంబాయిలోని ఇండియాకమ్యూనిస్టుపార్టీకి కమ్యూనిస్టుఆదేశములుగా దిగుమతిఅయ్యె ఈఆదేశములను అందుకొని ఇక్కడికమ్యూనిస్టువర్కర్లు గ్రామఫోనుప్లేట్లవలెపాడుచు ప్రశ్నించిన దానిపైగాని, దానికిసంబంధించిగాని మరొక్కముక్కకూడ చెప్పలేక ముక్కుపచ్చలారని, అనుభవము లేనికుర్రలగుటచే సమగ్రరాజ్యాంగవిధానములు తెలియక ఇక్కడ వీరివని

జరుగకుండినందున ఇంకేమియుతోచక ఇవిమధ్యత్రోవలోపుట్టిన రూపము లేనివిధానములని తెలియక వీటిని అమలుపరచవలెననే ఆదుర్దాకొలది ఇంకేమియు గత్యంతరములేక తుదిప్రయత్నములుగా బలవంతముగా అమలుపరచుటకు దౌర్జన్యములకు అవలంభించుచున్నారు. అంటే ఇక్కడికమ్యూనిస్టుపార్టీని నమ్ముచున్న కొద్దిమందిప్రజలకూ ఈకమ్యూనిస్టువర్కర్ల కార్యకలాపాలవిధానము తెలియదు. ఈవర్కర్లకు బొంబాయిలోని ఆల్ ఇండియా కమ్యూనిస్టుపార్టీ ఎంతఎడారిలోయున్నదీ తెలియదు. బొంబాయిలోని పార్టీకి వారికి ఆదేశములుపంపుచున్న బ్రిటిషుకమ్యూనిస్టుపార్టీ స్వరూపమూ తెలియదు.

ఇదేవిధముగా పరరాష్ట్రమునుండి అక్కడక్కడ మనపట్టణములలోనికి ఆర్గనైజర్లుగావచ్చి నెమ్మదిగా హైస్కూల్సులోని నిద్దరుముగ్గురు 'కాసబియాంకా*లను' పట్టుకొని వారిని బంకోహోల్సులో (రహస్యగృహ

* స్వధర్మకర్తవ్యమును ప్రబోధముచేసుకొనేబుర్రలేక ఎవరు ఏది చెప్పిన అదిఏమియో తెలియకయే ఆచరించువారికి ఉదహరణ 'కాసబియాంకా' ఇతివృత్తము:- ఓడలపై యుద్ధముజరుగుచుండ ఒకఓడసేనాని తనకుమారుడైన కాసబియాంకా యను బాలకుని ఒకసురక్షితమైనచోటు నిలబెట్టి బహిరంగప్రవేశములకు తిరుగుటవల్ల అపాయముకలుగుననే తలంపుతో అచ్చటనుండి కదలవద్దనిచెప్పి తానుయుద్ధమునడపుటకు ముందుకుపోయెను. ఆయుద్ధములో తాను మరణించెను. తరువాత ఆఓడకు అగ్నిప్రమాదముకల్గి మంటలకాహుతికాజొచ్చెను. ఆఓడపై మిగిలియున్నవారందరు చిన్నపడవలలో ఆఓడను విడిచిపోయిరి. ఈబాలునకు తండ్రిచనిపోయినసంగతి తెలియదు. మంటలు బాలుని చుట్టుముట్టుచున్నవి. 'ఓతండ్రీ! నేనేమిచేయను?' అని బిగ్గరగా కేకలుపెట్టుచు అచ్చటనుండి కదలవద్దని చెప్పినతండ్రిమాటలప్రకారము అచ్చటనుండి కదలక ఆమంటలకు ఆహుతి అయినాడు కాసబియాంకా. యుద్ధఅస్త్రములనుండి క్షేమముగానుండుటకు చెప్పెనేకాని తనకు తీరని

అపాయము వచ్చినపుడు తన అందు కనుగుణముగా రక్షించుకొనవలెనని సూచించుకొనేశక్తి లేకపోయెను.

---

ములలో) పెట్టి వీరికి ఈమతవిషము నెక్కించి వీరిద్వారా బాలురనుపోగు చేసి తమమతమును ఇతరమతములు పాడుచేయుచున్నవిగాన అట్టివారిని నిర్మూలనముచేయవలెనని వీరపూజలు చేయించుచు మేమేపరమభక్తులమను కొనును దేశస్వాతంత్ర్యపోరాటములనిన భయపడుకొందరుఉపాధ్యాయులు ప్లీడర్లు. ఉద్యోగులుమున్నగు పెద్దలమొద్దకుపంపించి ఇది తమమతమును కాపాడుకొనుటకుగాను మతవిషయముల ప్రబోధించుటకు ప్రతిరోజున సమావేశమగుటకును తమపుత్రుల ఆరోగ్యదాయుష్యములకొరకు ఆటలు, వ్యాయామము, డ్రిల్లుచేయుటకుమాత్రమేననియు అందుకు తమబాలురను పంపవలసినదిగాను దీనికి రాజకీయములకు ఎట్టిసంబంధములేదనియు చెప్పించుచు అసలుకార్యకర్తలు బయలుపడి వెల్లడికాకుండా ఈమతముచే పరిపాలన చేయవలెనని ఉద్దేశించి పార్టీనిర్మాణము చేయబూనిరి. పైనుండి వచ్చిన ఆర్గనైజరు అతనిబంకుహోలువిషయములు ఈఇద్దరుముగ్గురు కాసబియాంకాలకు పూర్తిగాచెప్పడు. ఈకాసబియాంకలతో సాధారణసభ్యులకుచెప్పించేది మరొకటి. కాసబియాంకాలు ఈకుర్రవాళ్ళచే తమపెద్దలకు చెప్పించేదివేరు. ప్రజాకార్యములకు సంతోషముతో ఎప్పటికప్పుడు అర్ధా, పావలా ఇచ్చుకొనే వివిధవృత్తుల ప్రజాసామాన్యము బాహాటముగా బహిరంగముగా అందరిరాజకీయ, ఆర్థిక, విజ్ఞానస్వాతంత్ర్యములకొరకు పాటుపడుచున్నవారికే సానుభూతిపరులై ఇచ్చుకొందురు. మరిఏప్రజోపయోగకరకార్యక్రమము లేక వంబెత్తుగా ఎక్కడఏమిచేయుచున్నారో తెలియనివారికి హరేకృష్ణ, హరేకృష్ణయనుకొనుటతప్ప పదిలు, పాతికలుఇచ్చుకొనే స్వభావములేనివారే సానుభూతిపరులుగనుక ఈబంకుహోలు తమనాయకులకు హోటేళ్ళకు, సినీమాలకు ఖర్చులకుగాను దొంగతనము, దోపిడీవిధానములున్నూ, బాగాచేతిలోడబ్బుఆడుచుండ విద్యార్థులే కొన్నాను. కావున

కమ్యూనిస్టులవలెనే వీరినిగూర్చికూడ వీరెవరో ప్రజలకుఅసలేతెలియదుసరి గదా మహాభక్తులము, భగవంతునకు ఇంకఒక్క-అడుగుమాత్రమేయున్నా మన్కొనే ఆకొద్దిమంది సానుభూతిపరులైన ఉద్యోగి పెద్దలకుకూడ తమబా లురు నిజముగా ఏమిచేయుచున్నారో తెలియదు. ఈపత్రికలోజుసమావేశా లలోను, డ్రిల్లులోను పాల్గొనుచున్న సామాన్యబాలురకు ఏఉద్యమనిర్మాణ ములోనైనను కార్యకర్తలకు వందలవేలు ఖర్చుఉంటాదని తెలియకపోవు టచే వారినాయకులను గౌరవించుకొనుటతప్ప వారినాయకులు సహజమైన, ఉత్తమమైన బహిరంగవిరాళాలద్వారా కాక అసహజమైనదోపిడీధనముతో ఎక్కడనండివచ్చుచున్నదో ప్రజలకుతెలియనిధనముతో సంచరించుచున్నా రని తెలియదు. అసలు వీరు ఉద్యమమునకు ధనమేఅవసరములేదుయని చెప్పుదురు. ఇది ప్రజాఉద్యమము నడుపుటయందే ఏమిటోతెలియనివారు నమ్మేవిషయముకాదా? అసలు తమను ఎందుకుగాను తయారుచేయుచున్నా రోకూడ ఈబాలురకు తెలియదు.

కమ్యూనిస్టులు రాజకీయచైతన్యములేని అమాయకకార్మికులను ఉప యోగించుకొనుచు కాంగ్రెసు అతిరథమహారథులు అనేకమందిపైనుండగా ఎంతతింటాలుపడినా అధికారములు తమకుచిక్కే అవకాశములుండవని సమ ర్థులైన నాయకులులేని ఇతరపార్టీలద్వారా దగ్గరదారిని పెద్దనాయకులగుటకు చూచే రాజకీయవేత్తలను సానుభూతిపరులుగాచేసుకొంటే వీరు 21 సంవ త్సరములైనను నిండనిహైస్కూలువిద్యార్థులను ఉపయోగించుకొనుచు పై మెరుగులకు మహాగౌరవనీయులని అమాయకప్రజలునమ్మే మానవకోటిలోని భీరువులైన కొంతమంది ఉద్యోగులను సానుభూతిపరులుగా చేసుకున్నారు.

కమ్యూనిస్టులు అధికారములకు బహుదూరముగానుండగనే కార్మికుల మీద నాయకత్వములకొరకు తద్వారా తమపార్టీలో నాయకత్వముకొరకు ముఠాలుగాను, పార్టీలుగానుయగుచుంటే, సోషలిస్టులు ఉపన్యాసాలలో, గాలిమేడలుకట్టుటలోనే ఎప్పుడో ఒకసారి జరుపుకొనేసమావేశమునకువచ్చి

కూర్చొనేముందే ఉన్న నలుగురూ తమలో తాము పరస్పర విశ్వాసాలకు దిగకుండే వీరు అసత్యవైపికి రాకుండా బంకుహోల్సులోయుండగనే ఈవిధపూరితమ తాధికారనాయకత్వముల కొరకు విడిపోయి ఓ.ఎస్. ఎస్.*లవిధ-ఇంకేవేవో వ్యక్తిపేరులతోను పేరులతోను స్వయంసేవకసంఘములుగా ఏర్పాటుచేసుకొని బోంబువాటిని సేవాసంఘములుగా చేసుకొనే సమర్థతలేక తమలోతామే విభజించుకొనుచున్నారు.

*ఆర్. ఎస్. ఎస్.=రాష్ట్రీయస్వయంసేవకసంఘం. ఓ.ఎస్.ఎస్.=భవానిస్వయంసేవకసంఘం. ఇంకా విశ్వామిత్ర ఆశ్రమములు, శివాజీ దండు, రాణాప్రతాపదండు యని ఈవిధముగా విడిపోవుట సామాన్యమైపోయినది.

ఈబంకుహోల్సులోనుండి బాకులు, బళ్ళెలు, పిస్టల్సు తయారుచేసుకొనేవారి చర్యలు పూజ్యబాపూజీ హత్యతో బయల్పడేవరకు తెలుసుకోలేక నమ్మిన పెద్దఉద్యోగుల సానుభూతినిబట్టియైనా యెంత పెద్దచదువులున్నను వీరికి రాజకీయపరిజ్ఞానములేదనియు, రాజకీయచైతన్యములేకపోవుట ప్రమాదకరమనియు తెలుటలేదా? వీరిలో చాలమంది గాంధీజీని పూజనీయునిగా భావించుకొనేవారుగలరు. ఈపెద్దలు ఈసంఘటనతో విస్తుపోయారు. మైనభక్తి దేవాలయములు ప్రథమమెట్టుఅన్నట్లు రాజకీయములను ప్రథమమెట్టుతోములో చర్చించుచు అన్ని రాజకీయపార్టీలలోను ప్రవేశించినకాలేజీ విద్యార్థులైనా ఇందులో ప్రవేశించలేదే. పోనీ హిందూమతము ఉద్ధారకులమని చెప్పుకొనేవీరు హిందూమతములోని హరిజనులను చేరదీసేరా? పోనీ హిందూదేశమునకు వస్త్రతెచ్చినది, కళంకము తెచ్చినది పరమతసహనము, సర్వసమానత్వము, సర్వమానవసౌభ్రాతృత్వము పాటించుచున్న కాంగ్రెసు తెచ్చినదో ఆర్. ఎస్. ఎస్. తెచ్చినదో మానవకోటికంతకు విదితమేగదా!

ఇప్పటికైనను అసంబద్ధము, అశాస్త్రీయము, అసంభవముయని మానవజాతి పుట్టుకనుండి నేటివరకు ఋజువగుచువచ్చుచున్న ఈమతప్రాబల్యముతో పరిపాలనచేయవలెననే చర్యలను మానవకోటిని ఇంకను ఇక్కట్లుపెట్టకుండా మానవులయొక్కయు, దైవముయొక్కయు అభిమతము నెరిగియైనా (For the sake of God & Mankind) విరమించుకొనుట చాలా ఉత్తమము. మతాధికారరాజ్యమును స్థాపించుటకు వందసంవత్సరములు ప్రయత్నించి విఫలతచెందిన ఇంగ్లండులోని వందసంవత్సరములయుద్ధమును, బౌద్ధమతస్థులు తమమతరాజ్యమును స్థాపించప్రయత్నించి ఎన్నిమతపోరాటములకు, దేశము పరస్పరవిరోధమువహించిన ఎన్నిచిన్నచిన్నరాజ్యములుగా యగుటకు దారితీసినది తెలుసుకొని, మనమేకాదు! అందరకు గౌరవముంటూడియని గుర్తించుకొని, దీనివల్ల దేశమంతయు జైనమతరాజ్యముకావలెనని సిక్కుమతరాజ్యముకావలెనని, మహారాష్ట్రమతరాజ్యముకావలెనని, అరవమతరాజ్యముకావలెనని, శివమతరాజ్యముకావలెనని, విష్ణుమతరాజ్యముకావలెనని ఉద్యమములు. పోరాటములు, అరాచకములు, నానాబాధలువచ్చిపెట్టున్నటివల్లను ఏహిందూమతోద్ధారణకని ఈఉద్యమములతలపెట్టినారో అందుకుగాను అవలంబించబడుచున్న తప్పుడువిధానమువల్ల దానికివ్యతిరేకముగా ఆహిందూదేశమే ప్రపంచదృష్టిలో అపహాస్యముపాలగును. ఈవిధముగా ప్రపంచమానవకోటిని సహజమార్గమున సుస్థిరపడకుండా ఎల్లప్పుడు కల్లోలితపరచుటయేనా? మతముపేరిటచేయుకార్యము. మానవుడు అందరిశ్రేయస్సుకొరకై పాటుపడి కీర్తివంతుడైనప్పుడే పరమతసహనము, సర్వమానవసౌభ్రాతృత్వమువల్లనే ఏమతమైనను మనుటకుగాని, కీర్తిపొందుటగాని జరుగునవనేసత్యమును గ్రహించెదరుగాక!

అందుచేతనే బహుపురాతనముగా ప్రపంచమున సాటిలేనియశస్సు పొందిన మనదేశసాంప్రదాయమును పునఃస్థాపించుకొరకునే కాంగ్రెసు మనదేశమును (సెక్యులర్ స్టేట్) ఏమతమువారైనను, జాతివారైనను పరమత

స్థానముకల్గి ఇతరులకెట్టిఆటంకములు, బాధలు కలిగించనిరీతిని తమతమ మత, జాతులయొక్క దైవిక, ఆధ్యాత్మిక ఆచారవ్యవహారములజరుపుకొనుట కెట్టిభంగములేకుండురక్షణతో జీవించుటకు తావుగలదేశముగా నడుపుటకే ఆశయముగా కల్గియున్నారు. జాతి, మతవిషయకముగా ఇంతకన్న ఈప్రపంచమున కోరతగినది, సాధ్యపడునది యున్నదా?

కావున బహిరంగముగా, నిర్మాణయుతముగా అందరిప్రజల అభిమతానుసారముగా, వారిసానుభూతితో, వారు ఐక్యకముగా ఇచ్చినధనముతో సమర్థులు, అనుభవశాలురు బరిమీదపడి కంటికిరెప్పకన్న ఎక్కువగా అహర్నిశలు తరేకకృషి, అనేకత్యాగములుచేయుచున్నదానికే ఒకటిఒకటి లక్ష్యములు అతికష్టముమీద జరుగుతుంటే అనుభవములేనికుర్రలు, రోస్టకెక్కుటకే కీర్తిచెందు కొద్దిమందిసానుభూతితో, దొంగధనముతో, చాటు నాటూహ్వాని పాఠములుచెప్పుకొన్న పద్ధతిమీద ఏమిసాధించదలచేరో దేశీయులు గ్రహించుకోవలసియున్నది.

## —♦ నేటియువతుల మరికొన్ని సాధారణకర్తవ్యములు ♦—

### నేటియువతుల దురభ్యాసములు-సదభ్యాసములకు మరలువిధానము--

నేడు సాధారణముగా మగవారు, ముఖ్యముగా వివిధవృత్తులలోని యువతులు ఎందుకూపనికిరాని బాతాఖానీలతోను అందుచాలభాగము వ్యభిచార సంభాషణలతోను కాలము వృథాచేసుకొనుచు ఆయాలోచనలతోనే, ఆ క్రియలతోనే కాలముగడుపుచు శారీరక, మానసిక, ఆర్థిక, వైజ్ఞానిక, సాంఘిక బాధలను అవమానములను. అగౌరవములను భరించుచున్నారు. కాని ప్రతిఒక్కరికి తమభార్యాబిడ్డలతో సుఖముగాను, గౌరవముగాను బ్రతకవలెననియేయుండును. కాని తమఅలవాట్లలో, వాతావరణములోపడికొట్టుకపోవుచుండుటే అవరోధము.

దీనినుండిబయటపడి ఒకప్రక్క సుఖముగాను, మరియొకప్రక్క గౌరవముగాను జీవింపవలయునన్న ఆకబుద్ధి, ఆయాలోచనలుమానుటేమా

స్త్రము. కబుర్లుమానవచ్చుగాని ఆలోచనలుమానుట ఎట్లాయనికొందరుప్రశ్నించవచ్చు. తిరిగి తమకే సౌఖ్య, సంపద, గౌరవములుకూర్చునవిగాన తమ వృత్తిలో తీరికలభించిన ప్రతినిముషమును తమకుసంబంధించిన సంఘముల పురోభివృద్ధికిగాను పాటుపడుటకో, అట్టిపాటుపడుటకు అవసరమగుఆలోచనలకో వినియోగించుటయే.

ముఠా, పార్టీ రాజకీయాల కతీతమైనరాష్ట్రకాంగ్రెసు:— నేడుమన రాష్ట్రకాంగ్రెసు, దానిఅనుబంధ (సోదర) కాంగ్రెసుసంఘములు పార్టీ ముఠా, రాజకీయాలకు అతీతమై నడచుచున్నవని గుర్తించుకొని, రాష్ట్రకమిటీఆఫీసు, సిబ్బంది, పరికరములు మున్నగువాటికి సాలుకు కొన్నిలక్షలున్ను, జిల్లాకమిటీలుకొన్నివేలున్ను ఖర్చుచేయుచు రాష్ట్రకాంగ్రెసు రాష్ట్రప్రభుత్వాన్ని, జిల్లాకమిటీలు జిల్లాప్రభుత్వఆఫీసులను, గ్రామకాంగ్రెసుసంఘములు ఆయాగ్రామములోని మునసబు, కరణం, ఆగ్రామమునకు అధికారులుగావచ్చు రివిన్యూ, పోలీసు, మున్నగుశాఖలఉద్యోగులను తమప్రజలకు అన్యాయములు జరుపకుండాను, ప్రభుత్వఏర్పాటులమేరకు నడచుకొనునట్లుగా శాసించగల బలవత్తరమైనవని తెలుసుకొని వాటిలో స్వలాభపరులకు తావులేకుండా చేసుకొనుచు ఇంకను బలవత్తరముచేసుకో వలసినబాధ్యత నేటియువకులపై మరింతగలదు.

ఆదర్శధర్మవ్యాపారము:— ఒకప్పుడు ఢక్కామజ్లిను, మాలనూలు యని పేరుపడసిన సన్ననినూలుబట్టలు మున్నగు ఏడుపొరలుచుట్టినను ఒళ్ళు కనబడునంతటి నాజూకుబట్టలు తయారుచేసిన మనమనదేశంనుండి* సాధా

* నేటికిని ఎంతటిఇంజనీర్లయినను, ఎంతటియంత్రములు తయారుచేసినను చేతిమీదతయారైన బట్టలసన్నమును తయారుచేయలేకపోయిరి. మన ఢక్కామజ్లిన్ నేటికిని లండన్ మ్యూజియంలో ప్రదర్శింపబడియున్నదని తెలియుచున్నది.

రణ మాతకిబట్టలనేసుకొనుటకే నేర్పుకోల్పోవుచున్న ఇంగ్లండులో గతశతాబ్ది

ములో మనదేశీయులు ఇంగ్లీషువారిమల్లు, గ్లాస్కో మున్నగుబట్టలపై మోజుపడి-ట్లుగా-మోజుపడి కప్పించుకొనెడివారు. అప్పుడు అచ్చటి నేతపారిశ్రామికులకు తాము నేసినబట్టలు తమ దేశములో కొనువారుతగ్గుచుండుటచే ఇది చాల నష్టదాయకముగా పరిణమించినది. వారందరు తమనాయకులతో మొరపెట్టుకొనగా-గత 30 సంవత్సరములక్రితంనుండి మన దేశనాయకులు విదేశీవస్తుబహిష్కరణ, స్వదేశీవస్తూపయోగమునకు ప్రబోధముచేయుచు ఆచరణకై ఉద్యమముప్రారంభించినట్లుగా-ఆనాడు అచ్చటినాయకులు మన దేశమునుండి అచ్చటికర్తకులు స్వలాభములకై తెచ్చుచుండిన బట్టలను కొనవలదనియు, అది తమదేశమునకు నష్టదాయకమనియు ప్రబోధముచేయుచు బ్రతిమలాడిరి. ఇందులకు తమదేశ క్షేమమును, తద్వారా తమక్షేమమును తెలిసిన కొద్దిమందివినుకున్నను ఇంతమాత్రమునసే ప్రజాబాహుళ్యము బీద, గొప్పతోసహా రాజకీయచైతన్యములేనివారు ఎక్కువగావున వారు తమతమ స్వలాభములను, నాజూకు-అందములకువ్యామోహముతోను మనదేశపుబట్టలు మామూలుగానే విరివిగా అమ్ముడుపోవుచుండెను. దానికి ఆనాయకులు ఆపరిశ్రమదారుల ఆందోళనలుజరుపుచూ పార్లమెంటుపై వత్తిడితెచ్చి, సంప్రదింపులుజరిపి తమదేశములో మనదేశపుబట్టలు అమ్మరాదనేఆంక్షను విధించుచు శాసనములు చేయించారు. ఐనప్పటికి గతకొన్ని సంవత్సరములుగా మనదేశములో స్వలాభపరులైన వ్యాపారస్తులు అధికలాభాలతో వ్యాపారములు సాగించుటవల్ల సామాన్యప్రజానీకము బాధపడుచున్నది నష్టపడుచున్నదియని ఇంతకంటెఎక్కువధరలకు అమ్మరాదుయని ఆంక్ష (సీలింగురేట్లు) విధించుచు శాసనములుచేసేటప్పటికి మల్లు మున్నగుబట్టలు ఏవిధముగా దాగుడుమూతవ్యాపారములోనికిపోయి అక్కడనుండి అమ్మకముగుటకు రహస్యమార్గాలవచ్చుటకు ప్రారంభించినదో ఆదేవిధముగా ఈమల్లు, గ్లాస్కోలను అనేకరెట్లుమించియుండిన ఆనాటిమనబట్టలు ఇంగ్లండులోని వ్యాపారస్తులకొట్లలో దొంగవ్యాపారములోనికిపోయినవి. ప్రభువులు, ధన

వంతులు తమఘనతనుచూపుకొనుటకు వారిఆచారముప్రకారము పెండిండ్లలో వధువునకుపెట్టుబట్టలు, మేలుముసుగు మున్నగువాటికై ఆపెండ్లికొడుకులు వ్యాపారస్తులను బ్రతిమిలాడి, లంచములుపెట్టి అత్యధికధరలకు హైకీతీయించు కొనుచుండిరి. మనదేశమువారి అధీనములోనికివచ్చినతర్వాత, యంత్రియుగమువచ్చి భారీయెత్తునవస్తూత్పత్తిచేయగలిగినశక్తి అన్నిదేశములలోవచ్చినపుడు ఆయవకాశము మనకులేకుండాచేసి తమ అపారఉత్పత్తిని అధికాగము తమచేతిలోనుండుటచే మనదేశమునకు దిగుమతిచేయుట మొదలుపెట్టి ఇదివరకు ఆవైపునయుండే ప్రవాహమును ఇటుమళ్లించుకొనిరి.

నౌకానిర్మాణము, నౌకావ్యాపారములోనుకూడ ఇదేవిధముగా జరిగినది. ప్రపంచములో ఎవరికి నౌకానిర్మాణము, నౌకాయానము తెలియని రోజులలో మనదేశీయులు (ముఖ్యముగా కోరంగి, కాకినాడప్రాంతపు ఆంధ్రులు, కలకత్తాప్రాంతపు బెంగాలీలు) ఓడలనుకట్టి వేలకొలదిమైళ్ళ సముద్రయానముచేసి మనదేశపు సరుకులను అనేకదేశములలో వ్యాపారము చేయుచు విజ్ఞానప్రబోధముకూడ చేసిరి. ఇంగ్లీషువారు మనదేశమునకు ఆహారపదార్థములకై వచ్చునప్పటికి వారికి 100టన్నుల పడవలకన్న పెద్దవి కట్టుట తెలియదు. ఇట్టిపడవలుకొన్నేసి ఒక్కొక్కముఠాగాబయలుదేరి వచ్చేవారు. ఇదిదారిలో సముద్రములమీదకలిగే తుపానులు మున్నగు అపాయములకు తట్టుకొనలేక కొన్నిమునిగిపోయెడివి. ఇక్కడకుచేరుకొన్నఆకొద్ది పడవలు సరుకులుతీసుకొని మరల ఇంగ్లండు చేరుకొనుసరికి మరికొన్ని మునిగిపోయి కొద్దిపడవలుచేరుకొనుటయే కష్టముగాయుండెడిది. ఇనుప మేకులు, చీలలతో బిగించికట్టుటయే తెలిసియున్నవారి పడవలు ఈవిధముగా ఏకొద్దియో తిరిగిచేరుకొన్నను, కట్టుబడిలో ఉపయోగించిన ఇనుప చీలలు తుప్పుపట్టి పాడైపోవుటచేతను. కెరటములవత్తిడికి వలిగిపోవుటచేతను మరల సముద్రయానమునకుగాని, మరమ్మతుకుగాని పనికిరాకపోవుచుండెడివి.

రందరు ఇంకమిగిలియున్న ఒక్కవృత్తికి వ్యవసాయకూలీలుగా గ్రామముల కెగబడుటవల్లనే మనదేశములోని ప్రధానవృత్తిపైజీవించు గ్రామములలోని వ్యవసాయకూలీలు కడుబీదవారుగాయుండుటకు, దొంగతనములదిగుటకు కారణమైనది.

గత అర్ధశతాబ్దముగా ప్రపంచమంతటికి యంత్రయుగమువచ్చి తక్కినదేశములకు స్వేచ్ఛావ్యాపారవాతావరణములో ఎగుమతి, దిగుమతివ్యాపారములు అభివృద్ధిగాంచినతరిలో, ఈపైకారణములవల్ల మనదేశీయులకు అట్టి అవకాశములులేక వివిధవృత్తులునశించి 'బీదలుగాను భిక్షకులుగాను అగుటయేగాక ఇతరదేశస్థులు ఆధునికయంత్రపరికరములతో ఆహారపదార్థాలు మొదలు అన్నివస్తువులను విరివిగాఉత్పత్తిచేసి నేటిపరిస్థితులనుబట్టి నూతన సరళిలో తాముఉత్పత్తిచేసినవస్తువులను లాభసాటిగా, సులువుగా విడుదల చేసుకొనుచు ముందుకుసాగిపోయినపద్ధతులను మనదేశీయులు తెలుసుకొనుటకు అవకాశములేక దగా, మోసవ్యాపారములకు గడంగి గొ క్కుబెత్తెడే తోకవిధానములోనైననుయుండక మనవ్యాపారములు క్రిందకు దిగజారిపోయినవి. ఆరోజుతను అమ్మేసరుకుమీద మరియొకపావలా రాబట్టుకోవలెననేదృష్టితో అపరాలలో తూకముహెచ్చుటకు బెడ్డలు, ఇసుకకలిపి; పరిమాణముహెచ్చుటకు నేయ్యిలోఅరటిపండ్లు, పాలలోనీళ్లు, పిండికలిపి; తక్కువధరలనూకను పంచదారలోను; చౌకబారునూనెలను కొబ్బరినూనె, మంచినూనెలలోనుకలిపి; మందులు, బలవర్ధకౌషధములు మున్నగు ఎంతటి విలువైనసరకులైనను తగుపాత్రలలోపెట్టకయు (Proper presering packing) నకిలీఅవుషధములు, వస్తువులుతయారుచేసియు; మంచినమూనా చూపించి నకిలీసరుకు రవాణాచేసియు ఈవిధముగా ఆరోగ్యకరమైన పదార్థములను ప్రజలకినారోగ్యకరమైనవిగా కలుషితపరచియు, సహజముగా నిలవయుండు సరకులను త్వరలోచెడిపోవునట్లుగాను, వినియోగదారులకు

వాటిని బాగుచేసుకొనుటకు కొంతపనిసమయము, కొంతమజూరీ కృత్రిమముగా వృథాచేసుకొనునట్లుగా నొనరించుచు ఆపదార్థములను ఉత్పత్తిచేసే వానియొద్ద మొదలుకొని వివిధస్థలములకు చేరవేయు రవాణావ్యాపారస్థలు, టోకునకొని తాముచిల్లరవ్యాపారులకు అమ్మువర్తకులవరకు ఎక్కడకక్కడే మరింత కలుషితపరచుచు వ్యాపారముసాగించుకొనుటలోనికి దిగబడి. ఈవిధముగా తాము అమ్మసరుకును కలుషితపరచువారు తామే తెలివైనవారుకాబట్టి ఆనాటి వ్యాపారమును లాభసాటిగాచేయకల్గితిమని మిక్కిలి గర్వించెదరు.

ఇట్టివిధముగా తాము అమ్మసరుకును కలుషితపరచినవారే తమకు అవసరమైన ఇతరవస్తువులనుకొనినపుడు అవికలుషితపరచబడినవని కనుగొని ఆఅమ్మినవానిని, అట్టిసరకులఅమ్మకమునకు అనుమతించినఉద్యోగిని దూషించుటకు దిగెదరు. అంతేగాని తాము ధర్మలాభమునుమించి అధికలాభము పొందుటకు తమసరకులకు సంబంధించిన ఉద్యోగికి ఏవిధముగాలంచము పెట్టి అందుకుసంబంధించిన ఇతరతాపత్రియములన్నియు ఎంతతెలివిగా చేసేవనుకొనుచున్నాడో, ఇతరవస్తువులవ్యాపారులుకూడ అంత తెలివితేటలు ఉపయోగించలేరనుకుంటాడు. ఈవిధముగా తను అమ్మసరుకుపై ఆత్యాశతో ఇతరులను నష్టపరచి ఎంతఅధికలాభముపొందినాడో తనవినియోగమునకైకొను ఈవిధమైన సరకులవలన అంతనష్టము ఎల్లప్పుడుపొందుచునేయున్నాడని, ఇందువల్ల నొక్కొకుజత్తైదేలోకయని గుర్తించడు. అదిగాక ఒకసారితాను పావలాఎక్కువతీసుకోకల్గినేగాని మరుచటిదినమునుండి కొనువారికి నమ్మకముపోవుటచే విరివిగా కొనువారు రారనియు ఒకవేళ ఎవరైనవచ్చినను బేరములుసాగించి అర్ధకుతక్కువగానే కొందురనియు గ్రహించడు,

వీటన్నిటివల్ల మనదేశములోని ప్రతిఒక్కడు తక్కినవారినందరను అనుమానించుచు పరస్పరము నమ్మకపోకయుండుటేకాక మనదేశపురైతు దగ్గరనుండి వినియోగదారునకు అమ్మువారివరకుగల వ్యాపారస్తులు, మన వ్యాపారము ఇతరదేశీయులదృష్టిలో చాలహీనపడినది. మనదేశ బీదస్థితికి ఇదికూడ ఒకకారణమైయున్నది. అధిక ఆశధరవేసుకొని పాతికరూపాయిలు అమ్మకముచేసి అగౌరవముతో కూర్చునేకంటె ధర్మలాభముతో వేలపై వ్యాపారము చకచకసాగించి వందలుఆర్జించి అర్థ, గౌరవములనుపొందుట మేలుగదా?

ఇంక వ్యాపారసరళిలో బేరములాటవలన అమ్మువారు కొనేవారిని తక్కినగుమ్మములలోనికి వెళ్ళనట్లుగచేసుకొని బేరగాడిని పోగొట్టుకొనుటయు, కొనేవారు అనేకమందిదగ్గరకు తిరగవలసివచ్చుటయు (ఇక్కడప్రతి వ్యక్తి అమ్మువాడుతానే కొనేవాడుతానేయని గుర్తించుకోవలెను) ఒకసారి వచ్చి కంగించుటయు, మరొకసారి ఉద్దేశము తెల్పుటయు, మరియొకసారి వచ్చి బేరముసాగించుటయు, మరియొకసారివచ్చి ఖాయముచేసుకొనుటయు ఈరీతిని నాలుగైదుసారులు తిరగవలసివచ్చుటవల్లను తాము ఇతరత్రా పనులుగాని, ఈవ్యాపారమే ఇంకను విరివిగాచేసుకొనుటకుగాని తమఅమూల్యమైన కాలమును వృధాచేసుకొనవలసివచ్చుచున్నది.

కావున తమవ్యాపారములు నమ్మకముగా, చురుకుగా, విరివిగా సాగవలెనన్నను. తాము యితరులనుండి కొనవలసివచ్చు సరుకులలో ధననష్టము, సమయనష్టము, కాయకష్టము, మనసుకష్టము పొందకుండవలెనన్నను, తాముకష్టించి వెచ్చించి కొన్నసరుకులు నాలుగుకాలములపాటు మన్నవలెనన్నను, తాముకొను ఆహార, ఔషధములవల్ల తమ ఆయురారోగ్యములను నష్టపడకుండవలెనన్నను తాము ప్రథమమున ఈమోసపువ్యాపారమునుమాని, నాణ్యమైనసరుకును తయారుచేయుట, శుభ్రమైనట్టి చాల

కాలము నిలవవుంచునట్టి కట్టుబడిచేయుట (Neat, clean & preserving paching) తన అమ్మినప్పటికి అసలుకునకు అన్నిఖర్చులుపోను నూటికి పాతిక, లేక ప్రభుత్వము ఎప్పటికప్పుడు నిర్ణయించుధర్మలాభము వేసుకొని అమ్ముటయేమార్గము. ఇందువల్లతమగౌరవము, తమదేశగౌరవముకూడ పునఃస్థాపించుకొనినవారుకూడ యగుటయేగాక ఇంకను పెద్దవ్యాపారము సాగించుకొనగల్గినవారగుదురు.

బేరము ధరలుచెప్పుట మానిన తామునష్టపోవలసివచ్చునని ఇంకను కొందరు మూఢనమ్మకస్థులు అనవచ్చును. నేడు పట్టణములలో పెద్దషాపులలో నిర్దిష్టధరకు (Fixed prices) అమ్మేపద్ధతివల్ల తమవ్యాపారముఎంత జోరుగా ఎంతఎక్కువగా సాగుచున్నదో చూచుటలేదా? ఇందువల్ల దొంగ వ్యాపారస్తులకు ఎల్లప్పుడూ పీడిస్తూయుండే అదురూ, బెదురూకూడ తప్పునుగద!

మనదేశజాతీయనాయకులు, కొందరు జాతీయదృష్టిగల ఉదారకోటీశ్వరులు దీనికి మొదట మహాత్ముని ఆశీర్వచన రక్షణయే ప్రధానముగా పెట్టుకొని జాతీయసంపద, గౌరవములను నిలబెట్టుకొనుటయే తమయొక్క సంపద, గౌరవములకుకూడ ఒక్కటేరక్షణమార్గమని గుర్తించుకొని బ్రిటిష్ వారు అసలే మనదేశీయులు వ్యాపారమునకై స్వంతనౌకలను కలిగియుండరాదనే బిగింపువరకువచ్చియున్నను శ్రీ వాల్చంద్ హీరాచంద్ ప్రభృతులు సింధియాషిప్ నేవిగేషన్ కంపెనీ (సింధియా నౌకాయానసంస్థను) స్థాపించి పార్లమెంటువరకు పోరాడి కొంతకాలమునకు భారతీయవర్తకులు స్వంత నౌకలను వేసుకొనవచ్చుననే స్థితికి తీసుకవచ్చి ప్రథమమున ఒకపాతఓడను కొని దీనిని ప్రథమమున బొంబాయిరేవులో పెట్టి ఇంగ్లండుకు సరుకులులను ప్రయాణీకులను కొనిపోవుటకు సిద్ధపరచేటప్పటికి మనముబాగుపడుటకు ప్రారంభించబడిన ఈదేశీయవ్యాపారమును పురిటిలోనే చంపుటకుగాను

ఒకబ్రిటిషుకంపెనీఓడను దీనికి పోటీగా పెట్టినారు. * వేలకొలదిటన్నుల

---

* ప్రజోద్యమవత్తిడికి ఇంక నిలువలేక కొంతవరకులొంగి తమప్రతిష్ఠకు భంగములేకుండా ఏదో ఎంతో పెట్టినట్లుగా చెప్పుకొని ఆవచ్చినకొంతఏర్పాటుతో మరీబలవంతులమగుదుమని దానిని మనకు కొనసాగకుండా భిన్నము చేయుటకు-పెట్టినదానిలో ఉమ్మివేయుట మొదటినుండి నేటివరకు ప్రతి అడుగులోను అనుసరించుచున్న దే బ్రిటిషువిధానము.

---

సరకును తీసుకొనిపోవు మనదేశవ్యాపారస్థులు మనఈఓడపై సరుకు ఎగుమతిచేసిన ఇంగ్లీషువారి ఆగ్రహమునకుగురియై తమవ్యాపారమునకేమిభంగము వచ్చునోయనియు, ఇంక ఐ. సి. యస్. మున్నగుచదువులకు, పరీక్షలకు పోవువారగు సాధారణప్రయాణీకులు కాబట్టి బ్రిటిషువారి అనుగ్రహముతో పొందుచున్న తమవిద్యకు ఎట్టిభంగముకల్గునోయనిన్ని మనఓడపైనెక్కుటకు భయమునొందెదరు కావున ఈమన ప్రథమదేశీయ వ్యాపారోద్యమమును (National enterprise) కొనసాగించుటకే నిశ్చయించుకొని ప్రయాణీకులున్నను లేకపోయినను, వ్యాపారస్థులు సరుకులువేసినను వేయకపోయినను సరే ఎంతనష్టమువచ్చినను సరే * ఆపోటీరేట్లకే నడిపించసాగిరి. ఒక

---

* ఒక్కొక్క ఓడ కొన్నికోట్లుఖరీదున్ను, ఒక్కొక్క ప్రయాణమునకు కొన్నిలక్షల ఖర్చున్ను యగును.

---

ప్రక్కదేశములో ప్రబోధముగావించిరి. క్రమేణా మనఓడపై ప్రయాణము, రవాణా అధికముకాజొచ్చెను. ఈవిధముగా చిరకాలముగా సుస్థిరముగా స్థాపితమైన, ప్రభుత్వఅండకల్గియున్న పెద్దబ్రిటిషుకంపెనీ జరిపిన పోటీకి దేశభక్తిపరిపూర్ణులై కార్యదీక్షాబద్ధకంకణులైన ఐదుగురుభారతీయ కోటీశ్వరులు నిలువగలుగుచున్నదానికి తట్టుకొలేక ఒకవారము మీాది, ఒక వారము మూయవలె నాటికి దిగవలసివచ్చినది. ఇదేవిధముగా మనవారు రెండవఓడనుకొని కాకినాడనుండి రంగూనుకువేసినప్పుడు ఆబ్రిటిషుకంపెనీ సిగ్గు

లేక మరలజరిపిన పోటీలో ప్రయాణీకునికి ఒకరూపాయి రేటు, ఉచితముగా వంటకుపోగు, టీసప్లయితో సహా తీసుకువెళ్లినవిషయము మనఆంధ్రులకు విదితమే. దీనికికూడా ఒకవారముమనకు ఒకవారమువారికి ఏర్పాటుచేయ గలిగిరి. తరువాత ఒక్కొక్క వాణిజ్యమార్గమున ఆయావాణిజ్యపరిస్థితుల కనుగుణంగా కావలసినరీతిని ఇష్టమువచ్చిన రూపురేఖలతో ఓడలను స్వంతముగా ఆర్డరిచ్చి కట్టించుకొనేస్థితిలోనికివచ్చిరి. *ఇంక నీఓడలునడుపుటకు

* ఆస్ట్రేలియా, న్యూజిలాండు మున్నగుప్రదేశములనుండి వివిధరకముల పండ్లను ఎగుమతిచేసుకొనేటి ఓడలలో ఆఫలములు చెడిపోకుండా (Cold storage bunkers on refregeration system) మంచుగడ్డ యంత్రసహాయమున హిమవంతమొనర్చినకానాలు యుండవలెను. చేపలపరిశ్రమ భారీయెత్తునగల దేశములనుండి చేపలనుకొనిపోవు ఓడలకు కూడా ఇట్టియేర్పాటే కావలయును. ప్రత్యేకముగా ఇనుము మున్నగు సరకులనుమాత్రమే కొనిపోవు (Chartred steamers) ఓడలకుప్రయాణీకుల గదులు కట్టనవసరములేదు. ఓడస్థలమంతయు సరకులనెగుమతిచేసుకొనుటకనువుగ కట్టుదురు. కిరసనాయిలు; పెట్రోలు, తత్సంబంధమైన నూనెలు కొనిపోవు ఓడలలో ప్రయాణీకులకు తావుండనేరదు. గదా డబ్బాలు; పీపాలు ఎగుమతి కాదుకాబట్టి మొత్తముఓడలోనే సాగపోతగావేసుకొనుటకు పెంకాగానిర్మించెదరు. కొన్ని కాయధాన్యములు, అపరాలుతీసుకపోవు ఓడలకు కూడ సాగపోతవిధానము కలదు. వీటిని ఎగుమతి, దిగుమతిచేయుటకు రేవులలో చాలకాలము వ్యర్థాగాయుండవక్కరలేకుండా ఈసాగపోతసరుకులను సులువుగా త్వరగా ఎత్తివేయు యంత్రములుండును. ప్రయాణీకులను, సామాన్యసరుకులను రవాణాచేయు ఓడలకైనను ఆయామార్గముపై ప్రయాణీకులు, సరుకులు ఏయేనిష్పత్తినియుండునో దాని కనుగుణంగా ఆఓడలలో స్థలనిర్దేశముచేసి కట్టవలెను. లేనిచో ప్రయాణీకులస్థలమో, సరుకులస్థలమో మిగిలిపోయి ఆసర్వీసుకు పూర్తిఆదాయమురాదు.

ఇంజనీర్లు, ఆఫీసర్లు బ్రిటిషువారేయుండవలసివచ్చుటచే మనవోడలైనను పెద్ద జీతములపైకే పోవుచుండుటచే మరికొంతకృషిచే మనదేశీయయువకులను ఈనిపుణతా విద్యా, పరీక్షలకు పంపించుకొనగల్గిరి. దీనికికూడ మనదేశీయుల విద్యాకాలఖర్చులు విదేశమునకుపోకుండా మరికొంత దీర్ఘకాలపోరాటముతో మనదేశమున బొంబాయిలో ఒకనౌకా విద్యాబోధపాఠశాలగా ఒక నౌకను ఏర్పాటుచేయించగల్గిరి. తరువాత నౌకలను కట్టించుకొనుటకు విదేశములకు కొన్నికోట్లు వృధాగాపోవుచున్నదని మనదేశములో నౌకానిర్మాణముచేయుట కుద్యమించిరి. ఇందులకు సుదీర్ఘపోరాటమే చేయవలసివచ్చినది. కొంతకాలము అనుమతించకయు, అనుమతించేక మనవారు దేశతీరమంతయు శోధించి నౌకానిర్మాణాగారములు నిర్మించుటకు అనువైనస్థలమును కనుగొనగా ఆస్థలమును అమ్ముటకు అభ్యంతరముతెలిపి, మరల ఇంకొకస్థలమును వెతకికొనగా మనఅవసరమునుబట్టి అధికధరచెప్పినదానికి అంగీకరించినను నౌకానిర్మాణశాల కనుసరించియుండవలసిన రైలుమార్గనిర్మాణస్థలములున్నగువాటిలో ఆటంకములుగాని, నిత్యముమనకు అధికఖర్చు వారికిఆదాయమువచ్చుషరతులుపెట్టిగాని భిన్నముచేయుచువచ్చిరి. తుదకు గతపర్యాయము కాంగ్రెసు రాష్ట్రపరిపాలనచేయుచున్నప్పుడు ఇచ్చటమనకువచ్చిన బలమువల్ల, యుద్ధమువచ్చుటచే తమకు అనేకఓడలనిర్మాణము అవసరమైయున్నప్పుడు ఇంకనూ కొన్నిబిగింపులతో నౌకానిర్మాణకేంద్రమునకు అవసరమగు కొన్నిప్రత్యేకసౌకర్యముల (Some priorities & fesilities that are nessasary for a ship building yard) ను చేకూర్చకయుండినను మొత్తముమీద ఏదోవిధముగా విశాఖపట్టణములో నౌకానిర్మాణము చేసుకొనుటకు ఒప్పించకల్గిరి.

ఈవిధముగా దేశవ్యాపారములకన్నిటికి తలమానికమైన ఎగుమతిదిగుమతి దేశవ్యాపారములో ముడివస్తువులనుకొని తయారీవస్తువులను అమ్ముటవల్లకలిగే విపరీతవ్యాపారలాభములనుండి వాటిని ఇచ్చటనుండి అచ్చటకు,

మరల అచ్చటనుండిఇచ్చటకు రవాణాఖర్చులను సంగ్రహించుకొనుచున్న ను ఆ రవాణా వ్యాపార *ఆదాయముకూడా వారికే చెందుట కాక ఈ

---

*కోటానుకోట్లధనము మనదేశమునుండి (బొంబాయినుండి) లండనుకు పెద్ద బంగారుకడ్డీలరూపమున ముఖ్యముగా అరవైనాల్గురోజులు ఒకటే ప్రవాహముగా పోవుచుండు.

---

రవాణాసంబంధవృత్తులు అనగా వాహనములు తయారుచేయువారు, నడుపువారు వీటన్నిటికికావలసిన గుమాస్తాసిబ్బంది మొదలగువృత్తులవారు మొద వలసివచ్చినపరిస్థితినుండి ఈధనమంతయు మనదేశములోనే యుండిపోయి ఈవివిధవృత్తులవారికి పనికల్పించినవారైరి. అంతేకాదు. వీరిత్యాగధర్మమా యంటూ నేటికి మనదేశమున అనేకజాతీయనౌకాయానకంపెనీలు, అనేక జాతీయ విదేశీవ్యాపారకంపెనీలు ఏర్పడియున్నవి. ఈఒక్కకంపెనీకే 'జలలక్ష్మి' 'జలదుర్గ' 'జలబిందు' 'జలధార' 'జలతార' 'జలబాల' 'జలమోహన్' 'జలగోపాల్' 'జలవీర్' 'జలవిజయ' మున్నగు నామములుగల 29 ఓడల వరకు అభివృద్ధిగాంచెను. మనకు స్వరాజ్యము వచ్చినతరువాత స్వతంత్రభారతావనిలో ఈస్వతంత్రభారతకంపెనీలో కట్టబడిన ప్రథమస్వతంత్రభారతనౌక 'జలఉష'ను స్వతంత్రభారత ప్రథమప్రధాని పండిత నెహ్రూ ఆంధ్రదేశమునకువచ్చి విశాఖపట్టణములో జలప్రవేశమహోత్సవముగావించినవిషయము అందరకు తెలిసినదే. తరువాత ఓడను మనభారత ఉపప్రధాని సర్దార్ పటేల్ ఢిల్లీలోనుండియే విశాఖపట్టణములోనిపేడకు రేడియోద్వారా జలప్రవేశమహోత్సవము జరిపిరి.

ఒక్కొక్కనౌకాకంపెనీ తమఓడలపై తమకంపెనీగుర్తుగలజండాను ఎల్లప్పుడు ఎగురవేసియుంచెదరు. దీనిప్రక్కనే ఆకంపెనీదేశపుప్రభుత్వ జండానుకూడ ఎగురవేసెదరు. కావున స్వతంత్రమైన మనత్రివర్ణపతాక మన ప్రభుత్వఓడలపైన యుద్ధనౌకలపైనేగాక ఈప్రపంచసముద్రభాగముల వివిధదేశ

ములలో మనరాయబారికార్యాలయములపై రెపరెపలాడుచు ఎగురుచున్నట్లు గానె మనదేశీయ వ్యాపార నౌకలపై నెగురుచు నేడు ఈప్రపంచమువిూది సప్తసముద్రములపైన విహరించుచున్నది.

ఇదేవిధముగా పెద్దపరిశ్రమలు మొదలు గృహపరిశ్రమలవరకు తక్కిన పరిశ్రమలు, వ్యాపారములన్నిటిలోను ఇటువంటిమహానుభావులు దేశదేశములుపోయి మనదేశపూర్వఅపుష్టత్వమును, నేటి (పరాధీనతలోనున్న ప్పటి) స్థితియు, రాబోవునను నేటిఉద్యమ లక్ష్యములు మున్నగునవి నేటల్లెల్లము చేసి అచ్చటచ్చట మనకు నైతిక, ఆధ్యాత్మిక, సానుభూతి, సహాయసంపత్తిపునాదులువేసుకొనుచు మనదేశ వివిధపరిశ్రమ, వ్యాపారములను పునః స్థాపించుకొనుచు; బలపర్చుకొనుచు, వృద్ధిచేసుకొనుచువచ్చిరి. కాంగ్రెసు రాజకీయస్వాతంత్ర్యముకొరకు పోరాటములుసల్పుచు నైతిక, అంగ బలములను వృద్ధిచేసుకొనుచువచ్చుచునే సర్వనాశనమైనదేశమును సంపాదించుకొని దిక్కులుచూచుచు కూరొర్చరావలసినఅ త్యమునుండి తప్పించుటకుకూడ ఈ పరిశ్రమ, వ్యాపారపునఃస్థాపన, అభివృద్ధిఉద్యమములనుకూడ ప్రక్కనె సాగించుకొనుచు వచ్చినారు. మనజాతీయ, రాజకీయ, సాంఘిక, పారిశ్రామిక, వ్యాపార, నైతిక, కళాపోషణలకై, స్వాతంత్ర్యములకొరకై, పునఃస్థాపనకై, అభివృద్ధికై పాటుపడుచురాకపోయిన అసలుమనదేశమున ఈకాంగ్రెసువంటి జాతీయసంస్థ పుట్టకపోయిన బీదవాడులగాయతు మహాధనవంతునివరకు మొత్తముభారతజాతిఅంతయుకూడ ఎవరికి ఒకసెంటుభూమిగాని ఏవర్తకముగాని, ఉద్యోగముగానిలేకుండా మొత్తము అందరినెత్తినిఉప్పర కట్టెలుమాత్రమే యుండెడివి. ఇది అతిశయోక్తికాదు, బ్రిటిషువారు ఆక్రమించుకొన్న ఆస్ట్రేలియాను చూచుటలేదా? ఆఖండములో అసలుయుండదగు జాతీయులు నేడు (Bushmen) యని పిలువబడుచు బ్రిటిషువారికి అసుందరనగరములు కట్టుటలోను, పెద్దఫ్యాక్టరీలలోను కూలిచేసుకొనుచు

దొంకలలోను, తుప్పలలోను నివసించవలసి వచ్చుచున్నది. అంతేకాదు. అక్కడకు ఏయితర దేశస్థులనుకూడ ఏవ్యాపార, వ్యవహారములకు రానీయరు. అంతేకాదు. ప్రపంచమందంతట గౌరవముపొందుచున్న మనభారతజాతిని కూడ బ్రిటిషువారు దక్షిణాఫ్రికాలో పట్టణములలోనికి రాకుండగను, రైళ్లు ఎక్కకుండగను మాలపల్లినివాసమునకు పాలుజేయలేదా? మనదేశములో మట్టుకు మొదట దేశపరిపాలనాప్రభువులు, తరువాత రాష్ట్రపరిపాలకోద్యోగులు, తరువాత జిల్లాఉద్యోగులు, తరువాత తాలూకాఉద్యోగులుగా సబ్‌ఇన్స్పెక్టర్లవరకుకూడా ఒకరుఒకరు వివిధశాఖోద్యోగులుగా బ్రిటిషువారు దిగుమతిఅయి ఇంక పోలీసుజవానులు, మునసబులు, కరణాలుమున్నగు గ్రామోద్యోగులుగా రావటంతరువాయి వరకువచ్చి, వ్యాపారములో పెద్ద కంపెనీలు మొదలు చివరకు సోడాషాపులలో బ్రిటిష్‌వనితలు అమ్మకములు సాగించేవరకువచ్చి ఇంకచివరకు కనీసపెట్టుబడితోనడిపే కిళ్ళీషాపులుకూడ బ్రిటిషుయువతుల హస్తగతంఅగుటమినహాగాయున్నస్థితినుండి మనరాజకీయ చైతన్యమును, ఉత్తమమానవసంస్కృతిని, వృత్తివిద్యలను త్వరితగతినిచంపు విద్యావిధానమును ప్రవేశపెట్టి ఇంచుమించు మన ప్రజాసామాన్యమును అజ్ఞానులుగా, పరస్పరము ఒకరినొకరు అనుమానించుకొని ద్వేషించుకొనునట్లుగా, మీసువారిని, నాసువారిని మోసముచేసుకొనుచు దోపిడీ,దొంగతనములుచేసుకొనుచుపరస్పరజగడములు దొమ్మీలుచేసుకొనుచు కొట్లాడుకొనునట్లుగా చేయగల్గి *ఇంకను మనఅదృష్టముకొలది మనపూర్వసంస్కృతిని అధ్య

*మాలపల్లిలో పెట్టి: మాలవారుగా చేయగుదురు. పిచ్చిఆసుపత్రిలో నిర్బంధించిన పిచ్చివారగుదురు. ఇది, బ్రిటిష్‌వారు మనదేశమున అవలంబించినవిధానము సి. టి. ఏక్టు (criminal triles act) అనగా దొంగజాతుల శాసనము అనుదానిని ప్రవేశపెట్టి కొండజాతులనుండి ఒక్కొక్కజాతినే దొంగలుగా జేర్చిమెదలిడిరి. అన్నిటికంటె పెద్దఅడవిమృగమైన ఏనుగనే లొంగతీయగల నల్లమందును; ఇతరమధ్యములను (మత్తుపదార్థములను) ప్రవేశ

పెట్టి మనదేశమున పీటిఉపయోగము బహుళవ్యాప్తమగువిధానములనుఅమలు పరచిరి. వారి ప్రతివిధానములోను ఒకేసారిగా మనము పశువులవలె తయారగుటకు, (to degenerate) మనఆరోగ్యము, ధనముచెడుటకు, తమకుఅధిక లాభాలువచ్చుటకు, తమపరిపాలన సుస్థిరపడుటకుకూడ మార్గముకలవిగా చేసిరి. తయారీ, ఖర్చులతో మొత్తము అమ్మకమునకువచ్చునరికి శేరునల్ల మందు ఐదురూపాయలకు కిట్టింపుఅయ్యేదానికి ఎనుబదిరూపాయలుచేసి ఆ 75 రూపాయలుడ్యూటీ (పన్ను)గా తీసుకొనుచుండిరి. నిత్యము ఎన్ని లక్షలశేర్లు అమ్మకమగుచుండెడిదో దీనివల్ల బ్రిటిషువారికి మనధనము ధారావాహినిగా ఎన్నికోట్లు పోవుచుండెడివో గ్రహించవచ్చుగద! ఈవిధమున మనదేశప్రజలు పేదలుకాక మరేమగుదురు? బ్రాందీలు, సారాలుకూడ ఇదే విధానము. ముఖ్యముగా, పద్నాలుగణాలుకిట్టింపుఅయ్యే బ్రాందీసీసాపై ఎనిమిది, పదిరూపాయిలు డ్యూటీవేసేవారు.

---

యనము, ఆచరణముచేయుచున్న కొద్దిపాటిపైతరగతులవారినికూడ ఈస్థితి లోనికి తీసుకవచ్చుటమినహాగాయున్న ఈజాతినే నాశనముచేసేవారి ఈ దుష్టప్రవాహమును వెనుకకుమరల్చి మనదేశీయులనుకలక్టరు, గవర్నరులుఅయ్యేటట్లు వారిపెద్దకంపెనీలను మనదేశీయవర్తకులకు వశపరచిపోయేటట్లు తీసుకవచ్చి, మొత్తముజాతికే క్రిమేణాకు మోరునుతగిలించవలెననుకొన్న సి. టి. ఏక్టునుతొలగించి మీది దొంగజాతికాదు, మీది దొంగవృత్తికాదుయని గౌరవవంతులైన భారతీయులుగా సంచరించుకొనునట్లుగాచేసుకవచ్చి ఇంక కొద్దిగామిగిలియున్న పనిని అనగా మనదేశీయులను తేజోవంతులుగా, ఆయురారోగ్యఐశ్వర్యవంతులుగాచేయుటకు అవిరళకృషినికూడసల్పుచుండ ఈకాంగ్రెసును తెలియనివారువచ్చి విమర్శించుట, చీకాకుపరచి అటంకములు కలుగజేయబోవుటను మనదేశీయులు సహించకూడదు.

ఈవిధముగా మనజాతియొక్క ధన, మానసంరక్షణ ఉద్దేశ్యపడి చేయు కొనవచ్చునని పైన మహానగరములనుండి తాలూకాపట్టణములవరకు ఇప్పటికి అందినను, ఇంక గ్రామములవారే ఈఅభివృద్ధిని అందుకొనలేక వెనుకబడి యున్నారని తెల్పుటకు విచారముగా యున్నది. కావున ఇప్పుడు ముఖ్యముగా గ్రామముల వారు తమనివాసకర ప్రాంతీయ కూటస్థమైన అభివృద్ధిమార్గములను తక్షణమే అవలంబించవలసియున్నది. నేడు పర్మిట్లు బ్లేక్ మార్కెట్లు అనేదానికి ప్రయత్నములు ఎగబడుచున్నది గ్రామముల వారేనని తెలియవలెను. ఈపర్మిట్లు సంపాదించుట తాలూకా, జిల్లా, రాష్ట్ర పట్టణములలోని వారికిపట్టుకొని కొంతకాలము పడుటకు ప్రయత్నించెదరు. ఇట్టి ఒకేవ్యక్తికి అధికలాభము చేకూర్చుటకు సహాయము చేయుటకు ఏనిరుద్యోగి కాంగ్రెసువాడు పూనుకోడు. పైగా మందలించి పంపివేయును. సమిష్టిగా పదిమందికి ఉపకరించు వ్యవహారములకు తప్పక పూనుకొనును. ఇంక ఏ గోముఖ వ్యాఘ్రమో ఇట్టివారికి లభించిన తనపట్టుకు కొన్ని వేలు దానిని ఇచ్చుటలో ప్రేమయుగల ప్రతివారికి క్రిందనుండి పైవరకు మరికొన్ని వేలు ఖర్చుతో తనకు అధికలాభసాటిగదాయను ఆశతో ఇట్టి పర్మిట్లు సాధించినను ఇంక ఆవ్యాపారము జరుపుకొనుటలో అడుగడుగునకు లాంచనములు చెల్లించుకొనవలెను. దీనికి ఆగోముఖవ్యాఘ్రపడిదాయను ఏమియు చేయలేడు. అడ్డు రానూ రాడు. కావున మొత్తముపై ఈపర్మిటుదారునికికూడ గొప్పకు జెత్తదేలేక, ఇంకపైన మిగిలేపట్టుకు జీవప్రజలను ఏడిపించినమాట, తానుగుండెలపై చెయివేసుకొని నిద్రపోలేని అపూర్వాభయములతో కూడిన రాత్రింబగళ్ళ కష్టము, మొగముపైకెత్తుకొని చూచి నడవలేని అపకీర్తి, అవమానము, ఈజన్మలోనే ముందుగతికి భంగము.

ఈరోజులలో అనేకమంది యువకులు అధికఆశతో ఈపర్మిట్లు, లైసెన్సులకై తాపత్రయపడి తిరిగి తిరిగి అసలు తమకుయున్న సొమ్మునుకూడ పోగొట్టుకొని హాహాకారులగుచున్నారు. ఒకవేళ ఏఒక్కరో పొందగల్గినను ఈపై చెప్పబడినదే పర్యవసానము.

బాలబాలికల కూర్పిడ్డ:- నేటి బాలబాలికలే రేపటి యువతీ, యువకులనియు ఎల్లుండి పౌరులనియు గుర్తించి బాలబాలికల విద్యాభ్యాసమునకు ప్రత్యేకశ్రద్ధ వహించవలసియున్నది. రేడియోలోని పిల్లల కార్యక్రమమునకు తీసుకవెళ్ళుట, పిల్లల పత్రికలను ఇచ్చుట, బాలసంఘములను ఏర్పాటుచేయుట మున్నగు నవికొన్ని సామాన్యపరిజ్ఞాన [General Knowledge] కార్యక్రమములు. సామాన్య, బీదప్రజానీకముయొక్క పిల్లలకు నిర్బంధ ఉచితవిద్యావిధానమును మనజాతీయప్రభుత్వము అమలు పరచుచున్నది. దీనికి ప్రతిబంధకములు కల్పించుకొనక ఈ సదుపాయమును సద్వినియోగపరచుకోవలసియున్నది.

స్వాతంత్ర్య దినోత్సవమును క్రిందితరముల వారివారికి అందించుట:- 1948 ఆగస్టు 15 ప్రథమస్వాతంత్ర్య దినోత్సవ సందర్భమున ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు ఆంధ్రప్రజానీకంకొరకై ఇచ్చిన ఆదేశానుసారం ధవళేశ్వరం పట్టణకాంగ్రెసు ధవళేశ్వరం పట్టణప్రజలకొరకై ప్రకటించిన నాలుగుపేజీల కరపత్రమును యథాతథంగా ఇచ్చుట ప్రకటించుచున్నాను.

60 సంవత్సరాల కాంగ్రెసుకృషి, ముఖ్యంగా మహాత్ముని నాయకత్వానముప్పదేండ్ల అనవరత పోరాట ఫలితంగా 1947 ఆగస్టు 14 తేదీ అర్థరాత్రితో భారతదేశంలో బ్రిటిష్‌పరిపాలన అంతర్ధానమై భారతావని స్వతంత్రమైనది.

కాని స్వరాజ్యం వచ్చిందని సంబరపడటానికైనా వీలులేకుండా సామాన్య, బీదప్రజానీకము అనుభవించుటకుగల ఏర్పాట్లుచేసుకొనుటకు వీలులేకుండా ఈలోపుగానే మనము అవకాశము ఇచ్చుటవల్లనే మనలోనే అలుముకుపోయిన అభివృద్ధి నిరోధకులయొక్క, దుష్టశక్తులయొక్క, పార్టీలయొక్క ముఖ్యముగా మతదురహంకారులయొక్క చర్యల మూలముగా దేశమంతటా ఇండియా పాకిస్థాన్‌లలో భారీయెత్తున భ్రాతృహత్యలు, దోపిళ్ళు విచ్చలవిడిగా సాగి అరాచకస్థితులకు దారితీశాయి. ఈ మతదురహంకారశక్తులే

స్వాతంత్ర్య ప్రవాత ఛాయలు తలఎత్తుకొంటున్నాయి. కాశ్మీర్ రంగంలో పాకిస్తాన్ సేనలే ముఖాముఖి భారతదేశంతో యుద్ధానికి తలబడ్డాయి. వేరొక వంక భారతదేశగర్భంలో హైదరాబాదు నైజాం నిరంకుశాధికారులు భారత ప్రభుత్వాన్ని ధిక్కరిస్తూ ప్రజాస్వామ్య శక్తులను హతమార్చుచు భారత ప్రభుత్వముపట్ల విరోధచర్యలు జరుపుతున్నారు

ఈవిధంగా దేశమంతటా ఎదురైన ఆలకల్లోలములను అణచుటకు, ప్రజలకు శాంతి సౌఖ్యాలు చేకూర్చుటకు కాంగ్రెసు ప్రభుత్వాలు శక్తివంచన లేకుండా కృషిచేయవలసివచ్చింది. శాంతిభద్రతలు స్థిరముగ నెలకొన్ననాడె యే ప్రభుత్వమైనా ఆర్థిక ప్రగతిని పెంపొందించుటకు తన నిర్మాణ ప్రణాళికలను అచరణలో పెట్టగలదు. కావున ప్రజాశ్రేయోభిలాషులందరు మున్ముందు దేశంలో శాంతిభద్రతల నెలకొల్పడంలో ప్రభుత్వమునకు తోడ్పడి అటుపిమ్మట ప్రజలను నిర్మాణాత్మకంగా సేవించే అవకాశాన్ని కేంద్ర, రాష్ట్రప్రభుత్వాలకు కల్పించాలి. ఇది ప్రతిభారతీయుని ప్రథమధర్మము.

కాని ప్రపంచసామ్రాజ్యవిస్తరణ కాంక్షతో బయలుదేరిన సోవియట్ నియంత స్టాలిన్ యొక్క అంతర్జాతీయ రాజకీయ చదరంగంలో పావులైన భారతకమ్యూనిస్టులు మాస్కో ప్రేరితులై దేశంలో అరాజకాన్ని మరింత పెంపుజేయుటకు నెహ్రూప్రభుత్వాన్నే కూలద్రోయుటకు కుట్రలు పన్నుతున్నారు. తమ హింసాచర్యలద్వారా శాంతికాములైన ప్రజాసామాన్యమును భీతావహులజేసి సమ్మెలద్వారా ప్రభుత్వాన్ని స్తంభింపజేసి బలవంతంగా దౌర్జన్యచర్యలద్వారా ప్రభుత్వాధికారాన్ని ప్రజాభీష్టముకు వ్యతిరేకంగా, ప్రజాస్వామ్య సిద్ధాంతాలకు విరుద్ధంగా హస్తగతం చేసుకోవాలని తీరనికోరికలు, ఆశలు కల్పించి కూలీలను, రైతులను, వివిధవృత్తులందలి ఉద్యోగగణమును కమ్యూనిస్టులు ఉత్పత్తినిరోధక సమ్మెలకు రెచ్చగొట్టుచూ అమాయకులగు వారలను తిరుగుబాటుకు పురిగొల్పుతున్నారు.

ఇన్ని విషమపరిస్థితులమధ్య మనము అగస్టు 15 ప్రథమస్వాతంత్ర్య దినోత్సవం జరుపుకోబోతున్నాం.

స్వరాజ్యం సంపాదించటం ఒక ఎత్తు. సంపాదించిన స్వరాజ్యమును సంరక్షించుకొనుచు ప్రజాసామాన్యానికి ఉపయోగపడునట్లొనరించుకోవటం ఒకయెత్తు అని గాంధీజీ బ్రతికియున్నంతకాలం పదే పదే హెచ్చరికలు చేశారు. సంపాదించిన స్వరాజ్యము శ్రమజీవులైన రైతులు కూలీలు కళాకారులు బుద్ధిజీవుల స్వరాజ్యమైననాడే స్వాతంత్రదినోత్సవం సంబరంతో చేసుకోగలమని సంవత్సరంక్రితం బాపూజీ వుద్ఘాటించి తానాశించిన స్వాతంత్రభారతపు భావనాచిత్రాన్ని లోకానికి ప్రదర్శించారు.

ఇట్టి ఆశయసిద్ధికై భారతజాతీయ కాంగ్రెసుసంఘం ప్రపంచమానవ సంఘచరిత్రలోనే అపూర్వఆదర్శప్రాయమయిన తన ఆదర్శాలను ఎంతమాత్రం సడలించకుండా పూర్తిఆశయసిద్ధికై నిరుపద్రవముగా నిరంతరకృషిసాగించుచునే యున్నది. కావున మధ్యది గాకోరుల, స్వార్థపరుల, కుటిలరాజతంత్రజ్ఞులైన ఇతరపార్టీలు 'కాంగ్రెసు ఆదర్శాలనుండి ఒకజారిపోయింది' అని మనలను చీలికలుజేయుటకుగాను చేసే బాధ్యతా రహితప్రచారములకు మోసపోయి మనము చీలిపోకుండా గాంధీజీ అడుగుజాడల్లో నడిచే జాతీయ కాంగ్రెసువాదులు, ప్రజలు అందరూ గాంధీజీ ఆశయాలను ఏకత్రాటిపైన నడుచుచూ సాధించుటకు యీ స్వాతంత్ర్య దినోత్సవమునాడు తిరిగి దీక్షబూనవలసియున్నది.

అగస్టు 15 స్వతంత్ర దినోత్సవం జయప్రదంగా అన్నిపట్టణాలు, పల్లెలలోను జరుపుట కవసరకార్యక్రమాన్ని నిర్ణయించుకొనుటకుగాను కావించిన ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘఆదేశానుసారం మనపట్టణములోని పలు పెద్దలు, అన్నివర్గాలు, బృందాలతో స్థానికఅధికారుల సలహా సహాయసహకారములతోకూడిన సమిష్టిఉత్సవకమిటీని ఏర్పాటుచేయుటకుగాను 7_8_48 శనివారం సాయంకాలం 5 గంటలకు పంచాయితీబోర్డు ఆఫీసులో అట్టిసమి

ష్టి సమావేశమునకు ఏర్పాటు చేసినాము. మన పట్టణములోని కొత్తూరుబాల భక్తసమాజము, ఐరావతిసత్యజ్ఞానానందసమాజము, పి. డబ్ల్యు. డి. వర్కర్సు యూనియన్, జట్కాసంఘం, పత్రికసంఘం, రైలర్సుఅసోసియేషన్, సెప్పింగ్స్నేట్ మెమోరియల్ క్లబ్ మున్నగువర్గసంఘములు బోర్డుమిడిల్ స్కూల్, మిషన్ స్కూల్, గరల్స్ స్కూల్, ఉర్దూస్కూల్, పంచాయితీబోర్డు మున్నగు పబ్లిక్ సంస్థలు హరిజన్, జాంబవంతులు, మాహాత్మ్యదియ. క్రైస్తవ, విశ్వబ్రాహ్మణ, రజక, చప్పాటి మున్నగు సంఘముల పెద్దలను, హాస్పిటల్ డాక్టర్లు, పోలీసుసబ్ ఇన్స్పెక్టరు, ఫిర్కాడెవలెప్ మెంటు ఆఫీసరు, మునసబు మున్నగు గ్రామోద్యోగులను పట్టణములోని పలువ్యక్తిగత పెద్దలను ఆహ్వానించితిమి.

ఆ సమావేశములో మన పట్టణకాంగ్రెసు కమిటీయే ఆట్టి సమిష్టి ఉత్సవ కమిటీగా వ్యవహరించుటకు అధికారమునిచ్చినారు.

పరతంత్రమునుండి స్వతంత్రమును పాసవలెనే అనేక కష్టాలకోర్చి సంపాదించుకొన్న అమెరికా మున్నగుదేశములు ఈనాటికీ ఏయేటా తమ తమ స్వాతంత్రదినోత్సవ పండుగలు అతివేడుకతో, అత్యంత ఉత్సాహముగా జరుపుకొంటూనే యున్నారు. రంగు రంగుదుస్తులతో అలంకరించుకొని రకరకాలుగా రమ్యముగా అలంకరించబడిన వాహనములతో తమజాతీయజండాలతో రణములా యనిపించునట్లుగా యలంకరింపబడిన వీధులగుండా ఊరేగింపులుత్సవములతోను, ఇంటింట పిండివంటలతోను ప్రతియిల్లు జ్యోతులతో దేదీప్యమానముగా ప్రకాశించునట్లొనరించుకొనియు ఆ పండుగరోజు గడపెదరు.

ఇనియేకాదు దీపావళి, దసరా, గణపతినవరాత్రులు, శ్రీరామనవమి కృష్ణాష్టమి, గాంధీజయంతి, క్రిస్మమస్, రంజాన్, మొహరం మున్నగు వివిధ జాతుల, మతముల, దేశముల పండుగలు, ఉత్సవములు అన్నియూ ఈవిధముగానే ఈప్రపంచముమీద మానవజాతికి సంక్రమించినవి. ఒకదుష్టపరిపాలన

నుండో, ఒకరాక్షసుని భీకరునుండో ప్రజలు రక్షింపబడిన నాడుగాని అట్టిప్రశస్తుడైన మహనీయుని జయంతినాడుగాని, వర్ధంతి నాడుగాని ఆయారోజు విశేషజ్ఞాపకార్థమై, అట్టిసుచరిత్ర జ్ఞాపకార్థమై తద్వారా మనకు కష్టములు కలుగకుండా శాంతిసౌభాగ్యములతో జీవించుటకుగాను మనపెట్టి నీతినియమబద్ధమైన క్రమశిక్షణతో కూడుకొన్నమార్గమున నడచుకొనవలెనో సాదృశ్యముగా నిర్దేశింపబడిన మార్గముల జ్ఞాపకార్థమై సామాన్యప్రజల ప్రబోధముకొరకై ఆయాపండగరోజులలో ఆయాకథాకాలక్షేపములు పెద్దలచే ఏర్పాటు చేయబడుచు వచ్చినవే మనపండుగలు.

కావున భారతీయులమయిన మనకు మనకాలములో మనకృషివలన అపూర్వపద్ధతిపై సంక్రమించిన ఈపండుగను మన యింటింట త్రివర్ణముగ్గులతో, త్రివర్ణజాతీయ పతాకములతో అలంకరించి, పిండివంటలతో జ్యోతులతో [ప్రమిదెలతో] జరుపుచు ఈస్వరాజ్య సంక్రాంతికి పెద్దలమైన మనము మనపిల్లలకు, మనమలకు తరతరాలుగా వెళ్ళునట్లుగా అలవాటుచేసి అందించవలసిన బాధ్యత మనపైనున్నది. కావున యీప్రథమ భారత స్వాతంత్ర్యోత్సవము అతిజయప్రదముగా జరిపించి ప్రజలలో దేశభక్తి, స్వాతంత్ర్యప్రియత్వము పెంపొందింప జేయకోరుచున్నాము.

కార్యక్రమం:-ఉదయం 6 గంటలకు గాంధీజీ విగ్రహంవద్దనుండి మంగళవాయిద్యములతో నగరసంకీర్తన బయలుదేరి 6-30 గంటలకు పట్టణ కాంగ్రెసు కార్యాలయంపై రాట్నచిహ్నంగల భారతజాతీయ పతాకప్రతిష్ఠాపన. 7 గంటలకు గాంధీజీ విగ్రహంయొద్దనున్న ధ్వజస్తంభముపై అశోకచక్రంగల జాతీయపతాకను ఎగురవేయుట.

మధ్యాహ్నం 2 గంటలనుండి గరల్సుస్కూల్, మిషన్‌స్కూల్ మున్నగువాటిలో పిల్లల ఆటలపోటీలు. చిత్రవేషాలు, నాటకములు, వాటిలో గెలుపొందిన పిల్లలకు బహుమతులు ఇచ్చుట. వర్కుషాపు సబ్ డివిజన్ బేస్ మెంటెక్ వారు ఈప్రథమస్వాతంత్ర్యదినోత్సవ సందర్భమున ఏర్పాటుచేసు

కొని కార్యకర్తలుగా అనుచున్న జేక్ వెంజెస్ టర్నర్ మొదలుయొక్క స్త్రీ నాన్న అటువంటి పర్యవసానము, జహాంమతులు పి. డబ్ల్యు. డి., వర్కర్స్ యూనియన్ లాక్ వారు అటువంటి గోష్ఠీలు. బహుమతులు, టీ పార్టీ, పంచరెబ్బు పేటవారు సమాజనసేవాగ్యాలయ ఆ గ్రంథము. ఈవిధముగా ఎంతో ఉత్సాహం, విజ్ఞానముల బట్టి సాటి మనుకుగా ఏర్పాటులు గావించుకొనుచున్నారు. తెలివిసంఘము లవారు, బృందము వారు కూడ తమ తమ యథాశక్తి, ఉత్సాహం, విజ్ఞానముల ననుసరించి పండుగను సార్థకము చేసుకొందురు గాక!

సాయంకాలము ( ) గంటలకు గాంధీజీ విగ్రహంవద్ద స్వాతంత్ర్య దినోత్సవ బహిరంగసభ. సభలో ప్రసంగించి ఖ్యాతి గాంచిన మన స్వరాజ్య సమరములో అసువులు బాసిన వీరాంగనలకు, భారతజాతి మహా బాపూజీకి భాష్పాంజలి అర్పించుట. స్వాతంత్ర్య సంరక్షణాదీక్ష గైకొనుట. స్వరాజ్యయోధుల సన్మానించుట ప్రస్తుత రాజకీయ విషమపరిస్థితులలో మనల నెదుర్కొనుచున్న అనేక క్లిష్టపరిస్థితులనుండి తప్పించుకొని బయటపడి శాంతిసౌభాగ్యములను చేకూర్చుకొనుటకు ప్రజలు అవలంబించవలసిన విధులను గురించి విపులముగా చెప్పబడును.

ధవళేశ్వరం }
11-8-48. }

జై హింద్
పట్టణ కాంగ్రెసు సంఘం.

దీనినిబట్టి ఏపేటా ఆయా గ్రామములు తమ వీలుననుసరించి ఈభారత స్వాతంత్ర్య దినోత్సవమును జరుపుకొనవచ్చును.

నేటిగుడి:___యువకులు ఆయా గ్రామములోని ప్రజలసహాయ, సానుభూతులతో స్వావలంబన నిర్మాణకార్యక్రమమును కొనసాగించుటకు చాల అనువైన, సులువైనమార్గము కలదు. ప్రభుత్వ ఏర్పాటులవల్లా, కొన్ని ప్రజాకమిటీలు బహువ్యయప్రయాసలతోను, నిజమైన త్యాగబుద్ధితోను పనిచేయుట వల్లకూడా ఈతప్పనిసరి ప్రజాతంత్రావశ్యకమైన (ప్రజలు, ప్రజాసంస్థ, ప్రభుత్వము) వివిధజీవితవిధానమార్గములుగల ప్రజలకు కొన్ని సౌకర్యములు

మార్గదర్శి ఓరియంటల్ వాచ్‌మేన్ పబ్లిషింగ్ హౌస్ సేల్స్‌బరీరోడ్, పూనా 1. బాలబాలికలకు నీతికథలు, చక్కటిపాటలు, వివిధముగ్గులు, కత్తిరింపులున్నగువాటితో చక్కనిరంగుబొమ్మలు కల్గియుండు. బాల 42 లాయడ్సురోడు, రాయపేట మదరాసు 14. "చందమామ" పోష్టు బాక్సు నెం 1686మదరాసు.1 నేటిమనదేశపరిస్థితులబట్టిఏనిమిదిడేండ్లవరకుచంటిపిల్లలనియు. ఆక్కడనుండ పద్ధెనిమిదేండ్లవరకు బాలబాలికలనియు, అక్కడనుండి నలుబదేండ్లవరకు యువకులనియు, ఆపైన పెద్దలనియు సాభావము. బాలబాలికలు సహజముగా చేయు తప్పులను ఏమాత్రము సహించక ఆతరిలోనే క్రమశిక్షణ నిచ్చుట చాల ముఖ్యావసరము.

ఆధ్యాత్మికులలో రాజకీయచింతగలవారికి మన దేశమున నైతికసంస్కృతిని ఎట్టి నీతినియమములతో నిలదొక్కవలెనో ప్రజలకు, ప్రభుత్వమునకు కూడ సూచించగలరీతిని గాంధి మహాత్ముని 'హరిజన్' ననుసరించి మన ఆంధ్రరాష్ట్రమున కనువుగా ఆంధ్రగాంధి, ఆధునిక వశిష్ట, సర్దార్ శ్రీ గొల్లపూడి సీతారామశాస్త్రిగారిచే రచియింపబడుచున్న ఆంధ్రహరిజన్ వినయాశ్రమం (వయా) పొన్నూరు, గుంటూరుడిల్లా. మనకు ముందుతప్పు యువకులు (నేటినాయకులు) బహుత్యాగ ప్రయాసలతో గొనివచ్చిన స్వాతంత్ర్య దివిటీని కాలక్రమేణా అందుకొని ఆవెలుతురు మార్గమున మనదేశమునే నడపునట్టి అభ్యాసమునకుగాను (సాధారణముగా వృత్తులలో తండ్రివెనుక కొడుకువలె కాని ఇక్కడ ఇతర వృత్తులలో కొడుకు అందివచ్చేవరకు ఆగినట్లుగా గాక) ప్రతిక్షణము అనేకమంది గ్రద్దలవలె తన్నుకపోవుటకు ప్రయత్నించుచుండే దేశములను నడుపుత్యాగము, వివిధవిషయ పరిజ్ఞానము, అనుభవములతోకూడిన ఈరాజకీయవృత్తిని దాశాతరముల తేడావారే. వెనువెంటనే అందుకొని రావలసియున్నది కావున దీనికిగాను మతాలకు, పార్టీలకు అతీతమై కాంగ్రెసు విర్మాణ కార్యక్రమమునే ఆచరించుకపోవుటయే ఆశయముగా కల్గియున్నటువంటివిన్ని, పెద్దలుండగనే వారితోబాటు పనిచే

యుచు అనుభవ సంపాదనకై కృషిచేయుచున్నట్టి ఆంధ్రరాష్ట్ర యువజన కాంగ్రెసుయొక్క అధికారపత్రిక 'క్రాంతి' గవర్నరుపేట, విజయవాడ నేడు మన దేశమునకు ఆయువు పట్టయిన ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సేవాదళము, దాని తాలూకు కార్యక్రమములు ఏఏ గ్రామమున జరుగుచున్నదో ఎప్పటికప్పుడు ప్రజలకందించు 'కాంగ్రెసుసేవాదళ్' ఆంధ్రరత్న భవనం, గవర్నరుపేట, విజయవాడ. రైతు సమస్యలకు, నిశితవిమర్శలకు 'నాగేలు' చిత్తూరు మాతృభూమి' గవర్నరుపేట, విజయవాడ. ఈపైవాటిలో స్థానిక వార్తలు, సంఘటనలు వివరముగా వ్రాయుటకుచాలమట్టుకు అవకాశముగలదు. ఈదేశములలోని, విదేశములలోని వివిధవిజ్ఞాన చారిత్రికవిషయాలుకూడ తేటతెల్లమొనర్చుటకు వీలున్నవి. ఇవిజాతీయ పత్రికలైనను కాంగ్రెసుపేర ప్రజలకు కీడుచేయు మోసగాళ్ళను అవసరమైనప్పుడు ప్రభుత్వమునుకూడ నిశితవిమర్శచేయును.

మరికొన్ని జాతీయపత్రికలనే పేరుతో నేముతా తత్త్వముతో స్వలాభము సకై కరకు విమర్శలు చేయునవిగలవు. కాని వీటిలో ప్రచురించబడు స్థానిక సంఘటనల దృష్ట్యావాటిలోని నిశితవిమర్శలు సమంజసముగా కాన్పించినను వాటిని అనుభవ పూర్వకముగా అమలుపరచుటకు ప్రభుత్వమునకుగాని, ఆవిమర్శలకు గురిచేయబడిన వ్యక్తులకుగాని ఎంతవరకు అవకాశమున్నదో, అందుకుగల సాధకబాధకములను ఆపత్రికలపాఠకులు గ్రహించుకొని ఆతీవ్రవిమర్శలను పరిస్థితులతో సమన్వయము చేసుకోవలయును. హైదరాబాద్ విషయములను తెలుసుకోగోరువారికి 'హైదరాబాద్' సుల్తాన్‌బజారు, హైదరాబాద్ (దక్షిణ) మరియు ఐదాబాదులోని విశేషాలతో, కరకు విమర్శలతో వెలువడు 'కాకతీయ' 20-37 గవర్నరుపేట, విజయవాడ. వివిధ వృత్తులపై బర్మావెళ్ళిన భారతీయులలో ఆంధ్రులే చాల ఎక్కువ బర్మాలో గల ఆస్తులు. వ్యాపారములు, వృత్తులు ఏవిధముగా నున్నవో తెలుసుకోగో

రువారికి 'ఆంధ్రమిత్ర' నెం. 255 లూ యీస్ట్రీటు, రంగూన్, స్వంతఅభి ప్రాయములతో సలహా విచ్చే వైజ్ఞానికపత్రిక 'తెలుగుస్వతంత్ర' 456 లో యడ్సుగోడ్, రాయ్‌పేట, మదరాసు. హరిజనులగూర్చి ఇంతవరకు ఏమిచేసి రో, ఇప్పుడేమిజరుగుచున్నదో, ఇక ఏమిచేయనున్నారో మున్నగు వివరము లకు వివిధరాజకీయ, వైజ్ఞానిక విశేషాలకు 'నవజీవన' 13 వాల్టాక్స్‌రోడ్ మదరాసు-3. ఇంకను కాపులకు 'వెన్నెల' అమలాపురం కాపుసేవ తెనాలి శెట్టిబలిజీలకు 'శెట్టిబలిజ' (ఎడిటరు తెలియదు) మున్నగు కులపత్రికలుగలవు కాని మతములను జాతులనే మించి సర్వమానవ సౌభ్రాతృత్వమునకు పోవు చున్న నేటి ప్రపంచమున ఇంకను కులపత్రికలు నడపవలసివచ్చుట హాస్యా స్పదమే. కాని వీరు వెనకబడియున్నమాట వీరు తమ పత్రికలద్వారా చెప్పు కొనుచున్నట్లుగా నిజమే. దీనికి కారణము వీరు ఇతరులతోబాటు సర్వమాన వశ్రేయస్సునకై పాటుపడుటకు, త్యాగములకు దిగకపోవుటయేగాక ఇతరుల నెవరనీ నమ్మక తమందరి శ్రేయస్సునకై త్యాగములు చేయుచున్న వారినికూడ, అపహాస్యము చేయుట, ఆటంకములు కల్పించుట, ఇతరులందరిని దూషించుట యొక్క ఫలితమే. ప్రపంచమందెక్కడను ఏజాతివారు, కులమువారుకూడ తాము అధిక సంఖ్యాకులుగాయున్న స్థలములలో తక్కిన దేశీయులు పది మందితోబాటు తామకూడ అందరియొక్క సమిష్టి శ్రేయస్సుకై పాటుబ డుచు తద్వారా తాము అధికసంఖ్యాకులుగాగల ప్రదేశములలో తమఅధికా రహక్కులను నిలబెట్టుకొనగల్గిరి. అతరిలో వీరి చేతులు ముడుచుకొని కూర్చు న్న ఫలితమేయిది. కావున ఇప్పటినుండియైన ఇతరులను దూషించుటమాని తమకులమువారైనను తలోకరు తలోకవృత్తులు చేసుకొనుచున్నారని గుర్తిం చుకొని ఇందువల్ల కులసంఘములుగా సంఘటితపరచుట అసాధ్యమని, సు స్పష్టపరియుత్నమని ఇంక ఈ వినాశకరపద్ధతిని దూనుకొనునట్లుగాను, నిజ ముగా తమకుల ఔన్నత్యమునే కోరుచున్నయెడల ఇప్పటినుండియైనను ఔ న్నత్యము బడసిన తదితర అన్నికులములు, జాతులు ఏవిధాన మవలంబించిరో

అట్టివిధానమున పదిమందికొరకు సదుపాయముతో కలిసి పాటుబడునట్లుగాను, తమ తమ వృత్తులనుబట్టి సగౌరవముగా [illegible] నట్లుగా ఈపత్రికలు విరివిగా ప్రబోధము చేయుచుండునని [illegible].

<u>పత్రికల పోషణ:</u>—అడవులలో వెదురు [illegible] పదార్థములను సరకేవారు. దానిని మిల్లుయొద్దకు సరఫరా చేయువారు. మిల్లులో దీనిని కాగితముగా చేయువారు, ఆకాగితమును పత్రికలవారికి అమ్మి సరఫరా చేయువారు. ఈఒక్క నడకలో ప్రతిఅంచెయొద్ద ( every stage) అవసరముగా నుండే ఆఫీసులు వాటి సిబ్బంది ఇదేవిధముగా ఆకాగితమును తెచ్చువారు, దానిని అచ్చువేయువారు. అచ్చువేయుటకు ఆసమాచారములను సేకరించుటకు అనేక ప్రదేశములలోను, అనేకదేశములలోను. యుద్ధరంగములలో కూడ తగువారిని నియమించి ఆవార్తలను అందుకొని వ్రాయువారు, ఆపత్రికలను రవాణా చేయువారు, ఇంకను ముందునకు పోయిచూచినచో ఆకాగితపు మిల్లుయొక్క యంత్రములను, ఈముద్రణాలయ యంత్రములను. అచ్చులను బ్లాకులను తయారుచేయు కంపెనీలపనివారు, సిబ్బందిచివరకు మనకు పత్రికను చేర్చువానివరకు ఉపయోగపడే ప్రతియంత్రమునకు రవాణా వాహనములకు ఉపయోగించిన లోహములను త్రవ్వువానినుండి గల వివిధవృత్తుల వారివరకు ఈప్రతి పరిశ్రమలోను, ప్రతిఅంచెకి అవసరమయ్యే ఆఫీసులను, యంత్రాగారములను కట్టేవారు. నడపేవారు, మరమ్మతులు చేసేవారివరకు గల వివిధవృత్తుల వారికి భృతిగల్గించుటయేగాక మనకు ఎప్పటిపరిస్థితులు అప్పుడు, ఎప్పటివిషయములను అప్పుడు వాటి పూర్వాపరిస్థితిగతులతో సహా చెప్పుచు, వాటికనుగుణంగా మనమెట్లు సంచరించుకోవలెనో దానికవసరమగు బహుశవిజ్ఞానమును ప్రసాదించుచు. పతితజాతులను నిలబెట్టుచు, దేశగౌరవకీర్తులను ప్రదీప్తము చేయుచు మనకు సౌభాగ్యవంతమైన ఏర్పాట్లకు దారిచూపు మంచిపత్రికలను పోషించుకోవలసిన బాధ్యత, అగత్యము ఎంతేనికలదు. ఫిల్ముదర్శకత్వము, పెద్దపరిశ్రమల కార్యనిర్వాహణవలెనే వివిధ విషయముల

సేకరించుటకు ఈ ఉత్తమపత్రికలను నడుపుటకూడ అంతకష్టమే. మనకు ఉపకరించుచు ఇంతటి శ్రమను వృథాపోనీయకూడదు.

ఏవృత్తి ననుసరించి ఆవర్గమువారు తమవృత్తి పత్రికను రప్పించుకొనుట సహజమే. ప్రభ, పత్రిక మున్నగు పత్రికలనుకూడ చాలమంది ఎవరిమట్టుకువారు తెప్పించుకొనుట కలదు. కాని సాధారణ ప్రజలందరికి ఈ వివిధ విషయములను ఎప్పటికప్పుడు తెలుసుకొనుటకు వీలుకల్పించు గ్రంథాలయము వారికి తమచందాలు, విరాళాలతో మాత్రమే సాధ్యపడుట కష్టము కావున ఆగ్రామములోని శక్తిగలవారిని ఆగ్రంథాలయమునకు గాని ఒక్కొక్క పత్రికను పోషించునట్టి ఆపత్రికను ఆగ్రామస్థులకు విరాళముగా నిచ్చునట్లు చేసుకొనవచ్చును.

ఇక కమ్యూనిస్టు సోషలిస్టు మున్నగు విద్రోహాకరుల, దేశవిచ్ఛిన్నకరుల పత్రికలను ప్రజలలో ప్రచారము కానీయకూడదు. కాని కొందరు జాతీయవాదులుకూడ ఈఅభిప్రాయమునకు విభిన్నాభిప్రాయము కలిగియున్నారు. శత్రువులు ఎచ్చటెచ్చట ఏమేమి విద్రోహములు తలబెట్టి అట్టి శత్రుచర్యలు జరుపుటకు ఏమేమి ఏర్పాట్లు గావించుచున్నారో తెలుసుకొనుచుండుట అవసరము. వీరి అభిమతము. ఈవిషయమునకు సంబంధించినంతమట్టుకు జాతీయ రాజకీయ కార్యకర్తలవరకే ఈపత్రికలను చదువుటలో ఏకీభవించగలము, కాకపోయినను కాంగ్రెసువాదులకు శత్రువులుండరు. ఎవ్వరైనను తామంతటతాము ఈపవిత్రకాంగ్రెసుపై శత్రుత్వము వహించినను వారిగూర్చి విచారమాత్రమే పడవలసియుండును. ధర్మపక్షీయులైన పాండవులను దుర్యోధనాదులు ఎన్నిసార్లు ఎన్నివిధముల ద్రోహములకు తలబెట్టి ఎన్నెన్ని ఏర్పాటులతో వచ్చుచుండినది, ఇట్టి ప్రయత్నములలోను వీరు ఇతరులవల్ల భంగపడి, అవమానము పొంది అపాయములలో బడుచుండుటయు కడకు ఎవరిపై మోసము, సర్వనాశనము తలబెట్టి వచ్చినారో అట్టి కరుణామయులైన పాండవులచేతనే రక్షించబడుచుండుటయు విశదమేగదా! ఇది ప్రకృతిసిద్ధము. దైవికము పురాణకాలమునుండి నేటివరకు మానవకోటి చరితలో ఈ విషయమున దుష్టబుద్ధితో ఎన్ని ఏర్పాట్లు చేసుకొని వచ్చినను దానిని రూపములోనికి తీసుకవచ్చుటకు కార్యరంగములోనికి వచ్చేసరికి కాళ్ళు తేలిపోవుచుండుట అడుగడుగునకు అనుభవమేగదా! కావున కాంగ్రెసువాదులకు ఇట్టి శత్రుత్వము వహించి దుర్మార్గమున సంచరించుచున్నవారి వెనుక గూఢ

సాధించవచ్చును. ఇతరదేశములనాటికన్నిటికంటె మనదేశపు మార్కెట్టుపరం
బలపపు పరిశ్రమను (slate industry) పలకలు పలకపుల్లల పరిశ్రమ
తరగతులు, వినియోగదారులుకూడా ప్రోత్సహించుకోవలసియున్నది. గోదా
వరితీరపర్వతములలో నూటికినూరుపాళ్ళు స్వచ్ఛమైన గ్రాఫైట్ కలదు నేటి
పరిశ్రమలలో చాలముఖ్యమైన సంగసిందూరము (Red Lead) అత్య
ధికపరిమాణములోగల జేగురురాతికొండలుగలవు. శుచియైన పింగాణీవస్తువు
లను చేయుటకుపయోగపడే సుద్దకొండలుగలవు. ఇట్టిప్రకృతిసంపదలను నూ
తనముగా ఉపయోగమునకు తెచ్చినవారికే ఎక్కువఆదాయము, నిత్యముగా
తయుండిపోయేకీర్తికూడ లభించును. ఒకసినిమాప్రక్కను ఇంకొకసినిమాకట్టి
ఒకకిళ్ళీకొట్టుయున్నచోటె మరొకకిళ్ళీకొట్టుపెట్టి ఉభయులూ నష్టపోయే
కన్న, తయారైయున్న వస్తువులనే అనేకులు అమ్ముకొనుటకు ప్రయత్నించే
కంటే మరికొన్నివస్తువులను తయారుచేసి లేనిచోటకు పంపుటసార్థకము, కాని
చాలమంది ఈపరిశోధనలకు దిగలేరు కాబట్టి కనీసం తమతావులలోగల ప్రకృతి
సంపదను తమజిల్లా, రాష్ట్రకాంగ్రెసు కమిటీలద్వారా రాష్ట్రప్రభుత్వమునకు
తెలియబరచుట, ఇట్టిపరిశోధనలవలన లభ్యమైనట్టిగాని లేక ఇదివరకుండు
కొన్నట్టిగాని వస్తువులను ఇతరులు ప్రజోపయోగమునకై భారీయెత్తునఉత్పత్తి
చేయుదానికి ప్లేన్లయినను (పాటాలు)కొనియుటవలన, దేశమునకుకూడ ఉప
యోగి కావలసియున్నది.

జైహింద్

ఇది కాంగ్రెసు సర్వతోముఖ కార్యక్రమ
కార్యవర్గ ప్రణాళికా
సర్వస్వము
సంపూర్ణము.

---

స్వస్తి ప్రజాభ్యః పరిపాలయన్తాం
న్యాయ్యేన మార్గేణ మహీం మహీశాః
గోబ్రాహ్మణేభ్యః శుభమస్తు నిత్యం
లోకాస్సమస్తాస్సుఖినో భవన్తు.
ఓం శాంతిః శాంతిః శాంతిః

# పాఠకులకు మనవి

ఇదే ప్రథమ ముద్రణ యగుటచేతను, ఈ సమయములో నాకు అనారోగ్యకారణముచే దగ్గరయుండి చూచుకొన లేకపోవుటచేతను కొన్ని అచ్చుతప్పులు దొర్లినవి. మరుచటి ముద్రణలో సవరించుకొనువాడను. నిర్మాణకార్యక్రమ స్వరూపమును ప్రజాసామాన్యమునకు తెలియజేయ తలపెట్టిన ఈ పూనికవలన మన తెలుగు దేశములో అచ్చటచ్చటగల నిర్దుష్ట నిర్మాణకార్యక్రమ కేంద్రములగూర్చి వినికిడి యగుచున్నది. వాటిని యేవిధముగా నిర్వహించారో సాధ్యమైనంత మట్టుకు వివరములతో జతపర్చి, గ్రంధప్రచురణలో కలిగిన ఈ యనుభవమునుకూడ పురస్కరించుకుని మరుచటి ప్రచురణ సర్వాంగసుందరముగా సమర్పించుకొనె పూనిక.

ముఖ్యసవరణ:— చివర భాగములోని 72వ పేజీలో -
'శ్రీధన్వంతరి' ముక్త్యాల, కృష్ణాజిల్లా.

---

ఈ పుస్తకములు వలయువారు:

**సాధనాల పెద తిరుపతిరాయుడు**
**ధవళేశ్వరం** (తూ. గో.)

---

గమనిక:— ఒకేసారి ఒకటికంటె ఎక్కువ పుస్తకములకు వ్రాసిన పోస్టలు ఛార్జీలు ఉచితము.